

# రమణస్మరణామృతము

రచయిత:

జి. ఎ. సుబ్బరామయ్య, యం. ఏ. (ఆనర్సు)
చేబ్రోలు, ఎ. బి. యన్. కాలేజి ప్రిన్సిపాల్




ప్రకాశకులు:
శ్రీ టి. యన్. వేంకటరామన్,
మ్యానేజర్ - ప్రెసిడెంట్,
శ్రీ రమణాశ్రమము,
తిరువణ్ణామలై.



[వెల. రూ. 4.



JAI SRI RAMANA !

# అంకితము

## To Sri T. RAMA REDDI,

an ardent devotee of Bhagavan Sri Ramana,
a prince among philanthropists,
a munificent patron of letters,
this little offspring of devotion
is lovingly dedicated

కం॥ శ్రీరమణ భక్తుఁడు మహో-
దారుఁడు కవికోటి కల్పతరుతుల్యుఁడు శ్రీ
టి. రామరెడ్డి సాదర
సారంగ నీ కృతికుమారి నంకిత మిత్తున్.



# విషయానుక్రమణిక



జయ శ్రీ రమణ!

# శ్రీ రమణ స్మరణామృతము

నేను శ్రీరమణాశ్రమమును 1933 జూన్ 8వ తేదీ తొలుసారి సందర్శించితిని. మా తల్లితోఁగూడ శ్రీవరదరాజ స్వామివారి బ్రహ్మోత్సవము చూచుటకై కాంచీపురము వచ్చి అచ్చటినుండి నేను ఒంటరిగ తిరువణ్ణామలకు వెళ్ళితిని. అంతకు పూర్వము డిసెంబరు 22వ తేది నా రెండవకుమారుఁడు రెండేండ్ల బిడ్డ ఆకస్మికముగ మరణించెను. అదే అట్టి విపత్తుల తొలి యనుభవము. అందుచేత ఆ కాలమున నేను దుఃఖసముద్రములో మునిఁగియుంటిని.

రెండు సంవత్సరాలుగా నేను శ్రీ రమణమహర్షుల కృతులను మఱికొన్ని ఆశ్రమగ్రంథాలను చదువుచూ ఉంటిని. నాకు తత్త్వశాస్త్రముకన్న సారస్వతముపై అభిరుచి యెక్కువ. తెలుఁగు "ఉపదేశసారము" చదివినప్పుడు అందలి భావగాంభీర్యము, శైలిసౌలభ్యము, పదములపొందిక అది కేవలము కవిబ్రహ్మ తిక్కన కవనమే అనిపించినది. జన్మతః అఱవవారైన శ్రీరమణులు అటువంటి తెలుఁగు కవిత్వము వ్రాసినారనఁగా వారిలో దివ్యశక్తి యుండవలెనని నాకు

నమ్మిక యేర్పడెను. అట్టి మహనీయుని సందర్శింపవలెనని యభిలాష పొడమెను.

కాని నేను యాత్ర వెళ్లినది యీ భావముతోఁ గాదు. ఆ సమయములో నాకు మనశ్శాంతి, దుఃఖోపశమనము ముఖ్యావసరమై యుండెను. ఆ నాఁడు ప్రాతఃకాలమున ప్రాత హాలులో శ్రీ భగవానుల దర్శనము చేసికొంటిని. మా కన్నులు కలసినంతనే నాలో అద్భుతమైన మార్పు కలిగెను. శాంతిసాగరములో మునిఁగిన ట్లనిపించెను. కనులు మూత పడెను. ఆనంద పారవశ్యమున సుమా రొక గంటసేపు అట్లే కూర్చుంటిని. మరల నేను మామూలుస్థితికి వచ్చి కనులు విచ్చి చూచునరికి ఎవరో యొకరు హాలులో గొట్టముతో క్రిమిహారి ద్రావకమును చల్లుచుండిరి. అది పనిలేదని శ్రీ భగవానులు మౌనముగా తన చేతిసంజ్ఞతో నివారించుచుండిరి.

కొంతసేపటికి శ్రీ భగవానులు ఏదో మాటాడుట విని, నేను వారిని ఒక ప్రశ్న అడుగ సాహసించితిని.

"భగవద్గీతలో, మనుష్యులు చినిగినగుడ్డలను వదలి క్రొత్త వస్త్రములను ధరించునట్లు శిథిలశరీరములను విడిచి క్రొత్త దేహములను దాల్చెదరని చెప్పినారే, అది శిశువుల మృతి కెట్లు అన్వయించును? వారిమేనులు క్రొంగ్రొత్తలు, మొలకలు మాయనివి గదా"

అని అడిగితిని. అందులకు శ్రీభగవానులు వెంటనే యిట్లు బదులుపలికిరి.

"మరణించిన శిశువు దేహము శిథిలము కాలేదని నీ కెట్లు తెలియును? ఆ శిథిలత కనిపింపకపోవచ్చును. కానీ శిథిలము కానిదే యేదీ చావదు. అది ప్రకృతిధర్మము."

ఆపయి నేను మరల ఇట్లు ప్రశ్నించితిని.

"గీతాకారులు ఒకచోట 'ఈ జగ మంతయు నాచే వ్యాప్తము. నేను గానిది యేదీ లేదు' అని చాటించి, మఱియొక తావున ఒకయధ్యాయమంతటా 'నక్షత్రములలో చంద్రుఁడను నేను, మానవులలో రాజును నేను' ఇత్యాదిగా చెప్పుకొని పోయినారే, ఈ రెండు భాషణములను సమన్వయించుట యెట్లు?"

శ్రీభగవానులు ఇట్లు జవాబిచ్చిరి.

"ఆ రెండవభాషణము అర్జునుని ప్రశ్నకు ప్రత్యుత్తరమే. అర్జునుఁడు శ్రీకృష్ణుని అడిగినాఁడు 'నిన్ను నేను ఏవిధముగా ధ్యానించి పొందఁగలను? నిన్ను ఏయే భావములలో గుర్తింపఁగలను?' అని. ఈ ప్రశ్నను బట్టి అర్జునునకు ఇంకను భగవానుని సర్వాత్మత్వమును సాక్షాత్కరించుకొను శక్తి యేర్పడలేదని స్పష్టమగుచున్నది. కావున కరుణామయుఁడగు శ్రీకృష్ణుఁడు అర్జునుని ధ్యానమునకు అనుకూలముగా, తన దివ్యవిభూతులు అభివ్యక్తమగు

పదార్థముల ననేకములను పేర్కొన్నాఁడు. వాస్తవముగా తత్త్వశాస్త్రము బోధన కేవలపరమార్థ నిరూపణ మాత్రము గాదు. అది సాధకుని యధికారమునకు తగి యుండవలెను, అతని తాత్కాలిక సంశయములను దీర్చు నది కావలెను.”

మధ్యాహ్న భోజనానంతరము నేను శ్రీభగవానుల సెలవుగూడ పుచ్చుకొనక, అజ్ఞాతయాత్రికునివలె వచ్చినట్లుగానే వెళ్లితిని.

దాదాపు మూఁడేండ్లతరువాత 1936 వసంతకాలమున తిరిగి నేను ఆశ్రమమును సందర్శించితిని. ఈ మాఱు శ్రీ గిద్దలూరు సాంబశివరావుగారినుండి ఒక పరిచయలేఖను పట్టుకొని వెళ్లితిని. దానిని శ్రీ భగవానులచేతికి అందిచ్చితిని. వారు దానిని చదువకముందే, నన్ను చక్కఁగా ఎఱిఁగినవారివలె నావైపు చూచి, తల యూచి కృపారస ముట్టిపడ నవ్వి యిట్లనెను.

“ఎందుకీ పరిచయలేఖ? మీరు క్రొత్తవారు కారే. ఇది వఱకు వచ్చియున్నారు గదా?”

ఇంకా ఏ మద్భుతము! ఇప్పుడు శ్రీ భగవానుల చూడఁగా, స్వర్గస్థులైన మా తండ్రిగారు సాక్షాత్తు మరల ప్రత్యక్షమైనట్లు కనిపించిరి. ఇది కేవలము నా యూహయే కాదు. తరువాత శ్రీ భగవానులను సందర్శించిన మా బావ

శ్రీ వి. వి. నారాయణప్ప నాతో "శ్రీభగవానులు అచ్చము మా మామ మీ నాయన యాకృతియే" అని పలికెను. ఈ పోలికయే శ్రీ రమణులతో నా సంబంధమును శాశ్వతముగా నిర్ణయించినది. వారు నాకు గురువు, మహర్షి, భగవానులు మాత్రము కారు, నా సొంతతండ్రి, కనుఁగన్నతండ్రి. అది మొదలు ఎప్పుడును నేను శ్రీ రమణులను, బిడ్డ తండ్రినివలె, నిర్భయముగా అభేదముగా చనవుతోఁ జేరుచుంటిని.

కొన్ని యేండ్లక్రిందట నాకు రెండు మంత్రములు ఉప దేశమై యుండెను. ఉపదేష్ట ఆ మంత్రములను నిత్యమూ అష్టోత్తరము తగ్గకుండ జపముచేయవలె నని నన్ను ఆదేశించిరి. అట్లే నేను తప్పకుండ జపించుచుంటిని. కానీ యిప్పుడు ఆశ్రమమునకు వచ్చిన తరువాత ఆ మంత్రములను జపించుటకుఁ గానీ మఱి యేవిధమైన యారాధన చేయుటకుఁగానీ బుద్ధి పుట్టలేదు. కొన్నాళ్లైన వెనుక గురువాక్యోల్లంఘనపాపమున కొడిగట్టితినే అను భీతి నన్నావహింపఁగా, నేను నా లోప మును శ్రీ భగవానులతోనే మనవిచేసితిని. అందులకు వారు చిఱునవ్వు నవ్వి యిట్లనిరి.

"అంత జపము చేసినావు గనుకనే ఆ పుణ్యము నిన్ను ఇచ్చటికిఁ గొనితెచ్చినది దాని ఫలితమును అనుభ వించుచూ ఇప్పుడూ నీకు భయ మెందుకు?"

మఱియు ఆ దినములలో నాకు ఇంతకన్న ఆందోళన కరమైన బాధ యొకటి యుండెను. శ్రీ రామతీర్థస్వామివారి గ్రంథములలో చెప్పఁబడిన విధానము ననుసరించి నేను ప్రాణాయామము అభ్యసించుచుంటిని. కొంత సాధన కాఁగా, ఒకప్పుడు నా శిరస్సు చీలి తునుకలై పోవునట్లుగా భయంకర స్పందనము కలిగెను. వెంటనే ఆ సాధనను నిలిపితిని. కానీ ప్రతిదినము అభ్యాసకాలమునకు ఆ యనుభవము వచ్చుచునే యుండెను. ప్రళయభీతి ప్రబలుచుండెను. ఇట్టి స్థితిలో నేను ఒక నడిరేయి శ్రీ భగవానులు ఏకాంతమున కూర్చుండి యుండఁగా వారిని సమీపించి నా కథ చెప్పుకొంటిని. వారు నవ్వుచూ ఇట్లనిరి.

"ఏమీ! మరల భయమా! ప్రత్యక్షగురుశిక్షణ లేకుండ యోగసాధనలు చేయువారికి ఇట్టి యనుభవములు సాధారణముగా కలుగుచుండును. కాని నా యొద్దకు వచ్చిన పిమ్మటఁగూడ నీవు భయపడు టెందుకు?"

మఱియు శ్రీ భగవానులు కంఠస్వరము తగ్గించి జనాంతికముగా ఇట్లు పలికిరి.

"ఈ మారు నీ కా భయము కలిగినయెడల, నన్ను తలఁచుకో, అది తొలఁగును."

అది మొదలు ఈ క్షణమువఱకు ఆ భయము నాకు మరల రాలేదు. కావున దానికై శ్రీ భగవానులను తలంచుకో వలసిన యగత్యము కలుగలేదు!

ఆ మఱునాఁడు మధ్యాహ్నము హాలునుండి నేను తప్ప అందఱు వెళ్లిపోయిరి; అప్పుడు ఒక పల్లెటూరిముసలాయన శ్రీ భగవానులను సమీపించి తాను చాలాకాలముగా భరింప రాని కడుపునొప్పితో బాధపడుచున్నట్లు మొఱపెట్టుకొనెను. శ్రీ భగవానులు నావైపు తిరిగి మందహాసముతో ఇట్లనిరి.

"చూడండి! ఈ మనిషికి బహుకాలముగా కడుపుకుట్టుఁట. ఆస్పత్రికి పోకుండా నాయొద్దకు వచ్చినాఁడు. నే నేమి డాక్టరునా యితనికి నెమ్మదిచేయుటకు!"

వెనువెంటనే శ్రీ భగవానులు నిండుమనస్సుతో మంద్రస్వర మున మరల నాతో ఇట్లు చెప్పిరి.

"ఇతనిని ఆఫీసుకు తీసుకవెళ్లండి. అచ్చుట ప్రసాద ముండును. దానిని ఇతనికి ఇచ్చి పంపండి."

నేను అట్లే చేసితిని. ఆ సమయములో అది ముసలాయనకు వలెనే నాకుఁగూడ వరప్రసాద మనిపించెను. ఏలనఁగా అంతవఱకు నేను ఈ ప్రసాదవినియోగమును ఒక మూఢ విశ్వాసముగా నిరసించియుంటిని. ఇప్పుడు శ్రీభగవానులు ఈ పని నాచేతనే చేయించుటవలన, నాకు జ్ఞానోదయమై నా యవిశ్వాసము పటాపంచలయ్యెను.

తిరిగి యిల్లు చేరినతర్వాత, నేను ఏదైన సారస్వత కైంకర్యము చేయఁగోరుచున్నట్లు ఆశ్రమమునకు వ్రాసి కొంటిని. "శ్రీ రమణగీత"ను తెలుఁగుపద్యాలుగా నేను అనువదించవచ్చునని ఆశ్రమమువారు బదులువ్రాసిరి. ఆ ప్రకారమే నేను ప్రథమాధ్యాయము తెలుఁగుచేసి తపాల ద్వారా పంపుకొంటిని. ఆ సమయమున శ్రీ వి. వి. నారాయణప్ప ఆశ్రమములో నుండుట తటస్థించెను. ఆయన 21-6-1936వ తేదీ జాబులో శ్రీభగవానులు నా యనువాద మునుగూర్చి తనతో ఇట్లు సెలవిచ్చినా రని వ్రాసెను.

"సాధారణముగా అనువాదములు మూలములకన్న కష్ట ముగ వ్రాయుట కలదు. అట్లుగాక శైలి సులభముగ నున్నది. భావములు చేకూఁగ వచ్చినవి. బాగున్నది."

ఈ యనుగ్రహవాక్కు ప్రోత్సహింపఁగా, నేను "రమణగీత"ను పూర్తిచేసితిని. తర్వాత శ్రీభగవానుల యాదేశముపై, శ్రీ కావ్యకంఠగణపతిశాస్త్రులవారి మఱికొన్నిరచనలను శ్రీ దైవరాతులకృతి నొకదానిని ఆంధ్రీకరించి "రమణగీత"కు అనుబంధముగా చేర్చితిని.

అదే సంవత్సరము అక్టోబరు 6వ తేది ఆశ్రమమునుండి ఆ నారాయణప్పకొఱకు ప్రసాదము నాయొద్దకు పంపఁబడెను. ఆయనకు అప్పుడు టైఫాయిడ్‌జ్వరము వచ్చుచుండెను. ఆశ్రమలేఖలో ఈ మాట లుండెను:

"శ్రీ భగవానుల యనుగ్రహామువలన ఆయనకు త్వరలో నెమ్మదించి ఆరోగ్యము చేకూఱునని ఆశించుచున్నాము."

ఆయనకు అప్పుడు జ్వరము హెచ్చుగా నుండెను. 6, 7 తేదులు విషమస్థితి అని డాక్టరులు హెచ్చరించియుండిరి. కాని 6–వ తేదీ ప్రసాద మిచ్చినంతట జ్వరము చాలావఱకు తగ్గెను. 7వ తేదీ పూర్తిగా నిలిచిపోయెను. ఇట్లు శ్రీ భగవానుల యీ యనుగ్రహచిహ్నము ఆ భక్తుని ప్రాణమును రక్షించుట యేగాక, నా దృష్టిలో తన్మహిమకు ప్రత్యక్షనిదర్శనముగా ఉపకరించెను.

ఆ వెనుక వచ్చిన దశారా సెలవులలో నేను మరల ఆశ్రమము వెళ్లి పూర్తియైన "శ్రీ రమణగీత" అనువాదమును శ్రీ భగవానుల పాదములందు సమర్పించితిని. నా ప్రార్థనను అంగీకరించి శ్రీభగవానులు వ్రాతప్రతిని పరిచూచి పలయు చోట్ల తప్పులు దిద్దిరి. నవమాధ్యాయము 10వ శ్లోకములో మూలపాఠమునే శ్రీ భగవానులు.

"ఆత్మనాడీం పరా మేకే, పరే త్వమృతనాడికాం"

అని సవరించి సుషుమ్నానాడి పర్యాయపదములకు 'పరా నాడి' అను నామమును జేర్చిరి. ఇందులకు "అమృతబిందూ పనిషత్తు"నుండి ప్రమాణము నెత్తిచూపిరి. షోడశాధ్యాయము 5వశ్లోకములో 'విషయరూపేణ' అనుటకు 'విషయిరూపేణ'

అని పాఠాంతరము వచించి, 'విషయి' పాఠమే మేలనిరి. ఇందులకు కారణమును శ్రీ భగవాను లిట్లు నిరూపించిరి.

> "కొందఱు పరమాత్మను ధ్యానపూజాదుల విషయముగా వాకొందురు. ఉదాహరణము: 'కలకండయే అగుటకన్న, కలకండను చవిగొనుట మేలుగదా' అనెదరు. సమస్తమునకు మూలకారణమగు వస్తువును ఒక జడపదార్థముతోఁ బోల్చుటకన్న ఘోరాపచారము వేఱుండునా? అసలాత్మయే 'విషయ' మగునెడల, మఱి 'విషయి' యెవరు? కావున 'విషయిరూపేణ' అను పాఠమే మెఱుఁగు."

పంచమాధ్యాయము 6వ శ్లోకమునుగుఱించి శ్రీ భగవానులు ప్రాసంగికముగా ఇట్లనిరి. మొట్టమొదట వారు స్వానుభవము చేతనే, 'చేతనహృదయము' ఱొమ్ములో కుడివైపు ఉన్నట్లు కనుగొన్నారఁట. అటుపిమ్మట ఈ సత్యమునే "అష్టాంగ హృదయము" మలయాళప్రతియందును, "శీతోపనిషత్తు" నందును జదివినారఁట. "బైబిలు"లో 'ఎక్లీసియాస్ట్స్' దశమాధ్యాయము ద్వితీయశ్లోకమందు,

> "జ్ఞాని హృదయము కుడివైపునఁ గలదు, పామరుని హృదయమే ఎడమవైపున"

అను వాక్యమును విన్నారఁట. శ్రీ భగవానులు మఱియు నిట్లు పలికిరి:

"ఇంత యెందుకు? ఒక పసిబిడ్డకూడా 'నేను' అని చెప్పునప్పుడెల్ల తనవ్రేలితో ఱొమ్ము కుడివైపున ఒకేచోటు చూపును, కాని యెన్నఁడూ భౌతికహృదయమువైపు గానీ భ్రూమధ్యము గానీ శిరస్సు గానీ చూపదు గదా."

ఈ ప్రసంగమును ఉపసంహరించుచూ శ్రీభగవానులు ఉద్బోధకమగు నొకమాట నిట్లనినారు:

"వాస్తవముగా నే నెఱిఁగినదంతా మొట్టమొదట ప్రత్యక్షానుభవముగానే. నేను పిమ్మట గ్రంథములలోఁ జదివినది నా పూర్వానుభవమునే దృఢపఱిచినది. వాటినుండి నేను క్రొత్తగాఁ దెలిసికొన్నది యేమియూ లేదు."

నేను బయలు దేఱుటకు ముందటిదినము సాయంకాలము శ్రీభగవానులతో నాభార్య యిష్టములనుగుఱించి ప్రస్తావించితిని. హఠాత్తుగా సంభవించిన పుత్రవియోగ శోకమువలన ఆవిడ చిక్కి శల్యమైయున్నదని విన్నవించితిని. తర్వాత "ఆమెకు మగబిడ్డ కలుగలేదా?" అని శ్రీభగవాను లడిగిరి. "లేదు" అని నే నంటిని. "అయ్యో! పాపము" అని శ్రీభగవానులు నిట్టూర్చిరి. ఈ సంభాషణ 1936 అక్టోబరు 18 వ తేదీ జరిగెను. 1937 ఆగస్టు 1 వ తేది నాభార్య మగబిడ్డను కనెను. తర్వాత ఆశిశువును శ్రీభగవానులకు చూపినప్పుడు, తొలుతగా వారు "ఈ బిడ్డ పే రేమి?" అని ప్రశ్నించిరి. 'రమణప్రసాదము' అని నేను బదులుచెప్పితిని. "ఓహో! అట్లగా" అనుచూ

శ్రీభగవానులు తనప్రసాదము' నిరూపించుట కేమో అన్నట్లు ఆ బిడ్డచేత రెండు పచ్చరటిపండ్లు తినిపించిరి. అవి యేమి చేయునో అని నేను దిగులుపడితిని. కాని ఆ బిడ్డ కేమాత్రమూ అజీర్ణముచేయలేదు.

నేను ప్రయాణమగుచుండఁగా, సర్వాధికారి నాచేతికి ప్రసాదముపొట్లములు మూఁడిచ్చిరి. "అవి యెవరికి?" అని నే నడిగితిని. అందులకు అప్పుడు ఆ గదిలోనే అభ్యంగనము చేయుచుండిన శ్రీభగవానులు ప్రత్యుత్తర మిచ్చిరి-ఆదినములలో ఆ యొక్క గదియే, భోజనశాలగా, ఆఫీసుగా, భగవానుల స్నానాలకొట్టుగా వాడఁబడుచుండెను - శ్రీభగవానులిట్లనిరి:

"ఒకపొట్లము మీకుటుంబమునకు, ఒకటి నా రాయఁడప్పకు, ఒకటి మీ స్నేహితునకు."

స్నేహితుని పేరు వారు చెప్పలేదు, నేనునూ అడుగలేదు. ఆ మఱునాడు నేను ఇల్లు చేరినవెంటనే, ఒకజాబు నా పేరటికి ఆశ్రమముపోయి అచ్చటినుండి తిరిగివచ్చెను. దానిని నెల్లూరి జమీన్దారు శ్రీరేబాల పట్టాభిరామరెడ్డిగారు నా పేరటికి ఆశ్రమము చిరునామాకు వ్రాసియుండెను. దానిలో ఆయన పండుముదుసలి తమయవ్వగారికి ప్రాణాపాయస్థితిగా ఉన్నదనీ కొన్నిమాసములుగా ఆహారమే లేదనీ తెలుపుచూ ఆమెపట్ల శ్రీభగవానుల యనుగ్రహముకొఱకు ప్రార్థనచేసిరి. అది చదు

వంగానే నా కర్థమైనది శ్రీభగవానులు ఎవరిని నా 'స్నేహితుని'గా నిర్దేశించినదీ. తత్క్షణమే నేను రెడ్డిగారివద్దకు 'ప్రసాదము'ను పట్టుకొవెళ్లి జరిగిన యుదంతమును ఆయనకు చెప్పితిని. కొన్నాళ్లతర్వాత, రెడ్డిగారు నన్నుఁ గలసికొని ప్రసాదము సేవించినదిమొదలు తమయవ్వగారికి వ్యాధి తిరుగుముఖమైనదనీ యిప్పుడామె ఆహారము పుచ్చుకొనుచున్నదనీ క్రమముగా ఆరోగ్యస్థితికి వచ్చుచున్నదనీ తెలియపఱచిరి. ఆమె తనకృతజ్ఞతా సూచకముగా శ్రీభగవానులకు ఏదైనా కైంకర్యము చేయఁ గోరుచున్నదని ఆయన చెప్పిరి. "పండ్లూ, పూజాద్రవ్యములూ పంపవచ్చును" అని నేను సలహా యిచ్చితిని. కానీ దానితో ఆయనకు తృప్తి కలుగలేదు. నేను "శ్రీరమణగీత"ను అనువదించుచుండిన సంగతి ఆయనకు తెలియును. కావున ఆగ్రంథమును అచ్చువేయించుటకు అనుజ్ఞకై ఆశ్రమమునకు వ్రాసికొనిరి. శ్రీభగవానులపక్షమున ఆశ్రమము వారు అంగీకరించిరి. శ్రీ రెడ్డిగారి ద్రవ్యముతో ఆ గ్రంథము అత్యంతసుందరముగ ముద్రితమయ్యెను. ఈ సంఘటనము శ్రీభగవానుల యనుగ్రహమునకు మఱియొక యద్భుత నిదర్శనము.

1936 క్రిస్టమస్ సెలవులలో తొలుసారిగా శ్రీభగవానుల జయంతిమహోత్సవమును సేవించితిని. అప్పుడే "శ్రీరమణచత్వారింశత్" అను కావ్యకంఠకృతికి నా తెలుఁగు పద్యానువాదమునుగూడా సమర్పించితిని. అంతకుముందే

"శ్రీరమణ విభక్త్యష్టకము"నకు నా యాంధ్రీకరణమును తపాలామూలమున పంపుకొనియుంటిని. ఈ రెండుకృతులను పరిశీలించునప్పుడు శ్రీభగవానులు ఇట్లు చెప్పిరి. విభక్త్యష్టకము ప్రథమశ్లోకము తొలిపాదములో తత్కవి దైవరాతుడు

"శ్రీమ త్పారాశరోఽయం ప్రముదితవదనః పావనః పర్వతీయః"

అని శ్రీభగవానులను 'పర్వతీయుడు'గా పేర్కొనెనట. కానీ నాయన (శ్రీకావ్యకంఠులు) దైవరాతునిగురువు దానిని 'పార్వతేయః' (పార్వతికొమారుడు, స్కందుడు) అని మార్పించిరట. శ్రీభగవానులు కావ్యకంఠులను ఎప్పుడూ 'నాయన' అనే పిలుచువారు. అట్లు పిలుచుటకు కారణమును అప్పుడు వారు తెలియజేసిరి. కావ్యకంఠులు వయస్సులో పెద్దవారూ, గొప్పపండితులూ కావున మొట్టమొదట శ్రీభగవానులు ఆయనను 'శాస్త్రిగారూ' అని సంబోధించుచుండిరట. కానీ కావ్యకంఠులకు అదిచాలా అప్రియముగా ఉండినందున, తనను శ్రీభగవానులు 'ఒరే' 'గణపతీ' అని పిలువవలసినదిగా ఆయన ప్రార్థించెనట. ఎవరినిగానీ అట్లు హీనముగా సంబోధించుట శ్రీభగవానులకు అసాధ్యము. కావ్యకంఠుల శిష్యులు ఆయనను 'నాయనా' అని పిలుచుచుండిరి. సంస్కృతములో 'తాత' అను పదమువలె, తెలుగులో 'నాయన' అను పదమునకు 'తండ్రి' అను అర్థమే కాక, 'కొమారుని' ముద్దుగా 'నాయన'

అని పిలుచుటయు వాడుక, కావున శ్రీభగవానులుగూడా ఇఁక మీఁదఁట కావ్యకంఠులను 'నాయనా' అని పిలుచునట్లుగా ఇరువురూ రాజీపడిరి.

ఇప్పుడు దైవరాతుఁడు నేపాళములో నివసించుచున్నాఁడనీ, అచ్చట 'మహర్షిగజాననశర్మ' అను బిరుదుగలిగి గొప్పగౌరవమును పొందుచున్నాఁడనీ శ్రీ భగవానులు కబురుచెప్పిరి. కొంతకాలముక్రిందట, దైవరాతుఁడు ఎక్కఁడ ఉన్నాఁడని ఒకయాత్రికుఁడు శ్రీ భగవానులను అడిగెనఁట. ప్రస్తుతము ఆయనపోబడి తెలియదని శ్రీ భగవానులు బదులుచెప్పుచుండునప్పుడే, ఆ నాటితపాలా శ్రీభగనులచేతికి వచ్చెనఁట, అందులో మొట్టమొదటి జాబుమీఁద 'నేపాలము శ్రీక్షేత్రములో మహర్షిగజాననశర్మవద్దనుంచీ' అని యుండెనఁట. దానిలో ఆయన యిట్లు వ్రాసిరఁట: తాను చాలా దూరములో ఉన్నప్పటికినీ సదా శ్రీ భగవానుల పాదపద్మములయొద్దనే యున్నట్లు తన కనిపించుచున్నదఁట. దానిని ఋజువుపఱుచుటకేమో అన్నట్లు ఎదిగిన గడ్డముతో దైవరాతుని ఛాయాపట మొకటి ఆ జాబులో ఇమిడ్చఁబడి యుండెను. అది చూచినంతట, దైవరాతుఁడు స్వయముగా కనిపించి యాత్రికునిప్రశ్నకు 'నేను ఇక్కఁడనేకదా ఉన్నాను' అని పలుకుచున్నట్లు శ్రీ భగవానులకు తోఁచెనఁట!

ఈ సందర్భమున శ్రీ భగవానులకు మఱియొక యుదంతము జ్ఞాపకమువచ్చెను. నాయన "రమణగీత" 18వ యధ్యా

యము రచించుచుండఁగా, యాత్రికుఁ డొకఁడు ఒకపళ్ళెములో చక్కగా మాగిన బంగారువన్నె మామిడిపండ్లను గొన్నింటిని తీసుకవచ్చెను. వాటిని చూచి నాయన నాలుగవశ్లోకములో శ్రీ భగవానుల మేనిఛాయను ఆ మామిడిపండ్లతో పోల్చుచు,

"పరిణతామ్రఫలప్రభ విగ్రహం"

అని వర్ణించిరట.

అందులోనే పదియవశ్లోకము స్కందమహామంత్రమును ప్రతిపాదించునది. దాని సాంకేతికార్థము తెలియక వ్యాఖ్యాత యేమేమో వ్రాసియుండఁగా అదృష్టవశాత్తు అది ముద్రణకు పోకమునుపే నాయన దానిని గమనించి అందలి మంత్రశాస్త్ర సాంకేతికపదములను స్వయముగా వ్యాఖ్యానించి రనియు శ్రీభగవానులు మాతో చెప్పిరి.

పాశ్చాత్త్యులు పెక్కుమంది జయంతిమహోత్సవము నకు సమావేశమైరి. వారిలో ఒకరు మారిస్‌ఫ్రిడ్మన్ పోలండు దేశపు యూధుఁడు అత్యంతసూక్ష్మబుద్ధి గలవాఁడు ఆత్మ సాక్షాత్కారమునకు ఒక క్రియారూపసాధనను దెలుపుఁడని శ్రీ భగవానులను చిత్రవిచిత్రవాదములతో అర్థించెను. శ్రీ భగవానులు అతని వాదములను మిక్కిలి శ్రద్ధతో అవధ రించిరి, కానీ అంతసేపునూ మౌనము వహించిరి. ఏదైన చెప్పుఁడని ఆయన ఒత్తిడిచేయఁగా, శ్రీ భగవానులు బైబిలు నుండి యీ వాక్యమును ఉద్ధరించిరి.

"ఊరకుండి నేను దేవుఁడ నని తెలిసికొనుము."

మఱియు ఒక్కమాట అనిరి.

"'నేను దేవుఁడ' నని తెలిసికొను మన్నాడు గాని తలంచు కొను మనలేదు ప్రభువు"

దీనిని బట్టి, దొరగారి వాదము లన్నియు బుద్ధికల్పితములు, వీని యుపశమనమే సాక్షాత్కారమునకు ఏకైకమార్గము అని శ్రీ భగవానులు సూచించినట్లు మేము గ్రహించితిమి. మఱియొక దొర డంకన్ గ్రీన్లీస్ ఇట్లనెను:

"భగవాన్, మేము మీ సన్నిధానములో ఉన్నప్పుడు, ఒక నైర్మల్యశాంతి తేజస్సు మమ్మావరించియున్నట్లు తోఁచును. మేము ఇచ్చటినుండి వెడలిన కొంతకాలమువఱకు అది అట్లే ఉండును. ఆమీఁద అది మఱుగుపడును, ప్రాత దుర్బుద్ధులు మరలివచ్చును. అది యేల?"

శ్రీ భగవాను లిట్లు బదులుపలికిరి:

"అదియంతయు మనస్సు చేయుపని. బ్యాటరీవలె అది (మనస్సు) అఱిగిపోవును, దానిని మరల పూరింప వలసి వచ్చును. కాని మనోనిగ్రహము సమగ్రముకాఁగా, తదుపరి యే కష్టమునూ ఉండదు."

దాక్షిణాత్యభారతీయులు కాఫీపానపాత్రను పెదవులకుఁ దగులనీయక పైకెత్తి తెరలుచున్న కాఫీని ఏకధారగాఁ

నోటిలో పోసికొని కబళించు పద్ధతిని జూచి గ్రీన్‌లీస్ నిర్ఘాంత పోవుచు ఇట్లనెను.

"భగవాన్, తమ దర్శన మైనతర్వాత నాకు తిరిగీ జన్మ ఉన్నదో లేదో యెఱుఁగను. కానీ పునర్జన్మ నా కున్న దేని, ఒక్క-వరము ప్రార్థింతును. ఈ విధముగా ద్రవాగ్ని (కాఫీ) ద్రింగు అగ్ని పరీక్షనుండి తప్పుకొనుటకై నేను దాక్షిణాత్య భారతీయుఁడుగా మాత్రము పుట్టుకుందును గాక!"

ఇది విని అందఱూ గొల్లున నవ్విరి:

అప్పుడు తిరువణ్ణామలలో అఖిలభారత మహమ్మదీయ మత సమావేశము జరుగుచుండెను. అచ్చటినుండి మహమ్మదీయ మతబోధక ప్రముఖులు కొందఱు శ్రీభగవద్దర్శనార్థము వచ్చి యిట్లు ప్రశ్నించిరి.

"ఎల్ల మతముల గమ్యస్థాన మేది?"

అందులకు వెంటనే శ్రీభగవానులు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చిరి:

"ఆత్మార్పణద్వారా శాంతి. అదే 'ఇస్లాం' అను పదమునకు అర్థము."

ఇది విని వారందఱు అమందానందభరితులైరి:

ఒక రడిగిరి: "జగము మిథ్య అనుటలో భావ మేమి?" అని. శ్రీభగవానులు ఇట్లు వింతజవా బిచ్చిరి.

"జగము సత్యము అని భావము"
ఇందులకు ఈ శ్లోకమును ఉదాహరించిరి:

"దృష్టిం భూతమయీం కృత్వా, పశ్యేత్ భూతమయం జగత్ దృష్టిం జ్ఞానమయీం కృత్వా, పశ్యేత్ బ్రహ్మ మయం జగత్"

(భౌతికదృష్టికి జగము భూతమయముగా అగుపడును. జ్ఞానమయదృష్టికి ఆ జగమే బ్రహ్మమయముగా గోచరించును.)

1937 ఫిబ్రవరిలో కొద్దిరోజులు సెలవు రాఁగా ఆ యవకాశమును బురస్కరించుకొని నేను శ్రీకావ్యకంఠుల "గీతమాల"కు నా యనువాదమును స్వయముగా సమర్పించుటకు తిరిగీ ఆశ్రమము వెళ్లితిని. నేను హాలులో అడుగుపెట్టి సాష్టాంగ నమస్కారము చేయుచుండఁగా, నా యైదేండ్లకొమార్తె లలిత శ్రీభగవానులకు చాలాదగ్గఱ వెళ్లి వారిని "మీా పేరేమండీ?" అని యడిగెను. దీనికి నేను గాభరాపడితిని. శ్రీభగవానులు బదులు ప్రశ్న వేసిరి: "నీ పేరేమి?" అని "నాపేరు లలిత" అనుచూ, ఆమె "మఱి మీా పేరో?" అని మరల ప్రశ్నించెను. అంతట శ్రీభగవానులు కుడిచేతితో తన ఱొమ్మునపై కుడిభాగమును జూపించుచూ,

"ఏమీా! నన్ను నీకు తెలియదూ?"

అనిరి. వెంటనే ఆమె బదులు పలికెను:

"ఓ తెలుసును, తమాషా కడిగినాను"

అని. ఇది విని శ్రీభగవానులు గొల్లున నవ్విరి.

లలిత హాలులోపల ఒక్క నిమిషమైనా ఊరకుండలేదు శ్రీభగవానుల పంకా లాగుచూ వారి పుస్తకాలను తలక్రిందు చేయుచూ ఉండెను. ఇదంతా ఆశ్రమనిబంధనలకు విరుద్ధము గదా! మూడుసారులు శ్రీభగవానులు ఆమెను "ఏమి చేయు చున్నావు?" అని యడిగిరి. మూడుసారులూ ఆమె "ఊర కున్నాను" అని జవాబిచ్చెను. అందుమీద శ్రీభగవానులు ఇట్లు పలికిరి.

"చూడండి! ఈబిడ్డ యెంత తీవ్రముగా పనిచేయుచున్నదో! కానీ ఊరకున్నానని నొక్కి చెప్పుచున్నది! ఇది పసిబిడ్డ చెప్పుచున్నది, కాని పెద్దవాళ్లు గ్రహించుకో లేకున్నారు"

ఇది మొదలు లలిత శ్రీభగవానులకు ముద్దుబిడ్డ అయ్యెను. వారు ఆమెను లాలించి ఆమె అఱవఅయ్యవారమ్మవద్ద నేర్చు కొనిన అఱవపాటలను ఆమెచేత పాడించి నాట్యమాడించిరి. ఆ వినోదమునకు శ్రీభగవాను లెంతో ఆనందించిరని స్పష్ట మయ్యెను. ఆసమయమున వారి యనుగ్రహము పొంగిపొరలు చున్నట్లు తోచెను:

లలిత వీడ్కోలు ఎంతో మనసు కరగించు ఘట్ట మయ్యెను. అది ఉదయము. శ్రీభగవానులు భోజనశాలలో

పద్మాసనాసీనులై అప్పుడే ఉదయ ఫలాహారమును బూర్తి చేసుకొనిరి. లలిత వారిపాదములకు ప్రొక్కఁగా వారామెను తన దండముతో వీపు తట్టుచూ "ఇది నీవు మఱచి పోకుండా ఉండుటకు" అని పలికిరి. అంతట వారామెను లేవనెత్తి తన ఱొమ్మునకు గట్టిగా అదుముకొనిరి. అప్పు డచ్చటనున్న వారితో శ్రీభగవానులు ఇట్లనిరి.

"ఈమెకు క్రొత్తా వెరపూ అనుమాట లేదు. అందఱూ తనవాళ్లే, అన్నీ తనవే. ఇది యీ బిడ్డలో విశేషము."

మాతృకయైన "గీతమాల"లో పదిగీతములే ఉండెను. వానిలో ఒకటి 'ఇంద్రగీతము'. దానిని కావ్యకంఠులే అనువదించియుండిరి. ఆ మాలికకు శ్రీభగవానులు కావ్యకంఠుల మఱియొక ప్రాఁతగీతమైన 'తారకరామగీతము'ను జేర్చి దానిని గూడ అనువదింపు మనిరి. నాయన 'రేణుకాగీతము'ను 'పడవీడు' అను సమీపగ్రామములో వెంచేసియున్న దేవినిగూర్చి స్తోత్రముగా రచించెననియు ఆ 'పడవీడు' నే గీతములో 'కుండలీపురి' అని పేర్కొనెననియు శ్రీభగవానులు సెలవిచ్చిరి.

'శ్రీరమణగీత' దాని యనుబంధములు అనువదించు పనిలో నిమగ్నురాలనై యున్న నన్నుఁ జూచి నాయొకనాఁడు శ్రీభగవానులుమందహాసముతో ఇట్లనిరి. "మీకు కాలేజిలో చేయుపనికి జీతము వచ్చును. కానీ యీపనివల్ల మీ కేమి ఆదాయము?"

నేను దీనినిగూడ వాస్తవతః నిష్కామముగా చేయుట లేదనియు, ధనలాభముకన్న చాలా గొప్ప బహుమానమునే ఆశించి చేయుచున్నాననియు బదులుపలికితిని. చిత్రముగా మఱునెల సగము, నేను అనుకోని ప్రధాన పరీక్షకత్వము పరీక్షల ప్రారంభమునకు ముందటిరోజు తంతిమూలమున నాకు లభించెను. అది యెట్లు సంఘటించినదీ తర్వాత నాకు తెలిసెను. అధికారులు పరీక్షకుల నియామకములో పొరపాటున కావలసిన సంఖ్యకన్న ఒకరిని తగ్గించి నియమించిరఁట. పరీక్షలకు ముందురోజే యీ పొరపాటును గుర్తించిరఁట. అంతట వారు ఖాళీల భర్తీకొఱకు ఏర్పఱచుకొనియున్న జాబితాలో తొలిపేరు నాదిగా ఉన్నందున నన్ను నియమించుచూ తంతె యిచ్చిరఁట. కానీ అప్పుడు నేను బొత్తిగా అనుకోకుండ అది వచ్చినందువల్ల, ఆ పరిస్థితులలో ఆ భాగ్యము శ్రీభగవానుల యనుగ్రహసిద్ధిగా నేను గ్రహించితిని. తర్వాత వేసవిలో నేను శ్రీభగవానులను సందర్శించినప్పుడు వారితో "శ్రీరమణగీతానువాదకార్యమునకై శ్రీరమణుల చేతిమీఁదుగానే పారితోషకముగూడ నాకు ముట్టినది" అని మనవిచేసికొంటిని.

1937 వేసవిలో దీర్ఘనివాసానుజ్ఞ నర్థించు నా జాబునకు తే 9-5-1937 ది ఆశ్రమమునుండి అత్యంతసంతోషదాయకమగు నీ ప్రత్యుత్తరము వచ్చెను.

"మీకు సౌకర్యమైనప్పుడెల్ల ఇచ్చట మీకు సుస్వాగతము ... మిమ్ములను మాలో ఒక్కడుగా గణించుచున్నాము. కావున మీకు సౌకర్యమైనంతకాలమూ ఇచ్చట ఉండవచ్చును...మీరు సామాన్యయాత్రికుల జాబీతాలో చేర రని వేఱే చెప్పనక్కఱ లేదు."

ఇది శ్రీభగవానుల విశేషానుగ్రహచిహ్నముగా గణించి కనులద్దికొంటిని. అది మొదలు ప్రతిసంవత్సరమూ కనీసము మూఁడు మారులు ఆశ్రమమునకు పోవుచున్నాను.

ఆ వేసవిలో నేను హాలు ప్రవేశింపఁగానే శ్రీభగవానులూ వారి పరిచారకుఁడు మాధవస్వామీ ఒకరి నొకరు చూచి నవ్వుకొనిరి. నా కేమీ అర్థము కాలేదు. అంతట శ్రీభగవానులు మాధవస్వామితో "జరిగినది చెప్పవోయి" అనిరి. ఆతఁ డి ట్లనెను: "శ్రీభగవానులు మీ రమణగీతకు విషయక్రమణిక వ్రాయుచూ 'గ్రంథకర్తయే స్వయముగా వచ్చి దానిని వ్రాసుకోవచ్చును' అని పలికిరి. శ్రీభగవానులు చివర యక్షరము వ్రాసి ముగించుచుండఁగా, ఏ మాశ్చర్యము! మీరు సమ్ముఖమున ప్రత్యక్షమైనారు!" అప్పుడు మున్నెప్పుడు తెలియని విధమున గ్రహింపఁగలిగితిని శ్రీభగవానుల సంకల్పమేగాని నా సంకల్పముగాదు నన్నిచ్చటికిఁ గొని తెచ్చినది అని.

ఉదయము హాలులో కూర్చుండియుంటిని. శ్రీభగవానులు తన వ్రేలితో నన్నుఁ జూపి, పురాతనభక్తుఁడూ మా

ప్రొఫెసరూ ఐన శ్రీ యం. యస్. వేంకటరామయ్యగారితో "ఇతఁడేగదా మీ సూత్రధారి" అని మందహాసముతోఁ బలికిరి. శ్రీ వేంకటరామయ్యగారు కొద్దికాలము క్రింద తన కొమార్తె వివాహము చేసిరి. సంబంధము కుదుర్చుటలో నేను వారి కించుక ఉపకరించియుంటిని, ఆనాడు మధ్యాహ్నము శ్రీ వేంకటరామయ్యగారు నన్నూ 'శ్రీరమణచరిత్ర' రచయిత శ్రీఓరుగంటి వేంకటకృష్ణయ్యనూ తనయింట విందుకై కొనిపోవుటకు శ్రీభగవానుల యనుజ్ఞ వేఁడిరి. శ్రీభగవానులు చిఱునవ్వుతో తన యంగీకారమును సూచించుచూ ఇట్లనిరి.

"మఱి యెవ్వరూ నన్ను విందుకు పిలువరే! కానిండు. నేను లేక మీ రెట్లు విం దారగింతురో చూచెదను గాక. చెప్పియుండలేదా?
'అహం వైశ్వానరో భూత్వా, ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధం'
అని."

శ్రీ వేంకటరామయ్యగారు మమ్ముల సిద్ధఁజేసి ఒక గుఱ్ఱపు బండిలోఁ గూర్చుండఁబెట్టిరి. అది దారిలో తలక్రిందై దాని చక్రము విఱిగిపోయెను. కాని మేము చెక్కు-చెదరకుండా తప్పించుకొంటిమి. మరలివచ్చిన తర్వాత నేను శ్రీభగవానులతో జరిగిన యుదంతము మనవిచేసి యిట్లంటిని:

"భగవాన్, మీరు నిజముగా దారిపోడుగునా మాతోఁ గూడ ఉంటిరి. లేకున్న మేము కనీసము అంగవికలులము కావలసినదే!"

ఒకనాటిరాత్రి శ్రీభగవానులు భోజనముచేయుచూ "కిచ్చిలికాయ ఊరుగాయ ఉన్నదా?" అని యడిగిరి. వెదకఁగా లేనందుకు సర్వాధికారి నొచ్చుకొనిరి. మఱునాఁడు మధ్యాహ్నము ఆశ్రమమునుండి వెడలు తపాలా వాడుక చొప్పున శ్రీభగవానులకు శ్రీ గ్రిద్దలూరు నరసింగరావుచేఁ జూపఁబడెను. అందు ఒక జాబులో సర్వాధికారి మధురవాస్తవ్యుఁడగు నొక భక్తునికి ఒక బుట్ట కిచ్చిలిపండ్లు పంపుమని వ్రాసియుండెను. అది చదివి శ్రీభగవానులు కోపపడుచు ఇట్లు పలికిరి.

"చూడండి, వీళ్లకు మోక్షము కిచ్చిలిపండ్లలో ఉన్నట్లున్నది! లేకున్న, వాటికొఱకు మనము ఒకరికి వ్రాయవలెనా? అవి రావలసియున్న వాటియంతట అవే రావా? సరి, మీయిష్టము వచ్చినట్లు చేయండి"

ఇట్లనుచూ శ్రీభగవానులు ఆ జాబును నరసింగరావుపై విసరివైచిరి. అంతట ఆతఁడు వణఁకుచూ నిష్క్రమించుచుండఁగా, ఒక రైల్వేకంట్రాక్టరు సీలుచేయఁబడిన రెండు పార్సెలు బుట్టలతో హాలులో ప్రవేశించెను. ఆ పార్సెళ్లకు రైల్వేరశీదు వచ్చియుండలేదు. ఆ దినములలో ఆశ్రమమునకు వచ్చు ప్రతి

వస్తువును లోపలికిఁ గొనిపోవుటకుముందు శ్రీభగవానులకు తప్పనిసరిగాఁ జూపుట వాడుకయై యుండెను. అప్పుడు వాటిని జూచి శ్రీభగవానులు నవ్వుచూ

"ఏమి! ఈ పార్సెళ్లు కిచ్చిలిపండ్లాయేమి? తెఱచిచూడండి"

అని పలికిరి. వాటిని తెఱచిచూడఁగా, ఏ మాశ్చర్యము! అవి సాక్షాత్తు కిచ్చిలిపండ్ల బుట్టలే! తత్క్షణము వాటిని కోసి ఊర వేయుటకై హాలుకు ఎదురుగా నున్న వంటయింటిలోనికి తీసు కొనిపోయిరి. మరల శ్రీభగవానులు

"బహుశః ఒకబుట్ట పుల్లపండ్లూ రెండవబుట్ట తియ్యపండ్లూ నేమో? చూడండి"

అనుచూ వాటిని కలిపివేయుటకు ముందుగా పరీక్షించుటకై ఒకనిని పంపిరి. చూడఁగా శ్రీభగవానులు ఊహించినట్లే యుండెను. మొదట తియ్యపండ్లను ఒలిచి తొనలను అప్పుడు హాలులోఉన్న యావన్మందికీ పంచిపెట్టిరి. నే నాశ్చర్యమగ్నుఁ డనై "ఈ సంభవము ఒక మహిమ అనుకోవలెనా? లేక కేవ లము కాకతాళీయమా?" అని ప్రశ్నించితిని. దీనికి ప్రత్యుత్త రముగా శ్రీభగవానులు "యోగవాసిష్ఠము"లోని యీక్రింది శ్లోకమును ఉదాహరించిరి:

"చిన్తామణి రియం ప్రజ్ఞా హృత్కోశస్థా వివేకినః
ఫలం కల్పలతేవేషా చిన్తితం సంప్రయచ్ఛతి"

[ఈ ప్రజ్ఞయే చింతామణి. ఇది జ్ఞానుల హృదయపేటికలో ఉన్నది. ఇది కల్పలతవలె తలంచినఫలమును వెంటనే సమకూర్చును.]

మఱియు శ్రీశంకరాచార్యులవారు "వివేక చూడామణి"లో 'ప్రజ్ఞ' యను పదమున కిచ్చిన యీక్రింది నిర్వచనమునుగూడ శ్రీభగవానులు ఉద్ధరించిరి:

"నిర్వాసనా చ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే"
[వాసనారహితము, చిన్మాత్రము అగు తలంపునకు 'ప్రజ్ఞ' అని పేరు.]

ఆవెనుక శ్రీ భగవానులు పై రెండు ఉద్ధారములను స్వలిఖితముగా నిండుకరుణతో నాకు ప్రసాదించినారు.

శ్రీ వేదంఅనంతాచారి అను భక్తుఁడు తెనుఁగు "రమణ గీత" ముద్రణకార్యమునందు మిక్కిలి శ్రద్ధతోఁ బాల్గొనెను. కావున గ్రంథపీఠికలో ఆయనకైంకర్య మించుక ప్రశంసింపఁబడెను. అందుల కాయన తనను ఆవిధముగా పేర్కొనవలదని శ్రీ భగవానులతో గట్టిగా మనవిచేసికొనెను. ఆయనకు శ్రీ భగవాను లిట్లు బదులుచెప్పిరి:

"ఎందు కాందోళనపడెదవు? నీపేరు వేయవలెనని కోరుట యెంత అహంకారమో వేయఁగూడదని కోరుటయు అంత అహంకారమే. కావున అది ఉన్నట్లు ఉండిపోనీ. కడపటికి, 'అనంతాచారి' అంటే యెవ రని యెవరికి తెలుసు?"

ఈ సెలవులలో నాకు ఎచ్చమ్మగారితో పరిచయ మయ్యెను. ఆమె మొదలియారుపాటీ శ్రీ భగవానులకూ భక్తులకూ ముప్పదేండ్లకు పైఁగా భోజనము తెచ్చి పెట్టు చుండినవారు. ఎచ్చమ్మగారి యిల్లు రమణభక్తులకు ధర్మసత్రము. వారిని ఆమె తన సొంతబంధువులుగా చూచుకొనెను. నాయెడల ఆమె హృదయ మెల్లప్పుడూ వాత్సల్యప్రపూర్ణమై యుండెను. ఆమె నాతో శ్రీ భగవానులనుగుఱించి ప్రాత కథలు లెక్కలేనన్ని చెప్పుచుండెను. వాటివల్ల శ్రీ భగవానులు నాహృదయమునకు మఱింత సన్నిహితులైరి. అందులో రెంటి నిచ్చట ప్రస్తావించెదను. శ్రీ భగవానులు కొండమీఁద నివసించుచుండిన దినాలలో ఒకనాడు ఎచ్చమ్మ ఆహార మెత్తి కొని పైకి పోవుచుండఁగా కొందఱు యాత్రికులజట్టు ఎదు రయ్యెను. వాళ్లు ఆశాభంగసూచకముగా మొగాలు వ్రేల వేసికొని తిరిగివచ్చుచుండిరి. ఈమె విచారింపఁగా, వాళ్లు దూరస్థలమునుండి యాత్ర వచ్చినారనీ, ఎంత వెదకినా మహర్షి యెక్కడా కనిపించలేదనీ ఆమెతో మొఱపెట్టుకొనిరి. నేను చూపించెదను రమ్మని ఆమె వాళ్లను తనతోఁగూడా తీసుకవెళ్లెను. శ్రీ భగవానులదర్శనము కాఁగానే వాళ్లు మిక్కిలి ఆశ్చర్యచకితులై సిగ్గుపడిరి. ఏల యనఁగా, వాళ్లు ఆయనను ముందు చూచియేయుండిరి. అప్పు డాయన గోచి పెట్టుకొని, ఒంటరిగా ఒకమట్టిగోడ కట్టుచుండెను. వీళ్లు ఆయన కూలివాఁ డనుకొని "స్వామి యెక్కడ?" అని అడిగిరి.

అందుకు శ్రీ భగవానులు "ఏమో నాకు తెలియదు" అని జవాబిచ్చిరట. వాళ్లు వెళ్లినతర్వాత ఎచ్చమ్మ భగవానులను "ఏమండీ, పాపము! ఆ యాత్రికులను మోసపుచ్చినారటనే" అని మందలింపఁగా, శ్రీ భగవానులు.

"ఏమి! 'ఇదుగో, ఇక్కడే స్వామి, చూడండి!' అని చెప్పుకోమన్నావా?"

అని సమాధానమిచ్చిరి.

శ్రీ భగవానులను దొంగలు కొట్టినప్పుడు ఎచ్చమ్మ ఊరిలో లేదట. ఆ వార్త విని భయార్తయై ఆశ్రమమునకు పరుగున వచ్చి శ్రీభగవానులను జూచి యేడువ నారంభించెను. ఆమె నూరడించుటకై శ్రీ భగవానులు ఆ యుదంతమును చులకనచేయుచు ఆమెతో ఇట్లు పలికిరి:

"ఎందుకీ గాభరా? ఇందులో వింత యేమీ లేదు. మీ రందఱు నాచేత తినుబండాలు, ఫలాహారాలు తినిపించు నట్లే, ఆ దొంగలు నాచేత దెబ్బలు తినిపించినారు. వాళ్లు కూడా నాభక్తులే!"

ఈ కాలమున యం. మార్సెల్ రియూ అను నొక ఫ్రెంచి భక్తునికీ నాకూ స్నేహము కుదిరెను. అతనికి ఇంగ్లీషు రాదు. నాకు ఫ్రెంచి రాదు. ఒకనాఁడు శ్రీభగవానులు హాలులో మే మిరువురమూ కలసియుండుటఁ జూచి మే మెట్లు సంభాషించు కొనఁగలిగితి మని అడిగిరి. మేము మౌనముగా మహా హావభావ

ములు ఒకరి కొకరు తెలుపుకొనువైఖరి నేను విశదపఱిచితిని. ఔను. మౌనమే నిక్కమైన హృదయసంభాషణము" అని శ్రీభగవానులు సెలవిచ్చిరి. వారు మా సహవాసమునకు సంతోషించినట్లు కనిపించిరి.

అప్పుడు అలహాబాద్ కమీషనర్‌గా ఉండిన శ్రీపన్నాలాల్, ఐ. సి. యస్' సకుటుంబముగ ఆశ్రమమునకు యాత్ర వచ్చియుండెను. ఒకయుదయము ఆయన శ్రీభగవానులతో తనకు సంపద, అధికారము, సమస్తసౌకర్యములు కలిగియున్నను, శాంతి లభించలేదని మనవిచేసికొనెను. శ్రీభగవానులు వెంటనే ఆయనను "మీకు శాంతి యేల కావలెను? మీరు ఉన్నట్లే ఉండరాదా?" అని ప్రశ్నించిరి. "శాంతి లేనిదీ నాకు సౌఖ్యము లేనందువల్ల" అని పన్నాలాల్ జవాబిచ్చెను. అంతట శ్రీభగవాను లిట్లు పలికిరి.

"అది అట్లే. ఒకమనిషికి తలనొప్పి తగిలెనేని దానికి తగిన మందు పుచ్చుకొని ఆబాధ నివారించుకొనువఱకు ఆతఁడు ఊరకుండఁడు. ఎందువల్ల అనఁగా ఆరోగ్యమే మన స్వభావము, రోగము కాదు. అదే విధముగా, శాంతి మన స్వభావము. నిక్కముగా శాంతియే మనము. ఈసత్యమును మఱచిపోయి బాహ్యకరములనుండి మనము శాంతిని వెదకుచుందుము. అది అసాధ్యమైన యన్వేషణము. అదే యీ క్లేశమున కంతా కారణము. ఎప్పుడు బాహ్యవిషయములనుండి మనస్సును మరలించి అంతర్ముఖము

గావింతురో అప్పుడే మీరు నిక్కమగు శాంతిని అనుభ
వింతురు, సుఖింతురు.''

పన్నాలాల్ శ్రీ భగవానులకు తాంబూలమిళితమగు శ్రేష్ఠమైన వక్కపొడి నజరిచ్చెను. అది నోటిలో వేసికొనఁగానే కరఁగి పోయి తాంబూలపరిమళము ఘుమాయించెను. శ్రీ భగవానులు దానిని మెచ్చుకొని నాకును రుచిచూడు మని కొంచెము ప్రసాదించిరి. తర్వాత అచిరకాలములోనే పన్నాలాల్ యు.పి.లో మొదటి కాంగ్రెసుప్రభుత్వమునందు ప్రధానకార్యదర్శిపదవి నధిరోహించెను. అప్పుడు నేను ఆయనను అభినందించుచూ "శ్రీ కృష్ణుఁ డారగించిన సుదాముని యటుకుల వలె శ్రీ భగవానులు చేవిగొన్న మీ వక్కపొడి ఈ యదృష్టమును మీకు సమకూర్చినదేమో!'' అని వ్రాసితిని. అందుల కాయన 27-3-1938 వ తేదీ యిట్లు ప్రత్యుత్తరము వ్రాసెను:

"ఈ సందర్భమున నాకు వచ్చిన యనేక అభినందనలేఖలలో ఏదియూ మీజాబుకన్న ఎక్కువ ఆనందమును గూర్పలేదు. *శ్రీ భగవానుల యనుగ్రహమువలననే నాకీ గొప్ప గౌరవము లభించినది అను నా హృదయవిశ్వాసమునే* మీలేఖ దృఢపఱిచినది.''

ఒకదినము శ్రీ భగవానులు కీర్తిశేషులు డాక్టరు టి. యం. నాయరుసోదరీమణి యైన కీర్తిశేషురాలు అమ్మణి

అమ్మాళ్ జీవితచరిత్రను చదువుచుండి, ఆమె పాండిత్యము, భక్తి, ధర్మప్రవణతలనుగుఱించి గొప్పగా చెప్పిరి. ఆమె జబ్బుపడి అవసానకాలమున శాంతనిష్క్రమణముకొఱకు ప్రార్థించుచూ శ్రీ భగవానులకు తంతె పంపెనఁట. ఆ తంతె ఆశ్రమము చేరి ఆమె సందేశమును శ్రీ భగవానులు చదువుచున్నప్పుడే, సరిగా ఆమె స్వగృహమున కాలధర్మ మొందెనఁట. ఈ యుదంతమును శ్రీ భగవానులు గద్గదస్వరమున వాకొనుచు కరుణాపూరితులై కన్నీరుఁ గార్చిరి.

ఒకనాఁడు వేకువసమయమున శ్రీ భగవానులు ప్రతిదినము మనకు ప్రత్యగాత్మ యెట్లు ద్యోతక మగుచున్నదీ విశదీకరించిరి. నిద్రకూ మెలకువకూ నడుమ ఒక క్షణికసంధి కలదు. 'నే'నను తలంపుతో మెలకువ యెఱుక ఆరంభమగును. ఈ 'నే'నను తలంపు లేచుటకు ముందు అఖండవిశుద్ధప్రజ్ఞ ఒక్క-త్రుటిమాత్ర ముండును. మొదట జ్ఞానాభావము, అంతట విశుద్ధప్రజ్ఞాప్రకాశము, ఆ మీఁద 'నే'నను తలంపుతోఁగూడ బాహ్యప్రపంచజ్ఞానప్రవాహము- ఇదీ వరుస. ఇందు మధ్యస్థితియే ఆత్మజ్ఞానము. మనము తగినంత జాగరూకత కలిగి సూక్ష్మబుద్ధితో గమనింతుమేని, అది మనకు గోచరింపఁగలదు.

మఱియు శ్రీ భగవానులు జాగ్రత్ స్వప్నసుషుప్తులు అను మూఁడవస్థలు మన జ్ఞానోదయమునకై యెట్లు నిర్మింపఁబడినవో విశదీకరించిరి. వారిట్లు సెలవిచ్చిరి:

"జాగ్రత్తులో నేను ఈ భౌతిక దేహముతో ఈ లోకమునం దున్నాను. స్వప్నములో నాయందుండి వేఱొక లోక మును వెలివఱుచుచున్నాను. ఆ లోకమందలి రూపము లలో ఒకరూపముతో నేను నన్ను ఏకీకరించుకొనుచున్నాను. గాఢసుషుప్తిలో నాకు ఏలోకముయొక్కగాని రూపము యొక్కగాని యెఱుకలేదు. కాని నేనుమాత్ర మున్నాను. ఏలనఁగా, నేను లేకుండినయెడల, నేను తిరిగీ జాగ్రత్ జ్ఞానమునకు వచ్చుట సంభవింపదు. కాఁగా, ఈ మూఁడవ స్థలకూ'' సామాన్యమూల మేది? అది 'నేను' లేక 'నే నున్నాను' తప్ప వేఱు గాదు."

ఇట శ్రీ భగవానులు బైబిల్ ఎక్సోడస్ మూఁడవసర్గలో మోసస్‌కు దేవుని ప్రత్యుత్తరమును ఉదాహరించిరి: "దేవుఁడు మోసస్‌తో 'నేను నేనుగానే ఉన్నాను' అని చెప్పెను. మఱియు దేవుఁ డిట్లు పలికెను. ఇస్రయిల్ సంతతితో నీవు ఇట్లు చెప్పవలెను. 'నేనున్నాను అనునతఁడు నన్ను మీావద్దకు పంపెను' అని."

ఇంకను శ్రీభగవానులు పంచకోశములనుగూర్చి సామా న్యాభిప్రాయములోఁగల పొరపాటును ఎత్తిచూపిరి. పంచకోశ ములనఁగా ఇనుపపెట్టెలో అఱలవలె అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందము అనునైదు అఱలు వరుసగా తొలిదానిలో రెండవది ఇముడ్పఁబడియున్నవి, వానియన్నిటి

లోపల ఆత్మ దాపబడి యున్నది అని సామాన్యాభిప్రాయము. శ్రీభగవాను లిట్లు చెప్పిరి: పంచకోశములకు మంచి యుపమానము సువాసన గుబాళించు చేతిగుడ్డ. పంచకోశములకు దీటుగా దానికీ అయిదుగలవు: పదార్థము (ప్రత్తిగానీ, పట్టుగానీ), నేత, పరిమాణము, వర్ణము, పరిమళము. కానీ ఈ యైదునూ ఒక దాని కొకటి ప్రత్యేకముగా నుండక చేతిగుడ్డయొక్క ప్రతి దారములోనూ కలసికొని యున్నవి. అదేతీఱున పంచకోశములునూ ఆత్మలో సమ్మిళితమై యున్నవి.

ఈమారు నేను ఆశ్రమములో దీర్ఘకాలము ఉండినందున అచ్చటినుండి బయలుదేఱుట అనఁగా నాకు దుర్భరహృదయ వేదన యయ్యెను. అప్పటి నాభావోద్రేకము నాచే 11-6-1937వ తేదిన మార్గమధ్యమున రచితమై వేంకటగిరి మకాంనుండి తపాలాద్వారా ఆశ్రమమునకుఁ బంపఁబడిన యీ క్రింది పద్యములలో వ్యక్తమయ్యెను.

తే॥ గీ॥ అమ్మగారింటనుండియు నత్తవారి
యింటికిఁ గాపురమ్మున కేఁగఁ బయన
మైన క్రొత్తకోడలి చంద మయ్యె, నకట!
త్వత్పదము వీడి యూరికిఁ బయనమగుట॥

తే॥ గీ॥ అల్ల యావేదనమ్ముఁ దా నుల్ల మొకటె
యెఱుఁగుఁ; బలుకుల వర్ణింప నెవరి తరము?
తలఁచినంతనె వాక్కు గద్గదిక నొందుఁ;
దనువు పులకించుఁ; జిత్తమ్ము తన్మయ మగు॥

కం॥ నీ నగవులు నీ చూడ్కులు
నీ నవనీతంపునుడులు నీ ధ్యానమ్ముల్
నీ నానాద్భుతలీలలు
మానసమున నాటి యెపుడు మగుడవు, తండ్రీ॥

సీ॥ మౌనమ్ముచేత సంభాషింతు వొకవేళఁ;
బలుకుచే మౌనమ్ముఁ గొలుపు దొకటఁ;
గడు నుదాసీనుండుగా నుందు వొకవేళ;
నందఱి యార్తిఁ బాల్గొందు వొకట;
ఏ మెఱుంగ నని మ మ్మేమార్తు వొకవేళఁ;
బరమార్థమును బోధపఱుతు వొకట;
అరుణాచలుని భంగి నచలుండ వొకవేళ;
నెల్ల పనుల నిర్వహింతు వొకట;
దివ్యగాంభీర్యకలిత దేదీప్యమాన
యుష్మదాకృతి దుర్వీక్ష్య మొక్కవేళ;
స్వాంత మొసఁగి తల్లివలె లాలింతు వొకట;
నీదు లీలల నెవఁడు వర్ణింపఁ గలఁడు?

సీ॥ వాగమృతమ్మును వర్షించుటకు మున్నె
మృదుకటాక్షేక్షణామృతముఁ జిలికి,
దర్శనామృతమును దయసేయుటకు మున్నె
యుదరామృతముచేత నోడలిఁ దనిపి,
కడుపున కమృతమ్ముఁ గావించుటకు మున్నె

తలఁ పన్న యమృతమ్ముఁ దల నొసంగి,
శిక్షామృతమ్మును జేకూర్చుటకు మున్నె
హృదయామృతమ్మయి యెదను నిలిచి,
తల్లి తండ్రియు గురు వన్న దైవ మనఁగఁ
దన్ను నమ్మినవారికిఁ దానె యగుచు
భక్తలోకమ్ముఁ గరుణింప భవముఁ గొన్న
పరమతత్త్వమ్మ! సాష్టాంగవందనమ్ము.

దీనికి ఆశ్రమమునుండి ప్రత్యుత్తర మిట్లు వచ్చెను:

“భావోద్రేకపూరిత మగు మీ పద్యపంచకముతోటి మీ లేఖ శ్రీ భగవానులచే ఆలోకింపఁబడెను.”

మఱుసారి నేను ఆశ్రమమునకు తిరిగి రాఁగానే శ్రీ భగవానులు నన్నుఁ జూచి యచ్చటివారితో ఇట్లనిరి:

“ఓహో! క్రొత్తకోడలు అమ్మగారింటికి మరల వచ్చినది! ఆమెను సరిగా చూచుకోండి!”

ఈ యనుగ్రహవాక్కులు కేవలపరిహాసము కావు, నాయెడల శ్రీ భగవానుల వైఖరిని వాస్తవముగా వర్ణించినవి. అది కేవలపరిపూర్ణవాత్సల్యము.

1937 అక్టోబరు 31 వ తేది, నా రెండేండ్లకొమార్తె ఇందిరకు రెండు మారులు వాయుగుణము (fit) తగిలెను. తొలిసారికన్న రెండవసారి యెక్కువ తీవ్రముగా వచ్చెను.

తటాలున ఆబిడ్డ ప్రజ్ఞను గోల్పోయెను. అన్ని నాడులూ స్తంభించిపోయెను. ఒడలు శవాకారముగాఁ జూపట్టెను. ఇంగ్లీషువైద్యుఁడు "మా శాస్త్రములో దీనికి ఔషధము లేదు. ఆయుర్వేదవైద్యము చేయించండి" అని చెప్పెను. ఆ సమయమునకు ఒక ముసలివాఁడు తాను కాల్చుచుండిన పొగచుట్ట నిప్పును ఆబిడ్డ కనుబొమలనడుమఁ దగిలించఁగా గొంతులో శబ్దము వచ్చెను. ప్రాణనాడులు తిరిగి పనిచేయ నారంభించెను. కానీ బిడ్డ రెండ్వకనక మూర్ఛిల్లినట్లే యుండెను. ఇద్దఱు ఆయుర్వేదవైద్యులకు ఒకరితర్వాత మఱియొకరికి చెప్పిపంపితిని. కానీ యిరువురూ లేరని కబురు వచ్చెను. ఈ విపత్సమయమున నాదృష్టి శ్రీ భగవానులపటముపై వ్రాలెను. నేను సాష్టాంగప్రణామము చేయుచూ "ఓ భగవాన్, ఇప్పుడు మానవసహాయము అలభ్యమైనది. ఇఁక నీవే కాపాడవలెను." అని యనుకొంటిని. లేచి, యూరక మేజా డ్రాయరు తెఱచి, తంతికాగితము తీసుకొని, దానిలో ఆబిడ్డ యెడల శ్రీ భగవానుల యనుగ్రహము నర్థించుచు ఒకప్రార్థన వ్రాసి, అర్జెంటుతంతి పంపితిని. తంతియుద్యోగులు ఆ తంతివార్త ఆశ్రమమునకు సాయంకాలము 7 గంటలకు చేరునని చెప్పిపంపిరి. సరిగా 7 గంటలకే ఆయుర్వేదవైద్యులిరువురునూ ఒకేమారు వచ్చిరి. ఆ 7 గంటలకే శ్రీ వి. వి. నారాయణప్ప కూడా వచ్చి "ఇదిగో నీబిడ్డకు భగవానుల ప్రసాదము" అనుచూ నా చిరునామా గల కవరొకటి నా చేతిలో పెట్టెను.

ఆ సమయమున అది 'పాహి' 'పాహి' యని మొఱపెట్టు గజేంద్రునకు శ్రీవిష్ణ్వాగమనమువలె, నా ప్రార్థనకు శ్రీభగవానుల యభయప్రదానముగా నాకు తోఁచెను. శ్రీనారాయణప్ప యిట్లు విశదీకరించెను. గతసంవత్సరము ఆయనకు జబ్బుగా నుండినప్పుడు నేను ఆయనకొఱకు తెప్పించిన ప్రసాద మది. దానిని ఆయన ఆ కవరులోనే భద్రపఱిచియుంచెను. ఇప్పుడు దానిని ఈ బిడ్డకు వినియోగించవలెనని ఆయనకు స్ఫురించెను. ఆ యిరువురు వైద్యులును పరస్పరము సంప్రదించుకొని బిడ్డకు ఔషధమొసఁగి ప్రాణభయము లేదని నాకు హామీ యిచ్చిరి. మఱునాడు రాత్రి ఆ బిడ్డ ప్రక్కన నిద్రించుచుండఁగా నాకు ఒక యద్భుతస్వప్నము వచ్చెను. నేను శ్రీభగవానుల హాలులో ఉంటిని. శ్రీభగవానులు యథాప్రకారము తనశయ్యమీఁద దిండుపై ఆనుకొని కూర్చుండియుండిరి. వారియెదుట నల్లని వర్ణము, క్రూరదృష్టి, పర్వతాకారము గల యొకవ్యక్తి నిలుచుండెను. శ్రీభగవానులు తన చూపుడువ్రేలితో అతనిని హాలు వదలి పొమ్మని ముమ్మారు సైగచేసిరి. ఆ ప్రకారమే ఆ వింతవ్యక్తి ప్రథమద్వారముగుండా వెడలి పోయెను. అంతట శ్రీభగవానులు నావైపు తిరిగి నన్ను దగ్గఱకు పిలిచి "నీ బిడ్డకు ఎట్లున్నది?" యని యడిగిరి. "భగవాన్, మీ యనుగ్రహము వల్ల కొంచెము నెమ్మదిగా ఉన్నది." అని నేను బదులు చెప్పితిని. అంతట శ్రీభగవానులు "ఆ బిడ్డకు తప్పక ఆరోగ్యము కలుగును. భయపడవద్దు" అని తనచేతితో నావీపు నిమిరిరి.

వారి యీ స్పర్శవలన నాకు తన్మయానందము కాఁగా, కల కరఁగిపోయెను. మఱునాటి యుదయము ఆశ్రమమునుండి నాకు ఈ క్రింది ప్రత్యుత్తరము వచ్చెను.

"నీ తంతివార్త నిన్నరాత్రి 7 గంటలకు అందుకొంటిమి అది శ్రీభగవానులచే ఆలోకింపఁబడినది. నీ బిడ్డపై శ్రీభగవానుల యనుగ్రహము పూర్ణముగా ఉన్నది. ఆమె తప్పక కోలుకొనఁగలదు. నీవు భయపడవలదు."

తర్వాత పై యుదంతమునూ స్వప్నమునూ తెలుపుచు వ్రాసిన నా లేఖకు ఆశ్రమమునుండి ఈ క్రింది జవాబు వచ్చెను.

"శ్రీభగవానుల యనుగ్రహమువల్ల నీబిడ్డ గండము గడచినది అని వినుటకు మేము చాలా సంతోషించుచున్నాము. అది అంతా శ్రీభగవానుల యనుగ్రహమే. అది అద్భుతమగు శ్రీభగవదనుగ్రహలీలనూ నీ గాఢ భక్తినీ సూచించుచున్నది."

ఆ వెంట వచ్చిన క్రిస్టమస్ సెలవులలో నేను తిరిగీ ఆశ్రమము వెళ్ళినప్పుడు శ్రీభగవానులను ఏకాంతములో అడిగితిని "మీరు నా తంతె చూచి యే మనుకొంటిరి!" అని. "ఔను. నీ తంతె వార్త చదివితిని. అప్పుడు గడియారము 7 గంటలు కొట్టుటగూడ గమనించితిని" అని వారు పలికిరి. నేను వదలకుండా మళ్ళీ యి ట్లడిగితిని:

"అయితే భగవాన్, 'వీఁడు నిండా ఆర్తిలో ఉన్నాఁడు పాపము! వీనిబిడ్డను ఏలాగైనా కాపాడవలెను.' అని మీరు అనుకోనలేదా?"

వెంటనే శ్రీభగవాను లిట్లు బదులుపలికిరి :

"బిడ్డను కాపాడవలె నను తలంపుగూడ ఒక సంకల్పమే. ఎట్టి సంకల్పముగానీ కలవాఁడు జ్ఞాని కాఁడు. వాస్తవములో అట్టి తలంపు అనావశ్యకము. జ్ఞానిదృష్టి దేనిమీఁద నైనఁ బడిన వెంటనే ఒక **Divine automatic action** (దివ్యస్వతస్సిద్ధ కార్యము) బయలుదేఱును. అదే ఉత్తమ శ్రేయస్సును జేకూర్చును."

పై సంభాషణ అంతా తెలుఁగులో జరగెను. **"Divine automatic action"** అను ఇంగ్లీషుమాట మాత్రము శ్రీభగవానులే స్వయముగా ఉచ్చరించిరి.

ఒకయుదయము భక్తాగ్రగణ్యుఁడూ వాగ్గేయకారుఁడూ ఐన శ్రీ యం. వి. రామస్వామిఅయ్యర్ హాలులో నాప్రక్కన గూర్చుండి నానోటుపుస్తకము నుదువుటతటస్థించెను. దానిలో నేను రచించిన యింగ్లీషుగేయము లుండెను. వాటి కాయన మిక్కిలి సంతోష మొంది వెంటనే శ్రీభగవానులయొద్దకు తీసుకవెళ్ళి "ఇవి మనసుబ్బరామయ్యా రవీంద్రనాథటాగూరు ఫక్కీలో వ్రాసినాఁడు" అనుచూ వారిచేతి కిచ్చెను. అందుమీఁద శ్రీభగవానులెంతో అనుగ్రహముతో వాటి నన్నిటినీ

చదివిరి. "యురేకా" (కనుగొంటిని) అను శీర్షిక గల పాటలో శ్రీభగవానులు "Cross–Word Puzzle' (వక్రపదసమస్య) అను సమాసమును 'Cross–World Puzzle' (వక్రప్రపంచసమస్య) అని పఠించిరి. పొరపాటును సవరించుకొని చదువఁబోయిరి. కానీ నేను శ్రీభగవానులుచ్చరించిన పాఠమువల్ల భావ మెంతో మెఱుఁగెక్కిన దని మనవిచేయుచూ వారు చదివినట్లుగా నా పాఠమును సవరించుకొనుటకు అనుమతి వేఁడితిని. శ్రీభగవానుల పాఠమే తర్వాత గ్రంథములో ముద్రితమైనది. 'Uunder the Microscope' (భూతద్దముక్రింద) అను శీర్షికగల పాటను జదివి శ్రీభగవానులు అప్పు డచ్చట ఉన్న రసాయనశాస్త్రాచార్యుని "దీనికి మీ సైన్సు ఏమి చెప్పును?" అని యడిగిరి. ఆ యాచార్యుఁడు చిఱునవ్వునవ్వి యూరకుండెను. శ్రీభగవానులు "I and Thou" (నేనూ, నీవూ) అను పాటను బిగ్గఱగా పఠించిరి: దానిలో కడపటి వాక్య మిది :

"I without me am Thou. Thou without Thee art I. Indeed I and Thou are one."
[నా- లేని నేను నీవు; నీ- లేని నీవు నేను;
నిక్కముగా నేనూ నీవూ ఒక్కరమే.]

దీనిని జదివి శ్రీభగవానులు పకృన నవ్విరి. ప్రాసంగికముగా నేను టాగూరు గేయములో

"I run like the musk-deer, mad with my own perfume.
I seek what I cannot get, I get what I do not seek."
[కస్తూరిమృగమువలె నేను నా పరిమళముతోనే మత్తెక్కి

పరుగిడుచున్నాను. నేను పొందరాని దానిని గోరుచున్నాను;
నేను కోరనిదానిని బొందుచున్నాను.]

అను వాక్యమును ఉదాహరించితిని. దీనిని శ్రీభగవానులు మిగుల మెచ్చుకొని తనభక్తులకు దీని భావమును అఱవములో విశదీకరించిరి.

"కవిత్వమూ కడమ లలితకళలూ ఆత్మసాక్షాత్కారమునకు ఒక సాధనగా ఉపయోగపడఁగలవా?" అని నేను ప్రశ్నించితిని. శ్రీభగవాను లిట్లు జవాబిచ్చిరి.

"మనస్సున కేకాగ్రతఁ గూర్చు ప్రతిదియు సహాయమే. కానీ ప్రతి కళాభ్యాసమందునూ ఒక భూమికలో 'అలం' భావము పొడమును. అనఁగా ఇది చాలును అనినభావము కలుగును. ఆ మీఁద దాని కతీతస్థితి సిద్ధించును."

ఆలంకారికులు 'రసము'ను 'బ్రహ్మానందసహోదరము' అనుచు వర్ణించినా రని నే నుదాహరింపఁగా శ్రీభగవాను లిట్లు పలికిరి:

" 'సహోదర' మేమి? బ్రహ్మానందమే రసము. 'రసో వై సః' అనిగదా వేదము చెప్పుచున్నది. నిక్కముగా బ్రహ్మానంద మొక్కటే రసము. తక్కిన రసము లన్నియు దాని సూక్ష్మచ్ఛాయలే."

నా ప్రయాణదినము వేకువ అలహాబాద్ విశ్వవిద్యాలయ తత్త్వశాస్త్రాచార్యుఁడు డాక్టర్ సయ్యద్ ఒకప్రశ్న వేసెను.

భగవాన్, సృష్టిప్రయోజన మేమి?"

అని ఆయన అడిగెను. సాధారణముగా శ్రీ భగవాను ప్రత్యుత్తరములు అఱవములోఁగాని తెలుఁగులోఁగాని మల యాళములోఁగాని చెప్పి వాటిని తర్జుమా చేయింతురు. కాని యీమారు శ్రీ భగవానులు ఇంగ్లీషులోనే భాషించిరి.

"Can the eye see itself ?"
(కన్ను తనను జూడఁగలదా?)

అని శ్రీ భగవానులు బదులుప్రశ్న వేసిరి. దానికి డాక్టర్ సయ్యద్

"చూడలేదు. అది యితరము సంతటిని జూడఁగలదు, ఒక్క తనను దప్ప"

అని జవా బిచ్చిరి.

"మఱి అది తనను జూడగోరితే?"

అని శ్రీ భగవానులు మరల అడిగిరి. డాక్టర్ సయ్యద్ ఒక్క నిమిష మాలోచించి యిట్లు పలికెను:

"అది అద్దములో తన ప్రతిబింబమునుమాత్రము చూడఁ గలదు."

ఈ ప్రత్యుత్తరమును బట్టుకొని శ్రీ భగవాను లిట్లు వ్యాఖ్యానించిరి:

"సరి. అట్లే సృష్టి 'eye' (కన్ను) తనను జూచుకొనుటకు అద్దము."

ఇది విని నేను శ్రీ భగవాను లుద్దేశించినది 'e-y-e' యా, లేక 'I'* యా? అని అడిగితిని. శ్రీ భగవానులు

"ఉపమానమునకు 'e-y-e', పరమార్థమునకు 'I' గ్రహింప వచ్చును."

అని సెలవిచ్చిరి:

1938 వసంతములో "శ్రీ రమణగీత" మూలగ్రంథము పునర్ముద్రిత మగుచున్నప్పుడు, "శ్రీ రమణచత్వారింశత్" "శ్రీ రమణవిభక్త్యష్టకము"లకు తెలుఁగులో వచనానువాదమును నాచేత వ్రాయించిరి. అవి "శ్రీరమణగీత"కు అనుబంధములయ్యెను. అదేసమయమున నేను "శివానందలహరి"నుండి శ్రీ భగవానులుద్ధరించిన పది శ్లోకములకు పద్యానువాదము రచించి సమర్పించితిని. 1938 మార్చి 22వ తేదీ అది చేరిన వైనముఁ దెలుపుచూ ఆశ్రమలేఖ యిట్లు నుడివెను:

"శ్రీ భగవానులు 'శివానందలహరి' దశశ్లోకిని జిత్తగించినారు. అవి మిక్కిలి చక్కగా ఉన్నవి. శ్లోకముల భావము చక్కగా వచ్చినది."

గత పర్యాయము నేను ఆశ్రమమునుండి బయలుదేఱినప్పుడు నాపేనా తీసుకపోవుటకు మఱచితిని. అది శ్రీ భగవానుల యొద్ద మూఁడునెల లుండెను; అంతట శ్రీ రామయోగిగారి

---

* I = నేను.

ద్వారా నాకు తిరిగి పంపఁబడెను. 1938 మార్చి 31 వ తేదీ దాని నందుకొని నే నీక్రింది పద్యమును రచించితిని:

"మ॥ కలమా, యెంతటి భాగ్యశాలినివొ! తొల్
కాయమ్ములం దెట్టి నో
ములనుఁ నోచితొ! నా కనుల్ మొఱగి యీ
మూఁడుఁ నెలల్ పున్నపుఁ
నెలవౌ శ్రీరమణర్షి సన్నిధిఁ దదం
తేవాసి రామాఖ్యయో
గుల కేలఁ నెలకొంటివి; నీ పదవి నా
కుఁ సుంత లే దయ్యెఁగా!"

నా పెద్దకొమార్తె వివాహము పెద్దకొమారుని యుపనయనముల సందర్భమున నే నీ క్రింది ప్రార్థన పద్యములు వ్రాసి పంపుకొంటిని:

భగవత్కరుణ

కం॥ కరుణాపూర్ణసుధాబ్ధీ,
జరపించితి విట్లు భక్తజనకార్యంబుల్;
ధర నిను నమ్మిన వారికి
శరణము నీవే యటంచుఁ జాటఁగవలదే"

కం॥ ఈపగిది విఘ్నలేశ
మ్మాపాదింపంగనీక యత్యంతసుఖో

భావపూర్ణములుగఁ జేసితి
నీ పెండ్లిని వడుగు, నో మహేశా, రమణా.

కం॥ ఈ దీనజనము పాలిట
నా దేవద్రుమము వౌచు, ననిశము యుష్మత్
పాదాబ్జమ్ముల మనమున
నూది కొలుచు భక్తి నొసఁగు, మో రమణఋషీ.

కం॥ నీ స్మరణ కలిగినంతనె
యస్మన్మానసము హృదయమందు లయింపఁగ్,
విస్మయముగ మా యఘములు
భస్మీభూతములు గావె పావనచరితా"

ఇవి చేరినవైనముఁ దెలుపుచూ 1938 మే 18 వ తేది గల యాశ్రమలేఖ యీ క్రింది సందేశ మనుగ్రహించెను:

"వివాహమూ, ఉపనయనమూ భారతీయ జీవితములో అత్యంతప్రధానఘట్టములు. ఉపనయనమునకు ద్విజన్మ యని పేరు. కావుననే బ్రాహ్మణుఁడు ద్విజుఁడు. వివాహము భారతీయబాలికా భాగ్యవిధాత. అదిమొదలు వివాహితకు జీవితదృక్పథ మంతయు క్రమముగా మార్పుఁ జెందును. ఆమె సహచరుఁడు ఆమెకు పూజనీయుఁ డగును. అది జీవితకావ్యమున నూతనాధ్యాయారంభము. అట్టి యాద ర్శము లున్నఁదప్ప, జీవితము నిష్ప్రయోజనము. ఈ

కార్యములందు మనకు హృదయాంతరాళమున గంభీరసం చలనము కలుగుట సహజము. శ్రీభగవానుల యనుగ్రహము నిత్యమహిమాన్వితము. అది యేవిధమున ఒక్కొక వేళ జీవితమునందలి ప్రమాదములనుసైతము సరిదిద్ది కాపాడుచున్నదో తలంచుకొన్నప్పుడు భక్తుఁడు ఎముకలతోసహా కరఁగిపోవలసినదే. 'కరుణాపూర్ణసుధాబ్ధి' అను పదము సర్వదా ప్రజ్ఞానకోశమం దొకమూల నెలకొనియే యుండును. అది మనస్సులో సంస్ఫురించినప్పుడు, మనః ఫలకమును బూర్తిగ ఆక్రమించి తదితరభావముల నన్నింటిని మాయ మొనర్చును. అప్పుడే భావనాతీత కరుణా ప్రపూర్ణ శాంతి మన యనుభవమునకు వచ్చును. మీ పద్యములు మిగుల హృద్యములు. వాటిని ఇటఁ బదిలపఱిచినాము."

శ్రీ భగవానులు తమ తెలుఁగు "ఉపదేశసారము"లో ప్రాసయతిని బ్రయోగించిరి. శ్రీ నిడిముసిలి బలరామరెడ్డి అను భక్తుఁడు ద్విపదలో ప్రాసయతి వాడవచ్చునా అని సంశయించెను. "శ్రీ భగవానుల వాక్కు ఆర్షమైనందున ఛందోవ్యాకరణ నిబంధనలకుఁ గట్టువడ నవసరము లేదు. అంతే కాదు, ఛందస్సులు ఋషులవలననే కదా జన్మించినవి. మఱి వాస్తవముగా ప్రాసయతిని ప్రాచీనకవులు ద్విపదలో ప్రయోగించియే యున్నారు." అని నేనంటిని. తర్వాత నేను ప్రాసయతి గల ప్రాతపద్యములలో కొన్ని చరణములనూ,

ద్విపదలో ప్రాసయతిప్రయోగ మంగీకరించు వేదము వేంకట రాయశాస్త్రి కృత "ఛందస్సు" అను గ్రంథమునూ తపాలా మూలమున శ్రీ భగవానులకుఁ బంపుకొంటిని.

1938 వేసవిసెలవులలో నేను నా పిల్లలనూ అల్లునీ శ్రీ భగవానుల దర్శనము చేయించుటకై వెంటఁబెట్టుకొని ఆశ్రమమునకు తిరిగీ వెళ్లితిని. మే మచ్చట చేరినదినమే నా యల్లుఁడు స్నానముచేయుచూ తన పెండ్లియుంగరమును చేయిఁ జార్చి పోఁగొట్టుకొనెను. దానికొఱకు అచ్చట గాలించి వెదకితిమి. ఈ వెదకుటలో స్నానాలగది పరిచారకుఁడు ప్రముఖ పాత్ర వహించెను. ఆశ్రమపరిచారకుల యధికారి శ్రీ దొరస్వామిఅయ్యర్ ఒకనాణె మెగురవేసి ఉంగరము దొరకవలెనని తేల్చెను. అంతట ఆయన ఆ పరిచారకుఁడు వద్దనుచున్ననూ వినక వానిపెట్టె తాళము తీసి తెఱిపించి చూడఁగా దానిలో అడుగున ఉంగరము దాచఁబడియుండెను. ఆ యప చారకుని వెంటనే తఱిమివేసిరి. ఈ సంభవము శ్రీ భగవానుల యనుగ్రహమునకు విశిష్టచిహ్నముగా మాకుఁ బొడకట్టెను.

ఆ దినములలో గొప్ప విశేష మొకటి సంభవించెను. శ్రీ భగవానులు "యోగవాసిష్ఠము"లో వసిష్ఠులు శ్రీరామునకు హృదయమునుగుఱించి యుపదేశించు ఘట్టమును ఈ క్రింది సీసమాలికగా అనువదించిరి:

" సీ॥ 'ఏ పెద్దయద్దమం దీ జగ త్తంతయు
నెలకొని వెలుఁగునో నీడగాను
ఈ లోకవాసులా నెల్లజీవులకు నా
హృదయ మనఁబడుచున్నదియు నేది?
చెప్పు' మని యడుగు శ్రీరామునకు ముని
శ్రీ వసిష్ఠుం డిట్లు చెప్పెః 'రామ,
ఈ దృశ్యవిశ్వమం దెల్ల జంతువులకు
హృదయమ్ము ద్వివిధ మ్మనుదురు బుధులు,
విను, కొనఁదగినది విడఁదగినది యని
యుండు నా హృదయ; మా యుభయమందు
పరిమితి గల దేహభాగమా ఱొమ్ములోఁ
బడు హృదయ మదియు విడఁదగినది,
చిన్మాత్రముగ నెల్లు చేతనహృదయమే
కొనఁదగినది యనుకొను మనమున,
అది లోపలను నుండు, నది వెలి నుండును;
అది లోపలను వెలియందు లేదు,
అదియె ముఖ్యహృదయ, మందుంచు నీయది;
అఖిలవస్తువులకు నద్ద మదియు,
ఎల్ల సంపత్తుల కిల్లగు నది, గాన
అన్ని జీవులకు చిత్తదె హృదయము
అనఁబడు; శిలవలె నస్థిరజడదేహ
మం దొక యవయవమై కాంశ మగునె?

అందుచేఁ బరిశుద్ధమగు చిత్స్వరూపమా
నా హృదయమునందు హారముఁ బూని

చలమన స్పంచు సాధనవలన వాయు
చలనమును దనంతట నుపశమన మొందు;
పలుభవములుగఁ బెంపొంది బలము కలిగి
వెలయు వాసన లన్నియు వీడిపోవు.”

ఇదే శ్రీభగవానుల సీసమాలికారచనకు ప్రథమపర్యాయము. ఇందు వసిష్ఠమహర్షి శ్రీరామునితో ‘ముఖ్యహృదయము’ దేహభాగమౌ తొమ్ములోని మాంసఖండము గాదనియు అది చిత్స్వరూపమే అనియు వచించును. ఇందులో ఒకవింత యేమనఁగా ఈ ఘట్టము మాతృకలో ప్రాణాయామసాధనలను బేర్కొనుపట్టున నున్నది. సాధారణముగా ప్రాణాయామము మనోనిగ్రహమునకు సాధనముగా వాకొనఁబడును. కానీ యిచ్చట మనస్సును హృదయములో నిలుపు సాధన వలన వాయుచలనము తనంతట నుపశమించు ననియూ, ‘పలు భవములుగఁ బెంపొంది బలము కలిగి వెలయు వాసన లన్నియు వీడిపోవు’ ననియూ ఉపదేశింపఁబడినది. “ఉపదేశసారము”లో శ్రీభగవానులు

“చిత్తము ప్రాణము చిత్క్రియాశక్తి।
యుక్తశాఖలు మూలశక్తి యేకమ్ము”

అనియు, వీటిలో ఒకదాని నిగ్రహించిన రెండవది తనంతట తానే లోఁబడుననియు చేసిన బోధనలతో సరిపోవుచున్నది.

తెలుఁగులో శ్రీభగవానుల పూర్వరచనలయందువలెనే యీ సీసమాలికయందును చరణముల నడకయు భాషాశైలియు ఉత్తమస్థాయి నందుకొన్నవి.

"యోగవాసిష్ఠము"నుండి జీవిత శిల్పమును గూర్చి శ్రీరామునకు వసిష్ఠుఁడుపదేశించు ఘట్టమునందు శ్రీభగవాను లేర్పఱిచిన 'లోకే విహార రాఘవ' అను పల్లవి గల దశ శ్లోకిని వారి ప్రోత్సాహమున నేనును తెలుఁగు కందపద్యములుగా అనువదించితిని. వాటిలో అంత్యశ్లోకపద్యము లివి:

"ఆశాపాశశతోన్ముక్తః, సమః సర్వాసు వృత్తిషు,
బహిఃప్రకృతికార్యస్థో, లోకే విహార, రాఘవ."

"క॥ ఆశాపాశ శతమ్ముల్
నాశముగా, నెల్లవృత్తులఁ సమతఁ, బై
కే శాంబరి కా యాటగ
శైశవలీల విహరింపు జగతిని, రామా."

ఇందు 'శైశవలీల' అనుమాట నేను జేర్చినది, అమూలకము. ఈ చేర్పును శ్రీభగవాను లామోదించిరని 1938 జూలై 5 వ తేదీ గల యాశ్రమలేఖలో ఇట్లు వ్రాయఁబడెను:

" 'శైశవలీల'అను పద మెంతో చక్కఁగాఁ బడినది. శ్లోకములలో సాధనకై యుపదేశింపఁబడిన మనస్తత్త్వమును సూటిగాఁ బ్రకటించుచున్నది. క్రీస్తువుగూడ చెప్పలేదా:

" 'నీవు ఈ శిశువులవలె అయినఁదప్ప నీకు ఈశ్వరసామ్రాజ్యములో ప్రవేశము లేదు' అని."

శ్రీభగవానులు ఉద్గ్రంథానువాదశిల్పమునుగూడఁ బ్రశంసించిరి. ఆ ప్రశంసను నేను పద్యరూపమున నిట్లు రచించితిని :

" క॥ పదిసార్లు మనసు నిల్పుచుఁ
జదువుట యగు వ్రాఁత; నూఱుసారుల వ్రాఁతన్
మది నెన్నఁగ మించెడి నను
వదింపు; కాన బుధుల కనువాదము తగదే!"

ఒకయాత్రికుఁడు శ్రీభగవానులతో ఇట్లు మనవి చేసికొనెను:

"స్వామీ, నేను లోకములో పెక్కుమంది మహాత్ములను సందర్శించినాను. వా రందఱియందును నాకు సమానభక్తి గౌరవము లేర్పడినవి. మఱి నేను వారిలో ఎవరిని అనుసరింప వలెనో నాకు తోఁచలేదు. ఈ విషయమున మీ యాదేశమును అర్థించుచున్నాను."

శ్రీభగవాను లిట్లు చెప్పిరి :

"బోధకులు పెక్కుమంది కావచ్చును. కానీ బోధన యొక్కటే. దానిని అనుసరింపుఁడు"

ఒక వైష్ణవభక్తుఁడు సిమ్లాలో ఉన్నతోద్యోగి. ఆయన తాను నిత్యము పూజచేయు విగ్రహముల నన్నింటినీ తీసుక

వచ్చి శ్రీభగవానుల చేతికిచ్చెను. బహుశా వాటికి శ్రీభగవానుల కరస్పర్శామహిమను జేకూర్పవలెనని ఆయన యుద్దేశ్యము కాఁబోలు. శ్రీభగవానులు వాటిని మిక్కిలి కుతూహలముతోఁ గైకొని పరీక్షించిరి. ఆ భక్తుఁడు "భగవాన్, నన్ను మా వాళ్లనేకులు మూఢ విగ్రహారాధకుఁడు అని గేలిచేయుచున్నారు" అని విన్నవించెను. శ్రీభగవాను లిట్లు పలికిరి:

"మీరు వాళ్లను అధమవిగ్రహారాధకులు అని బదులు గేలి యేల చేయరాదు? ఏలనఁగా, వాళ్లు స్నానముచేయుట, ఉడుపులు ధరించుట, అలంకరించుకొనుట, ఆరగించుట- ఈ శరీరారాధనను నిత్యమూ ఎన్నోసారులు చేయుచున్నారు గదా. శరీరమునకన్న పెద్ద విగ్రహ మే మున్నది? కాఁబట్టి యెవఁడు విగ్రహారాధకుఁడు కాఁడు!"

మంత్రజపము నభ్యసించు సాధకుఁడొకఁడు "మంత్రసిద్ధికి ఎన్ని సారులు జపము చేయవలెను?" అని యడిగెను.
శ్రీభగవాను లిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి:

"'నేను జపించుచున్నాను' అను తలంపు పూర్తిగాఁ బోవువఱకు జపము చేయుచునే యుండవలెను. అప్పుడు 'జపించునది నేను గాదు. మంత్రము నా ప్రయత్నము లేక తనంతట తానే ఆవర్తమగుచున్నది' అను సత్యము నీ యనుభవమునకు వచ్చును. అదే సహజస్థితి, అదేసిద్ధి."

శ్రీభగవానులు మఱియు నిట్లు పలికిరి:

"వాస్తవముగా 'నేను' అను తలంపే ఉత్తమమంత్రము ప్రణవము (ఓంకారము) నకుఁగూడ అకారఉకారమకా ముల సమ్మేళనము ఇత్యాది వివరణము వలయును. కా యీ 'నే' నను తలంపు స్వయంవ్యక్తము, అప్రయత్నము

నేను తిరిగీ యింటికి వచ్చిన తరువాత ఆశ్రమమువా "ఉపదేశమంజరి"ని "A Catechism of Instruction" అను శీ కతో ఆంగ్లమున అనువదించి ముద్రించు సందర్భమున నాతో పలుమారు తపాలాద్వారా సంప్రదించుచుండిరి. శ్రీభగవ నుల కృతిరాజముతో ఈ నిరంతరసంబంధము నాకు గొప్ప దీవనయై మేలి సాధనగా ఉపకరించినది.

బాబు రాజేంద్రప్రసాద్, శ్రీజమ్నాలాల్ బజాజ్ గార సకుటుంబముగా శ్రీభగవద్దర్శనార్థము వచ్చుచున్నారని వి నేను 1938 ఆగస్టు 14 వ తేదీ పద్యద్వయమును రచించి పంప కొంటిని :

కం॥ రాజేంద్రబాబు జమ్నబ
జాజియు రమణాశ్రమమున స్వాగతు లగు టౌ
న్నైజము; భరతావనిఁ దొలి
రాజులు ఋష్యాశ్రమముల ప్రాపును గొనరే?

కం॥ సోదరభక్తావళి కభి
వాదనముల్ చేయఁగోరు వాఁడను మదిలో

నీ దూరమ్మున నుండియె,
సాదరముగ స్వీకరింప సంప్రార్థింతుర్ ."

ఆశ్రమమువారు ఆగస్టు 16 వ తేదీ నాకీ యుత్తర మంపిరి:

"శ్రీభగవానులు మీ జాబు చదువుచున్నప్పుడే, శ్రీ రాజేంద్రబాబు హాలులో అడుగుపెట్టెను. మన దేశమున కంతటికీ ఒకేభాష యుండిన ఎంత బాగుండెడిది! మీ రెండు పద్యములు మిక్కిలి ప్రశంసనీయములై పదిలపఱు పఁబడినవి."

"నాఋషిః కురుతే కావ్యం" అను విషయముపై నా యుపన్యాససారాంశమును నేను శ్రీభగవానులకు పంపుకో నఁగా, దానినిగూర్చి 1938 ఆగస్టు 27 వ తేదీ ఆశ్రమలేఖ యిట్లు వ్యాఖ్యానించెను:

"విషయము...మిక్కిలి యాకర్షణీయమైనది. కావ్యసం స్కృతిగానీ మతసంస్కృతిగానీ 'గల మనస్సు "రసానుభ వము'నందు జీవించును. అది వాస్తవమూ శాశ్వతమూ అగు దానిని తన లోపలఁ జూచును. ఆ వస్తువే జీవితము నకూ మనస్సునకూ బుద్ధికీ మూలాధారము. అంతరాత్మ గభీరనిమ్నతలను మనము చేరునంతట చిత్తకంజము ప్రతి భగా వికసించును. ఇదే నైతికమానసికజీవితరహస్యము. కావుననే జీసస్ చెప్పినారు: 'తనలో ఈశ్వరసామ్రా జ్యమును అన్వేషించువానికి సమస్తమూ వచ్చిచేరును' అని.

మనస్సు నిష్కామమై 'అనన్యభక్తి'చే వినీతమై దయార్ద్రమై యున్నప్పుడే అనఁగా అహంకారము నాశమైనప్పుడే పూర్వోక్తశక్తు లన్నిటిని అభ్యసించుట పరిణతి నొందించుట సాధ్య మగును. ఎల్ల మహర్షుల యఖండప్రతిభకు ఇట్లే కారణము చెప్పవలెను. కావున ఇదే వాస్తవ విద్య. దీనినే ప్రహ్లాదుఁడు భాగవతమున 'చదువులలో మర్మ మెల్ల' అని పేర్కొనెను."

"Sunday Times" పత్రికా సంపాదకులైన యం. యస్. కామత్ గారి మరణమునుగుఱించి ఆశ్రమమువారు 1938 సెప్టెంబరు 18 వ తేదీ యిట్లు జాబు వ్రాసిరి :

"అది మనకు తీఱని లోటు. మా దుఃఖమును దెలుపుటకు మాటలు లేవు. శ్రీభగవానులయెడ ఆయన గాఢభక్తి, ఆశ్రమమునకు ఆయన నిస్స్వార్థకైంకర్యములూ సర్వలోక ప్రశస్తిఁ గాంచినవి. ఆశ్రమము ఒక్కమాట చెప్పినఁ జాలును; వెంటనే ఆపని సమగ్రముగా నెరవేర్పఁబడినదే. అట్టిది ఆయన సేవానిరతి!"

దశారా సెలవులలో శ్రీభగవానుల సన్నిధాన భాగ్యము నా కలభ్యమగుటనుగూర్చి నే నీ క్రింది రెండు పద్యములు వ్రాసి పంపుకొంటిని:

"కం|| ఆహా! భగవత్పదమున
నే హాయిగ నుండు కోర్కె నప్పుల మయ్యెన్;

దేహాత్మబుద్ధి మాన్పఁగ
సాహాయ్యం బిది యటంచు సంభావింతున్.

కం॥ కడు దూరమ్మున నుండియె
పడియెద నీ పదమునందుఁ, బడసెద శాంతిన్;
కడ లేని నీ కరుణ యను
కడలి కలుగ, నాకుఁ గొదువ కలుగునె, తండ్రీ!'

అవి చేరినవైనముఁ దెలుపుచూ ఆశ్రమమువారు 1938 అక్టోబరు 11 వ తేదీ యిట్లు వ్రాసిరి:

"శ్రీభగవానుల తత్త్వము మనకు సుపరిచితమొనర్చిన కమ్మని భావములను ఈ రెండు పద్యములు ప్రకటించుచున్నవి. ప్యాస్కలిన్ మ్యాలెట్ సెలవు తీసుకొని వెడలిపోఁబోవునప్పుడు శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి: 'పోవునది నౌకా రైలుబండీ గాని నీవు గాదుగదా!'

నేను "వేదము వేంకటరాయశాస్త్రి సంస్మృతి" అను నా తెలుఁగుకృతిని శ్రీభగవానులకు అంకిత మిచ్చుటకై అనుమతి వేఁడితిని. అంకితము ఈ క్రింది పంచరత్నముల రచించి ఆశ్రమమునకుఁ బంపుకొంటిని:

"కం॥ శీర్షమణి వేదమునకున్
హర్షమ్ముల కెల్ల నెల్ల యాత్మజ్ఞానో
త్కర్షము భగవాన్ రమణము
హర్షి పదమ్మునకుఁ గృతి సమర్పణ సేతున్

తే॥ గీ॥ సకలసత్కావ్యరసపూరసారిణితతి
జ్ఞానసాగరులోఁ జేరి లీనమౌను;
కానఁ గావ్యగురుస్సంస్మృతి యైన కృతిని
దగదె జ్ఞానగురున కంకిత మ్మొనర్ప?

కం॥ వేంకటరాయలు శాస్త్రులు
వేంకటరాములు మహర్షి; వీ రిరువురు ని
శ్శంకమ్ముగ వేంకటరమ
ణాంకిత సద్వస్తు వేక మాత్మయ గారే!

తే॥ గీ॥ గురుని సంస్మృతి యాత్మసంస్మరణమె గద;
గురు సమర్పణ యాత్మనుగూర్చియె గద;
గురునిశుశ్రూష లఘుభావ మరుగనె గద;
గురుతరంబగు పరమాత్మఁ బొరయనె గద.

కం॥ గురువే బ్రహ్మయు విష్ణువు
గురుదేవుఁడె యీశ్వరుండు, గురువే సాక్షాత్
పరమబ్రహ్మము; గావున
గురుచరణాంభోజములను గోరి భజింతుఁన్."

ఆశ్రమమువారు 1938 అక్టోబరు 18 వ తేదీ జాబులో అనుజ్ఞ నొసంగుచూ ఇట్లు వ్రాసిరి:

"అంకితపద్యములు గంభీర తాత్త్వికాశయమును దెలుపుచున్నవి. సహృదయులగు పాఠకులు వాటి తాత్పర్యమును సరిగా గ్రహింతురుగాక యని యాశింతుము."

కాంచి కామకోటి పీఠాధిపతులైన శ్రీజగద్గురు శంకరా చార్యులవారి సమక్షమున "ప్రారబ్ధము"నుగూర్చి జరిగిన యుపన్యాసపు సారాంశమును నేను శ్రీభగవానులకు నివేదించితిని. దానిలో, 'దశముఁడు' తానే దశముఁడనని తెలిసికొన్న తర్వాతఁగూడ తన గాయము మానువఱకు దానిభాధ ననుభవింపవలెను గదా, అదేవిధముగా జ్ఞాని ఆత్మసాక్షాత్కారమైన పిమ్మటగూడ దేహ మున్నంతవఱకు ప్రారబ్ధ మనుభవింపక తప్పదు అని వాదింపఁబడెను. ఇందులకు ఆశ్రమము నుండి 1938 డిసెంబరు 17 వ తేదీ యీ క్రింది యుత్తరము వచ్చెను:

"దశమత్వసిద్ధిపై చర్చను ఆసక్తితోఁ జదివినాము. అది అంతయూ, సిద్ధినిగూర్చిన యెఱుకగూడా భావనయే. అనఁగా, మనస్సు జీవితస్థితిగతులనుగుఱించి వ్యాఖ్యానించుచున్నంతవఱకు, అది 'నేను' 'నేను కర్తను' అను తలంపునకు లోఁబడవలసినదే. తదనంతరము గాయము మానుచుండఁగాఁ గలుగు బాధవిషయమై, దేహ మున్నంతవఱకు భాధయుండును. కానీ జీవన్ముక్తుని చిత్తవృత్తి సామాన్యమానవుని చిత్తవృత్తికన్న కేవలము భిన్నమైనది. మనము జీవన్ముక్తునికి ఒక మనస్సు నారోపింతుము. కానీ అది మనలో ఉన్నట్లు ఎఱుకపడు మనస్సువంటిది కానే కాదు. అది జాగ్రత్ స్వప్నసుషుప్తులు అను మూఁడవస్థల కతీతమగు స్వరూపముతో ఏకీభవించిన మనస్సు,

అందుచేత ఈ యేకీభావమును సాక్షాత్కరించుకొన్న జీవన్ముక్తుని మనస్సు బాధానుభవమునకు దూరముగ నుండును. ఏలయనఁగా ఆతఁడు బాధానుభవరాహిత్యస్థితిని ఎఱిఁగి పొందినవాఁడు కదా. మనము మన మెలుకను జాగ్రత్ స్థితితో ఏకీకరించుకొన్నందువల్ల గాఢనిద్రలో మనల నెఱుఁగము. కాని జీవన్ముక్తుఁడు నిదురలో 'ఎఱుక లేమి'ని ఎఱిఁగినవాఁడు. కావున ఆతఁడు బాధ యున్నప్పుడుఁగూడా తాను బాధారహితుఁడ నని కనుగొన్నవాఁడు. అట్టి మహాత్మునికి ప్రారబ్ధ మెక్కడిది?.....ఆశ్రమములో జీవితము శ్రీభగవానుల సన్నిధానమున ఉనికి నిక్కమైన విరామము. ఏలనఁగా అహంకారము విరమించును - కాదా - విరమింపఁబడును. అదియు అప్రయత్నముగా జరగును. ప్రయత్న మున్నచో అహంకార మున్నట్లే. అహంకారమునుండి విడివడి-ఊరక-ఉండుటయే జీవితములో బ్రహ్మానందము."

1938 క్రిస్టమస్ సెలవులలో నేను శ్రీభగవానుల చరణములకడ మరల నా మామూలు 'విరామము'ను గంటిని. తత్పూర్వము ఆగస్టు నెలలో 'రమణగీత'యందలి 'వైదర్భుఁడు' శ్రీ చివుకుల వేంకటేశ్వరశాస్త్రి సిద్ధిపొందినవిషయమును గుఱించి నేను ప్రాసంగికముగా ముచ్చటించుచూ ఆయన ప్రాణోత్క్రమణసమయమున సన్న్యసించి పద్మాసనాసీనుఁడై

నిరంతరము ఓంకారము జపించుచూ శాంతముగా మరణించిన వైఖరి నభివర్ణించితిని. అది విని శ్రీ భగవానులు

"అవును, యోగి సామాన్యముగా ప్రాణము విడుచు పద్ధతి అట్టిదే, అది చనిపోవునతని యాత్మపరిణతిని సూచించును."

అని పలికిరి. శ్రీభగవానులు మఱియు నిట్లనిరి:

"కానీ జ్ఞాని జీవము నెడవలెనే చావునెడనూ ఉదాసీనుఁడు. ఆతని దేహస్థితి హేయతమముగా నున్ననూ ఆతఁడు ఘోరతమవ్యాధులపాలై సహింపరాని బాధతో నేలపైఁ బొరలాడుచూ కేకలు వేయుచూ మరణించుచున్ననూ, తాను చలింపకయే యుండును, అప్పుడునూ ఎప్పుడునూ తాను జ్ఞానియే."

స్వజీవితాంత్యమున శ్రీభగవానులకే సంభవించిన యనుభవము మన స్మరణకు రాఁగా ఇప్పుడు వారి పూర్వోక్తభాషణ మందు హృదయవిదారక భావిసూచన గోచరించును.
ఒక యుదయము శ్రీభగవానులు ఒక పత్రికనుండి

"మనశ్శాస్త్ర పరిణామమే తత్త్వశాస్త్ర ప్రారంభము"

అను వాక్యమును జదివి. దానితో తమ సొంతవాక్యము నిట్లు కలిపిరి:

"తత్త్వశాస్త్రపరిణామమే ఆత్మవిద్యాప్రారంభము"

ఒకరు ఇంద్రియక మానసిక బ్రహ్మానందములకు పరస్పరసంబంధ మెట్టిదని యడిగిరి. శ్రీభగవానులిట్లు బదులు చెప్పిరి:

"తక్కినయానందము లన్నియు బ్రహ్మానందసాగరమున ఫేనబుద్బుదముల వంటివి. అన్ని యానందములునూ కోరిక వదలిన వానికే."

బ్రహ్మ, విష్ణువూ శివుని కొమాళ్లు అను కథయందలి తత్త్వమును శ్రీభగవానులిట్లు వెల్లడించిరి:

"శివుఁడు మహాలయస్థానము. ఎచ్చట లయమో అచ్చటనే యుత్పత్తి. కావున శివుఁడు సమస్తసృష్టికినీ బ్రహ్మ విష్ణువులకునూ గూడ ఉత్పత్తిస్థానము. అందువలన బ్రహ్మ విష్ణువులు శివుని కుమారులు."

శ్రీభగవానులు అరుణాచలము వచ్చిన తరువాత ఏమేమి మార్పులు చెందినదీ తెలుపుఁడని యొక రడుగఁగా శ్రీవారిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి:

"నే నెప్పుడునూ ఒక్కటిగానే ఉన్నాను. నాలో ఎట్టి సంకల్పమునూ ఏ మార్పునూ లేవు. 'మామిడితోపు' చేరువఱకూ ఉపేక్ష వహించి కనులు మూసికొని యుంటిని. తర్వాత కనులు తెఱచి వ్యవహరించుచున్నాను. అంతే గానీ నాలో ఏమియూ మార్పు లేదు."

ఒక రడిగిరి:

"అయితే, భగవాన్. మీలో బాహ్యముగా పెక్కు మార్పులను జూచుచున్నామే?"

శ్రీ భగవానులు బదులుపలికిరి:

"అవును. అది యెందువల్ల? మీరు నన్ను దేహిగాఁ జూచుట వల్ల. మీకు దేహాత్మబుద్ధి వదలకుండునంతవఱకూ మీరు నన్ను దేహిగనే చూచుట తప్పదు. సంశయించువాఁ డుండువఱకూ సంశయ ముండక మానదు."

ఒకరాత్రి శ్రీభగవానులు వేడుకగా మాటాడుచూ దేవాలయములోని 'భగవానులు' తనకన్న ఎంతో అదృష్ట వంతు లని యిట్లు పలికిరి:

"అచ్చటి భగవానులకు నాకువలె భక్తులు తెచ్చునైవేద్యము ప్రతి పర్యాయమూ ఆరగింపవలెనను నిర్బంధము లేదు. అర్చకుఁడు మంత్రము లుచ్చరించుచూ చేయి త్రిప్పి 'నివేదన'చేయును. అంతట ఆ నైవేద్యము నాతఁడు తీసికొని పోవును. కానీ మీరు నన్ను ప్రతిదీ తిననిదీ వదలరుగదా!"

ఆ దినములలో ఎవ్వరైన ఏ భక్ష్యముఁ దెచ్చిననూ వెంటనే దానిని శ్రీభగవానులకూ అచ్చట సమక్షములో ఉన్న యెల్లరకూ వినియోగించుట వాడుక. కావున సామాన్యముగా ఉపాయన మైన యెండుద్రాక్ష కలకండల వినియోగము

నిత్యమూ లెక్కలేనన్ని సారులు జరుగుచుండును. అది శ్రీభగవానుల యారోగ్యమునకు భంగకరముగాఁ గనుపట్టినందున, ఆ యాచారము మార్పు చెందెను. నివేదన లన్నిటిని గలిపి యొక్కమారుగా భోజనఫలాహారసమయములందు పంచి పెట్టు పద్ధతి అమూలులోకి వచ్చెను.

శ్రీభగవానులు దేవాలయ నిర్మాణశిల్పమునుగుఱించి గూడా ముచ్చటించుచూ తత్ప్రయోజనము నిట్లు విశదీకరించిరి:

"'గర్భగుడి' ద్వారమున కెంతో దూరమున ఉండును. అందుచేత ఆగంతుకుఁడు ఒక ప్రాకారము తర్వాత మఱియొకటి దాఁటుచూ ముందుకు పోఁగా పోఁగా, దేవుని సన్నిధానమునకు వచ్చుసరికి ఆతని హృదయమందు పావనత్వమూ భక్తిభావమూ వెల్లివిరియును. ప్రదక్షిణము చేయు నుద్దేశ్యమునూ అదియే. తనచుట్టును తాను తిరిగి చేయునట్టి యాత్మప్రదక్షిణము దానికి పరమావధి యగుట సాభిప్రాయము."

శ్రీ భగవానులు మఱియు నిట్లు పలికిరి :

"అంతేగాక, దేవునివైపు తిరిగి 'స్వామీ, తండ్రీ, యిదే నా నమస్కారము' అని సాష్టాంగప్రణామముచేయునప్పుడు మనము కన్నులు మూసికొందుము. విగ్రహమునకు నమరించునట్లైనచో, మనము కన్నులేల మూసికోవలెను?

నిక్కముగా మనము మన యెదుటనున్న విగ్రహమునకుగాక మనలోనే యున్న యేదో యొక వస్తువునకు మ్రొక్కుచున్నాము. అట్లు మనము అజ్ఞాతముగా మనలోని సత్యాత్మకే అర్చన చేయుచున్నాము.”

1939 తొలి నెలలలో కొచ్చిన్ రాజవంశీయుఁడగు శ్రీ అప్పురాన్ తంపురాన్ మలయాళములో శ్రీభగవానులను గుఱించి రచించిన వ్యాసమును ఆంగ్లాంధ్రములలోనికి అనువదించు సందర్భమున నాతో తపాలాద్వారా పలుమారు సంప్రదింపులు జరుగుచుండెడివి. తర్వాత వసంతఋతువులో శ్రీ సుందరకృష్ణశాస్త్రిఁడు శ్రీభగవానుల తల్లినిగూర్చి వ్రాసిన వ్యాసమును ఆశ్రమమువారి యాదేశమున నేను తెలుఁగులోనికనువదించితిని. నా వ్రాఁతప్రతి తపాలా రహాణాలో ఎచ్చటనో పోయెను. అందుచేత నేను ఆ యనువాదమును మరల వ్రాసి పంపవలసివచ్చెను. అది చేరినవైనముఁ దెలుపుచు ఆశ్రమమువారు 1939 ఏప్రిల్ 10 వ తేదీ ఇట్లు వ్రాసిరి:

“తల్లిమీఁద వ్యాసమునకు మీ యుత్తమానువాదమును ఆనందముతో అందుకొంటిమి. దానిని ఈదినమే ముద్రణమునకు పంపినాము. అది మీరు తిరిగీ వ్రాయవలసివచ్చుట దైవనిర్ణయము.”

మంచిభక్తుఁడు నా సహాధ్యాయి యైన శ్రీగిద్దలూరు సత్యనారాయణరావు అకాలమరణవార్తను దెలుపుచూ ఆశ్రమమువారు 18-3-1938 తేదీ గల తమజాబులో ఇట్లువ్రాసిరి:

"ప్రేమాస్పదుఁడైన సత్యనారాయణ మరణము విషాద వార్త. ఈశ్వరవిధానములు దురవగాహములు. పిల్లలను ప్రేమతో పోషించు తండ్రి పోయినాఁడు. తల్లిపక్షమున సన్నిహితబంధువు లెవ్వరూ లేరు. ఇఁక బిడ్డల భావిదశను భగవత్కరుణయే నడిపించునుగాక యని మనము ప్రార్థింతము"

ఆ జాబులోనే కాంచికామకోటిపీఠాధిపతులు జగద్గురువులు శ్రీశంకరాచార్యులవారినిగూర్చి నేను రచించిన 'పీఠార్క్ లు పద్యాంజలి' ప్రతి తమకు చేరినవైనము ఆశ్రమము వారు తెలిపిరి. ఆ పద్యము లివి:

"కం॥ శ్రీ చంద్రశేఖరాంకిత
వాచంయమిశేఖరా, భువనపరమగురూ,
లోచన కటాక్షకృత భవ
మోచన, నీ చరణములకు మ్రొక్కెద మెపుడున్

తే॥ గీ॥ నిఖలజగముల పీఠమ్ము నీవ యయ్యు,
నొక్క పీఠాధిపతినామ మూను టరయఁ
జిత్ర మిది; యాస్తికతను రక్షించుకొఱకు
నీ యనుగ్రహలీలగా నేఁ దలంతు,

తే॥ గీ॥ నీ విచటఁ గడపినాపఁట నెలలు నాల్గు;
తోఁచె నవి యెల్ల మా కొక్క త్రుటియువోలె;
ఎదల ప్రేమఁ జూఱగొనితి; వెట్లు నిన్ను
నిల్పఁగల మింకఁ? గన్నీరె రాల్పఁ గలము!

తే॥ గీ॥ ఎటులు కాపాడెదో మమ్ము నింకమీఁద,
ఎటులు మా తలంపున సదా యిరవుకొనెదో,
ఎటులు మరల దర్శనము మా కియ్యఁ దలఁతో,
ఎల్ల నీ కరుణయె యంచు నెంతు, మయ్య.

తే॥ గీ॥ వరము లెవ్వియు వలదు నీ భక్తి దక్క;
హీనగుణులము, మాకు నేమైన నేమి!
సకలలోకజనైక తారకుఁడ వీవు;
నిత్యకల్యాణ మగుఁగాక నీకుఁ, దండ్రి!"

వీటినిగూర్చి ఆశ్రమలేఖలో ఇట్లు వ్రాయఁబడెను;

"తెలుఁగుపద్యములు వాస్తవముగా హృదయమును గరఁగించునవి. గంభీరభావములను సులభశైలిగల చిన్నపద్యములలో నిబంధించు కౌశలము మీ భాగ్యము. స్వాముల వారు వాటిని వినినప్పుడు అశ్రుబిందువులు రాల్చుటలో వింత లేదు".

నా పెద్దకొమార్తె మాణిక్యము "Pilgrimage to Sri Ramanashramam" (శ్రీరమణాశ్రమయాత్ర) అను శీర్షిక క్రింద తన యాత్రానుభవములను ఆంగ్లమున వ్రాసి సమర్పించు

కొనెను. అవి చేరినవైనము దెలుపుచూ 1939 ఏప్రిల్ 8 వ తేదీ గల యాశ్రమలేఖ యిట్లు నుడివెను.

"హాయిఁగూర్చు భాషాసౌలభ్యముతో అది కేవలము శాలవాక్యగా ఉన్నది.....ఆశయవైశాల్యము, శీర్షిక యౌచిత్యము, వివరముల సమృద్ధి, శ్రీభగవానులనూ ఆశ్రమదివ్యవాతావరణమునూ వర్ణించుపట్ల భావగాంభీర్యము ఇత్యాది సుగుణములు కలిగి వ్యాసము ప్రశంసనీయముగా ఉన్నది. అన్నివివరముల చక్కని కూర్పు ఆమె జ్ఞాపకశక్తిని, భావవైశద్యమును జాటుచున్నది."

1939 వేసవిలో నేను సకుటుంబముగా ఆశ్రమమునకు వచ్చితిని. వెంటనే శ్రీ భగవానులు "యోగవాసిష్ఠము"లో 'వసిష్ఠోపదేశము'నకు తాను సీసపద్యముగా వ్రాసిన యనువాదమునూ దానివివరణలునూ, తన ప్రోత్సాహమున కొందఱు భక్తులు వ్రాసిన ప్రత్యేకానువాదములునూ నాకుఁ జూపించిరి. శ్రీభగవానుల యనువాద మిది:

" సీ॥ బహువిధదశ లన్ని పరిశీలనము చేసి
సత్పరంపద మెది తత్పదమును
హృత్తునఁ గొని భువి నెన్నడుఁ గ్రీడింపు;
భావము లన్నింట భావ మదియు
నెఱిఁగితి, వాదృష్టి యెప్పుడుఁ విడువక
యిలయందు వర్తిలు మిచ్ఛపగిది;

సంభ్రమ సంతోష సంతాప కోప స
మారంభ సంరంభ ధారి యనగ
వ్యాజముగ విహారింపు లో నములు డగుచు,
ఆశబంధనము క్తుండై యన్ని వృత్తు
లందు సమభావము గలిగి యవనియందు
వేషయుక్తుండై వెలి నాడు, వీర రాము॥"

శ్రీ భగవానులు తన పద్యములో ఇంకనూ పలసిన మార్పులు చేయుమనీ, నా సొంత యనువాదమును మఱియొక పద్యముగా వ్రాయుమనీ నాకు సలహాయిచ్చిరి. నేను ఏదో వ్రాసికొని రెండు నిమిషములలో ఎల్లకాగితముల కట్టను తిరిగీ యిచ్చివేసితిని. శ్రీభగవానులు నా వ్రాతను జూచి ఆశ్చర్యచకితులై యిట్లనిరి:

"ఏమి చేసినారు! నా తొలి ముసాయిదాకు ప్రతి వ్రాసినారు! అంతేనా!"

నే నంటిని ?

"మఱేమి చేయుదును? వేదతుల్యమైన భగవానుల వాక్కును సవరించుటకెన్న సాహసము వే ఉండదు. నా పారాయణకొఱకు దానిప్రతి వ్రాసికొంటిని."

శ్రీ భగవానులు చిఱునవ్వు నవ్వుచూ

"మీరు చాలా గట్టివారు!" ('రొంబా గట్టికారి')

అని పలికిరి.

ఆ మఱునాఁడు (19-5-1939 వ తేదీ) శ్రీభగవానులు తననుగుఱించి ప్రబోధకరమగు నొకయంశమును వెల్లడించిరి. వారిట్లు సెలవిచ్చిరి.

"నేను దేహాతిరిక్తుఁడనని తొలుతనే తెలిసినది. ఇచ్చటికి వచ్చిన తర్వాత, నేను సర్వవ్యాప్తమగు వస్తువుతో ఏకమా, భిన్నమా? ఆ వస్తువు అద్వైతమా, ద్వైతమా, విశిష్టాద్వైతమా? మొదలగు ప్రశ్న లన్నియూ చర్చకు వచ్చినవి. నేను బ్రహ్మము అనుకొనుటగూడా తలంపే అగును గాని, ఆత్మనిష్ఠ కానేరదు. తలంపు లన్నియు విడిచి ఆత్మయందే ఉండవలయునని సకలమతసిద్ధాంతము. జీవాత్మ పరమాత్మలకు ఉపాధిభేదమేగాని వస్తు వొక్కటియే. అట్లు గాకున్న అద్వైతసిద్ధాంతమునకు హాని కలుగును. నిర్వికల్పసమాధిగూడా సాధనలలో ఒక గడువే. అందు, సమాధిలోనికి పోవుట, సమాధినుండి లేచుట కలదు. నాకు సాధనచేయవలసిన యవసరమే కలుగలేదు."

ఆ కాలమున శ్రీభగవానులు అప్పుడప్పుడు చెప్పుచుండిన విషయములను క్రోడీకరించి అఱవములో పద్యరూపమున రచించి శ్రీమురుగనార్ "గురువాచకకోవై" అను పేరఁ బ్రకటించుచుండిరి. అందులో కొన్ని భావములను శ్రీభగవానులిట్లు విశదీకరించిరి:

"దేవునకు ఆత్మను అర్పించుట గుడవినాయకన్యాయము, అనఁగా బెల్లముతో విఘ్నేశ్వరునిఁ జేసి అందులో రవంత బెల్లము గిల్లి ఆ దేవునికే నైవేద్యము పెట్టుట వంటిది. దేవునకు నేను సాధనభూతుఁడను కావలెను అని ప్రార్థించుట గూడా ఆత్మార్పణము కానేరదు.

ఆత్మార్పణము చేసితి నను గర్వము నిరాధారము. ఏలన, ఆత్మస్వరూపి యగు పరమేశ్వరుని వంచనచేసి కదా ఆత్మను దెచ్చుకొన్నావు. కావున ఆత్మను అర్పించుట అనఁగా, దొంగసొత్తును అధికారుల స్వాధీనముచేయుట వంటిది."

ఈ సమయముననే ఆశ్రమాధికారులు సూర్యాస్తమయ వేళకు స్త్రీలు ఆశ్రమము వదలిపోవలెనని యొక నిబంధనను అమూలుపఱిచిరి. తత్పూర్వము స్త్రీలు రాత్రి 8 గంటల దాఁక ఆశ్రమములో ఉండుటకు అనుమతియుండెను. శ్రీపాణకా కనకమ్మ, మేలోకోట సతీమణి, నాభార్య మున్నగు స్త్రీలు పలువురు దీనికి తీవ్రముగా నొచ్చుకొనిరి. ఏల యనఁగా, దీని వల్ల వాళ్లు దేశభాషాపారాయణశ్రవణమును రాత్రి భోజనమప్పుడు శ్రీభగవానుల సాన్నిధ్యమును గోల్పోయిరి. దీనిని గూర్చి శ్రీభగవానులతో మొఱపెట్టుకొనుట నిరుపయోగమని వాళ్లకుఁ దెలియును. ఏలయన ప్రతి ఆశ్రమనిబంధనను సంపూర్ణముగా అనుసరించువారిలో శ్రీభగవానులే ప్రథములు. ఉదాహరణము: ఎవరైన పాట పాడుచున్నప్పుడూ,

పారాయణ చేయుచున్నప్పుడూ, మధ్య భోజనమునకు గంట మ్రోఁగెనేని, శ్రీభగవానులు వెంటనే యిట్లు పలుకుచూ లేచెడువారు:

ంమువారు మనకు ధర్మముగా భిక్ష చేయుచున్నారు. ఆలసించితిమా, వారు మన కాహారము నిరాక న్యాయ్యముగా నుండును. కావున వేగముగా పదండి."

భక్తురాండ్రకు ఆ చేఁదుమందు మ్రింగుట తప్ప గత్యంతరము లేకుండెను. ఈ సందర్భములో నా చిన్నకొమార్తె లలిత ఒక తమాషా చేసెను. ఆమె నేరుగా సర్వాధికారివద్దకు వెళ్లి ఆయనతో ఇట్లు చెప్పెను:

"స్వామీ, మీకు కావలసినది రాత్రిపూట మగవాళ్లూ ఆడువాళ్లూ ఆశ్రమములో కలసి యుండఁగూడ దని కదా. అట్లయితే ఆడువాళ్లము మేము రాత్రివేళ శ్రీభగవాను లతోఁగూడా ఉంటాము. మగవాళ్లు మీరు ఆశ్రమము వదలి వెళ్లిపొండి, అది గదా ఔచార్యము!"

చిన్నస్వాములవారు నవ్వుచూ "సరిసరి, పసిపిల్లవైనా నీ యుక్తి కాళయుక్తిగా ఉన్నదే! నిన్ను బ్రతిమాలుకొంటాను. ఊర కుండు" అని పలికిరి.

మఱియొకదినము శ్రీభగవానులు "కైవల్యనవనీతము"ను గుఱించి ముచ్చటించిరి. అది మొట్టమొదట నాలుగైదు శతాబ్దములముందు తాండవరాయనిచే అఱవములో రచింపఁబడినది. 1854 లోనే "Butter of Bliss" అనుపేరుతో జర్మన్ ఇంగ్లీషు భాషలలోకి తర్జుమా చేయఁబడినది. ఆ ప్రచురణప్రతి శ్రీభగవానులయొద్ద ఉండెను. మూలగ్రంథమును శ్రీజగద్గురువు పూరిశంకరాచార్యులవారు ఆర్యావృత్తములుగా సంస్కృతములోని కనువదించిరి. ఈ యనువాదప్రతిని గ్రంథాక్షరములలో వేలూరువకీలు శ్రీసుబ్రహ్మణ్యయ్యరువద్ద శ్రీభగవానులు చూచియుండిరి. తర్వాత రెండు భాగములుగా అర్థతాత్పర్యవ్యాఖ్యానములతోఁ బ్రకటితమైన యాంధ్రానువాదప్రతులను నేను పట్టుకవెళ్లి శ్రీభగవానులకుఁ జూపించితిని. దానిలో తమిళమాతృకనుగుఱించి ప్రస్తావమే లేకుండుట వింతగాఁ దోఁచెను.

ప్రాసంగికముగా శ్రీభగవానులు మత్తుమందుల (Drugs) ను గుఱించి యిట్లు సెలవిచ్చిరి:

"మత్తుమందులవల్ల యోగాభ్యాసమునకు కొంతగుణము కలదని యొప్పుకొనెదను. ఒకమందువల్ల దేహమంతా క్షీరసాగరమువలె అయిపోవును. పట్టాభి అను నొకరు తాను శస్త్రచికిత్సకై Chloroform పుచ్చుకొన్నప్పుడు అమృతమయముగా ఉండెననియూ అట్టిస్థితి మరల ఎప్పుడు

వచ్చునా అని యువ్విళ్లూరుచున్నాననియూ చెప్పిరి. చైనావాళ్లు అస్థిపంజరములవలె ఉందురు. నల్లమందు సేవించిరేని యెంతకష్టమైన రాక్షసకృత్యముఁగూడా సాధింతురు. కానీ యీ మందులను పరిమితముగా రహస్యముగా పుచ్చుకోవలెను. లేనియెడల అందఱూ కావలెనని కోరుదురు. మఱియూ కొంతకాలమునకు అదే పెద్దబంధమగును, జ్ఞానప్రతిరోధక మగును. అట్టిమందు కలవాటు పడినవారు దానికొఱకై దొంగతనము మొదలైన యెట్టి సాహసకార్యములకైననూ వెనుదీయరు. కావున నిరపేక్షముగా ఉండుటయే ఉత్తమము. ఇవన్నీ చూచియే ఉన్నట్లుండుట మేలని నిశ్చయించుకొన్నాను. కొంతకష్టమైననూ ఆత్మవిచారము చేసి తన స్వరూపమును దెలిసికొనుటకు ప్రయత్నించుటయే నిరపాయమగు మార్గము.''

ఆ మఱునాడు ఒకాయన యిట్లడిగెను:

"ఈ 'నేను' అనునది యేమిటి? అది యెక్కడ పుట్టును? అన్ని వస్తువులలో అది యెట్లుండఁగలదు?"

భగవాను లిట్లు జవాబిచ్చిరి:

'నేను' అనునది యేమిటో, ఎక్కడ పుట్టునో ఆ 'నేను'నే డిగిచూడు. నేను అన్నిటిలో ఉన్నాననుట అద్దము ప్రతిబింబములో ఉన్నదని పలుకుటవంటిది. వాస్తవము తద్వ్యతిక్రమము. అద్దములో ప్రతిబింబమున్నట్లు నిక్కమగు నేనులో అన్నియూ ఉన్నవి."

ప్రసంగవశమున శ్రీ భగవానులు గిరిప్రదక్షిణమును ఉత్కర్షించుచూ ఇట్లు మాటాడిరి:

"తక్కిన దివ్యగిరులు ఒక దేవతకు నివాసస్థానములుగా వర్ణింపఁబడినవి. కానీ అరుణాచలముమాత్రము గిరిరూప మైన దేవుఁడే. కావున అరుణాచలప్రదక్షిణమునకు విశేష మహిమ కలదు. ఒక్కమాఱు గిరిప్రదక్షిణము చేసిన వాఁడు బ్రహ్మాకారమున నిలిచిపోవునని చెప్పఁబడి యున్నది. పూర్ణగర్భిణి యగు రాణి మందగమనమువలె అడుగులో అడుగు పెట్టుకొనుచూ నడచుట సరియైన ప్రదక్షిణపద్ధతి. దారిలో రాళ్లు గ్రుచ్చుకొనుటచే కాలి యడుగున కలుగునట్టి యెఱ్ఱగాయములు దేవతలకు కిరీట ములలో మణు లగునట!"

ఆ మఱునాటి యుదయము శ్రీభగవానులకు ఒక యుదంతము జ్ఞాపకమువచ్చెను. కొంతకాలము క్రిందట శ్రీసోమ సుందరస్వామి ఒక్క క్రొత్తనోటుపుస్తకము శ్రీభగవానుల వద్దకు తెచ్చి "స్వామీ, దీనిలో ఓంప్రథమముగా ఒక్క యక్షరము వ్రాసియియ్యండి" అని వేఁడుకొనెను. 'అక్షరము' అనఁగా అవ్యయము (ఆత్మ) అనియూ అర్థము. కావున శ్రీభగవానులు అఱవములో ఇట్లు వ్రాసిరి:

"ఒక్క యక్షరము హృదయములో ఎవరికి వారు ప్రార్థింప వలసినది. అది వ్రాయునది కాదు."

ఇది "గురువాచకకోవై"లో 'కుఱళ్' (ద్విపద) యైనది:

"ఓ రెళుతు త్తెన్రుం తానా యుళ్ళ త్తొళి ర్వదా
మా రెళుద వల్లా రదై."

దీనిని తర్వాత శ్రీభగవానులే సంస్కృతశ్లోకముగా తెలుఁగు ద్విపదగా ఇట్లు రచించిరి:

"శ్లో॥ ఏక మక్షరం హృది నిరంతరం
భాసతే స్వయం లిఖ్యతే కథం?"

"ద్వి॥ ఏక మక్షరము తా హృదయమం దెపుడు
నేకమై వెలుఁగునే యెటు వ్రాయఁగలము?"

(పాఠాంతరము)

"ద్వి॥ ఏకమై వెలుఁగునే హృదయమం దెపుడు
నేక మక్షరము తా నెటు వ్రాయఁగలము?"

శ్రీభగవానులు "గురువాచకకోవై"లో మఱియొక పద్యభావమును గూడ ఇట్లు విశదీకరించిరి:

"జ్ఞాని యెప్పుడూ తన్మయుఁడై పరిపూర్ణుఁడై చిదాకాశములో రమించుచుండగా, అతనికి లోకము సిద్ధులను ఆరోపించుట చీఁకటిగదిలోనికి ప్రసరించిన సూర్యకిరణములలోని యణువులనుబట్టి సూర్యుని మహిమను నిర్ణయించుటవంటిది."

ఆ మఱునాడు సాయంకాలము ఒకక్రోతి నా భార్యను కాలిలో కఱచెను. ఈ యుదంతము వినఁగానే శ్రీభగవానులు

వరండాలోకి లేచివచ్చిరి. అచ్చట ఆవిడ ఎచ్చమ్మప్రక్కన కూర్చుండియుండెను. శ్రీభగవానులు నెత్తురు కారుచుండిన గాయమును జూచి దానినిగురించి మిక్కిలి దయతో ఆ విడను పలుకరించి ప్రశ్నించిరి. ఆమెను వెంటనే ఆస్పత్రికి తీసుక వెళ్లి గాయమునకు కట్టు కట్టించుమని శ్రీభగవానులు నాకు సెలవిచ్చిరి. అద్భుతముగా ఆ గాయము మూఁడునాలుగు రోజులలోనే మానిపోయెను. కడకు మచ్చగూడా నిలువలేదు. తర్వాత ఎప్పుడూ నా భార్య అనుచుండెడిది: అది వాస్తవ సంభవమే కాదనీ, శ్రీభగవానుల యనుగ్రహోపాయమనీ. సిగ్గుచేతనూ, తన పిల్లలు శ్రీభగవానుల సన్నిధిలో శాంతికి భంగము కలిగింపరా దను కోర్కెచేతనూ, నా భార్య హాలు వెలుపల కూర్చుండి శ్రీభగవానులు హాలు వెలువడునప్పుడు వారి దర్శనభాగ్యమును పొందుచుండెడిది. కావున ఆవిడవద్దకు వెళ్లి పలుకరించి తన యనుగ్రహమును వర్షించుటకై శ్రీభగ వానులు ఈ సంవిధానమును సృష్టించెనని ఆమె చెప్పుచుండె డిది; మఱియూ సీతకు హనుమంతునివలె, తనకు ఆ కోతి పర మోపకారి యని దాని నెప్పుడూ కృతజ్ఞతతో స్మరించుకొను చుండెడిది. ఆ విడ ఊరికి పోవుటకు సెలవుతీసుకొను సమ యమున శ్రీభగవానులు మరల ఆ గాయమునుగూర్చి ప్రశ్నించి యెంను కింతతొందరగా పోవుచున్నా వని యబ్బురపడిరి. ఆ దినము రాత్రి డాక్టరు టి. యన్. కృష్ణస్వామి నూతనగృహ ప్రవేశసందర్భమున భిక్ష చేయుచుండెననీ, ఆయన కోరిక

ప్రకారము అందులో అవియల్ తయారుచేసిరనీ భోజనసమ యమున శ్రీభగవానులు చెప్పిరి. నా భార్య బిడ్డలు గూడ అచ్చట ఉండి దానిని రుచిచూచిన బాగుండెడిదిగదా అని శ్రీభగవానులు నాతో పలికిరి. అంత పరిపూర్ణము వారి యను గ్రహము!

ఒక యుదయము శ్రీభగవానులు ఒక విచిత్రసంఘట నను నిరూపించిరి. "గురువాచకకోవై" ప్రూఫులో శ్రీభగవా నులు 'కర్త' అను పదమును వ్రాయుచుండునప్పుడే ఒక బాలుఁడు హాలులో 'కర్తురాజ్ఞయా' అని "ఉపదేశసారముఁ" బాడ నారంభించెను.

"దేవీకాలోత్తరముఁ"గూర్చి ప్రసంగించుచూ శ్రీభగ వానులు అందులో 'కాలము' 'మహాశూన్యము' అను సాంకే తికపదములను విశదీకరించిరి. 'కాలము' అనఁగా, పరిపక్వమైన కాలము. పరిపక్వకాలమునందే బోధబీజము మనస్సునఁ బడును. 'మహాశూన్యము' అనఁగా, తానుతప్ప వేఱు లేనిది. అదియే ఆత్మ. కావున మహాశూన్యమును పూరించుట అనఁగా, అదిగానుండుటయే.

మఱియు "గురువాచకకోవై"నుండి శ్రీభగవానులు మూఁడు పండుగల యంతరార్థమును దెలుపు మూఁడు పాట లను జదివి వ్యాఖ్యానించిరి. ప్రథమము నరకచతుర్దశిపండుగ. జ్ఞాన మను చక్రముతో నరకరాజ్యమైన దేహమునకు రాజగు

'అహంకారము'ను జంపినదినమే నరకచతుర్దశి. జ్ఞానస్నానమే నరకచతుర్దశిస్నానము. ద్వితీయము దీపావళిపండుగ. నరక రూప మగు దేహాభిమానమును జంపినంతట సంస్ఫురించు నాత్మప్రకాశమే దీపావళి. తృతీయము పొంగలిపండుగ. అనేక భిన్నరుచులతో మానవుని లోబఱుచుకొను మాయను అతిక్ర మించి గురువుకరుణచే హృదయమునఁ బొంగునట్టి యేకరస స్వరూపమే పొంగలి. అట్టి గురువు చరణములను 'పొంగలో పొంగలి' అని కీర్తింపుఁడు. ఈ పొంగలిపండుగ సంవత్సరము పొడుగునా నిరంతరము సాఁగునది.

మధ్యాహ్ననంతరము శ్రీ భగవానులు "ఉపదేశ సారము"యొక్క ప్రకరణమును ముచ్చటించిరి. దారుకా వనములో శివునిలీలను శ్రీమురుగనారు అఱవములో గేయ రూపమున రచించెను. ఆ వనములో మునులు కర్మల బలముచే గర్విష్ఠులై శివునిమీఁదికి కృత్యను బ్రయోగింతురు. శివకేశ వులు వరుసగా పురుష మోహినీవేషములు ధరించి మునిపత్ను లను మునులను వేఱువేఱుగా ఆకర్షించి శీలభంగము కావింతురు. అంతట ఆ మునులు పశ్చాత్తప్తులై శరణు వేఁడఁగా శివుఁడు వారికి జ్ఞానోపదేశము ననుగ్రహించును. ఈ ఘట్టము రాఁగా శ్రీ మురుగనార్ మునులకు శివుని యుపదేశ భాగమును మీరే రచింపదగుదు రని శ్రీ భగవానులను వేఁడు కొనెను. అప్పుడు ఆయనప్రార్థన నంగీకరించి శ్రీ భగవానులు "ఉపదేశఉందియార్" అఱవమున రచించిరి. దానిని వారే

తర్వాత "ఉపదేశసారము" అను శీర్షికతో ఆంధ్రగీర్వాణ మలయాళభాషలలోనికి అనువదించిరి. ఈపురాణగాథ పరమ శివుని పావనత్వమును అపకర్షించుచున్నదను కారణమున నాయనగారికి ఇష్టము లేదని శ్రీభగవానులు చెప్పిరి.

ఆ సాయంకాలము శ్రీభగవానులు విచిత్రమైన యొక సంభవమును స్మరించిరి. వా రిట్లు నుడివిరి:

"కొంతకాలముక్రిందట పక్షవాతరోగి నొకనిని ఒక బండిలోఁ దెచ్చి హాలులోనికి కొందఱు మనుష్యులు మోసికొనివచ్చి నాయెదుటఁ గూర్చుండఁబెట్టిరి. నేను మామూలుప్రకారము అతనివైపు చూచుచుంటిని. సుమారు అరగంట దాఁటిన పిమ్మట అతఁడు కొంత ప్రయత్నముతోఁ దనంతఁ దాను లేచి నిలుచుకొని సాష్టాంగనమస్కారము చేసి మరల లేచి ముందుకు నడచి ఒక నోటుపుస్తకమును నాచేతి కిచ్చెను. దానిని జూడఁగా, అది అతని జాతకము. అందులో అతనికి పక్షవాయువు తగులుననియూ సరిగా ఈ సమయమునకు ఒక మహాత్ముని దర్శనమై ఆయన యనుగ్రహమహిమవల్ల రోగము సద్యోనివృత్తి యగుననియూ వ్రాయఁబడియుండెను. అతఁడు తన గాఢకృతజ్ఞతను దెలుపుకొని తనంతఁ దాను హాలుబయట నుండిన బండివద్దకు నడచిపోయెను. అప్పు డచ్చట నున్నవా రందఱు ఆశ్చర్యపడిరి. నేనునూ ఆశ్చర్యములోఁ బాల్గొంటిని. ఏలనఁగా నేను బుద్ధిపూర్వ కముగా అతనికి చేసిన దేమియు లేదు."

ఈ వృత్తాంతముఁ జెప్పి శ్రీభగవానులు జ్ఞానికి సంకల్ప మేదియూ ఉండఁజాల దని పునరుద్ఘాటించిరి.

ఆ మఱునాటి యుదయము శ్రీభగవానులు ఆత్మ సాక్షాత్కారమునకై గుర్వనుగ్రహామునుగుఱించి ప్రసంగించిరి. వా రిట్లు సెలవిచ్చిరి:

"ఈ సాక్షాత్కారము కావలసినది యెవరికి? అని విచారింపఁగా ప్రత్యేకవ్యక్తిత్వము నశించి, యింక ఆత్మ సాక్షాత్కరింపవలెను అను భ్రమ వీడును. ఇదియే గుర్వనుగ్రహాము. ఆత్మ యింకను సాక్షాత్కరింపలేదు అను భ్రమను వదలించుటయేగాని, ఆత్మసాక్షాత్కారమును ప్రసాదించుట గురువునకే గాదు ఈశ్వరునకుఁ గూడా సాధ్యము గాదు. అట్లు ప్రసాదింపు మని కోరుట నన్ను నాకు ఇమ్మని అడిగినట్లు. దేహాత్మబుద్ధివలన నేను ప్రత్యేకవ్యక్తిని అను భ్రమ ఉండుటచే గురువు నాకన్న వేఱగు నొకవ్యక్తిఅను భ్రమ కలుగుచున్నది. నిక్కముగా గురువు ఆత్మకన్న వేఱు కాఁడు...జిజ్ఞాసువు అష్టసిద్ధుల విషయమున జాగ్రత్తపడవలెను. జ్ఞానముఁ గోరువానిని అష్టసిద్ధులు తమంతట వచ్చి వేఁడినను అతఁడు వాటిని నిరాకరింపవలెను."

ఆ దినము శ్రీభగవానులు "గురువాచకకోవై"నుండి మూఁడు పాటలను "ఉళ్లదునార్పదు" అనుబంధములోఁ జేర్చ

నిశ్చయించిరి. అవే అనుబంధములో 14, 16, 33 సంఖ్య గల పాటలు. తర్వాత శ్రీభగవానులే వాటిని తెలుఁగు గద్యముగా అనువదించిరి. వారి యాజ్ఞమేరకు నేను వాటిని తెలుఁగు పద్యములుగా అనువదించితిని.

ఆ మఱునాఁడు శ్రీభగవానులు ప్రాతసంగతులు స్మరించుచుండిరి. అప్పుడు తన తల్లినిగుఱించియూ తన పూర్వపరిచారకులనుగుఱించియూ ఇట్లు ముచ్చటించిరి:

"1911 మొదలు 1921 వఱకు అయ్యాస్వామి అను నొక పరిచారకుఁ డుండెను. ఆతఁడు నిరంతరము పనిచేయువాఁడు, బహుశ్రద్ధాళువు, తనదేశమునకు వెళ్లి చనిపోయెను.

అమ్మ సిద్ధిపొందిన యనంతరము అప్పుడప్పుడూ ఇచ్చటికి (సమాధిస్థలమునకు) వచ్చుచుంటిని. ఒకనాడు ఉదయము వచ్చితిని. తిరిగి పోవుటకు బుద్ధి కలుగలేదు. అక్కడ నిలిచిపోయితిని. ఊరిలో వకీళ్లు మొదలగు పెద్దమనుష్యులు వచ్చి తిరిగీ స్కందాశ్రమమునకు రమ్మని పిలిచిరి. కానీ బుద్ధి పుట్టలేదు. మధురనుండి తిరువణ్ణామలకు ఏ శక్తి కొని తెచ్చినో ఆ శక్తియే కొండమీఁదినుండి యిచ్చటికి నన్నుఁ దెచ్చినది. నాకు సంకల్పమే లేదు. తల్లి మరణించినవెంటనే ఆమె దేహమునకు ఒక దివ్యప్రకాశము కలిగెను. శవాకృతిగాక ధ్యానమునం దుండు యోగినివలె నుండెను. స్నానము

చేయించిన వెంటనే ఆ తేజ మణఁగిపోయెను. ఏకాంతముగా భూస్థాపన చేయవలెనని మా యుద్దేశ్యము. రాత్రి ఆమె ప్రాణము విడిచెను. వేకువన 5 గంటలకే పల్లాకొత్తుకుఁ దెచ్చితిమి. కానీ అప్పటికే ఊరిజన మంతయు ఇచ్చట గుంపుగూడియుండిరి.''

తల్లి తన మృతినిగూర్చి ముందు హెచ్చరిక యేమైనఁ గను పఱిచెనా అని యొక రడిగిరి. శ్రీ భగవాను లిట్లు బదులుపలికిరి:

''తాను మరణింతునని ఆమె చెప్ప లేదు. కానీ కొద్దిరోజులు ముందుగా తనమనుమని (వెంకటును) చూడఁ గోరెను. అట్లే వానిని దెచ్చి చూపించిరి. కావున ఆమెకు తా నింక జీవింపనని తలంపు కలిగినట్లే యెంచవలెను.''

మఱియొక ప్రశ్నకు జవా బిచ్చుచూ శ్రీభగవాను లిట్లనిరి:

''అమ్మ ప్రాణోత్క్రమణసమయమున Metallic sound (కంచుగీసినట్టు సన్నని శబ్దము) వినఁబడినది వాస్తవమే. కానీ నా ధ్యానము అప్పుడు దానియందు లేదు''

మఱియొక పూర్వపరిచారకునిగుఱించి శ్రీభగవాను లిట్లు వచించిరి:

''పళనిస్వామినిగూడా అమ్మనువలెనే ఉత్క్రమణసమయమున ఉపచరించితిని. ఎడమచేయి అతని శిరస్సు మీఁదనూ కుడిచేయి అతని హృదయముమీఁదనూ ఉంచితిని. ప్రాణము లయించెనని తలంచి దేహమును

నేలమీఁదఁ బెట్టి నేను ఒకటి రెండు అడుగులు పోఁగానే అతఁడు కనులు విచ్చి మూసికొనెను. కనులగుండా ప్రాణము పోయెను."

యోగి మరణమునకునూ జ్ఞాని మరణమునకునూ భేద మేదైన ఉన్నదా? అని యొకరు ప్రశ్నింపఁగా శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి:

"'నకర్మణా' అను వాక్యములో యోగులకు అర్చిరాది మార్గమున బ్రహ్మలోకప్రాప్తియూ జ్ఞానులకు బ్రహ్మత్వ సిద్ధియూ చెప్పఁబడిన వని నాకు తోఁచినది. కానీ 'విజ్ఞానేశ్వరీయమున' 'పరాంతకాలే' అనుటకు అపరాంత కాలమునఁ గాదు అనఁగా అజ్ఞానయుక్తమరణముగాదు అనియూ, 'బ్రహ్మలోక' మనుటకు బ్రహ్మఆలోకము అనఁగా బ్రహ్మసాక్షాత్కారము అనియూ అర్థము చెప్పఁబడియున్నది."

తిరిగీ యొకరు మెదడునూ హృదయమునూ గుఱించి యడుగఁగా శ్రీభగవాను లిట్లు పలికిరి:

"మెదడు నాడీకేంద్రము అనునది ఒక్క జాగ్రదవస్థకు మాత్రమే అన్వయించును. కానీ వాస్తవాత్మకు విశిష్ట కేంద్ర మొకటి యుండవలెనుగదా. అదే హృదయము."

మహాపూజామహోత్సవమునకు ముందటిదినము నేను దర్శనార్థులగది కార్యములో ఉంటిని. ఆ సాయంకాలము నేను హాలు ప్రవేశింపఁగానే శ్రీభగవానులు నాతో

"మిమ్ములను ఎవరైనా ఇక్కడికి పిలిచినారా?"

అని యడిగిరి.

"లేదు, భగవాన్. నేను ఇంతసేపూ దర్శనార్థులగది కార్యములో ఉంటిని. ఇప్పుడు మామూలుప్రకారము నమస్కారము చేసికొనుటకు వచ్చుచున్నాను."

అని బదులుపలికితిని; అందుమీఁద శ్రీభగవానులు మందహాసము చేయుచూ ఇట్లనిరి:

"మీరు మధ్యాహ్నమునుంచీ కనుపించనందువల్ల నేను మిమ్ములనుగుఱించి ఓరుగంటి వేంకటకృష్ణయ్యను ఇప్పుడే అడుగుచుంటిని. వెంటనే మీరు ప్రత్యక్షమైతిరి. వేంకటకృష్ణయ్య ఇంకా ఇచ్చటనే ఉన్నందువల్ల మీ యొద్దకు ఎవరైనా పరుగెత్తి మిమ్ములను రమ్మని చెప్పినారా యేమి? అని ఆశ్చర్యపడుచున్నాను."

"లేదు, భగవాన్, నన్నెవ్వరూ పిలువలేదు. నాయంతట నేనే వచ్చినాను."

అని నేను మరల మనవి చేసితిని.

అప్పుడే శ్రీభగవానులు తన సహాధ్యాయీ ప్రాతస్నేహితుఁడూ ఐన మాజీపోలీసుడిప్యూటీసూపరింటెండెంటు

అబ్దుల్ వాహాబ్ నుగుఱించి ముచ్చటించుచుండిరి. అతనికి ముద్దుపేరు సాబ్ జాన్. సాబ్ జాన్ మధురాంతకములో శ్రీవిజయంనాయుడు అనునతనివద్ద శ్రీభగవానుల రూప పటమును జూచి తన ప్రాతస్నేహితుని గుర్తుపట్టి శ్రీభగవానులు ఎచ్చోట ఎట్లు ఉన్నదీ విచారించి తెలిసికొనిరి. తర్వాత అతఁడు శ్రీభగవానులను జూచుటకు రాఁగా, ఏ మాశ్చర్యము! శ్రీవిజయంనాయుడుగూడా అదేసమయమున ఆశ్రమమునకు వచ్చియుండెనఁట. వా రిరువురును శ్రీభగవానుల యెదుటనే కలసికొని ఆశ్చర్యపడి తాము మధురాంతకములో పూర్వము కలసికొనిన యుదంతమును స్మరించిరఁట.

మహాపూజాదినమున (1939 జూన్ 11 వ తేది) సాబ్ జానే వచ్చెను. ఆయనను శ్రీభగవానులే నాకు పరిచయము చేసిరి. తర్వాత నే నాయనను ఏకాంతమునఁ గలసికొనఁగా, ఆయన తన ప్రయాణగాథను నాకు చెప్పెను. విల్లుపురం జంక్షన్‌వద్ద తాను కాట్పాడీ రైలుబండిలోకి ప్రవేశింపఁ బోవఁగా, ఆ బండిలో నుండిన బర్మావాళ్లు ముగ్గురు అతనికి అడ్డుపడి బాకులతో పొడువఁబోయిరఁట. సరిగా ఆ సమయమునకు ఒక హిందువు వీళ్లనడుమ వచ్చి వారి బాకుపోటును తన భుజముమీఁద తగిలించుకొని ఈయనను కాపాడెనఁట. ఈయన తన కృతజ్ఞతను దెలుపుకొనుటకుఁగూడా తడ వీయక ఆ హిందువు వెంటనే అదృశ్యమయ్యెనఁట. ఈ విధముగా తనకు శ్రీభగవానుల దర్శనమునకు ముందే వారి యను

గ్రహము అనుభవమయ్యె నని సాబ్ జాన్ నుడివెను. మఱియు ఆయన శ్రీభగవానుల బాల్యవృత్తాంతముం గొంత చెప్పెను. 'వేంకటరామణ' (శ్రీభగవానులు) బడియందు కాల్బంతి (foot ball) ఆట్ల జట్టులో ప్రముఖుండఁట. దానికి తాను నాయకుఁడు (Captain)గా ఉండెనఁట. ఒకప్పుడు ఒకయాటలో శ్రీభగవానులకు కాలిమీఁద పెద్దదెబ్బ తగిలి 104.6° డిగ్రీల జ్వరము రాఁగా ఆటగాం డ్రందఱూ చాలా దిగులుపడిరఁట. మఱియూ ఆ దినములలో వెంకటరామనూ తానూ ప్రాణ మిత్రులనీ తమ యిండ్లలో ఉభయులూ పలుమారు కలసికొను చుండిరనీ ఆయన చెప్పెను.

ఆనాడు మధ్యాహ్నముమీఁద సాబ్ జాన్ సెలవు పుచ్చుకొనుటకు వచ్చినప్పుడు శ్రీభగవానులు పచ్చకొత్తులో కోతులసమూహమునకు మహాపూజ విం దొసంగుచుండిరి. కోతులు బారులుదీఱి కూర్చుండి వరుసప్రకారము లేచివచ్చి శ్రీభగవానుల చేతినుండి తినుబండములను గైకొని పోవు చుండెను. అన్నియూ ఆరగించినపిమ్మట అవి తమకృతజ్ఞతను దెలుపుటకో అనునట్లు ఒక్కమాఱుగా కలసి కేకపెట్టెను. ఇది చూచుటకు మిక్కిలి చిత్రముగా నుండెను. తర్వాత శ్రీభగవానులు సాబ్ జాన్తోఁగూడా ఆశ్రమమునకు మరలి వచ్చిరి. ఆ మిడిమెండలో చెప్పులు వేసికొనకుండా ఇసుక మీఁద నడచుట సాబ్ జానుకు నిప్పులగుండము త్రొక్కుటవలె ఉండెను. కానీ యెన్నడూ పాదరక్షుల నెఱుఁగని శ్రీభగవా

నులకు అది వెన్నెలసికాయువలె హాయిగా నుండెను. సాబ్ జాన్ వెళ్లినతర్వాత నేను ఆయనవద్ద వినిన వృత్తాంత మంతయూ శ్రీభగవానులకు మనవిచేసితిని. శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి:

"నిన్న హాలులో మనము సాబ్ జానునుగురించి ముచ్చటించుచుండినప్పుడే ఆతఁడు తనయూరినుండి బయలు దేఱియుండవలెను."

మహాపూజాదినము వచ్చిన మఱియొక విశేషము గూడా చెప్పుకొనఁదగినది. ఆ యుదయము తపాలాలో "భగవాన్ రమణమహర్షి" అను శీర్షిక గల యాంగ్లకరపత్రములకట్ట యొకటి- ధర్మవినియోగమునకై యుద్దేశింపఁబడినది- వచ్చెను. శ్రీభగవానులు ఆ కరపత్రమును జదువుచూ దాని ముఖపత్రమున నేను ఆంగ్లమున రచించియుండిన "Prayer" (ప్రార్థన)ను నాకుఁ జూపించిరి. అది నాకు ఆశ్చర్యముఁ గొలిపెను. శ్రీభగవానుల యాజ్ఞానుసారము దానిని నేను హాలులో ఇట్లు పఠించితిని.

"Where the riotous senses rest and are lulled into
soft slumber,
Where speech congeals into silence and thought
blows back into its fountain-head,
Where this gigantic ego drops to a point, vanishes,
and lo! emerges as the Infinite One,
Where the atom and the universe, the soul and the
Over-Soul unite in one eternal-luminous-Being,
There, O Self of self, let me awake."

దాని భావ మిది:

"ఎచ్చోట సంక్షోభించు నింద్రియములు విశ్రమించి చల్లగ
నిదురపోవునో,
ఎచ్చోట వాక్కు మౌనముగా గడ్డకట్టి తలంపు తన
మూలములోనికి ప్రవహించునో,
ఎచ్చోట ఈ బ్రహ్మాండమైన యహంత ఒక బిందువంత
సూక్ష్మమై, అదృశ్యమై, ఆహా! అఖండైకవస్తువుగా
స్ఫురించునో,
ఎచ్చోట అణువూ- విశ్వమూ, ఆత్మ- పరమాత్మ- సచ్చిదా
నందస్వరూపముగా ఏకమగునో,
అచ్చోట, ఓ ప్రాణంపుప్రాణమా, నన్ను మేల్కొల్పి
యనుగ్రహింపుమా"

నాపద్యము ఆ కరపత్రములలోని కెట్లు ఎక్కినదీ శ్రీభగవానులే విశదీకరించిరి. సింహళవాస్తవ్యుడు శ్రీ జి. రామచంద్రన్ అను నొక మంచిభక్తుడు నా యాశ్రమలేఖలో ఆ పద్యమును జూచి దానిప్రతి వ్రాసికొనిపోయి మరదన (సింహళము) అను చోట తనకరపత్రములలో దానిని అచ్చువేయించి ఈ యుత్సవసందర్భమున ఆశ్రమమునకు బహూకరించెనట.

శ్రీభగవానులు ఇప్పుడు ఆ పద్యమును శ్రీసుందరేశయ్యర్ గారిచే అఱవములోనికి అనువదింపించి తామే సమగ్రముగా సరిదిద్దిరి. ఆ తమిళానువాదము ఎట్లుండెను:

“ఓయా ప్పాఱిగ ళోయ్ఙ్దుమోఙ్ ఉయిల్
తన్ని లోడుజ్గుఙ్ తల మెదు వెదు తాన్
వాక్కు మవున మన్నిడ మెణ్ణం
తన్ఱలై పిఱప్పిడఙ్ చారిడ మెదుపే
రగన్ఱై యఙువాయ్ త్తేయ్దోళిన్ దావా
ఎఱ్ఱైయి లోన్ఱా మెళు మిడ మెదువో
అఙువు మకిలము మూవియుం పరముం
ఒరునిద వోఙ్పొరు ళుడనోన్ ఱిడమే
తావెన్ నా రుయిర్కుయిరే
యాంజ్గేయా నుఙర్న్ దెళున్ దిడ వరుళే.”

రెండుదినముల తర్వాత శ్రీభగవానులు ప్రాసంగిక ముగా తాము తెలుఁగు నేర్చుటనుగూర్చి ముచ్చటించిరి. వారు మధురలో ఉండినప్పుడే వారికిఁ గొంచెము తెలుఁగు వచ్చియుండెను. తెలుఁగుఁ దెలిసిన బంధువు లక్ష్మయ్య అను నొకాయన వారితో ఎప్పుడూ తెలుఁగులోనే మాటాడుచుం డెనఁట. శ్రీకావ్యకంఠులు వారికి ‘రమణమహర్షి’ అని నామ కరణము చేయుటకు చాలా ముందే ఈ లక్ష్మయ్య వారిని ముద్దుగా ‘రమణా’ అని పిలుచుచుండెనఁట. “సీతారామాంజ నేయము” అను గొప్ప తెలుఁగు వేదాంతకావ్యమును శ్రీభగవానులు పచ్చెయమ్మగుడిలో నివసించు చుండినప్పుడు చదివిరఁట. దానిని వారివద్దకు శ్రీగంభీరం శేషయ్య (“విచార సంగ్రహము”లో ప్రాశ్నికుఁడు) తెచ్చెనఁట. ఈ శేషయ్య

ముల్కినాఁడు బ్రాహ్మణుఁడనీ ఆకన్న మాదన్న అను సుప్రసిద్ధమంత్రుల వంశమువాఁడనీ శ్రీభగవానులు మాకుఁ దెలియఁబఱిచిరి. ఆ గ్రంథములో 'సుషుమ్నానాడి' తపోమార్గమనీ, 'అమృతనాడి' మోక్షమార్గమనీ తాము చదివినట్లు జ్ఞాపక మున్నదని శ్రీభగవానులు నుడివిరి.

ఆ సాయంకాలము నేను "ఆత్మా యజ్ఞేన కల్పతాం, యజ్ఞం, యజ్ఞేన కల్పతాం" అను వేదమంత్రములో 'యజ్ఞం' 'కల్పతాం' అను పదములకు అర్థ మడిగితిని. శ్రీభగవానులు 'యజ్ఞం' అనఁగా స్వరూపమే అనియూ, 'కల్పతాం' అనఁగా 'అది ఉన్నతీఱున దానిని దెలిసికొనుట' అనియూ అర్థము చెప్పిరి.

అప్పుడు ఒకరు సృష్టి ప్రయోజన మేమి?" అని ప్రశ్నింపఁగా శ్రీభగవాను లిట్లు జవా బిచ్చిరి:

"ప్రశ్నించున దెవరో యెఱుంగుటయే ప్రయోజనము. సృష్టినిగుఱించి భిన్నకథనములకు తత్కర్తల భిన్నమానసికదశలే కారణము."

అది విని డాక్టర్ సయ్యాదు అనాత్మను దొలఁగించిన తర్వాత ఆత్మ నెఱుంగుటకు ఏదే నొక విధానము ఇదమిత్థమని తేల్చిచెప్పఁ డని కోరెను. శ్రీభగవాను లిట్లు జవా బిచ్చిరి:

"అనాత్మను దొలఁగించినంతట ఏది శేషించునో అదే పరమార్థము. దానిని బొందుట అనున దేమీ లేదు. ఏ లన

అది నీకు బాహ్యము గాదు. దానిని నిర్వచించుటగానీ మాటలలో వర్ణించుటగానీ సాధ్యము గాదు. పరిపక్వజీవి గురువునకు సంపూర్ణముగ ఆత్మార్పణము జేసినపిమ్మట దానిని తనకుఁ దాను సాక్షాత్కరించుకొనవలసినదే. అట్లు సాక్షాత్కరించుకొన్న జీవికి ఈ ప్రశ్నలు పుట్టనే పుట్టవు. అతఁడు ఏకచ్ఛత్రాధిపతివలె- కాదా- పసిబిడ్డవలె ఎట్టి దిగుళ్లూ తాపత్రయాలూ లేకుండ జీవించును. అతఁడు తమ మనస్సులతో పరమార్థమును జర్చించువారిని జూచి నవ్వుకొనును. ఏలన అట్టి చర్చ ఒక దోమ ఆకాశము నంతా మ్రింగి వెలిగ్రక్కుట వంటిది."

అంతట ఆత్మార్పణవలన ఆత్మసాక్షాత్కారము తనంతటనే లభించును అనుటకు దృష్టాంతముగా శ్రీభగవానులు జనకరాజు అష్టావక్రమునుల సుప్రసిద్ధగాథను నాటకఫక్కిలో అత్యంతహృదయంగమముగ నిట్లు నాక్రుచ్చిరి:

"వేదాంతగ్రంథములలో ఎచ్చటనో గుఱ్ఱపుసవారిచేయువాఁడు ఒకపాదము లగాములో పెట్టినపిమ్మట రెండవపాదము పెట్టి యెక్కుటకుఁ గావలసిన వ్యవధిలోపలనే ఆత్మసాక్షాత్కారము నొందవచ్చును అని చదివి జనకమహారాజు తన రాజ్యములోని పండితుల నందఱిని బిలిపించి పై వాక్యమును ఋజువుపఱిచెదరా లేక ఖండించెదరా అని యడిగెను. వారు దానిని ఋజువుచేయ లేకుండిరి.

కాని అది వేదవాక్కు గావున దానిని ఖండించుటకు సాహసింపనూ చాలకుండిరి. దీనిచేత రాజు కుపితుడై వారి నందఱినీ చెఱసాలలో పెట్టించెను. అంతట అష్టావక్రముని జనకుని రాజ్యము సమీపమునఁ బోవుచుండగా, జనులు పై వృత్తాంత మాయనకుఁ దెలిపి ఆ రాష్ట్రముఁ బ్రవేశింపవలదని హెచ్చరించిరి. కాని ఆయన అచ్చటికే వెళ్లెను. రాజు ఆయనను బిలిపించి ఆ వేదవాక్కునుగుఱించి ప్రశ్నించెను. రాజు కొన్ని షరత్తులకు ఒప్పుకొనినచోఁ దాను ఆ వాక్యమును ఋజువుపఱుపఁ గలనని ఆయన బదులుచెప్పెను. మొదట రాజు ఆయనను గురువుగా స్వీకరించి ఆయన యాజ్ఞను తూచా తప్పక అనువర్తింపవలెను. రెండవది పండితుల నందఱినీ రాజు వెంటనే విడుదలచేయవలెను. మూఁడవది రాజు తనరాజ్యమును యావదాస్తిని ఆయనకు అప్పగింపవలెను. జనకమహారాజు ఈ షరత్తుల నన్నింటిని నెరవేర్చెను. ఇప్పుడు రాజపదవి లేనందున 'జనకా' అని సంబోధించి, ముని ఒక గుఱ్ఱముతో నగరము వెలుపలికి ఒంటరిగా తనవెంట రావలెనని ఆతని నాజ్ఞాపించెను. అక్కడ ఆయన జనకునితో ఒక పాదము లగాములో పెట్టి రెండవపాదము నెత్తుమని చెప్పి, అతఁడట్లు చేసినంతట ఆయన 'ఇప్పుడు రాఁబోవునది పెద్ద షరత్తు. నీవు నిన్నే అర్పణచేయవలెను. అది నీకు ఇష్టమేనా?' అని యడిగెను. జనకుఁడు 'సరే' అనెను.

ఆ క్షణమునుండి జనకుఁడు ఒకపాదము లగాములో నుండఁగా రెండవపాదము గాలిలో వ్రేలాడఁగా ఒక ప్రతిమవలె అట్లే నిలిచియుండెను. (ఈ పట్టున శ్రీ భగవానులు జనకుఁడు నిలుచున్న తీఱును అనుకరించి చూపిరి.) ఆతని ప్రజలు వచ్చి ఆ స్థితిలో నున్న యతనిని జూచి భయభ్రాంతులై మునితో ఆతనిని గనికరించి రక్షింపుఁడని మొఱపెట్టుకొనిరి. ముని ఆతనితో 'జనకా, యేల యిట్లున్నావు? గుఱ్ఱముమీఁద సవారిచేయుచూ ఇంటికి పో' అని పలికెను. జనకుఁ డట్లే సవారిచేసి గృహమున కేఁగి ప్రతి విషయములో వెల యిచ్చి కొనిన దాసునివలె ముని యాజ్ఞను అనువర్తించుచుండెను. ఇది చూచి ప్రజలు మిక్కిలి యాఱడిల్లిరి. 'ఇప్పుడు ఆ వేదవాక్కునందలి సత్యమును అంగీకరింతువా?' అని ముని యడిగెను. 'అవును' అని జనకుఁడు పలికెను. 'ఇఁక మునుపటివలెనే రాజ్యము చేయుము' అని అష్టావక్రుఁ డనెను. ఇప్పుడు రాజ్యము మీయది గదా' అని జనకుఁడు ప్రశ్నించెను. 'అవును. కానీ నేను రాజ్యమును నాపేరట ఏలవలయు నని నిన్నాజ్ఞాపించుచున్నాను' అని ముని యుత్తరు విచ్చెను. 'చిత్తము, తమ యాజ్ఞ నెరవేర్చెదను' అని జనకుఁ డట్లే చేసెను."

సీతాదేవిని ఋషులపత్నులు ఆమె భర్తను జూపుమని యడుగఁగా, ఆమె కడమపురుషుల నెల్ల 'ఇతఁడు కాఁడు' 'ఇతఁడు కాఁడు' అని పలుకుచూ, శ్రీరాముని యెదుట వచ్చి

నప్పుడు సిగ్గుపడి మౌనముతోఁ దలవంచుకొనిన కథను బ్రస్తావించుచూ శ్రీభగవానులు "కైవల్యనవనీతము"లోనూ ఒక బాలికను తత్ప్రియుని గుఱించి యిటువంటి కథయే కలదని నుడివిరి. మఱియు "మీనాక్షీవిజయము"లోని కథఁగూడా చెప్పిరి. మీనాక్షిదేవికి మొదట మూఁడు పాలిండ్లుండెను. ఆమె యుద్ధముచేసి ప్రతి దేవుని జయించెను. కానీ ఆమె సుందరేశ్వరునియెదుట వచ్చినప్పుడు, మూఁడవ చన్ను మాయము కాఁగా, ఈశ్వరునిముందు తల వంచుకొనెను.

ఆ మఱునాటి యుదయము ఒక ప్రాతభక్తుఁడు శ్రీ రంగస్వామిఅయ్యంగారు తన మనుమరాలిని వెంటఁబెట్టుకొని శ్రీభగవానుల దర్శనార్థము వచ్చెను. ఆ బిడ్డ ఇతరుల యెదుట బహిరంగముగాఁ గాక, రహస్యముఁగానే శ్రీభగవానులకు నమస్కరించుచుండెను. దీనిని శ్రీభగవానులు 'ఏకాంతభక్తి' అని పేర్కొని ఇందుల కుదాహరణముగా "భక్తవిజయము"నుండి యొక్క కథను జెప్పిరి. ఒకరాజు ఎల్లప్పుడూ లోకవ్యవహారాలలో మునిఁగియున్నట్లగపడు వాఁడు. దేవునిపేరే యెత్తువాఁడు కాఁడు. ఆయనరాణి మంచి భక్తులకుటుంబమున జనించినది. దేవునిపట్ల తనభర్త వైముఖ్యమునకు ఆమె చాలా చింతిల్లుచుండెడిది. ఇట్లుండఁగా ఒకనాటి యర్థరాత్రి రాజు గాఢనిద్రలో నుండినప్పుడు రాణి ఆయన పెదవులు కదలుచుండుటఁ జూచి తన చెవులు ఆయన

మోహమునకుఁ జేర్చి యాలకించెను. అప్పుడు ఏకధారగా 'రామ' 'రామ' అను గుసగుస వినవచ్చెను. ఆయన పెదవులు నిద్రలోఁగూడా రామనామము నుచ్చరించుచున్న వనఁగా, ఇఁక ఆయనభక్తి యెంతగాఢమై తీవ్రమై యుండవలెనో ఆమె మనస్సుకు వచ్చెను. ఆమె ఆనందపరవశయై వెంటనే ప్రధాన మంత్రిని బిలిపించి నగరములో ఆ మఱునాడు పండుగ చాటింపవలె నని యాజ్ఞాపించెను. ఆ ప్రకారమే పట్టణమును తోరణములతో అలంకరించిరి. రాజు నిద్రలేచుసరికి మేళ తాళములు తూర్యనినాదములు ఆయనకు వీనులవిం దయ్యెను. ఈ పండుగకుఁ గారణ మేమని రాజు రాణిని నొక్కి యడిగెను. రాణి జరిగినయుదంతము విన్నవింపఁగా, ఆమె పలుకులు ఆయన కొక ప్రఘాతమై "ఏమీ! నా రామనామ జపము నీకు వినఁబడెనా!" అని పట్టరాని యుద్వేగముతో వెనుక కొఱఁగి ప్రాణము విడిచెను.

శ్రీభగవానులు పైకథ చెప్పినపిమ్మట భక్తతుకారాం కథఁగూడ నుడివిరి. రాజపురోహితుఁడు భగవన్నామమును మడిఁ గట్టుకొన్నప్పుడు తప్ప, మఱి యెప్పుడునూ ఉచ్చరించి అపవిత్రముచేయరా దని చాటించెను. తుకారాం నిరంతరము రామనామసంకీర్తనము చేయుచుండువాఁడు ఒకదినము బహిర్భూమి కేఁగుచు రామనామముఁ బలుకుచుండెను. ఆ దారిన పోవుచుండిన పురోహితుఁడు దానిని విని, తుకారామును

జూచి, కోపముతో ఆతనిపై కుటికి ఆ పవిత్రనామమును అట్లు పాడుచేయుట నిలుపుమని ఆజ్ఞాపించెను. తుకారాం నోరు మూసికొనెను. కాని తత్‌క్షణము ఆతని దేహములో ప్రతి సూక్ష్మరంధ్రమునుండి 'రామ' 'రామ' అను శబ్దములు లెక్క లేనన్ని ఒక్కమాఱుగా బయలువెడలెను. ఆ పురోహితుఁడు ఆశ్చర్యచకితుఁడై తుకారాం పాదములపైఁ బడి క్షమ వేఁడుకొని, తన తెలివితక్కువయుత్తరువును ఉపసంహరించు కొనెను.

అంతట ప్రాసంగికముగా శ్రీభగవానులు నామదేవుఁడే రామనామజపము కొన్నికోటులు శేషించియున్నందున అది పూర్తిచేసికొనుటకు తుకారాంజన్మ మెత్తెనను నైతిహ్యమును దడవిరి.

మఱియు శ్రీభగవానులు "తాయుమానవర్"నుండి ఒకపాటఁ జదివి యర్థము చెప్పిరి. ఆ పాటలో మనస్సు ఆత్మతో అది ఒకపరాయివాని మాట విని, మనఃప్రాణముల స్నేహమును విడనాడినదనీ, వాటిని అణఁగఁద్రొక్కవలె నని ప్రయత్నించి విఫలీకృత మగుచున్నదనీ నిష్ఠురమాడును.

రెండుదినముల తర్వాత శ్రీభగవానుల వీపునను ప్రక్కలందును చర్మవ్యాధి (eczema)పొడలమీఁద వేసియుంచిన పట్లను దీసివైచిరి. అప్పుడు శ్రీభగవానులకు డాక్టరు జి.యస్. మేల్కోట్ (ఇటీవలి హైదరాబాదుమంత్రి) వైద్యముచేయు

చుండెను. ఆయన సకుటుంబముగా ఆశ్రమమునకు వచ్చి యుండెను. ఆ డాక్టరే గుండెజబ్బుతో బాధపడుచుండి నిండా బలహీనస్థితిలో వచ్చియుండిరి. శ్రీభగవానుల యనుగ్రహము వలన ఆయన త్వరితముగా ఆశ్రమములో కోలుకొని శ్రీభగవానుల చర్మవ్యాధికి చికిత్సచేయు భాగ్యమును బడసి యుండెను. అది శ్రీభగవానులూ డాక్టరూ ఒకరితో నొకరు చేసికొన్న యొప్పందములాగు కనిపించెను. వాస్తవముగా అది శ్రీభగవానుల యనుగ్రహలీల యని తోఁచెను. ఏలన, మహాపూజ ముందటిరోజు శ్రీభగవానులు పట్టుపట్టి యీ పట్లూ కట్లూ అన్నీ తీసివేయించిరి. మహాపూజనాఁడు శ్రీభగవానుల దేహము ఆరోగ్యప్రకాశముతో కళకళలాడు చుండెను. ఎవ్వరునూ వారికి ఎట్టిజబ్బుగాని యుండినదని అనుమానించుటకు వీలు లేకుండెను. ఆ మఱునాటినుండి మరల ఆపట్లూ కట్లూ ప్రారంభమయ్యెను. ఈ దినము కడసారిగా వాటిని దీసివేసిరి. అంతట శ్రీభగవానులు "ఇప్పుడుగదా నాకు 'బంధమోక్షణము' లభించినది" అని పరిహసించిరి. డాక్టరుగారి కార్యక్రమముమీఁద చర్మవ్యాధినివారణ ఆధార పడియుండినట్లు తోఁచుచున్నదని నే నంటిని. "ఔను, ఈ కట్లు తీసివేసినపిమ్మటనే ఊరికి పోవలెనని డాక్టరుగారి సంకల్పము" అని శ్రీభగవానులు సెలవిచ్చిరి.

ఆ మఱునాఁడు హాలులో శ్రీ యం. వి. రామస్వామయ్యర్ కొమార్తె శ్రీమతి లలితా వెంకటరామన్ వీణా

వాద్యసహితమధురగానము వీనులవిందుఁ గావించెను. శ్రీభగవానులు తదేకధ్యానముతో ఆకర్ణించిరి. "శరణాగతి" అను చరమగీతమునందు పారవశ్యము పరమావధి నొందెను. అందఱము తన్మయులమై ఆనందసాగరమున నోలలాడితిమి. మేము మరల మామూలు మనస్థితికి వచ్చినప్పుడు శ్రీభగవాను లిట్లు పలికిరి:

"ఇప్పుడు మనము మళ్లీ యీ లోకమునకు దిగినాము. ఇంతవఱకు ఎక్కడ ఉంటిమి? 'గాంధర్వలోకము' అనెద రే అది యెక్కడ ఉన్నది? నేను చెప్పెదను వినండి. మనము ఇంతసేపూ ఉండినదే గాంధర్వలోకము."

శ్రీభగవానులు గాయకురాలి నిట్లు ప్రశంసించిరి.

"లలితలో విశేష మేమనఁగా, ఆమె వాయించుచూ పాడుచున్నప్పుడు, అది నోటిపాటా, వీణాస్వనమా వేర్పఱిచి చెప్పలేము. ఆ రెండునాదములు అంతపూర్తిగా సంలీనమైపోవును."

తర్వాత కొంతసేపటికి శ్రీసారనాథన్ చెల్లెలు చిన్న పిల్ల హాలులో నాట్యముచేయుచూ పాడెను. శ్రీభగవానులు మిక్కిలి యక్కఱతో దానిని గమనించుచూ ఇట్లు సెలవిచ్చిరి:

"ఇప్పుడు మనము దేవలోకములో ఉన్నాము. పిల్ల లెక్కడ ఆడుకొందురో అదే దేవలోకము."

ఆ పాట భావమును అర్థముచేసికొను వయస్సు లేకుండి ననూ ఆయమ్మాయి చూపిన యభినయమును శ్రీభగవానులు మెచ్చుకొనిరి, ప్రాసంగికముగా శ్రీభగవానులు "కథకలి నృత్యము"నుగూడా ప్రశంసించిరి.

శ్రీభగవానులు కొండ నెక్కుచూ ఇరువురు భక్త ప్రముఖులనడుమ నేర్పడిన మనస్తాపమును బ్రస్తావించి వారికి ఈ క్రిందిసందేశము నందజేయుమని నన్నుఁ గోరిరి:

"ఎవఁడు మనలను దూషించునో ఆతఁడే మనమిత్రము. ఏలన, అతఁడు దూషించునది మనకు శత్రువైన మన శరీరమును మాత్రమే. శత్రువుకు శత్రువు పరమమిత్రము గదా, నిక్కముగా మనము మనలను భూషించు వారి యెడల జాగ్రత్తపడవలెను."

మధ్యాహ్నానంతరము శ్రీభగవానులు అరుణాచలశివుని మహిమను గొండాడిరి. "శివపురాణము"లో అరుణాచలుఁడు శివుని యవతారమని చెప్పఁబడినది. ఆదిలింగరూపావిర్భావము ఇదియే. దీనివలననే శివుని లింగాకారమున బూజించు విధానము వాడుకలోనికి వచ్చినది. విష్ణువువలె శివుఁడును వరాహావతార మెత్తినట్లు నుడువఁబడినది. రాముఁడు ఖరదూషణుల వధించు ఘట్టమున "అధ్యాత్మరామాయణ ము"లో రాముఁడు శివునియవతార మని చెప్పఁబడినది.

ప్రసంగవశమున శ్రీభగవానులు "అల్లాఉపనిషత్తు"ను గూర్చి ప్రస్తావింపఁగా, డాక్టర్ సయ్యద్ అది అక్బరుచక్రవర్తి యాస్థానములో ఒక బ్రాహ్మణునిచేఁ గల్పింపఁబడినదని నుడివెను "హిందూమతము మహమ్మదును క్రీస్తువుకు గూడా గురువులుగా అంగీకరించును, కానీ వారిలో ఏ యొక్కరే యేకైకచరమగురు వనినమాత్రము ఒప్పుకొనదు" అని శ్రీభగవానులు సెలవిచ్చిరి. సద్గురువు గోష్ఠిలోఁ గడపిన యొక గంటకాలము ప్రార్థనలోఁ గడపిన నూఱేండ్లకన్న మిన్న యను రూమీభాషణమును డాక్టర్ సయ్యద్ ఉద్ఘాటించెను.

ప్రాసంగికముగా శ్రీభగవానులు వరరుచిని భర్తృహరిని గుఱించిన యైతిహ్యములలో పరస్పరవైరుధ్యములను నిరూపించి చారిత్ర్యకవిమర్శ యనఁబడుదానిలో చాలభాగము మరుమరీచికాప్రాయమని సెలవిచ్చిరి. ఈ సమస్యను బరిష్కరించుచూ శ్రీభగవాను లిట్లు నుడివిరి:

> "ఏదైనను యుక్తియుక్తముగా నున్నయెడల, ఒక బాలుఁడు చెప్పిననూ గ్రహింపుఁడు. యుక్తియుక్తము గానిచో బ్రహ్మచెప్పిననూ తృణీకరింపుఁడు."

మఱునాటి యుదయము నేను ఆ భక్తప్రముఖుల నిరువురను ప్రత్యేకముగాఁ గలసికొని శ్రీభగవానుల సందేశమును వారి కందిచ్చితిని. కానీ నేను పెదవి విప్పుటకుముందే వారుభయులూ తమ తగవును బరిష్కారముచేసికొనుట కాతురతను

దెలిపిరి. ఒకేశక్తి సర్వతోముఖముగాఁ బనిచేయుచున్న దను టకు ఇది చక్కని నిదర్శనముగా నాకుఁ దోఁచెను. అంతట వారు హాలు వెనుకఁ గలసికొనిఁ అన్యోన్యకరసంచాలన మొనర్చి, గతమును క్షమించి విస్మరించినట్లు ప్రమాణ మొనర్చిరి. ఈ వృత్తాంతము శ్రీభగవానులకు నివేదించునప్పుడు, వారిలో నొకరు తమనడుమ ఇంతవఱకు నడచిన యుత్తరప్రత్యుత్తరము లను ఏమి చేయవలె నని ప్రశ్నించెను. "వాటిని దగులఁ బెట్టుదమా!" అని ఆయన యడిగెను. వెంటనే శ్రీభగవానులు ఇట్లు బదులుపలికిరి:

"కాగితములను దగులఁబెట్టినమాత్రమున ప్రయోజన మేమి? హృదయములో అది మరల రగులకుండఁ దగులఁబెట్టవలెను."

శ్రీభగవానులు కొండనుండి మరలి వచ్చుచూ గణేశ్ అను పిల్లవానితో పరిహాసమాడిరి. వానిచేతిమీఁద 'గణేశ్' అని వ్రాయఁబడి యుండెను. శ్రీభగవానులు వానిచేతిని గిల్లిపెట్టుచూ "నేను గిల్లినది గణేశ్‌ను గానీ 'నిన్ను' గాదు" అని వాదించిరి. మఱియు "గణేశ్ అంటే యేమి? అది చేయియేనా?" అని యడిగిరి.

అప్పుడు నేను శ్రీభగవానులప్రక్క నడచుచుండఁగా, వారు పైతీఱుననే కొంతకాలముక్రింద జరిగిన యుదంతము నభివర్ణించిరి. మైలాపూరులో ఉపాధ్యాయుఁడు మంచిభక్తుఁడు నైన శ్రీ శేషగిరిఅయ్యర్ కడగొట్టుబిడ్డ శ్రీభగవానుల

యొద్దకు వచ్చి "తాతా, తాతా, నన్ను తాకు" అని యడిగెను. ఆ పైకథ శ్రీభగవాను లిట్లు చెప్పిరి.

"అంతట నేను దానిచేతిని ఇట్లు తాఁకితిని. (ఈమాట పలుకుచూ శ్రీభగవానులు నాచేతిని స్పృశించిరి. నాకు గుండె జల్లని యొడలు జలదరించెను.) వెంటనే ఆ బిడ్డ 'నాచేయి తాఁకితిరి గాని నన్ను తాకిఁతిరా!" అని ప్రశ్నించెను. ఆ బిడ్డ సవాలుకు నేను ఆశ్చర్యపడితిని"

అని ముక్కుపై వ్రే లిడికొనుచూ శ్రీభగవానులు హాలులో తిరిగీ ప్రవేశించిరి.

డాక్టరు ఏవో తైలములు పూయుటకు తీసుకొని రాఁగా, శ్రీభగవాను లిట్లనిరి:

"ఇప్పుడు డాక్టరు చేయఁబోవునది 'preventive treatment' (ఇఁకముందు జబ్బు తిరిగీ రాకుండుటకు చికిత్స). 'కైవల్య నవనీతము'లో శిష్యుఁడు గురువుతో ఇట్లు చెప్పెను: మీయుపదేశముచేత నాకు జ్ఞానము కలిగినది. కానీ దయ్యము విడిచినమా మరల రాకుండ యంత్రస్థాపన చేయునట్లు అజ్ఞానపిశాచము మరల రాకుండు నుపాయము సెలవియ్యవే'. దానికి గురువుచెప్పినదే ఉత్తరభాగము. పూర్వభాగముకన్న ఉత్తరభాగమే పెద్దది. అదేవిధముగా 'గీత'లో అర్జునుఁడు 'మోహే నష్టే స్మృతి ర్లబ్ధా' అని

పలికియూ తిరిగి 'మఱచిపోయితిని. కావున ఇంకొకమాఱు చెప్పవే' అని శ్రీకృష్ణుని వేడుకొనును. అందులకు శ్రీకృష్ణుఁడు చెప్పినదే 'ఉత్తరగీతము' "

మఱునా డుదయము అమెరికాలో క్యాలిఫోర్నియా నుండి నోయీా అనునామె సంకల్పము లేకయే ఆశ్రమము వచ్చెను. ఆమె యేదో మానసిక వేదనతో కుములుచున్నట్లు కనిపించెను. ఆమె నుద్దేశించి శ్రీభగవాను లిట్లు పలికిరి:

" 'నేను మలినముగా నున్నాను' అను తలంపును దొలఁగింపుము. ఆత్మ నిత్యశుద్ధము. ఇదంతా మనస్సు చేయు పని. నీవు మనస్సుయొక్క మూలమును జేరుకొన్నట్లయితే, యీా చెడ్డతలఁపు లన్నీ అదృశ్యమగును"

ఆ మధ్యాహ్నము విజయనగరము రాణిగారు శ్రీభగవానుల దర్శనార్థము విచ్చేసిరి. ప్రాసంగికముగా శ్రీభగవానులు కీర్తిశేషులైన రాజాగారు ఆశ్రమమునకు ఒకవ్యాఘ్రాజినమును పులితలతోఁగూడ సమర్పించిరనీ, శ్రీ భగవానులు ఆ యజనముపై ఆసీనులైన చిత్తరువు రాజాగారికి పంపఁబడెననీ పూర్వ వృత్తాంతమును స్మరించిరి. రాజాగారి తల్లి పరమ భక్తురాలు తన కొమారుని యనారోగ్యమును గుఱించి పలుమారు శ్రీభగవానులకు వ్రాయుచుండెనఁట. రాణిగారు "శాంతి అనఁగా ఏమి?" అని ప్రశ్నించిరి. శ్రీభగవాను లిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి.

"మన స్వరూపమే శాంతి. మనము మనకు అశాంతి నారోపించుకొని శాంతికొఱకు దేవులాడుచుందుము. నిక్కముగా మనము సర్వదా శాంతిలోనే ఉన్నాము. వేదము ఆత్మనుగూర్చి 'శాంతిసమృద్ధ మమృతం' అని నుడువుచున్నది. పూర్ణత్వములో మనము స్వస్థులమై ఉండుటయే శాంతీ, ఆనందమూ. శాంతికొఱకు ప్రయత్నించుట మంచినీటిలో తలమునకలుగా నిలువఁబడి దాహము తీఱలేదే అని మొఱపెట్టుటవంటిది. ఇది చూచినప్పుడు, ఆ నీరే దాహము పుట్టించుచున్నదా అని ఆశ్చర్యముకలుగును!"

రాణిగారు వెడలునప్పుడు నాతో ఇట్లు సెలవిచ్చిరి:

"నేను సంప్రదాయసిద్ధమైన ప్రశ్న నడిగితిని. భగవానులు సాంప్రదాయికప్రత్యుత్తరమునే యొసంగిరి. కానీ నాహృదయమున కెక్కినది శ్రీభగవానుల దేహమందూ ముఖమందూ కళకళలాడు శాంతితేజము. వాస్తవముగా వారే శాంతిస్వరూపముగా సాక్షాత్కరించినారు. ఇదే యిచ్చట నేను క్రొత్తగా కనుగొన్న విశేషము."

"జ్ఞానికి ఎంతనిద్ర కావలెను?" అని ఒకాయన అడుగఁగా, శ్రీభగవాను లిట్లు బదులుపలికిరి:

"'నేను నిద్రనుండి లేచినాను' అనుకొనువానికి నిద్ర అవసరము. కానీ యెన్నడూ మాఱని నిద్రలో ఉన్నవానికి

వేళా కనిద్రతో ఏమిపని యున్నది? కను రెప్పలు అలుపుఁ గొన్నప్పుడు కొంచెము సేపు కనులుమూసినఁ జాలును. జాగ్రత్తు, స్వప్నము, గాఢనిద్ర అను మూఁడవస్థలు మనస్సుకుఁగానీ దేహమునకుఁ గావు."

సాయంకాలము శ్రీభగవానులు "ఐతిహ్యమాలిక" అను మలయాళగ్రంథమునుండి 'ఒకవడ్రంగి పదుగురుబ్రాహ్మణులు' అను కథ చెప్పిరి. ఆ బ్రాహ్మణులు మాంత్రికుఁడు, అగ్నిహోత్రి, యోగాభ్యాసి మున్నగువారు. వడ్రంగి మెఱక నేలపై ఒక్కొక్క బ్రాహ్మణుని యనుష్ఠానమునకు ఒక్కొక గుంట త్రవ్వి వారి యనుష్ఠానములు నిష్ప్రయోజనము లగుట నిరూపించును. కథాంతమున శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి:

"నీటిమట్టము తెలిసికొనక ఎన్నిగుంటలు త్రవ్వినను లాభమేమి? అట్లే స్వరూప మెఱుఁగక, యెందఱు దేవతలను ఎన్నిమార్గముల నుపాసించినను ప్రయోజనము లేదు."

మనపై అపనిందలు మోపుట మనకు ప్రచ్ఛన్నముగా ఉపకారమే కావచ్చును అనునీతి నుదాహరించుటకు శ్రీభగవానులు మఱియొక్క కథఁగూడఁ జెప్పిరి. ఒకమాలవాఁడు వానియిల్లాలు మాలెత దారిని బోవుచుండఁగా ఒకనంబూదిరి బ్రాహ్మణుఁ డెదురయ్యెను. ఆయనను జూచి మాలవాఁడు తనభార్యతో "ఒసే, బాపనయ్య వస్తూన్నారు. మనం

పక్కకు పోదాం" అనెను. అది విని మాలెత యిట్లు పలికెను: "పో నవసరము లేదు. తనకూతురిని ఉంచుకొన్న వాఁడు మనం దగ్గఱకు పోతే మైలపడతాడా? ఈ పాపిని బాపనయ్యా అంటావా!" అందుమీఁద ఆ మాల యిట్లనెను: "ఈ నీలాప నింద పలకడంలో నీవు నూఱో మనిషివి. దీనితో ఆ అయ్యవారి పాపం పూర్తిగా తొలఁగిపోయింది." ఆ పాప మేమిటో ఆ వృత్తాంతమును మాల తనభార్యకు ఈవిధముగా వివరించెను: ఒకనాడు ఆబ్రాహ్మణునిభార్య వంటచేయుచుండఁగా జలగ యొకటి యింటి పైకప్పునుండి అన్న ముడుకుచున్న పాత్రలోఁ బడి చచ్చెను. అది విని ఆబ్రాహ్మణుఁడు చెడిపోయిన యన్నమును పనివాళ్లకు వేయుమని భార్య నాజ్ఞాపించెను. తత్క్షణమే యమధర్మరాజు తనగుమాస్తా చిత్రగుప్తునితో ఆపాపమును బ్రాహ్మణునిపేర లెక్కవ్రాయుమని చెప్పి, ఆబ్రాహ్మణుఁడు మరణించి నరకమునకు వచ్చునప్పుడు అతనిని గఱపించుటకై జలగలకొండఁ చేర్చిపెట్టుఁడని యుత్తరువుచేసెను. ఆబ్రాహ్మణుఁడు చిత్రగుప్తుని భక్తుఁడు. నిత్యమూ నిద్రించుటకు ముందు 'చిత్రగుప్తాయ నమః' అని మ్రొక్కిపడుకొనువాఁడు. అందుచేత చిత్రగుప్తుఁడు ఆ బ్రాహ్మణునిపై జాలిఁగొని స్వప్నములో దర్శనమిచ్చి అతనికి రాఁబోవు శిక్షనుగూర్చి ముందు హెచ్చరిక చేసెను. ఆ బ్రాహ్మణుఁడు భయభ్రాంతుఁడై ఆయనపాదములపైఁ బడి "ఏదోయొక విధముగా నన్నుఁ దప్పించి రక్షించవే" అని వేడుకొనెను.

చిత్రగుప్తుఁడు ఆయన కొకయుపాయము నుపదేశించెను. ఆ బ్రాహ్మణుఁడు ఎదిగియున్న కన్నెపడుచైన తనకొమార్తెతో అవినీతిగా వర్తించుచున్నాఁడా అని యనుమానము కలుగు నట్లు మెలఁగవలెను. అప్పుడు ఆతనిపై కూఁతురి నుంచుకొన్న మహాదుర్మార్గుఁడు అని అపనింద వ్యాపించును. దీనిని బలుకు నొక్కొకఁడునూ అతనిపాపములో నొక్కభాగము పంచు కొనును. అట్లు దీనిని నూఱుమంది యుచ్చరింపఁగానే ఆతని పాతకము పూర్తిగాఁ దొలఁగిపోవును. అట్లే ఆ బ్రాహ్మణుఁ డొనర్చెను. ఆతనిపై అపనిందను బలికినవారిలో ఈ మాలెత నూఱవది. కావున ఆ బ్రాహ్మణుఁడు పాపవిముక్తుఁ డైనాఁడు. శ్రీభగవానులు ఈకథయందలి నీతిపాఠము నిట్లు సెలవిచ్చిరి:

"కేవలసదుద్దేశ్యము కలిగియుండుము. కానీ భూషణగాక దూషణ వచ్చునట్లు ప్రవర్తింపుము. నీ నడవడి న్యాయ్యమై ననుగూడ, నిన్ను సమర్థించుకొను ప్రలోభమునకు లోఁబడవలదు."

ఆ రాత్రి శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి:

"కొందఱిమతమున జ్ఞానికూడా ప్రారబ్ధ మనుసరించితీఱవలెఁ గదా. ఆ యనుభవకాలములో చేయు కర్మల ఫలిత మేమికావలెను? అనఁగా, అవి వేయించిన గింజలవంటివి. తినుట కుపయోగించునే గానీ మరల మొలకెత్తఁజాలవు. అని బదులుచెప్పెదరు. మఱి వాని పుణ్యపాపముల

గతియేమి? అనఁగా, వానిని భూషించువారు పుణ్యము పంచుకొనెదరఁట, దూషించువారు పాపము పంచుకొనెదరఁట."

మఱునాఁటి యుదయము శ్రీభగవానులు మఱియొక కథను జదిని చెప్పిరి. ఒకజ్యోతిష్కుఁడు పేదవాఁడు ఎవరో యిచ్చిన చెడ్డసలహా విని బ్రాహ్మణరూపముననున్న నారాయణదూతల నిరువురను వారు వలదన్ననూ వినక బదరీనారాయణమువైపు వారివెంబడి పోవును. శ్రీభగవానులు ఈమాట పలుకుచుండఁగా, వారితపాలా తెచ్చిరి. అందులో మొదటి జాబు బదరీనారాయణమునుండి వచ్చియుండెను. శ్రీభగవాను లిట్లనిరి:

"ఇప్పుడు కథలో బదరీనారాయణమం దుంటిమి. ఈ జాబునూ బదరీనారాయణమునుండి వచ్చినది. ఇది చిత్రముగా ఉన్నది!"

తపాలా చూచినమీఁదట శ్రీభగవానులు ఆకథను పూర్తి చేసిరి. ఆ జ్యోతిష్కుని నారాయణదూతలు ఫలానిదినము పడిపోయెదవని శపింతురు. దానిని దప్పించుకొనుటకు అతఁ డెంతో ప్రయత్నించి తుదకు విఫలుఁడగును.

మధ్యాహ్నముమీఁద శ్రీభగవానులు మఱియొకకథ చెప్పిరి: ఒక బ్రాహ్మణుఁడూ అతనివంటవాఁడూ కలసి యాత్ర

పోయిరి. వంటవాఁడు ఒక సొరకాయను తనతోఁగూడ తీసుక వెళ్లి ప్రతితీర్థములోను ముంచెను. తర్వాత దాని నతఁడు వండఁగా అది మునుపటివలెనే చేదుగా నుండెను. ఈ కథపై శ్రీభగవాను లిట్లు వ్యాఖ్యానించిరి:

"అదేవిధముగా యాత్రికునిలోని చేదుగూడా తీర్థములలో మునిఁగినమాత్రాన ఎట్లు పోవును, అతని మనస్సు సాధువైన స్వాదువైన తప్ప?"

మఱియు రెండు కథలను ఆ గ్రంథమునుండియే శ్రీభగవానులు చదివి చెప్పిరి.

ఆ మఱునాడు ప్రసంగవశమున శ్రీభగవానులు "ఉపదేశఉందియార్"లో 16,28,30 వ పాటలు తొలుత శ్రీమురుగనార్ చేత చిత్తువ్రాయఁబడి తదుపరి తనచేత సరిదిద్దఁబడినవని తెలియఁజేసిరి.

మఱుసటియుదయము శ్రీభగవానులు మామూలుకన్న ఎక్కువసేపు కొండపై నుండిరి. అందుమీఁద, అంతకు ముందురాత్రి సిద్ధిపొందిన మలయాళస్వామి సమాధిక్రియలు పర్యవేక్షించుటకు శ్రీభగవానులు స్కందాశ్రమమునకు వెళ్లియుందురని కింవదంతి వ్యాపించెను. అది విని నేను శ్రీఅణ్ణామలై స్వామితోఁగూడా కొండ నెక్కి త్వరలోనే శ్రీభగవానులు తిరిగివచ్చుటను జూచితిని. శ్రీభగవానులిట్లు సెలవిచ్చిరి:

"ఈ కొండ సొంతయిల్లువలె ఉన్నది. ఇంతవఱకు ప్రొద్దు తెలియరానట్లు చల్లగా ఉండెను. అందుచేత ఇచ్చటచ్చట విహరించుచుండఁగా ప్రొద్దుపోయినది."

శ్రీభగవానులు మఱియు నిట్లు పలికిరి:

"ఈ కొండ నిమ్మగడ్డితో నిండియున్నది. దానిని వాసన చూచినమాత్రన కొండ నెక్కు-వారి అలుపు తీఱిపోవును. భౌతికశాస్త్రజ్ఞులు ఈగడ్డినుండి తైలము తీయవచ్చును."

ఒక బెంగాలియువకుఁడు ఈ క్రింది ప్రశ్నలను ఆంగ్లమున వ్రాసి శ్రీభగవానుల చేతి కందిచ్చెను:

1. మనము దేవునిఁ దెలిసికొనుట యెట్లు?
2. దేవుఁ డనఁగా ఎవఁడు? ఎచ్చట నున్నాడు?
3. మనపూర్వజన్మములను మనము తెలిసికొనఁగలమా?

శ్రీభగవానులు చిఱునవ్వుతో ఆ చీటీ 'Question paper' (ప్రశ్నాపత్రము) అని పేర్కొని యీ క్రింది జవాబుల నుడివి వాటిని ప్రాశ్నికునకు నాచేత ఇంగ్లీషులో చెప్పించిరి:

"1. నిన్ను నీవు తెలిసికొనుట యెట్లో దేవునిఁ దెలిసికొనుటయూ అట్లే.

2. మొట్ట మొదట నీ వెవరో తెలిసికొనుము. తర్వాత దేవుఁ డెవఁడైనదీ ఎక్క-డ ఉండునదీ నీకే తెలియును.

3. మన యిప్పటిజన్మను గుఱించిన పరిమితజ్ఞానముతోనే మనము క్రుంగిపోవుచూ మన యహంతను వ్రోసి పుచ్చఁ జాలకున్నాము. ఇఁక మన పూర్వజన్మల జ్ఞానముగూడా మనపైఁ బడినట్లైన, మన యహంత మఱింత బలపడి మన కష్టము వేయిమడుంగులగును. కావున గతమును గుఱించీ, భవిష్యత్తునుగుఱించీ, వర్తమానమునుగుఱించిగూడా, తలపెట్టకుండుట మేలు."

సాయంకాలము శ్రీభగవానులు ఆనాఁడు అనఁగా 1939 జూన్ 22 వ తేదీ శ్రీమాణిక్యవాచకర్ గురుపూజాదినమని తెలిపిరి. ఆవేళ చాలసేపు శ్రీభగవానులు గంభీరమౌన ముద్ర వహించి యాసీను లగుటవలన ఆ పర్వదినపావనత మా యాత్మలలో అంతర్గతమయ్యెను.

ఆ మఱునాఁడు శ్రీభగవానులు ప్రాసంగికముగా "శ్రీరమణగీత" మూఁడవకూర్పునకు పీఠిక శ్రీకావ్యకంఠ గణపతి శాస్త్రులవారే సంస్కృతములో వ్రాసిరనియూ అది తర్వాత ఇతరభాషలలోని కనువదింపఁబడెననియూ తెలిపిరి. అదేవిధముగా శ్రీకాశీభట్టకృష్ణరాయశాస్త్రిగారి 'ఆమోదోక్తి'గూడా తమిళమలయాళములలోనికి అనువదింపఁబడెనఁట. ఈ సందర్భమున శ్రీభగవాను లొకయంశ మెత్తిచూపి యిట్లనిరి:

"సంస్కృతపీఠికలో 'తిరుచ్చుళి' 'త్రిశూలపురము'గా అనువదింపఁబడినది. 'తిరుచ్చుళి' అను అఱవపదమునకు సరియైన అనువాదము 'ఆవర్తపురము.' 'రమణగీత' మఱుసటి కూర్పు అట్లు మార్పు చేయవచ్చును."

అంతట శ్రీభగవానులు తన స్వగ్రామమునకు 'తిరుచ్చుళి' అను పేరు ఎట్లు వచ్చెనో ఆ కథ చెప్పిరి. ప్రళయకాలమందు పరమశివుఁడు త్రిశూలముతో ఆ భూభాగమును పైకెత్తెను. దానిచేత జలములలో ఒక 'చుళి' (సుడిగుండము) ఏర్పడెను. అదే 'తిరుచ్చుళి' (శ్రేష్ఠమైనసుడి.) శ్రీప్రణవానందులు 'తిరుచ్చుళి' అనఁగా 'ప్రణవము'అని యర్థము చెప్పినట్లుగూడా శ్రీభగవానులు నుడివిరి.

మధ్యాహ్నముమీఁద శ్రీభగవానులు "హారిజన్" పత్రికలో 'దేవుఁడు, సత్యాగ్రహము' అను శీర్షిక గల వ్యాసమందలి కొన్ని భాగములను జదివి వినిపించిరి. "ఈ మనస్సు లేకున్ననూ దేహము కొన్నిహద్దులకు లోఁబడి చక్కగా పనిచేయఁ గలదు" అని యొక విశిష్టవాక్య మా వ్యాసములో నుండెను. అది చదివి శ్రీభగవానులు మనస్సు నశించిన మనమేమగుదుమో అని చాలామంది గాభరాపడుచున్నారని సెలవిచ్చిరి.

ప్రాసంగికముగా శ్రీభగవానులు తాను 'ప్రాణాయామము'నుగుఱించి అరుణాచలము వచ్చినపిమ్మటనే తెలిసి

కొంటి నని చెప్పిరి. 'నాహం'=రేచకము, 'కోఽహం'= పూరకము, 'సోఽహం'=కుంభకము అను 'జ్ఞానప్రాణాయామ' వర్ణనము తాను సొంతముగాఁ జెప్పినదే అని శ్రీభగవానులు తెలియఁజేసిరి. 'సోఽహం' ఒక వృత్తియే (తలంపే) కావున దానినిగూడా అతిక్రమింపవలెను అని నుడువుచూ శ్రీభగవానులు,

"ఒకమాటలో తెలియఁదగినదానికి కోటిశాస్త్రము లేర్పడినవిగదా!"

అని యబ్బురపడిరి.

జ్ఞాని విశిష్టతను నిరూపించుచూ శ్రీభగవాను లిట్లు పలికిరి:

"ఇతరమైన యే యుపాసనగానీ ధ్యానముగానీ చేయువానికి పూనిక, విడుదల కలవు. కానీ జ్ఞాని కవి లేవు. తన్ను విడిచి యెం దుండఁగలఁడు? ఏమి చేయఁగలఁడు? ఎల్ల మనోవృత్తులునూ తనను స్మరించినంతనే సురిగి పోవునుగదా. ఈ ధ్యానయోగాదులనుగుఱించి నవ్వుకొన వలసిన స్థితి యొకప్పటికి వచ్చును."

ఒకాయన యి ట్లడిగెను:

"ఆత్మ తాను కోరినవానికే తనను సాక్షాత్కరించుకొనును అని శాస్త్రము చెప్పుచున్నదిగదా. మఱి మన ప్రయత్నమువలన ప్రయోజన మేమి?"

శ్రీభగవాను లిట్లు జవాబిచ్చిరి:

"అంతర్ముఖు లైనప్పుడే సాధకునిని ఆత్మ తనలోనికి లాగికొనును. బహిర్ముఖుఁడై యున్నంతకాలము ఆత్మ జ్ఞానము అలభ్యము. ఇప్పుడు పలువురు ఆత్మను నిరూపించుటకు ప్రయత్నింతురే గానీ ఆత్మ నెఱిఁగి ఆత్మస్థితు లగుటకు ప్రయత్నింపరు."

పునర్జన్మనుగుఱించి ప్రశ్న రాఁగా, శ్రీభగవాను లిట్లు పలికిరి:

"ఇప్పుడు జన్మ యున్న దనినచో, పూర్వజన్మ కలదు, ఇంకను జన్మ రాఁగలదు. జన్మము ఎవరికి? అని విచారింపవలెను. 'నేను' అను తలంపు లేచుటే నిజమైన జన్మము."

మఱియు శ్రీభగవానులు "కైవల్యనవనీతము"నుండి యీక్రింది వాక్యముల నుదాహరించిరి:

"ఒకగుంట త్రవ్వి ఆగుంటలోనికి ఆకాశము ప్రవేశించిన దని చెప్పుటవంటిది ఆత్మను బొందితి ననుట. ఆకాశమే కదా గుంటకు తా విచ్చినది!..................ఒకబిడ్డ దోఁగాడుచూ నీడలోని తనతలను బట్టుకోవలెనని తఱుముకొని పోవుచుండెను. కానీ అది చిక్కలేదు. తల్లి దీనిని జూచి ఆ బిడ్డను ఒకచోట నిలిపి వానితల వాని చేతనే పట్టింపఁగా, నీడలోఁగూడా ఒకచేయి తల పట్టుకొన్నట్లు బిడ్డకుఁ గనుపడెను. దానితో బిడ్డకోరిక నెరవేఱెను. ఇటివి గురుంనుగ్రహ మనునది."

ఆ మఱునాటి యుదయము ఫలాహారము చేయు చున్నప్పుడు శ్రీభగవానులు నన్ను "ఈ పచ్చడి యేమిటో తెలియునా?" అని యడిగిరి. "తెలియదు. కానీ రుచి దివ్యముగా ఉన్నది" అని నేను బదులుచెప్పితిని. అంతట శ్రీభగవానులు చిఱునవ్వు నవ్వుచూ "ఇది పచ్చికాకరకాయ పచ్చడి" అని పలికిరి. శ్రీభగవానులు గాక మఱి యెవ్వ రైనను ఆ మాట చెప్పినయెడల నేను నమ్మియుండను. ఏలనఁగా, అది రవంతగూడ చేదు లేక మిక్కిలి రుచ్యముగా ఉండెను. ఫలాహారానంతరము నేను ఈక్రిందిపద్యము వ్రాసితిని:

"పచ్చి కాకరంట! పచ్చడి యఁట! చేదు
లేదు సుంత! యౌర నీదుమహిమ!
మౌనివర్య, యట్లె మాలోని యహమును
చేదుఁగూడ మాన్పరా దఁటయ్య!"

శ్రీభగవానులు కొండపైనుండి మరలిరాఁగానే ఈ పద్యమును వారికిఁ జూపించితిని. వారు దానిని బిగ్గఱగాఁ జదివి సంతోష ముట్టిపడఁగా అచ్చట నున్నవారికి దానియర్థము చెప్పిరి. కాకరకాయతోఁగూడా పుల్లని మామిడికాయ, కొబ్బెర కలిపి రుబ్బినందువల్ల పచ్చడిలో చేదు అణఁగిపోయినదని శ్రీభగవా నులు తెలిపిరి. మఱియు వా రిట్లనిరి:

"కాకరకాయ జీర్ణకారి. పచ్చికాకరవల్ల సాఫీగా కాలప్రవర్తి యగును."

ఒకభక్తురాలు "ఉపదేశసారము"నకు బెంగాలీ అను వాదము పఠించుచుండఁగా, శ్రీభగవానులు 22, 23 శ్లోకము లకుఁ గల భావసంబంధమును విశదీకరించిరి. 22వ శ్లోకములో 'విగ్రహేంద్రియప్రాణధీతమములు' 'అసత్తు' 'జడము' అనీ, 'అహము' 'ఏకసత్తు' అనీ వర్ణింపఁబడినవి. కాఁగా ఒకప్రశ్న నిలిచియున్నది. 'అహము' చిత్తా, జడమా? దీనికి ప్రత్యుత్తరము 23వ శ్లోకములో ఇయ్యఁబడినది. సత్తే చిత్తు. పూర్వశ్లోకమునుబట్టి 'అహము'సత్తు. కావున 'అహము'చిత్తు. ఈ హేతువాదమే గణితములో ప్రథమసూత్రముగా గణింపఁబడు 'త్రైరాశికము' అని శ్రీభగవానులు చమత్కారముగాఁ బలికిరి.

మఱియు శ్రీభగవానులు భగవద్గీతలో

"ఆత్మసంస్థం మనః కృత్వా, న కించిదపి చింతయేత్"
(తనయందె తిరముగా మనమును నెలకొల్పి,
యొకటియుఁ జింతింప కుండవలయు)

అను చరణమును బేర్కొని అది జ్ఞానసారగుళిక అని ప్రశంసించిరి.

మఱునాఁటి వేకువన 3-40 గంటలకు మేము కొందఱము గిరిప్రదక్షిణము వెళ్లితిమి. మేము బయలుదేరునప్పుడు శ్రీభగవానులు

"సరియైన కాలమే, పోయి 7 గంటలకు తిరిగి రండి"

అని సెలవిచ్చిరి. మేము 6-40 గంటలకే మరలి వచ్చితిమి. మమ్ములను జూచి పరిహసించుచూ శ్రీభగవాను లిట్లనిరి:

"మీరు ఫలాహారముకొఱకు పరుగున వచ్చినట్లున్నది! బహుశా మీరు మీ ప్రదక్షిణములో 'ఉదరేశ్వరు'నే ధ్యానించుచుంటిరి కాఁబోలు?"

మామూలుగా ఫలాహారవేళ 6-30 గంట. కానీ ఆ దినము మాకు గుణపాఠము నేర్పుటకో అనునట్లు ఫలాహారవేళ 7 గం టలకు మార్చఁబడెను. ఈ యాలస్యమునకు నష్టపరిహారముగా కాబోలు వడ, సాంబారులు నాడు విశేషము లయ్యెను!

ఫలాహారానంతరము శ్రీభగవానులు "కైవల్యనవనీత ము"లో 'సచ్చిదానందము'ను గూర్చి నుడువు పద్యములఁ గొన్నింటిని నాచేతఁ జదివించి తాము వాటి తమిళమాతృక యందలి పాఠమును గమనించుచూ వ్యాఖ్యానించిరి. శ్రీభగ వాను లిట్లు పలికిరి:

"'చిత్తూ' 'ఆనందమూ' మృగవృక్షాదులలోఁగూడా నిగూఢమై యున్నది. కానీ 'సత్తు' 'చిత్తు' 'ఆనందము' వాస్తవముగా ఆత్మసాక్షాత్కార మొందిన జ్ఞానికే తెలియఁబడును."

ఒకశిశువు చంద్రుని ప్రతిబింబమును జూచి చంద్రుఁడే యని భ్రమించుటవంటిది మాయ అని శ్రీభగవాను లుదాహ

రించిరి. మఱియు శ్రీభగవానులు తాము స్వయముగా గమనించిన 'కోతి దృష్టాంతమును గూడా నుడివిరి, ఒకయద్దము ముందు మిఠాయి పెట్టియుండఁగా దానిచే 'నాకర్షింపఁబడి ఒక కోతి అద్దము సమీపమునకు వచ్చెను. మొట్ట మొదట ఆ యద్దములో తన ప్రతిబింబమును జూచి బెదరి పరుగెత్తెను. అంతట ఆ యద్దము వెనుకకుఁ గేలు సాచి ప్రతిబింబమును వెదక సాగెను. కడపటికి అది వాస్తవము కాదని తెలిసికొని, అద్దమును లక్ష్యముచేయక, ఆ మిఠాయిని దీసుకపోయెను. శ్రీభగవానులు ఈ కథ చెప్పుచూ అద్భుతముగా అభినయించి చూపిరి.

గురువునందు శాస్త్రములందును విశ్వాసము ఏ విధముగా ఆత్మసాక్షాత్కారము నొదవించునో విశదీకరించుటకు శ్రీభగవానులు ఈ క్రింది నిదర్శనము లొసంగిరి. స్వప్నములో ఒకరాజును కుక్క కఱచినది. అప్పు డాయన మందు దొరకక నిస్సహాయుఁడ నని వాపోవుచున్నాఁడు. వాస్తవముగా అన్ని మందులూ అందఱువైద్యులూ ఆయనకు స్వాధీన మే గదా. కాని స్వప్నవ్రణమును స్వప్నవైద్యుఁడే స్వప్నచికిత్సతో మాన్పవలెను. అదేవిధముగా మీరు కడుపునిండ భుజించి నిద్రించి కలఁగనండి యెండలో కష్టపడి పనిచేసి అలసి పోయి ఆఁకలితో నున్నట్లు. ఆ స్వప్నక్షుధ స్వప్నభోజనము చేతనే తీఱఁగలదు.

పూర్వసంస్కారవాసనాప్రాబల్యము నుదాహరించుచూ శ్రీభగవాను లిట్లు నుడివిరి:

" మనము అజీర్ణపదార్థము భుజింతుము. అందువలన ఎన్ని సారులో బాధపడుదుము. బాధపడునప్పుడు ఇఁక దానిని ముట్టుకోమని ఒట్టుపెట్టుకొందుము. కానీ నెమ్మదికాఁగానే మరల దానిపై ఆసఁగొందుము."

డాక్టరుసయ్యద్ హేతువాదమునకు ఆస్తిక్యమునకుఁ గల సంబంధమును గుఱించి ప్రశ్నించుచూ ప్రాసంగికముగా కృత్రిమగురువులకు సద్గురువులకుఁ గల భేదమును బ్రస్తావించెను. అందులకు శ్రీభగవాను లిట్లు బదులుపలికిరి:

"అదంతయు శిష్యుల పరిస్థితినిబట్టి యుండును. గురూపదేశమునందు శ్రద్ధనమ్మికవల్ల గురువునే ఉద్ధరించిన శిష్యులును ఉండినారు."

పశువృక్షాదులందునూ ఆత్మసాక్షాత్కార మొందిన యరిది నిదర్శనము లుండవచ్చునని శ్రీభగవానులు సెలవిచ్చిరి.

ఆ సాయంకాలము శ్రీభగవానులు ఆత్మనుగుఱించి 'అణోరణీయాన్ మహతోమహీయాన్' అను వర్ణనను బ్రస్తావించి యిట్లనిరి:

"వడగల్లు సముద్రములో పడును; ఒక చిన్నబిందువు స్థానములో పడును. తత్క్షణమే అది కరఁగిపోయి సముద్రమే అగును. అట్లే జీవునకు మూలము ఒక pin-point (సూది మొన.) అది వెదకఁగా, ఏమీ లేకపోవును. పూర్ణమే నిలు

చును. కావుననే జీవునకు 'అణువు' అను పేరుగలదు. నిక్కముగా మనము ఆనందసాగరములోఁ దేలియాడు మంచుగడ్డలము."

మౌనమునుగుఱించి శ్రీభగవానులిట్లు సెలవిచ్చిరి:

"మౌనము నాలుగు విధములు: వాఙ్మౌనము, నేత్రమౌనము, కర్ణమౌనము, మానసికమౌనము. అందు కడపటిదే శుద్ధమౌనము, అదే ప్రధానము. మౌనవ్యాఖ్యయే ఉత్తమవ్యాఖ్య. కావుననే 'మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వం' అన్నారు ఆచార్యులవారు ఆదిగురువగు దక్షిణామూర్తిని. మౌనమే 'అఖండవాక్కు.' అదే 'ఒక్క మాట.' అదే హృదయమూ హృదయమూ కలసిన సంభాషణము. మౌనము అడ్డు లేని విద్యుచ్ఛక్తిప్రవాహము వంటిది. వాక్కు ఆ ప్రవాహమును దీపాదులకొఱకు అడ్డగించుటవంటిది. జ్ఞాని యెంత మాటాడియూ మౌనియే, ఎంతచేసియూ చేయనివాఁడే. ఆతనివాక్కు ఆశరీరివాక్కు. ఆతనినడక నేలపైఁ గాదు, ఆకాశమును ఆకాశముతో కొలుచుటవంటిది."

రాత్రి భోజనసమయమున వడ్డించిన పనసపరుగును నాకుఁ జూపించి శ్రీభగవానులు ఆ పనసకాయ కాకినాడనుండీ యింతదూరము పంపఁబడినదని నుడివిరి.

భోజనానంతరము శ్రీభగవానులు ఇంగ్లీషులోని నా 'ప్రార్థన'పద్యమునకు శ్రీసుందరేశయ్యర్ రచించి తాము స్వయముగా సరిదిద్దిన తమిళానువాదమును పఠించి, అందలి 'అహావెల్'ఛందస్సునూ భావమునూ విశదీకరించిరి. మఱియు వారు "గురువాచకకోవై"లో తన నూతనపద్యములనుగూడా పఠించి వాటియర్థమును బోధించి వాటిప్రతిని నాకు వ్రాసి యిమ్మని శ్రీసుందరేశయ్యరుతో చెప్పిరి.

మఱునాఁటి యుదయము నా ప్రయాణవేళ శ్రీభగవానులు కొండకు పోవుచుండిరి. నేను వారితో కొన్నియడుగులు నడచి మూఁడు అఱవపుస్తకములు చదువుకొనుటకు తీసుకపోవుచున్నానని మనవిచేసితిని. శ్రీభగవానులు ఆమోదసూచకముగా మందహాస మొనర్చి యిట్లు పలికిరి.

"అదేమి యెక్కువకష్టము కాదు. నరసింగరావూ, లక్ష్మి వాటిని చదివినారు. మొట్టమొదట అఱవము అంత ఆకర్షణీయము కాకపోవచ్చును, ఉచ్చారణ వింతగా ఉండుటవల్ల, కొన్ని శబ్దములూ అక్షరములూ లేనందువల్ల. కానీ కొంత చదివినపిమ్మట నీవు దాని నెంతో ప్రేమింతువు. నాయన యనుభవముగూడా అట్టిదే."

అంతట నేను శ్రీభగవానుల పాదాబ్జములపై సాష్టాంగ ప్రణామమొనర్చి కన్నీటితో సెలవుఁగైకొంటిని.

దశారా ప్రారంభమున ఆశ్రమమువారు శ్రీభగవానులను గుఱించి మేజర్ ఎ. డబ్ల్యు. చాడ్విక్ అను నాంగ్లేయభక్తుఁడు రచించిన వ్యాసము నాంధ్రీకరింపుమని నన్నుఁ గోరిరి. ఈ చాడ్విక్ మొదటిప్రపంచసంగ్రామములో పాల్గొని గొప్పపేరు గడించి, యాపయి నాధ్యాత్మికచింతన గలిగి శ్రీభగవానుల కడ కాకర్షింపఁబడి, అది మొదలు 'సాధుఅరుణాచల' అను నామముతో వారి పాదపద్మముల సన్నిధినే సుస్థిరముగా నెలకొనియున్నారు. దశారా సెలవులకు నేను ఆశ్రమము వెళ్లఁగా, నా తెలుఁగుతర్జుమా యించుక పేలవముగా వారికి తోఁచినట్లు నాకు తెలియవచ్చినది. అందలి భావములను గ్రహించి పద్యరూపమున రచించిచూడుమని నాకు సలహా యిచ్చిరి. ఆ యింగ్లీషువ్యాసమునూ వివిధభాషలలో దాని యనువాదములునూ శ్రీభగవానుల షష్టిపూర్తిమహోత్సవాహ్వానములతోఁగూడ పంపుటకై యుద్దేశింపఁబడినవి. కావున ఆశ్రమమువారు వాటిని ముద్రించుటకు మిక్కిలి తీవరపడుచుండిరి. అక్టోబరు 17వ తేదీ యుదయము శ్రీభగవానుల యావేశావహదివ్యసన్నిధానమునఁ బ్రేరితుఁడనై రెండుగంటలలో పదునాఱుపద్యము లిట్లు రచించితిని:

శ్రీకాంతప్రముఖామరావళులు నిశ్శేషమ్ము నే నంచుఁ దా
వాకొన్నట్టి మహామహుండు త్రిజగద్వంద్యుండు సర్వోత్తముం
డీ కాలమ్మున నెల్లక్షోభముల ఘుటిక్లాంచు గాసిల్లు నీ

లోకంబం దవతార మొందెఁ గరుణాలోలుండు; భాగ్యం
బహో! 1

ఆ రమణర్షి షష్ట్యభిదహాయనపూర్తి మహోత్సవంబు చె
ల్వారును మార్గశీర్ష బహుళాదిఁ బ్రమాదిని; భక్తు లెల్లరున్
శ్రీరమణాశ్రమస్థలిని జేరెద రా శుభవేళఁ బావన
శ్రీరమణాంఘ్రిపద్మములచెంగట; భాగ్యము వారిదే సుమా! 2

పుట్టిరి శ్రీమహర్షు లొక భూసురదంపతి నోముపంటయై;
అట్టితఱిన్ మహాద్భుతమహస్సొక వృద్ధకు సంస్ఫురించెఁ; గ
న్పట్టెను భక్తితన్మయత బాల్యమునందె; పదేఁడువత్సరా
లిట్టులు దాఁట, జ్ఞాన ముదయించి ప్రబోధము సల్పె
నాత్మకున్. 3

కర మాకస్మికరీతి నమ్మెయి సమగ్రం బాత్మసాక్షాత్కృతిన్
బొరయంగల్గె మహర్షి; తొల్ భవములన్ బుణ్యమ్ము
లెంతెంతఁ గూ
ర్చిరో! తన్మానుషవేషధారణ మిలన్ చిద్భానునిన్ డాపఁగా
శరదంభోధరఖండమాత్ర మయి, సంఛాదించి విచ్చెన్ వెసన్.4

తదుపరి వారిఁ గైకొనిన దైవికశక్తియె శోణశైలస
త్పదమున కా కుమారుఁ గొనివచ్చి తదంకమునందుఁ జేర్చెన్;
తదుభయ కేవలైక్య మది తథ్యము; శ్రీయరుణాచలేశ్వరున్
మదిఁ దలపోయుటన్న రమణర్షి స్మరించుటయన్న నొక్కటే.5

సంపూర్ణమ్ముగ నాత్మనిష్ఠ భగవత్సాయుజ్య మావేశమై
ముంపన్, బల్కఁ దలంప రామిని బహిర్బోధమ్ముఁ గోల్పోయి, ని
ష్కంపస్థైర్యమునన్ మహర్షి బహువర్షమ్ముల్ క్షణంబట్లు సా
గింపన్ గల్గెను బావనారుణగిరిక్షేత్రమ్మునం దొంటిమై. 6

మే నెల్లన్ బహుధూళిధూసరితమై మేల్ వాసినన్, దీవ్రపున్
మానమ్మున్ వహియించియుండినను, నిర్మానుష్య మేకాంతమా
స్థానంబందు నివాసమయ్యు, రమణస్వామిప్రభావమ్ము ల
ద్దానన్ జక్క గ్రహించి రొక్క రిరువుర్ తత్త్వప్రబోధార్థులై 7

ఉపదేశమ్ము ననుగ్రహింపవె యటం చొక్కుమ్మడిన్ గాఢభ
క్తిపరుల్ దీనత వేఁడుటన్ రమణమూర్తిన్ మౌన మల్లల్ల మె
త్తపడెన్; నేడు మహర్షి తాను పరమాత్మస్థాన మయ్యున్
గృపన్
దపనుంబోలి వెలుంగు భూజనములోఁ దా నొక్క డన్
తీఱునన్. 8

ఇరువదియొక్క వర్షమున నే రచియించి యనుగ్రహించెఁ దా
నురుపరమోపదేశము లహో! నిరపేక్షమ యే ప్రమాణ, మే
యరమర కానరాదు; ఋషి స్వానుభవంబుల యవ్వి, లెస్సగా
నరయఁగ నాద్యులౌ మునుల వ్యాహృతులన్ బ్రబలించు
నెంతయున్. 9

చరిత నపూర్వ మీ రమణసత్తము నుత్తమతత్త్వసిద్ధి; యే
గురువును గొల్వలే దెపుడుఁ, గోరఁగ లే దుపదేశ మెద్దియున్,

జరపఁగలేదు సాధనల; సన్నిధిమాత్రనె జ్ఞానశాంతు ల
బ్బురముగ నబ్బుచుండు టనుభూతము గాదొకో యెల్లవారికిన్ 10

మౌనవ్యాఖ్యనె సంశయోత్కరముఁ ద్రుంపన్ దక్షిణామూర్తిచం
దానన్ బొల్చు మహర్షి, గుహ్యతమతత్త్వస్ఫారభాషాసుధా
పానానందమహాప్రసాద మొసఁగున్ వ్యాసర్షినిం బోలి, 'నీ
లో ని న్నారసి కాంచుమోయి' యను తొల్ బోధమ్మె
గావించుచున్. 11

అతిసులభమ్మె గావుత మహర్షుల బోధన; యందె యున్న దు
న్నతపరమార్థ; మెట్టి గురునాథుఁడు సిద్ధి కుపాయ మింత సు
న్నితముగఁ దెల్పలేదు; నిజనిర్వృతిఁ దత్ఫలకారితన్ బ్రద
ర్శిత మొనరించి యీ గురువరేణ్యుఁడు తాఁ బురికొల్పు
నెల్లరన్. 12

'ఏ నెవ?' రన్ విచారణ మదెంతయు శాస్త్రసుసమ్మతమ్ము, యా
త్మానుభవాప్తి సన్నిహితమార్గము, నూతనహేతువాదలో
కానుగుణమ్ము యౌచు సహజాశ్రయకాంక్షి మనఃప్రవృత్తి కెం
తే నవలంబనం బొసఁగియే సమకూరుచు నాత్మసౌఖ్యమున్ 13

కర్మము భక్తి యోగమును జ్ఞానము నాఁబడు నాల్గుమార్గముల్
నిర్మలబుద్ధి నారయఁగ నిక్కము భిన్నముగావు, వానిలో
మర్మము హృత్పయోనిధిని మగ్నమొనర్చి మనమ్ము,
నెంతయున్
శర్మము నొందుటే యనుచుఁ జాటును శ్రీరమణర్షి వాక్సుధల్ 14

అల తత్త్వార్థము లెన్నఁబోవము, స్వకీయాధ్యాత్మిక ప్రాప్తముల్
దలఁపంబోము జయంతి నుత్సవమహానందాబ్ధి డెందమ్ము లో
లలనాడన్, భగవత్పదాబ్జముల మ్రోలన్ జేరి, యీ యర్వదేం
డ్లిల నస్మత్సహవాసివైన దయ కెంతే స్వాంత మర్పింపమే. 15

ఈ యవతారమం దిమ్మెయినే చిరకాలమ్ము మమ్ములఁ
గావవయ్యా,
లోక మెల్లను నీవ నౌకగాఁ దరియించు తఱి నీవె యాసన్న
పఱుపవయ్యా,
నెన రుట్టిపడునట్టి నిడుచూపు నుడితీపు నీవె మా తలఁపుల
నిలుపవయ్యా,
జగతి బందెను డిందు శాంతిసౌహార్దము లీ తిరునాళ్ల విడిపింపఁ
దివురుమయ్యా

అనుచుఁ బ్రార్థింపఁగలము జయంతి నుత్స
వామితానందవార్ధి నోలాడునాఁడు
మనగురుని మనతండ్రిని మనమహేశు
శ్రీమహర్షిని, మ్రొక్కి జేజే లొనర్చి. 16

అంతట పై పద్యములను శ్రీభగవానుల యానతిమేరకు హాలులో పఠించితిని. 'అలతత్త్వార్థము లెన్నఁబోవము' అనుపద్యములో మూఁడవచరణమునకు వచ్చుసరికి నాకు భావోద్రేకమువలన కంఠరుద్ధమై వాక్కు రాకుండెను. శ్రీభగవానులును కన్నీరుఁ గార్చిరి. ఎంతో ప్రయత్నముమీఁద ఎట్లో శేషము చదివి

పూర్తిచేసితిని. శ్రీభగవానుల యనుమతిపై ఆ పద్యము లా దినమే "కరుణాపూర్ణసుధాబ్ధి" అను శీర్షికతో ముద్రణమునకుఁ బంపఁబడెను.

ఆ మఱునాటి యుదయము శ్రీభగవానులు ప్రాసంగికముగా మీరాబాయి గురుదర్శనార్థము వెళ్లిన కథ చెప్పిరి. తమగురువు స్త్రీముఖము చూడఁడన్న కారణముతో శిష్యులు ఆమె ప్రార్థనను నిరాకరించిరి. మీరాబాయి ఆశ్చర్యముఁ దెలుపుచూ "ఒక్కఁడే పురుషుఁ డనీ తక్కినయందఱము స్త్రీలమే అనీ అనుకొనుచుంటిని" అని పలికెను. ఈ మాటలను శిష్యులు గురువుకు నివేదింపఁగా, ఆయన వెంటనే మీరాబాయి జ్ఞాని యని గ్రహించి తానే వెలుపలికివచ్చి ఆమెకు నమస్కరించెను.

శ్రీభగవాను లీకథ చెప్పినతర్వాత కొంతసేపటికి సుబ్బలక్ష్మమ్మ అను పురాతనభక్తురాలూ నేనూ ఈ కథను గుఱించి ముచ్చటించుచుండఁగా, మీరాబాయి భాషణ ప్రకారము శ్రీభగవానుఁ డొక్కఁడే 'పురుషుఁ'డని అందుచేత ఆయన షష్టిపూర్తికి విశిష్టసార్థక్యము కలదనీ మాకు తోఁచెను. ఈ భావమును పద్యరూపమున రచింపుమని సుబ్బలక్ష్మమ్మ నాకు సలహా యిచ్చెను. ఆప్రకారమే నేను తిరిగీ యిల్లు చేరిన వెంటనే యీక్రింది రెండుపద్యములు వ్రాసితిని:

పురుషులు షష్టివర్షపరిపూర్తి స్వభార్యనె పెండ్లిగారోకో;
అరయఁగ నిక్క మాంధ్రుమగ లందఱముక్ భువి
నాఁడువారమే!
పురుషుఁడ వీవ యొక్కఁడవ పో! రమణా, సకలస్వకీయులం
బరిణయమాడఁగావలె సుమా మముఁ దావక
షష్టిపూర్తినిన్! 1

నీవే పెండ్లికుమారుఁడ,
నీవే పౌరోహితుండ, నీవె సదస్యం
బీవె క్రియ, మానమంత్రం
బై వఱలెడి నీ వివాహ మననిన్, రమణా! 2

ఈ పద్యములను సుబ్బలక్ష్మమ్మకు చూపించుటకై ఆశ్రమము నకుఁ బంపితిని. కొన్నిదినములతర్వాత ఈ రెండు పద్యములు గూడా పదునాఱుపద్యముల కరపత్రములోఁజేర్చి ముద్రింపఁ బడుచున్నవని ఆశ్రమమువారు తెలుపఁగా నాకు విస్మయము కలిగెను. ఈ పద్యములు ప్రచురణకై గాక కేవలవినోదార్థము వ్రాయఁబడిన వని నేను ఆశ్రమమువారికి మనవిచేసితిని. అందులకు 1939 అక్టోబరు 21వ తేదీ జాబులో ఆశ్రమమువా రిట్లు ప్రత్యుత్తరము వ్రాసిరి:

"నెల్లూరినుండి పంపిన రెండుపద్యములనుగుఱించి మీా యభిప్రాయమును గ్రహించినాము. వాటి యంతరార్థము సార్వజనీనహృదయ మవగాహనచేసికొన్నవాఁడు నిర్ణ

యింపఁగలదు. కావున అవి వినోదలలితమగు రచనమైననూ సహృదయునకు వాటిసారస్యము ఇందువెంట పంపఁబడిన గేయములలోనివంటిది. కరపత్రమునకు 'కరుణాపూర్ణసుధాబ్ధి' అని నామకరణము చేసినాముగదా. మఱి మనము శ్రీభగవానుల యడుగుజాడలనే అనువర్తించు నప్పుడు మనభావములకు అనౌచిత్యదోష మెట్లాపాదింపఁగలదు?"

ఆ లేఖలో శ్రీభగవానుల "అక్షరమణమాల"నుండి యీక్రింది నాలుగుచరణములు "ప్రతిధ్వని యిచ్చిన ప్రథమాలాపనలు" అను సార్థకశీర్షికతోఁ జేర్పఁబడెను:

"నను@ జెఱిపి యిపుడు ననుఁ గలియక విడు
టిది మగతనమొక్కొ! అరుణాచలా"
"ఏటి కీ నిదుర? న న్నితరులు లాఁగఁగ,
ఇది నీకు న్యాయమా? అరుణాచలా"
"తాఁకి కృపాకరము ననుఁ గలియకున్న,
నిజము, నశింతుఁ, బ్రోవు మరుణాచలా"
"రేయుంబవలు లేని బట్టబయటి యింట
రమియింపఁగా రమ్ము, అరుణాచలా".

పై రెండుపద్యములను "షష్టిపూర్తిచదివింపులు" అను శీర్షికతో "కరుణాపూర్ణసుధాబ్ధి"కి అనుబంధముగా ముద్రించిరి. ఆ కరపత్రప్రతులు తెలుఁగుభక్తుల కందఱికి షష్టిపూర్తిమహోత్స

వాహ్వానపత్రికలతోఁగూడ పంపఁబడెను. డిసెంబరు 27వ తేదీ మహోత్సవసందర్భమున చెంచుకృష్ణమ్మ అను సంగీతనిపుణు రాలగు భక్తురాలు ఆ కరపత్రమును శ్రీభగవానుల సన్నిధాన ములో పఠించెను; కాని "షష్టిపూర్తి చదివింపులు" మాత్రము వదలిపెట్టెను. అందుమీఁద శ్రీభగవానులు మందహాసముతో నా కిట్లు సెలవిచ్చిరి:

"ఆపద్యములందు స్త్రీపురుషవిభేదమున కతీతమయిన యాధ్యాత్మికాంతరార్థమును ఆమె గ్రహింపలేదు. కావున తాను స్త్రీనని అనవసరసంకోచము నొందినది!"

1939 క్రిస్టమస్ సెలవులలో నేను ఆశ్రమము చేరుకొను నప్పటికే షష్టిపూర్తిపండుగ ప్రారంభమైనది. ముఁదటివార మంతా ఒకే పండుగ. అది డిసెంబరు 27వ తేదీ మహోత్స వముతో పూర్తియయ్యెను. నేను ఆశ్రమము చేరినప్పుడు తత్పూర్వజ్వరఫలితముగా తీవ్రమైన పార్శ్వపునొప్పితో బాధ పడుచుంటిని. సుప్రసిద్ధాంధ్రకవి, హోమియోపతివైద్యుఁడు సోదరభక్తుఁడు ఐన శ్రీ చింతాదీక్షితులు రెండుదినములు మం దిచ్చిరి. కాని నొప్పి తగ్గలేదు. మూఁడవదినము ఉదయము అమ్మగుడి యెదుట అరుగుమీఁద శ్రీభగవానుల సన్నిధానములో నేను కూర్చుండియుండఁగా శ్రీ యం. వి. రామస్వామయ్యరు నాకు స్వాగతము చెప్పుచూ నా ముఖ ములో బాధచిహ్నములను గమనించి, బిగ్గఱగా "ఏమి

జబ్బుగా ఉన్నావు?" అని ప్రశ్నించిరి. నేను బయటవచ్చి నా బాధనుగుఱించి ఆయనచెవిలో చెప్పితిని. శ్రీభగవానుల కేల చెప్పలేదని ఆయన నన్ను మందలించెను. నేను తిరిగీ నా యాసనమునకు రాఁగానే శ్రీభగవానులు రామస్వామయ్యరుతో నేను మాటాడుచుండిన దేమని యడిగి నా జబ్బునుగుఱించి దాని వైద్యమునుగుఱించి అన్ని వివరములను నావలన ఆలకించిరి. బాధతోఁ గూర్చుండుట సాధ్యము కానందున, నేను వెళ్లి పుస్తకాలయములో ఒకబీరువా వెనుక పడుకొంటిని. అప్పుడు సుమారు 10 గంటలు. ఆశ్రమపరిచారకుఁ డొకఁడు ఎవరికొఱకో కాఫీ తెచ్చి ఆయన అచ్చట లేనందున ఆ కాఫీ త్రాఁగుమని నన్ను బలవంతపెట్టెను. అది త్రాఁగిన తత్క్షణమే పార్శ్వపునొప్పి తటాలున వదలిపోయెను. తర్వాత మరల రాలేదు. ఇదియు శ్రీభగవానుల యనుగ్రహమహిమలలో మఱియొకటి అని నేను భావించితిని.

'షష్టిపూర్తి'నాఁడు నేను శ్రీభగవానులమీఁద ఆఱు పద్యములు కట్టి, నా చేవ్రాలు లేకుండ, ఆనాఁటి తపాలాలోఁ జేర్చిపెట్టితిని. తమకన్ను ఆ వ్రాతపైఁ బడఁగానే శ్రీభగవానులు సానుగ్రహమందహాసముతో నావంకఁ జూచిరి. వాటిని జదువుకొని వారు నన్నుఁ బిలిచి "ఈపద్యములను ఎక్కడ ఎప్పుడు పోస్టులో వేసితిరి?" అని యడిగిరి. "నాహృదయము నుండి- ఈయుదయమే!" అని నేను బదులుపలుకఁగా శ్రీభగ

వానులు నవ్విరి. ఆ పద్యములనూ శ్రీ కె. వైద్యనాథయ్యర్ అను నుపాధ్యాయభక్తుఁడు రచించిన యింగ్లీషుపద్యములనూ బిగ్గఱగాఁ జదువుమని శ్రీభగవానులు నా కానతిచ్చిరి. నా పద్యముల నిట్లు పఠించితిని:

## షష్టిపూర్తి మహోత్సవషట్కము

ప్రత్యక్షదైవ మగుచున్
నిత్య మ్మరుణాచలమున నేత్రోత్సవమా
సత్యస్వరూప, నిఖిల
స్తుత్యా, యో రమణ, నీకు జోహార్లిడెదన్. ౧

ఆకృతియు గుణము లేకయె
సాకారుఁడు గుణియుఁ బోలె, సాక్షాత్కారం
బీకరణి నొసఁగి భక్తుల
సాకెదు నీ కరుణ నెంత సన్నుతియింతున్! ౨

ఉత్సాహ మడర భక్తులు
సోత్సుకులై షష్టిపూర్తి శుభతరకల్యా
ణోత్సవ మిదె జరిపింతురు;
వాత్సల్యరసప్రపూర్ణ, వర్ధిలు మెప్పున్ ౩

ఈ యఖిలలోక భాగ్యము
నీ యరచేతిది గదయ్య, నిరుపమచరితా,

మా యెల్లర యాయువులను
మా యయ్యా, నీవె తాల్చి మనఁగదె చిరముగా. ౪

నీవు నిత్యుఁడవే యయ్యా, నేను పామ
రుఁడ నగుటఁ జేసి యేమేమొ నుడివినాఁడ
భ్రాంతివశమున నినుఁగూర్చి, రమణ, నీదు
నిత్యతత్త్వమ్ము నాహృది నిలుపవయ్యా. ౫

జయము నిశ్శేషభువనరక్షణచణునకు!
జయ మమలసచ్చిదానందసాగరునకు!
జయము శోణాద్రితేజఃప్రసారమునకు!
జయము రమణమహర్షికి! జయము! జయము! ౬

పై పాటలో నాలుగవపద్యము నేను జదువుచుండఁగా శ్రీభగవానులు అందలి ప్రార్థనకు నిజానంగీకారసూచనగా తల యూఁచి వ్రేళ్లు విదిల్చిరి. తదనంతరసంభవమునుబట్టి అది విష్యసూచకమని తెలియుచున్నది. శ్రీభగవానులు ఆప్రార్థనకుఁ గేవలవిరుద్ధ మొనర్చినారా అనిపించుచున్నది. వారు మన యెల్లర యాయువులను పెంచుటకై తన యాయుష్యమును కుంచించికొన్న ట్లున్నది!

మఱునాఁటి వేకువ మామూలుప్రకారము "శ్రీరమణచత్వారింశత్" పారాయణ జరుగుచుండఁగా,

"భువనభూపతే ర్భగవతః కృతే
భవసి పాచకో యమవతాం పతే"
"నరపశూ నిమా నహామి తాడయ౯
పరశివాదనం వితనుషే. పచ౯"

అను శ్లోకములు వచ్చుసరికి శ్రీభగవానులు పఠనము నించుక ఆపి నాతో ఇట్లనిరి:

"చూచినారా ఇక్కడ నాయన నన్ను శివునికి వంటవానిఁగా వర్ణించినారు! ఈ వంటవాఁడు నరపశువులను వారి యహముసఁ గొట్టి వారితో శివునికి ఆహారము వండునట!"

సామాన్యార్థములోఁగూడ శ్రీభగవానులు పాకనైపుణ్యమున సాటిలేనివారు గావున ఈయుపమానము రెండువిధముల ఒప్పియున్నదని నే నంటిని.

ఆ మఱునాఁడు రావుబహద్దరు ఎ. దేవరాజమొదలియార్ అను ప్రముఖన్యాయవాది, సన్నిహితభక్తుఁడు శ్రీభగవానులు తనభక్తులలో హెచ్చుతక్కువలు ఎట్లు పాటింతురని ప్రశ్నించెను. శ్రీ మొదలియార్ మఱియు నిట్లనెను. "ఉదాహరణమునకు, సుబ్బరామయ్య ఇతరులకన్న కొంచెమెక్కువ అనుగ్రహమును బొందుచున్నాఁడనీ ఈ కూటములో పురోహితస్థానమున నున్నాఁడనీ చెప్పిన తప్పగునా?" ఇందులకు శ్రీభగవానులు మందహాసముతో ఇట్లు బదులుపలికిరి:

"నాకు ఏ భేదమును లేదు. అనుగ్రహప్రవాహము సముద్రమువలె ఎప్పుడూ పరిపూర్ణమై యున్నది. దానినుండి ప్రతియొక్కఁడు తన పాత్రకొలఁది గైకొనుచున్నాఁడు. ఒకలోటా తెచ్చినవాఁడు తాను ఒకబిందె తెచ్చినవానితో సమానముగా తీసుకోలేకపోవుచున్నానే అని ఫిర్యాదు చేయుట యేమి న్యాయ్యము?"

కడపటిదినము వేకువన నేను బయలుదేఱుటకుముందు శ్రీభగవానులు మురుగనార్ 'సన్నిధిమురై'నుండి రెండు పద్యములను జదివి అర్థముచెప్పిరి. నారైలుబండి కాట్పాడిలో ఆగినప్పుడు నేను ఆపద్యభావములను తెలుఁగుపద్యములుగా ఇటు అల్లుకొంటిని: ఆవల కావల

"ఆవల కావల అనునది
యీావల కీవలనె యుండె హృదయములోనన్
దా వెలుఁగు నాత్మవస్తువె
శ్రీవేంకటరమణుఁ; డతని సేవింపఁగదే."

## జాగ్రత్త!

"రాయియే యని రత్నముఁ ద్రోయునట్టి
కోడివలె, నీవుఁగూడ నీ తోడి నరుఁడె
యనుచు నిరసింతు వేమొ యీా యరుణశైల
రమణనామపరాత్ము, జాగ్రత్త సుమ్ము!"

మఱియు నీక్రింది వీడ్కోలుపద్యమునుగూడ అప్పుడే రచించితిని:

నేను - మేను

నే ననునది నీకడనే
తా నిలువఁగ మే నొకండె తరలినయది; యీ
'నేను'ను మేనును నేకము
గా నొనరుపఁగలది నీదు కరుణయె, రమణా.

పై మూఁడుపద్యములను తపాలమూలమున శ్రీభగవానులకు నివేదించుకొంటిని.

నేను తిరిగి యిల్లు చేరుకొన్న క్రొత్తలో నాకు శ్రీభగవానుల యనుగ్రహమువలన ఒక యద్భుతానుభవము కలిగెను. అదివేకువవేళ. నేను చాలసేపు ధ్యానములోఁ గూర్చుండి యుంటిని. క్రమక్రమముగా నేను తేలికనై తేలిపోవుచున్నట్లు తోఁచెను. కడపటికి నేను గాలిలో తేలియాడు నొక యాకవలె తేలిక. నైతిని, దేహస్మృతిని గోల్పోయితిని. కానీ ప్రజ్ఞ మాత్రము పూర్ణముగా నుండెను. ఆకాశములో ఎంతో యెత్తున ఎగిరిపోవుచుంటిని. కొంతసేపటికి ఒక పర్వతరాజమూ దానిముందు దేదీప్యముగఁ బ్రకాశించు పెద్దగోపురములూ కానవచ్చెను. ఆ స్థలము తిరువణ్ణామల యని తెలిసికొంటిని. కొద్ది క్షణాలలో ఆశ్రమముమీఁద దక్షిణభాగమున గోశాల

వద్ద ఎగురులాడుచుంటిని. నేలపై కొద్దియడుగుల యెత్తువఱకు దిగితిని. అచ్చట శ్రీభగవానుల దర్శన మయ్యెను. వారు ఒక బ్యాటరీదివ్వెను కేలం గొని దాని కాంతిని ఆ సమీపములో నున్న పొదలలో ప్రసరింపంజేయుచూ తొంగిచూచుచుండిరి. నేను పైనుండియే శ్రీభగవానులకు నమస్కరించితిని. వెంటనే చాలాయెత్తుకు లేచి వెనుకకు ఎగిరివచ్చితిని. ఆ వాయుమార్గ మధ్యమున క్రింద ఒకచోట నేను ఏవో పెద్దమంటలు గంటిని, తుపాకిప్రేలుడులు వింటిని. ఈ వాయుప్రయాణము సాగించుచూ కడపటికి నా సొంతపట్టణమును గుర్తించితిని. అచ్చట ఆగి క్రిందికి దిగి మరల మా యింటిలో నడిమిహాలులో నా యాసనమునకు చేరుకొంటిని. తత్క్షణమే నాకు దేహస్మృతి కలుగంగా, కన్నులు తెఱచితిని. దేహమే యదృశ్యమై మరల కనిపించుట తప్ప నా ప్రజ్ఞమాత్రము నిరంతరాయమై యేక ధారగా నుండెను. మఱునాఁడు పత్రికలలో తిరువణ్ణామల కాంచీపురములకు మధ్య ఆర్కాట్ అను పట్టణములో పెద్ద పోరాటములు దహనములు ఆ రాత్రియే జరిగినట్లును పోలీసు వారు గుంపును జెదరంగొట్టుటకై కాల్పులు జరిపించినట్లును నేను జదివితిని. అంతకు ముందుగానీ తర్వాతంగానీ అటువంటి అనుభవము నా కెప్పుడూ కలుగలేదు. శ్రీభగవానులు తన ప్రత్యక్షదర్శనమును నాకుం బ్రసాదించుటకై సమకూర్చిన యనుగ్రహలీలామాత్రముగ దానిని భావింతును.

1940 వసంతారంభమున ఆశ్రమమువారు "ఉన్నది నలుబది" గ్రంథమును క్రొత్తకూర్పునకు తయారుచేయుమని

నన్నుఁ గోరిరి. తొలికూర్పునందు శ్రీభగవానుల గద్యమూ శ్రీగ్రిద్దలూరు నరసింగరావు పద్యమూ ఉండెను. శ్రీనరసింగ రావు రచన శ్రీకావ్యకంఠులచేతను శ్రీభగవానులచేతను సరి దిద్దఁబడియుండెను. ఇవి గాక మఱియురెండు ఆంధ్రానువాద ములు అముద్రితములుగ నుండెను; ఒకటి కీర్తిశేషులు పొణకా శేషురెడ్డిగారిచే వృత్తములుగా అనువదితము, రెండవది శ్రీఓరుగంటి వేంకటకృష్ణయ్యగారిచే మంజరీద్విపదరూపమున అనువదితము. ఈ పరిస్థితులలో క్రొత్తకూర్పు నేర్పఱుచుట క్లిష్టతరసుకుమారసమస్య అగుటంజేసి నేను స్వతంత్రించి పరిష్కరింపఁజాలకుంటిని. కావున నేను వేసవిసెలవులకు ఆశ్రమము వెళ్లినప్పుడు ఈ యనువాదముల నన్నింటినీ దీసుక పోయి నా చిక్కును శ్రీభగవానులకు విన్నవించితిని. ఇదిగాక అనుబంధములో పద్యములను అసలుగ్రంథమునకు సమాన ముగా వచ్చునట్లు నలుబదివఱకు పొడిగింపవలెననీ శ్లోకరూప సంస్కృతానువాదమునుగూడ గ్రంథములోఁ జేర్పవలెననీ సంకల్పించిరి. శ్రీభగవానులు ఈ సమస్యకు యథోచితమైన పరిష్కారమును సెలవిచ్చిరి. ఎడమపుటయందు తెలుఁగు గద్యమూ దానిక్రింద సంస్కృతశ్లోకమూ ముద్రింపవలెను. వాటికి ఎదురుగా కుడిపుటయందు ద్విపదలూ వృత్తములూ ముద్రింపవలెను. అసలు నలుబదిపద్యములకు శ్రీగ్రిద్దలూరు నరసింగరావు ద్విపదలు ముద్రింపవలెను. 'సూక్తిసుధ'యను నూతననామకరణ మొందిన 'యనుబంధము'నకు శ్రీఓరుగంటి

వేంకటకృష్ణయ్యమంజరీద్విపద ముద్రింపవలెను. అసలు గ్రంథమూ అనుబంధమూ రెంటికిని వృత్తములు కొన్ని గ్రిద్దలూరు నరసింగరావువి కొన్ని పోణకా శేషురెడ్డివి ముద్రింప వలెను. ఇట్లు వివిధానువాదములను శ్రీభగవానులు సరితూచి నట్లు నిబంధించిరి. క్రొత్తకూర్పు సంపూర్ణముగ జయప్రద మయ్యెను. జ్ఞానియొక్క సమత్వబుద్ధికీ కార్యదక్షతకూ ఇది చక్కని దృష్టాంత మయ్యెను.

ప్రాసంగికముగా శ్రీభగవానులు నరసింగరావు అను వాదములో 23వ పద్యమునుగుఱించి యిట్లు చెప్పిరి. తమిళ మాతృకలో "ఈ దేహము 'నేను' అనదు" అని యుండఁగా, శ్రీభగవానులు నరసింగరావు అనువాదమునందు

" 'నే' నని పలుక దీ పీనుఁగ తనువు"

అని 'పీనుఁగ'అను విశేషణమును గలిపిరి. దీనిభావము శ్రీభగ వాను లిట్లు విశదీకరించిరి:

"మనము సజీవులమై యున్నప్పుడుఁగూడా ఈ మన దేహము పీనుఁగే. అది అంత కాంతివంతముగా హుషా రుగా కనుపడుటకుఁ గారణము దానిలో మనయాత్మ యునికియే."

శ్రీభగవానులు మఱియొక వింత యుదంతమునుగూడ నుడివిరి. నాయన "ఉన్న దినలుబది"తమిళమును సంస్కృతశ్లోక

ములుగా అనువదించునప్పుడు 12వ పద్యములో 'జ్ఞానమూ అజ్ఞానమూ లేనిదే నిక్కమైన జ్ఞానము' అను వాక్యమును ఆక్షేపించెనట. నాయన తానే "ఉపదేశసారము"లో 27 వ సంఖ్యగల

"జ్ఞానవర్జి "తాజ్ఞానహీనచిత్
జ్ఞాన మస్తి; కిం జ్ఞాతు మన్తరం?"

అను శ్లోకమును ఆమోదించి వ్యాఖ్యానించియుండిన విషయమును శ్రీభగవానులు ఆయనకు జ్ఞాపకముచేసిరట. అంతట నాయన అంగీకరించెనఁట. ఇది చెప్పుచూ శ్రీభగవానులు

"దీనినిబట్టి ఉత్తమవిద్వాంసునిమీఁదఁగూడ మాయా శక్తి కెట్టి ప్రభావము కలదో తెలియుచున్నది."

అని సెలవిచ్చిరి.

కవీ భక్తుఁడూ అగు శ్రీనారునాగనార్యుఁడు తేట గీతిలో రచించిన "శ్రీరమణగీత" ఆంధ్రానువాదమును సరి చూడుమని ఆశ్రమమువారు నన్నుఁ గోరిరి. నేను సంతోష ముతో దానిని జదివి ఆ ప్రతిని తిరిగీ ఆశ్రమమునకు బంపు కొంటిని. అది తర్వాత "ఆంధ్రరమణగీత" అను శీర్షికతోఁ బ్రచురింపఁబడినది.

ఈకాలమున శ్రీభగవానులతోఁగూడ పాకశాలలో పనిచేయు నపూర్వమహాభాగ్యము నాకు లభించెను. పనివేళ

రాత్రి $2\frac{1}{2}$ గంటలనుండి 4 గంటలవఱకు. శ్రీభగవానులు సరిగా 2-30 కి వత్తురు; కొంతసేపు పరిచారకులతో భక్తులతోఁగూడఁ గూరగాయలు తఱుగుటయందుఁ గడపుదురు; అటుపిమ్మట పాకశాలలో ప్రవేశించి ఉదయఫలాహారమునకు పులుసుగానీ పచ్చడిగానీ తయారుచేయుదురు; ఒక్కొకప్పుడు ఏమైనా భక్ష్యవిశేషములుగూడ చేయుదురు. సబ్ రిజిస్ట్రారు శ్రీ ఆర్. నారాయణయ్యరూ, పుస్తకాలమోదోగ్యి శ్రీ కల్యాణ సుందరమయ్యరూ నేనూ శ్రీభగవానులకు తోడ్పడు చుంటిమి. మొట్టమొదట నాకు ఈపని యేమీ తెలియదు. శ్రీభగవానులు ప్రొయ్యివద్ద విశేషముగా చెమ్మటఁ గార్చు చుండుటఁజూచి నేనువారికి విసనకఱ్ఱ వీవఁ బ్రయత్నించితిని. కానీ శ్రీభగవానులు సమ్మతింపలేదు. వారు తమకు ఏవిధమైన యాధిక్యమును జూపుట కొప్పుకొనరు. నేను విసరుట నిలిపితిని. కానీ శ్రీభగవానుల యవధానము పనిలో మగ్నమైనప్పుడు నేను మరల మెల్లగా విసరుట కారంభించితిని. శ్రీభగవానులు నావైపు చూచి నవ్వుచూ ఇట్లనిరి: "ఓహో! నీవు నన్నే మార్చి విసరఁ గోరుచున్నావు. కానీ అదిగూడా చక్కగా చేయుట నీకు చేతఁగాలేదు. నీకు నేర్పించెదను." ఇట్లు పలుకుచూ వారు నాచేయి పట్టుకొని చక్కగా విసరుట నేర్పించిరి. ఆహా! అప్పటి నా పారవశ్యము వర్ణనాతీతము. ఆ యదృష్టము నకుఁ గారణమైన నా యజ్ఞానమును గొనియాడితిని. వంటింటి నుండి ప్రక్కగదికి పోయి అచ్చట ఆ కదంబమును రుబ్బుచుం

టిమి. అక్కడఁగూడా మొట్టమొదట రుబ్బుడుపాత్రమును బట్టుకొని త్రిప్పుట నాకుచేతఁగాకుండెను. శ్రీభగవానులు వారిచేతిని నాచేతిపై నుంచి రుబ్బుడుపాత్రముచు చక్కఁగాఁ ద్రిప్పించిరి. మరల ఏమానందము! నా యజ్ఞాన మెంత యదృష్ట వంతము! పనిపూర్తియైనపిదప పళ్లెమునుండి పదార్థమునించుక తీసుకొని దానిలో కొంచెము తాము రుచిచూచి మిగత మాకు రుచిచూచుట కిచ్చుచుండిరి. ఒక్కొక వేళ మేము చేతులు కడుగుకోనప్పుడు వారే స్వహస్తముతో మా నోటిలో పెట్టుదురు. అది మా పారవశ్యమునకు పరమావధి. అంతట వారు తిరిగీ హాలుకు గబగబ వెళ్లి సోఫాపై ఒత్తగిలి పరుండి బ్రాహ్మణులు పారాయణకు వచ్చుసరికి తూఁగుచున్నట్లు కనిపింతురు. శ్రీభగవానులకు అంత సమీపమునఁ గూర్చుం డుట, వారితో ముచ్చట లాడుట, వారి పరిశ్రమానుగ్రహాఫలి తములోఁ బాల్గొనుట ఇది యెంతటి భాగ్యము! ఎంతటి యదృ ష్టము! నిక్కముగా మా ముప్వురి జీవితగోపురములకు అదే స్వర్ణకలశము. దాని సంస్మరణమే యెల్లవేళల మా జీవిత పర్యంతము మాకు బ్రహ్మానందము.

కానీ శ్రీభగవానులతో ఇట్లు పనిచేయుట సంతో షావహ మయ్యునూ కత్తిపై సాముచేయుట వంటిది. శ్రీభగ వానులు కరుణాపూర్ణసుధాబ్ధులే గాక నిశితక్రమశిక్షకులు గూడా. పనియందు దేపాటి మాంద్యమునూ వారు సహింపరు.

ప్రతిదీ పూర్తిగా బాగుండవలెను. ఏదీ వ్యర్థము కాఁగూడదు, చెడిపోఁ గూడదు. వారి యాదేశములను నిండుశ్రద్ధతో గమ నించి చక్కగా నెరవేర్చవలెను. ఒకరాత్రి న్యాయవాదిభక్తుఁ డొకాయన తానుగూడా ఈ పనిలో పాల్గొనెదనని పట్టు పట్టెను. పులుసుపాత్రను దీసుకరమ్మని అతనితో శ్రీభగ వానులు చెప్పిరి. అది తెచ్చుటలో పాత్ర తొణికి కొన్నిబొట్లు పులుసు చిందిపోయెను. వెంటనే శ్రీభగవాను లిట్లు మందలిం చిరి: "మీరు కోర్టులో వాదించుటకు తగుదురే గానీ యీ పనికి తగరు:" పాప మాయన మరల ఎప్పుడూ ఈ పని చేసె దనని రాలేదు. ఒక్కొకరికీ ఒక్కొకపని విధింపఁబడును. అది యతఁడు శ్రీభగవానుల చూపుమాత్రముననే గ్రహింపవలెను. ఉదాహరణ: నాపని ఉప్పును ఉదకమును దెచ్చియిచ్చుట. శ్రీభగవానులు నావైపు చూచినపుడెల్ల నేను ఆ రెంటిలో ఏది కావలెనో గ్రహించి వెంటనే తేవలెను. సాధారణముగా మేము రాత్రి రెండుగంటలకే లేచి ప్రక్షాళనములు పూర్తిచేసి కొని శ్రీభగవానులు వచ్చుటకుముందే సిద్ధముగా నుందుము. కానీ ఒకరాత్రి నేను అయిదునిమిషము లాలసించితిని. నేను వచ్చుటకుముందే పని ప్రారంభమై జరుగుచుండెను. శ్రీభగ వానులు పాకము రుచిచూచి ఉప్పు కొంచె మెక్కువైనదని చెప్పుచూ నావంకఁదిరిగి మఱియు నిట్లనిరి: "నీవు రానందున, ఉప్పు వేయునప్పుడు నిన్ను తలఁచుకొంటిని! అదే యీ యెక్కువకు కారణము." నా యాలస్యమునకు శ్రీభగవానులు

మండలించుచుండె నట్టిది. మఱియొకరాత్రి పాకములో పులుపు కొంచెము మెక్కువ అయ్యెను. శ్రీభగవానులు దానిని రుచిచూచి నవ్వుచూ ఇట్లు పలికిరి: "పులుపు పైత్యమునకు మంచిమందు. ఇచ్చటికి వచ్చువారికి కొద్దియో గొప్పో పైత్య ముండును. కాబట్టి దీనితో ఆ పైత్యము పాఱిపోవును!" కానీఅట్టి పొరపాట్లు చాలా అరుదు. సాధారణముగా భక్ష్యములు దివ్యమైన రుచి కలిగియుండుట ఆశ్రమములోని యెల్లవారి కనుభవమే. శ్రీభగవానుల హస్తస్పర్శమాత్రముననే వాటి కంత కమ్మదనము వచ్చెనా అనిపించును. అది వాటిపై అమృతము ప్రోక్షించినట్లే.

పనిచేయుచున్నప్పుడు ప్రాసంగికములగు సామాన్య భాషణల వ్యాజమున పరమార్థమును బోధించుట శ్రీభగవానుల పద్ధతి. ఒకరాత్రి ఒకసీమకూరఁ దఱుఁగుచుండఁగా పరిచారకుఁ డొకఁడు "ఈ కూర మన ఆశ్రమము తోటలో వేసి పెంచఁగలిగిన ఎంత బాగుండును!" అనెను. వెంటనే శ్రీభగవాను లిట్లు జవాబిచ్చిరి:

"అది యెచ్చట పెరిగిన దనుకొన్నావు? మన తోటలోనే. కాకున్న మన కెట్లది వచ్చును? వాస్తవముగా ప్రపంచములో అన్నితోటలూ మన ఆశ్రమము తోటలే!"

మఱియొకమాఱు పులుసు ఉడుకుచుండఁగా శ్రీభగవాను లిట్లు పలికిరి:

"అది పూర్తిగా ఉడుకవలెను. ఆ పొంగంతా అణఁగి పోవలెను. అప్పుడే అది పక్వమై స్వాదువగును."

మఱియొకరాత్రి సుమారు మూఁడు గంటలప్పుడు మేము శ్రీభగవానులతోఁగూడా పాకశాలకు ప్రక్కగదిలో పచ్చడి రుబ్బుచుంటిమి. ఒకాయన వచ్చి హాలువద్ద నాకొఱకు ఎవరో కొందఱు కాచుకొనియున్నారని చెప్పెను. నేను వెళ్లి చూడఁగా వాళ్లు నాయుడుపేటనుండి వచ్చిన స్త్రీలూ పిల్లలూ అని తెలిసినది. వాళ్లు గిరిప్రదక్షిణము పోవుచూ శ్రీభగవానుల దర్శనాశీస్సులను అపేక్షించిరి. ఆ సమయమున శ్రీభగవానుల దర్శనము వీలుపడదని వాళ్లతో ఖండితముగా చెప్పివేసి నేను లోపలికి వెళ్లితిని. నన్ను చూడఁగానే శ్రీభగవానులు ఏమి సంగతి?" అని యడిగి నావలన విని యిట్లనిరి:

"పాపము! వాళ్లు ఆశాభంగముతో ఎందుకు పోవలెను? వాళ్లను ఈ ప్రక్కగుమ్మమునకు రమ్మని చెప్పండి. అచ్చట వాళ్లను కలసికొంటాను."

ఆ ప్రకారమే నేను వాళ్లకు చెప్పఁగా వాళ్లు అచ్చటికి పరుగిడిరి. శ్రీభగవానులు ద్వారబంధముపై నిలుచుండిరి. నడుమ పరిచారకుఁ డెవ్వఁడూ లేఁడు. ఆ జట్టువాళ్లందఱూ శ్రీభగవానుల పాదములపై వ్రాలి వాటిని కన్నుల నద్దుకొని కన్నీటితోఁ గడిగిరి. శ్రీభగవానులు అనుగ్రహము వర్షించునట్లు

వాళ్లను కటాక్షించుచూ నిలబడిరి. అప్పుడు నేను ఆ జట్టు వాళ్లు శ్రీభగవానుల యనుగ్రహము నీట్లు కొల్లగొట్టుటకు వారి యదృష్టవిశేషమును గొనియాడుచూ శ్రీభగవానులు 'కరుణాపూర్ణసుధాబ్ధి' అని కీర్తించుటలోఁ గల భావమును చక్కఁగా గ్రహించితిని.

నాలుగుదినముల తర్వాత ఇంటినుండి నాకు వచ్చిన జాబులో నాకొమారుఁడు రమణప్రసాదము ఆకస్మికముగా పడినందువలన మెడక్రింది యెముక విఱిగినట్లునూ ఆస్పత్రిలో చికిత్స పొందుచున్నట్లునూ ఉండెను. శ్రీభగవానులకు నేను ఆజాబును చూపఁగా వారు తమ మెడక్రింది కుడియెముకను నిర్దేశించి తడవికొనుచూ అది కొద్దివిఱుగుడుగా నుండుననీ పసిబిడ్డ యొడలిలో సులభముగా కుదురుకొనుననీ సెలవిచ్చిరి. దానిని వినినంతట నాకు పూర్తిగా ధైర్యము గలిగి, అటుపయి నేను దానినిగూర్చి చింతించనే లేదు. ఒకనెల కడచిన వెనుక నేను ఇంటికి మరలివచ్చి చూచినప్పుడు సరిగా శ్రీభగవానులు నిర్దేశించిన తావుననే ఎముక విఱిగి చాలవఱకుఁ కుదురుకొనియుండెను. అప్పుడు నేను ఈ రమణప్రసాదము సాక్షాత్తు శ్రీరమణుల ప్రసాదమే అనునంశమును జ్ఞప్తికిఁ దెచ్చుకొంటిని.

ఒకదినము శ్రీభగవానులు 1931 చైత్రపౌర్ణమినాఁడు జరిగిన యుదంతమును స్మరించిరి. ఆ పౌర్ణమి రాత్రి మిక్కుట

ముగా భుజించిన యనంతరము భక్తుఁ డొకఁడు అవ్వైయార్ పాటను ఉదాహరించెనఁట. దానియందు జీవుఁడు కడుపును గూర్చి యిట్లు మొఱపెట్టును:

"కుడుపు నొకనాఁటనేనియు
నుడుగవ, మఱి రెండునాళ్ల యోగిర మిడినన్
బడయవ, నా యిడుమఁ గనవ,
కడుపా, నీతోడ నునికి కష్టం, బకటా!"

అది విని శ్రీభగవానులు దాని ననుకరించుచూ కడుపు జీవు నితో మొఱ పెట్టుకొనుచున్నట్లు బదులుపాట నిట్లు రచించిరఁట.

"గడెయైన నిడవు విడుమరఁ
గడుపగు నా; కుడుగ వొక్కగడెయుఁ గుడుపు; నా
యిడుమ నెఱుఁగ వొకనాఁడును;
గడించి నీతోడ నునికి, కట్టడి జీవా!"

ఇంచనే నేను ఆ రెండుపాటలను పై రెండు పద్యములుగా ఆంధ్రీకరించితిని.

ఆ సంవత్సరము మహాపూజామహోత్సవము మేనెల 30 వ తేదీ వచ్చెను. అందుకు ముందటిదినము శ్రీభగ వానులు అమ్మగుడిలోనూ తిరుశిరపల్లి ప్రాచీనదేవాలయము లోనూ ఆరాధ్యదైవత మగు మాతృభూతేశ్వరుని గుఱించిన

మాతృభూతేశ్వరునకు అఱవములో పర్యాయ నామము 'తాయుమానవర్' అనఁగా 'తల్లియైన దేవుఁడు' శ్రీభగవానులు తల్లిసమాధిపై లింగమును బ్రతిష్ఠించినప్పుడు శ్రీ కావ్యకంఠగణపతిశాస్త్రులు దివ్యస్ఫురణతో దానిక 'మాతృభూతేశ్వర' నామకరణ మొనర్చిరి. ఆ యితిహాస మునూ ఆ నామకరణౌచిత్యమునూ ఉద్ఘాటించుచూ మహా పూజామహోత్సవమునాఁటికి నేను రచించిన యాంగ్లవ్యాస ములో ఇట్లు వ్రాసితిని:

"ఇది పురాణగాథ. ఒకభక్తురాలు కాన్పునొప్పులు పడు చుండఁగా, ఆమె కుపచరించుటకు మంత్రసాని యెవ్వతెయు లేకపోయెను. అప్పుడు ఈశ్వరుఁడే ఆమెతల్లి రూపమున అవతరించి కాన్పుచేసి యదృశ్యుఁ డయ్యెను. అందుచేత ఈశ్వరుఁడు మాతృభూతేశ్వరుఁడుగా ఆరాధ్యుఁ డయ్యెను. అదేవిధమున భూదేవి మాయాగర్భముఁ దాల్చి ఆత్మవి చారమును గనుటకు కష్టపడుచుండఁగా, ఈశ్వరుఁడు తల్లి యవతార మెత్తి ఆత్మవిచారపుంభావమైన శ్రీభగ వానుల కాన్పు చేసెను. కావున తల్లిని మాతృభూతేశ్వర రూపమున ఆరాధించుట ఎంతయు ఉచితమై యున్నది."

ఈ భావమునే మహాపూజాదివసమున ఈ క్రింది పద్యముగా రచించితిని:

"భక్తురాలికిఁ గాన్పుచేసిన పట్టునన్ జననీత్వమున్
శక్తిమై గయికొంటివి; విత్తటిఁ జానవై జగదంబవై

డి క్తతిఁ నుతిఁ గొన్న మా గురుదేవుఁ గంటివి; నిన్ను సం
సక్తచిత్తమునఁ భజించెద, మాతృభూతమహేశ్వరా!"
ఆ మఱునాఁడు శ్రీభగవానులు "అరుణాచలమాహాత్మ్య
ము"లో దేవి అసురునకుఁ బంపు తీవ్రమైన హెచ్చరిక నిట్లు
ద్ధరించిరి:-

"అత్ర ధర్మాత్మనాం వాసః శివభక్తిమతాం సదా
పరపీడాప్రసక్తానాం భవే ద్రోగశతావృతిః;
అత్ర దుర్మనసాం వీర్య మనృశ్యం భవతి క్షణాత్;
మైవ త్వ మరుణాద్రీశ ముపపీడయ, దుర్మతే;
మా త్వం శోణాచలేశాగ్నౌ శలభత్వం భజాసుర."

దానిని శ్రీభగవానులే యీ క్రింది తెలుఁగుపద్యముగనూ
గద్యముగనూ అనువదించిరి:

"దేవి: ఏనాడు నీ క్షేత్ర మీశభక్తులకు
ధర్మబుద్ధులకు నాస్థానమై యుండు;
పరులకు బాధలు భావించు నరులు
బహువిధవ్యాధులు పట్టి చెడుదురు;
ఇచ్చట దుష్టులబల మెల్ల క్షణమున
అణఁగు; నసలగిరి యరుణేశు కోప
కాలాగ్నిశలభమ్ము కావద్దు నీవు."

"ఎప్పుడును ధార్మికులకు భక్తులకు వాసస్థల మీ క్షే
త్రము. ఇతరులకుఁ జెడుగుఁ దలంచు నీచులు

పలురోగములు గలిగి చెడుదురు. ఇచ్చటి దుష్టుల బల మొకక్షణమున నశించును. అగ్నిశైలాకారఅరుణా చలేశుని కోపదీప్తజ్వాలయందు మిడుత గావద్దు"

మూఁడుదినములతర్వాత శ్రీభగవానులదర్శనార్థము వచ్చిన మా తల్లి నాచేత ఈ ప్రశ్న నడిగించెను:
"స్త్రీలు ప్రణవజపము చేయవచ్చునా?"

శ్రీభగవానులిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి:
"ప్రణవజపమునకుఁగాని మఱే సాధనకుఁగానీ పరమ ప్రయోజనము జ్ఞానసిద్ధి. ఏ సాధనచేతనైనను బుద్ధిపూర్వకముగా జ్ఞానమునే అర్థించువారికి,- వారు పురుషులు గానిండు, స్త్రీలు గానిండు,- ఎట్టి నిషేధములునూ లేవు."

శ్రీభగవానులు మఱియు నిట్లనిరి:
"జనులు తా మాచరించుసాధనయం దాసక్తి గలిగి పలుమారు ఆ సాధననే ప్రయోజనముగా భ్రమింతురు. లోకములో ప్రాణాయామము, జపము, తపము, యాగము, యోగము, మొదలైన సమస్తసాధనలూ అన్నిటా సామాన్యప్రయోజనమైన మనోనిగ్రహమునకు సాధనమాత్రములే అను విషయమును మఱచిపోవుదురు: అందుచేతనే యీ సందేహములన్నీ లేచును."

రెండుదినముల యనంతరము శ్రీజగదీశ్వర శాస్త్రి యను పురాతనభక్తుఁడు సంస్కృతమున విద్వత్కవి శ్రీభగవానుల దర్శనార్థము కొనిరాఁబడెను. ఆయన మిక్కిలి జబ్బుగా నుండి అప్పుడే ఆ పట్టణములోని ఆస్పత్రినుండి విడుదల అయ్యెను. మేము కొంతకాలముక్రిందట ఆయనను జూచి ఆశ వదలుకొనియుంటిమి. కానీ ఆయన చిత్రముగా కోలుకొనెను. ఇప్పు డాయన అస్థిపంజరముగాఁ గనిపించెను. అంత బలహీనమైన దేహము ఎట్లు సజీవమై సంచరింపఁగలుగుచున్నదో అని నేను ఆశ్చర్యమును దెలిపితిని. అందులకు శ్రీభగవానులు చిఱునవ్వుతో ఇట్లనిరి: "ఔను, ఏదోయొకశక్తి ఆ దేహములో ప్రవేశించి దానిని నడిపించుచున్నట్లున్నది!" మఱియు శ్రీభగవానులు శ్రీజగదీశ్వర శాస్త్రినిగూర్చి యీయుదంతమును స్మరించిరి. కొండపై నివసించుచుండినప్పు డీయన 'హృదయకుహరమధ్యే' అను సమాసముతో శ్లోక మారంభించి తర్వాత ఏమి వ్రాయుటకునూ తోఁచక ఆ శ్లోకమును పూరింపుఁ డని శ్రీభగవానులను ప్రార్థించెనఁట. అంతట శ్రీభగవానులు

"హృదయకుహరమధ్యే కేవలం బ్రహ్మమాత్రం
హ్యహమహమితి సాక్షా దాత్మరూపేణ భాతి;
హృది విశ మనసా స్వం చిన్వతా మజ్జతా వా
పవనచలనరోధా దాత్మనిష్ఠో భవ త్వం"

అను సుప్రసిద్ధశ్లోకమును రచించిరఁట. ఆస్పత్రిలో ఆ రాత్రి శయ్య

నుండినప్పుడు శ్రీజగదీశ్వరశాస్త్రి శ్రీభగవానులనుగూర్చి ప్రార్థనశ్లోకములు కొన్ని రచించెను. వాటిలో నొకటి యిది:

"త్రాతవ్యోఽయ మితి, ప్రభో, మయి దయా
స్యాచ్చే ద్ధృతం పాహి మాం;
కిం వా దుష్కృతసత్కృతాదిమననే?
నైవం న యుక్తం తవ;
కర్తుం లోక ము తాపక ర్తు మితరా
నాపేక్ష శక్తస్య తే,
కిం వా సంప్రతి వఞ్చనా బలవతీ
కర్మానుగుణ్యం త్వితి?"

దానిని నే నిట్లాంధ్రీకరించితిని:

"కావంబోలును వీని నంచుఁ దలఁతేని గాపాడు మిప్డే ప్రభూ;
భావింపన్ దగ దయ్య నీమదిని నా పాపమ్ములున్ బుణ్యముల్;
ఈ విశ్వమ్ము సృజింపఁ ద్రుంపఁ గల పీ వే సాయమున్ గోరకే;
రావే, కావవె, బేలుపుచ్చకవె ప్రారబ్ధప్రకర్షోక్తులన్."

శ్రీజగదీశ్వరశాస్త్రి బ్రదికి బయటపడుట నిక్కముగా శ్రీభగవానుల యనుగ్రహామహిమా విశేషమే.

అది 1940 జూన్ నెల 10 వ తేది. ఆ దినము ప్యారిస్ నగరము జర్మనీ స్వాధీన మైనసదని, ఇటలీ 'మిత్రమండలి'

(Allies) కి ప్రతికూలముగా యుద్ధములో ప్రవేశించినదని రేడియో ప్రకటించెను. ఆ రాత్రి సుమారు 3 గంటలప్పుడు శ్రీభగవానులూ నారాయణయ్యరూ నేనూ రుబ్బుగదిలో పనిచేయుచుంటిమి. ఇటలీచర్యకు ప్రతిమల్లముగా టర్కీ మిత్రమండలి వైపు యుద్ధములో చేరినదని నేను ఒకపుకారు అప్పుడే విని యుంటిని. నారాయణయ్యర్ ఆ రాత్రియే పట్టణమునుండి వచ్చినందున రేడియోలో అట్టి ప్రకటనను వింటిరా అని ఆయనను అడిగితిని. నారాయణయ్యర్ జవాబుచెప్పుటకు ముందే శ్రీభగవానులు నాప్రశ్న నందుకొని 'లేదు, వాస్తవముకాదు' అని పలికిరి. శ్రీభగవానుల యీ యసాధారణ ప్రత్యుత్తరమును నారాయణయ్యర్ శ్లాఘించుచూ నావైపు తిరిగి యిట్లనెను. 'ఫ్రాన్సుఅంతటి మొదటితరగతి రాజ్యమే మూఁడు రోజులలో పడిపోయినదే. ఇఁక మన బ్రిటనుమాత్రము ఎంత యెక్కువ అంచనా వేసిననూ మూఁడు వారములకన్న దీర్ఘ కాలము నిలువఁగలుగునా?'' అది విని శ్రీభగవానులు మరల "ఊ! కానీ రష్యా...'' అని పలికి అంతటితో ఆ వాక్యమును పూర్తిచేయకయే మౌనముఁ దాల్చిరి. ఆ కాలమున రష్యా జర్మనీకి మిత్రముగా నుండినందున శ్రీభగవానులు రష్యాను పేర్కొనుట మాకు ఆశ్చర్యము కలిగించెను. కానీ రష్యా యేమి చేయఁబోవును? అని శ్రీభగవానులను ప్రశ్నించుటకు మాకు ధైర్యము చాలలేదు. ఈ సంభాషణ జరిగినతర్వాత సుమారు ఒకసంవత్సరమునకు జర్మనీ రష్యాలమధ్య యుద్ధము సంభవిం

చుటయు రష్యాపై జర్మనీ దండయాత్రయే మిత్రమండలికి అనుకూలమైన వికపరిణామ మగుటయు జగద్విదితము. ప్రపంచ మెఱుఁగనియ ట్లున్న యీ సర్వసంగపరిత్యాగి సర్వజ్ఞత్వ మహిమ కిది యొక చిన్న తార్కాణము.

ఆ కాలమున 'భగవద్గీత'ను ప్రతిసంవత్సరము స్థానిక విద్యార్థులకు ఉచితముగా బహూకరించుచుండిన యొక స్నేహితుని కోరికపై నేను సంపాదకుఁడనుగా "గీత" క్రొత్తకూర్పును తయారుచేయుచుంటిని. విద్యార్థులు నిత్యమూ పారాయణచేసి సులువుగా జ్ఞాపకముంచుకొనుటకై ఆ గ్రంథము తొలిపుటలలో ముద్రించుటకు "గీత"నుండి కొన్నిశ్లోకములను ఏర్పఱుపుఁడని నేను శ్రీభగవానులను ఒకనాఁడు ప్రార్థించితిని. శ్రీభగవానులు తొలుత "ఇదివఱకే గీతాశ్లోకముల యుద్ధారము లెన్నో ప్రచారములో ఉన్నవి గదా. మరల క్రొత్తది యేల?" అని సంకోచించిరి. కానీ కడపటికి నా పునః పునః ప్రార్థన నాలకించి శ్రీభగవానులు నలువదిరెండు శ్లోకములను ఎత్తి వాటి కొక నూతనక్రమము నేర్పఱిచిరి. అవెనుక శ్రీభగవానులు తామే వాటిని అఱవములోనూ మలయాళములోనూ పద్యములుగా అనువదించిరి; వాటిని తెలుఁగున సీసమాలికగా అనువదించుటకు నన్నుఁ బ్రోత్సహించిరి. మాతృకతోఁగూడ ఈ యనువాదములను ఆశ్రమము వారు వేఱువేఱుగా ప్రకటించిరి. వాటికి శ్రీభగవానులు తమిళమలయాళములలో తాము

శ్రీకృష్ణార్జునుల చిత్రపటమునకై పూర్వము రచించియుండిన యొక ప్రార్థనపద్యమును జేర్చిరి. దానిని శ్రీజగదీశ్వరశాస్త్రి గారు సంస్కృత శ్లోకముగాను నేను తెలుఁగుపద్యముగాను అనువదించితిమి. అవి యన్నియు ఈ క్రిందఁ బొందుపఱుపఁ బడినవి:

"పార్థ౯ తేటి నల్
వార్తయా లవ౯
ఆర్తి పో క్కరుళ్
మూర్తి కాక్కవే" (శ్రీభగవానుల తమిళము)

"పార్థసారథి యా యాన్ర
వార్తక ళ్చెవి వార్తవ౯
ఆర్తితీ ర్త్తొరు కారుణ్య
మూర్తి కాత్తరుళేణ మే." (శ్రీభగవానుల మలయాళము.)

"పార్థసారథిరూపేణ
శ్రావయిత్వా శుభాం గిరం
పార్థ స్యార్తిహరో దేవః
కృపామూర్తి స్స పాతు నః" (శ్రీజగదీశ్వరీయము.)

"అమలశుభతర దివ్యవాగమృతరసము
శ్రవణపుటముల నిండారఁ ద్రావ నిచ్చి
నరుని యార్తిని బాపిన కరుణమూర్తి
పార్థసారథి మనలఁ గాపాడుఁగాత." (మదీయము)

మఱియు నేను ధన్యవాదముగా ఈ క్రింది పద్యమును రచించి తిని :

> ఆ నాఁడు గీతఁ బల్కిన
> శ్రీనాథుఁడె నేఁడు భువిని శ్రీరమణుండై
> తానే గీతామృతఘుటిఁ
> బానమొసంగెడిని మనకు, భాగ్యం బహహో!"

దీనిని గుప్త యను నొక యువభక్తుఁడు సంస్కృతీకరింపఁగా ఆ యనువాదమును శ్రీభగవాను లిట్లు సవరించిరి :

> "అహో భాగ్యం పురా గీతాం
> యోఽవద చ్ఛ్రీపతిః స్వయం
> అద్య శ్రీరమణో భూత్వా
> గీతాసారం దదౌ స నః"

పై శ్లోకమూ పద్యమూ ఆశ్రమమువారు ప్రకటించిన "భగవద్గీతారత్నమాలిక" ముఖపత్రమున ముద్రింపఁబడినవి.

ప్రాసంగికముగా శ్రీభగవానులు "భగవద్గీత"నుగూర్చి యాకర్షణీయవిశేషాంశములు కొన్ని నుడివిరి. 'విశ్వరూప సందర్శనము'ను గుఱించి శ్రీభగవాను లిట్లనిరి :

"ఈ యుదంత మంతయు నిక్కముగా ఒక మహాద్భుతము.
శ్రీకృష్ణుఁడు అర్జునునితో
'ఇహైకస్థం జగ త్కృత్స్నం ప శ్యాద్య సచరాచరం
మమ దేహే, గుడాకేశ, య చ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి'
[అర్జునా, యిప్పుడు ఈ నా దేహమం దొక్కచోటనే జంగమ స్థావరసహితంబగు జగము నంతటినీ మఱియు వే ఱెద్దానిని చూడఁగోరుదువో దానినే చూడుము.]

"అని పలుకును. అది యెంత పెద్దదైనా ఒకరూపమే ఐన యెడల, దానిలో అర్జునుఁడు తాను కోరున దెల్ల ఎట్లు చూడఁగలఁడు? మఱియు శ్రీకృష్ణుఁడు అర్జునునితో 'నా దేహములో సకల దేవతలు, సిద్ధులు, మహర్షులు మున్నగు వారిని చూడుము' అని పలుకును. అర్జునుఁడు వారి నందఱినీ ఆయన దేహములో చూచుచున్న ట్లొప్పుకొనుచూ అదేసమయమున వా రందఱు శ్రీకృష్ణునకు నమస్కరించుచూ సంకీర్తనము చేయుచున్నట్లు చెప్పును. మఱి, వా ళ్లందఱు ఎక్కడ నిలిచియుండవలెను? శ్రీకృష్ణుని దేహమునకు లోపలనా వెలుపలనా? అర్జునుఁడే ఎక్కడ నిలిచి యున్నాఁడు? అసంబద్ధములుగాఁ దోఁచునట్టి యీ యంశముల కన్నిటికీ ఒకే సమాధానము. అ దేమనఁగా అర్జునునకు ప్రదర్శింపఁబడినది 'విశ్వరూపము' గాదు 'విశ్వఆత్మ' (ఆత్మయే విశ్వమైనది.)"

ఆఱవ యధ్యాయములో అర్జునుఁడు

"చఞ్చలం హి మనః, కృష్ణ, ప్రమాధి బలవ ద్దృఢ.
[కృష్ణా, యీ మనస్సు చంచలమైనదియు, క్షోభపఱుచునదియు, ప్రబలమైనదియు, అభేద్యమైనదియుఁ గదా]

అని మొఱపెట్టుకొనినప్పుడు, శ్రీకృష్ణుఁడు "ఔను వాస్తవమే, కానీ యీ మనస్సు అభ్యాసముచేతను వైరాగ్యముచేతను నిగ్రహింపవచ్చును" అని సెలవిచ్చెను. దానికి కొంచెముముందు శ్రీకృష్ణుఁడు అర్జునునితో

"యతో యతో నిశ్చరతి మన శ్చఞ్చల మస్థిరం
తత స్తతో నియ, మ్యైత దాత్మన్యేవ వశం నయేత్"
["ఎందెందు వెడలునో యెప్పుడును నిలుకడఁ గానని చంచలమానసమ్ము అందందునుండి యెయ్యెన దీని మరలించి తనయందె వశముగాఁ గొనఁగవలయు"]

అని యుపదేశించెను. దీనిని శ్రీభగవాను లిట్లు వివరించిరి:

"మనస్సును అది సంచరించు తావులనుండి మరలించుటే నిక్కమైన 'వైరాగ్యము.' ఆ మనస్సును ఆత్మలో నిలిపి చేయుటే నిక్కమైన 'యభ్యాసము'."

కడపటియధ్యాయములో శ్రీకృష్ణుఁడు గీతాసందేశము పరమగుహ్యమని దీనిని తనభక్తులకే తెలుపవలెననీ తదితరుల

కెన్నడును తెలుపరాదనీ ఆదేశించును. ఇందలి యధికార వాదమును శ్రీభగవాను లిట్లు విశదీకరించిరి:

"పరమసత్యమును అనధికారులకు బోధింతుమేని దానిని వారు తప్పకుండ అపార్థముచేసికొని దుర్వినియోగపఱు తురు. వాస్తవముగా హిరణ్యకశిపునివంటి యసురులు గూడా బ్రహ్మవాదులే. వారుగూడా 'నేనే దేవుఁడను' అని చాటినవారే. కానీ 'నేను' అనఁగా వారియర్థము వారిశరీరము. కావున తమ శరీరమునకన్న మిన్నయగు శక్తి లేదని విశ్వసించి వారు ఎట్టి పాపకార్యమొనర్చుట కైనను సాహసించిరి. శ్రోతల యధికారమును బాటింపక పరమసత్యమును బ్రచారముచేయుటవలన అట్టి యనర్థము ప్రాప్తించును. కావున దానిని శ్రీకృష్ణుఁడు నిషేధించెను."

రెండవ యధ్యాయములో

"యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః"

అను 46 వ శ్లోకమును గుఱించి శ్రీభగవాను లిట్లు ప్రసంగించిరి:

"అన్ని వేదములూ శాస్త్రములూ ఎవరు తమ యజ్ఞాన మును గుర్తించి జ్ఞానము నన్వేషింతురో వారికే. అజ్ఞాన ములో మునిఁగియున్నవారికి అట్టి వేదశాస్త్రాదు లున్న వనియే తెలియదు. కావున వారు వాటి ప్రసక్తియే పెట్టు

కొనరు. మఱి జ్ఞానియో ఆత్మకన్న వేఱు చూడనే చూడఁడు, కావున ఎట్టి ప్రామాణ్యమునకునూ వేదప్రామాణ్యము నకుఁగూడా బద్ధుఁడు కాఁడు. సమస్తవేదములూ బ్రహ్మమునే ప్రతిపాదించునవి, జ్ఞాని యనఁగా సాక్షాత్తు బ్రహ్మమే."

ఒకరు 'ప్రజ్ఞానము'నకూ 'విజ్ఞానము'నకూ తారతమ్యమడుగఁగా శ్రీభగవాను లిట్లు బదులుపలికిరి:

'స్వరూపజ్ఞానము ప్రజ్ఞానము. అనుభవజ్ఞానము విజ్ఞానము'

"శ్రీరమణగీత" నాల్గవయధ్యాయము మొదటిశ్లోకములో 'అహం బ్రహ్మాస్మి' అనుటకూ 'బ్రహ్మాహం' అనుటకూ భేదమును విశదీకరింపుఁడని నే నొకమారు ప్రార్థింపఁగా శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి:

" 'బ్రహ్మైవాహం' అనుచో, పరోక్షబుద్ధి పోవును. 'అహంబ్రహ్మాస్మి' అనుచో, పరిచ్ఛిన్నబుద్ధి పోవును."

జూన్ నెల 17 వ తేదీ శ్రీ ఆర్. నారాయణయ్యర్ తన పెద్దకొమార్తె పెండ్లి మనువువిషయమై తన ప్రయత్నములన్నియు విఫలమైనవనీ, ఇఁక శ్రీభగవాను లాజ్ఞాపించిన తప్ప తా నెట్టిప్రయత్నమూ చేయఁదలఁచుకోలేదని శ్రీభగవానులతో మనవిచేసెను. అదే సమయమునకు తపాలాలో

"Progress" అను నొకపత్రిక వచ్చెను. దాని ముఖపత్రముపై

"You can succeed if you know the power that is in you"

(నీలో నున్న శక్తిని దెలిసికొందువేని నీవు జయింతువు)

అను శీర్షికను శ్రీభగవానులు బిగ్గఱగాఁ జదివి యిదే నారాయణయ్యర్‌కు ప్రత్యుత్తరమని నుడివిరి. ఇది శ్రీభగవానుల యనుగ్రహ వరప్రసాదముగా గ్రహించి నారాయణయ్యర్ వెంటనే అప్పుడు వచ్చిన క్రొత్తమనువునకు ప్రయత్నించి యీమారు సఫలీకృతుఁ డయ్యెను.

కొద్దిరోజుల తర్వాత నెల్లూరిలో పెద్దన్యాయవాది రాజకీయవేత్తయైన రావుబహదూరు ఎ. యస్. కృష్ణరావు గారు శ్రీభగవానుల దర్శనార్థమై వచ్చి తనజీవితచరిత్రను సంగ్రహముగా విన్నవించి యిఁక నిప్పుడు తనకు ఒకేకోరిక గలదనీ, తాను మహర్షులవంటి మహాత్ములకు శుశ్రూష యొనర్చి మోక్షముఁ బడయఁ గోరుచున్నాననీ మనవిచేసెను. ఈ సందర్భమున శ్రీభగవానుల యాదేశమును బ్రార్థించెను. శ్రీభగవానులు ఆయన కిట్లు సెలవిచ్చిరి.

"మీావయస్సున మీా రేమి శుశ్రూష చేయఁగలరు? మీారు ఎక్కడకును వెళ్ల నక్కఱలేదు, ఏమియూ చేయ నక్కఱలేదు. 'నాకు మోక్షము కావలెను' అను తలంపును గట్టిగా పట్టుకొనుఁడు, ఆ తలంపే మీాకు మోక్షము నియ్యఁ గలదు"

ఒక యుదయము భోజనశాలలో ఫలాహారము పెట్టుచూ శాంతమ్మ "ఈ రాత్రి నేను ఊరికి పోవలెను" అని శ్రీభగవానులతో చెప్పెను. అందుమీఁద శ్రీభగవానులు నావైపు తిరిగి యిట్లు పలికిరి :

"చూడండి! శాంతమ్మ ఈరాత్రి ఊరికి పోవలెనఁట. తన ప్రయాణపుసందడిలో ఆ సమయానికి మఱపుకలుగునేమో అని ముందుగానే ఆమె సెలవుతీసుకొనఁ గోరుచున్నది."

ఆ నాఁడు శాంతమ్మ తనప్రయాణము మానుకోవలసినట్లు ఏర్పడెను. ఆ మఱునాఁ డుదయము ఆమె యథాప్రకారము ఫలాహారము వడ్డించుటకు రాఁగానే శ్రీభగవానులు మందహాససుందరవదనారవిందులై ఆమెను కటాక్షించి మరల నాతో ఇట్లు నుడివిరి:

"తనప్రయాణమును నిన్న ఉదయము చాటించుకొనెనే, ఆప్రయాణము మానుకొన్నవిషయము ఇప్పుడు మనకేల చెప్పలేదో శాంతమ్మను అడిగిచూడండి."

శ్రీభగవానులు మఱియు నిట్లు సెలవిచ్చిరి:

"ఇది కంఠాభరణన్యాయమును జ్ఞప్తికి తెచ్చుచున్నది. ఒకామె తన కంఠాభరణము పోయిన దనుకొని దానిని అంతటా వెదకుచూ అందఱిని అడుగుచూ ఉండెను. వాస్తవములో అది అంతసేపూ ఆమె మెడలోనే ఉండి

సది. తటాలున అది మెడలోనే ఉన్న సంగతి స్మరణకు రాఁగా ఆమె ఊరకుండెను. ఇతరు లామెను కంఠాభరణము దొరకినదా అని అడుగఁగా ఆమె 'అవును' అని మాత్రము జవాబు చెప్పెను గానీ జరిగినదంతా సవిస్తరముగా చెప్పదు. ఎందువల్ల ననఁగా అట్లు చెప్పుట కామెకు మొగము చెల్లదు."

ఈమాటలు విని అచ్చట నున్న వా రందఱు నవ్వఁగా, పాపము! శాంతమ్మ సిగ్గుపడినట్లు కనిపించెను.

శ్రీబసవరాజు సీతాపతిరావు అను మఱియొక భక్తుఁడు కూడా ఒకనాఁడు "భగవాన్, నేను రేపు బయలు దేఱుచున్నాను" అని చెప్పెను. శ్రీభగవానులు ఆయనతో

"రేపు బయలుదేఱుటకు నేఁడు సెల వెందులకు? రేపటి సంగతి రేపు చూచుకోనిండి"

అని బదులుపలికిరి. ఆయనవదినె ఆరాత్రి యింటికి దూరమైనందున ఆయన ప్రయాణ మాగిపోయెను. కావున మఱునాఁడుదయము ఆయన కనిపించఁగానే శ్రీభగవాను లిట్లు పరిహసించిరి:

"అవును. సీతాపతిరావు చెప్పినదే సరి. ఆయనప్రయాణము నేఁడుగాదు ఏదో ఒక 'రేపు'!"

ఈ యుదంతముల గుణపాఠము గ్రహించి ఆవెనుక నే నెప్పుడూ చివర నిమిషములో తప్ప శ్రీభగవానులవద్ద సెలవుపుచ్చుకొని నది లేదు.

నేను ఇల్లు చేరినతర్వాత రమణప్రసాదమునకు కట్టు విప్పినారు కానీ యింకనూ చాలా బలహీనముగాఁ గన్పడు చున్నాఁడని వ్రాసిన జాబునకు ఆశ్రమమువారు 8-7-1940 తేదిన ఇట్లు జవాబువ్రాసిరి:

"చిరంజీవి రమణప్రసాదమునకు కట్టు విప్పినారని వినుటకు మాకు సంతోషమైనది. పిల్లవానికి కొంతకాలము నిలుప కుండా మంచి యాహారము నిప్పించిన, సత్ఫలితము కలుగును, దృఢకాయ మేర్పడుట కది యుపకరించును. సుఖవికాస వంతమగు సంతానమే తలిదండ్రులపాలిటి పెన్నిధానము. *మన మందఱము శ్రీభగవానుని సంతానము. కావున మన యోగక్షేమము వారు చూచుకోవలసినదే."*

ఆ జాబులో ఈ క్రింది poste-script (ఉత్తరలేఖనము) ఉండెను:

*"ఈజాబు చదివి శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి: భగ వద్గీతలో*

*'అనన్యా శ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహం' అను శ్లోకమును అఱవములో వెణ్బావృత్తముగా శ్రీభగ వానులు అప్పుడే అనువదించిరఁట. కావున అదే అది.'*

నా పాకశాలా సహచరుఁడు శ్రీ ఆర్. నారాయణయ్యర్ 12-7-1940 తేదిన ఎట్లు శ్రీభగవానుల యనుగ్రహ మొక్కటే తనకొామా ర్తె వివాహమును జులై 7 వ తేదీ చక్కఁగా జరిపింపఁగలిగినదో తెలుపుచూ, ఇట్లు జాబువ్రాసెను:

"గురువారము సాయంకాలమువఱకూ పెండ్లి నిశ్చయమైన ట్లునూ రాఁగల ఆదివారమునాఁడే జరుగవలసినట్లునూ నాకు తెలియలేదు. నేను ఎట్టిసన్నాహమునూ చేయ లేదు....నావల్ల ఏమి కాఁగలదు? మధ్య ఒక్కదినమే, ఏపనీ చేయలేదు. కన్నీరు గార్చుచూ శ్రీభగవానులకు 'శరణాగతి' అని ప్రార్థనలేఖ వ్రాసికొంటిని. ఆ క్షణము నుండి నా భారము తొలఁగిపోయినట్లు తోఁచెను....నేను తిరువణ్ణామల వెళ్లుసరికి అక్కడ నేను చేయవలసినపనియే లేకుండెను. గృహములు, వంటవాళ్లు, పాత్రలు, పరిచారకులు, సామానులు ప్రతిదీ యేర్పాటై యుండెను. అంతా సక్రమముగా జరిగి పోయెను. ఏ మద్భుతము! తత్పూర్వము నా దిగులు, ఆవేదన, చివరనిమిషములో పిచ్చిపట్టినట్లు పరుగులాడుట అవన్నియు ఇప్పుడు ఒకస్వప్నమువలె కన్పట్టుచున్నవి. '*నీలోనున్న శక్తిని తెలిసికొందువేని నీవు జయింతువు*' అనిన శ్రీభగవానుల యుపదేశమును మంత్రమువలె పునశ్చరణ చేయుచున్నాను."

శ్రీకృష్ణజయంతినాఁడు నేను శ్రీభగవానుల "ఉపదేశ సారము" పారాయణచేయుచుంటిని. 'రమణవాగియం' అను చివరపదములు నేను పాడుచుండఁగానే తపాలాజవాను నాచేతిలో ఒకపుస్తకము పెట్టెను. అది "భగవద్గీతాసారము"నకు శ్రీభగవానుల తమిళానువాదము. ఈ యోగపద్యమునకు నేను సంభ్రమ మొంది ఈనాఁడు శ్రీకృష్ణులు నాకొఱకు వాస్తవముగా ఎట్లు పునర్జన్మ మెత్తిరో, శ్రీకృష్ణభగవానుల గీతయూ శ్రీరమణ భగవానుల యుపదేశమునూ ఎట్లు నిక్కముగా ఒక్కటియో గ్రహించితిని. ఈ విషయము నేను ఆశ్రమము నకు జాబు వ్రాయుచుండఁగా వీధిలో ఒకభిక్షుకుఁడు పాడుచుండిన యీ పాట వినవచ్చెను:

"కల్ల గాదూ నిజము నిజమురా- సద్గురునిఁ గన్న
మళ్లీ జన్మబాధ లేదూరా-
కల్లగాదు గురునికరుణ
వల్లఁ దన్నుఁ దెలిసికొన్న
మళ్లీ జన్మభాధ సున్న
మహిమఁ గన్న వారలకునూ- కల్ల గాదు॥

అందరానీ చెట్టుపండురా- సద్గురునికరుణ
అందఱికిని దొరకఁబోదురా
ఇంద్రియములా రాశిలోనా
చందమామ వెలుఁగుచుండు,
ముందు మూఁడూ కళలు గడచి
ముక్తిఁ గన్న వారలకునూ- కల్ల గాదు"

ఈ యోగపద్యముగూడా నాకు అద్భుతముఁ గొలిపెను. అప్పుడే నేను ఆ పాటను ఆజాబులోనే వ్రాసి ఈ యుదంతముఁ దెలుపుకొంటిని. దానికిఁ బ్రత్యుత్తరముగా ఆశ్రమమువారు 20-8-1940 తేదిన ఇట్లు వ్రాసిరి:

"సుబ్బలక్ష్మమ్మ ఆపుస్తకము మీకు చేరిన పరిస్థితులను వివరించి చెప్పినది. వాటిని బర్యాలోచింపఁగాఁ దేలు సిద్ధాంత మే మనఁగా, అవ్యక్తవస్తువు యొక్క స్వయం వ్యక్తీకరణకు అవి యొక నిదర్శనము. ఆతఁడు 'సర్వభూతా శయస్థితుఁడు' కావున ఆ గ్రంథప్రతి ఆ దినము మీకు చేరుటకు వీలగునట్లుగా ముద్రణాలయమువారు ఆపుస్తకము లను ఇచ్చుటకిఁ బంపిరి. భక్తహృదయాంతర్యామి యగు నీశ్వరుఁడు 'ఉపదేశసారముఁ' బఠించుటకు మిమ్ముఁ బురి కొల్పి 'రమణవా గియుం' అను చరణముతో మీచేతఁ బూర్తిచేయించు నా క్షణముననే ఆ పుస్తకము మిమ్ముఁ జేరుటకు అది యెన్ని చేతులు మాఱియుండవలెను!

దారిన పోవు భిక్షుకుఁడు (దరిద్రనారాయణుఁడు) పాడిన చరణములుగూడా గంభీరభావస్ఫోరకములుగా నున్నవి. గుర్వనుగ్రహము అమోఘమైనది. ఏలన అది మోక్ష ప్రదాయి. రెండవచరణము గుర్వనుగ్రహమువలననే సాధ్య పడు సాధనసంపత్తిని సూచించుచున్నది."

గీతాశ్లోకరత్నములకు నా యాంధ్రానువాదము ఆశ్ర మము చేరినసమయమున అప్పుడు చిత్తూరు డెప్యూటీకలెక్టరుగా

ఉండిన శ్రీ బి. వీరభద్రయ్య తన కొమారుని యుపనయన సందర్భమున ఆశ్రమములో ఉండెనఁట. ఆయన ఆ యనువాదము ను జదివి దానికి వేయిప్రతులు అచ్చువేయించుటకు సంకల్పించెనఁట. ఆ భక్తిపూర్వకసంకల్పమును ఆశ్రమమువారామోదించి "శ్రీభగవద్గీతారత్నమాలిక" అను శీర్షికక్రింద మూలశ్లోకములతో సహా దానిని బ్రకటించిరి. ఇదియు శ్రీభగవదనుగ్రహఫలితమే.

శ్రీభగవాను లొకభాషలో రచించిన గ్రంథమును ఆ భాష నెఱుంగని భక్తులుకూడా చదువఁగోరుట సహజము. ఆ కోర్కెను దీర్చుట ఉభయభాషాకోవిదులగు శ్రీభగవానులకే సాధ్యము. ఎంతయో శ్రమ కోర్చి తనభక్తులు పఠించుట కొఱకై వారికి తెలిసిన లిపిలో తనగ్రంథమును వ్రాసిపెట్టువాడుక శ్రీభగవానుల యపారభక్తవాత్సల్యమునకు హృద్యతార్కాణము. ఆప్రకారమే శ్రీభగవానులు గీతారత్నములకు తనమలయాళానువాదమును తెలుఁగులిపిలో వ్రాసి నాకు పంపిరి. అదేవిధముగా శ్రీభగవానులు నా తెలుఁగుసీసమాలికను మలయాళపులిపిలో వ్రాసి తన పరిచారకుఁడగు మాధవస్వామి కిచ్చిరఁట. మఱుసటిసారి నేను ఆశ్రమము వెళ్లినప్పుడు శ్రీభగవానుల యానతిమేరకు మాధవస్వామి సీసమాలిక అంతా ఒక్కతప్పు పోకుండ ఒప్పఁజెప్పుట నాకు సంభ్రమాశ్చర్యములు గొలిపెను.

ఈ సారి అక్టోబరు 5 వ తేది రాత్రి నేను ఆశ్రమము చేరుకొంటిని. వెంటనే ఆదినమే జరిగిన యొక యుదంతమును వింటిని. మామూలుగా మాధవస్వామి శ్రీభగవానుల పరిచర్యలో బహుజాగరూకుఁడై అప్రమత్తుఁడైయుండువాఁడు. కానీ ఎట్లో ఆనాఁడు తాంబూలము తయారుచేయుట మఱచిపోయెను. సరిగా ఆ క్షణమునకు తటాలున జ్ఞాపకము తెచ్చుకొని తయారు చేసి తెచ్చుటవలన కొంచె మాలస్యమయ్యెను. శ్రీభగవానులు దానిని బుచ్చుకొన నిరాకరించిరి; ఇఁకమీఁద పుచ్చుకో నని గూడా ఉద్ఘాటించిరి. మాధవస్వామి తన తప్పునకు చాలా నొచ్చుకొని తనను క్షమించి దానిని స్వీకరింప శ్రీభగవానులను ప్రార్థించెను. శ్రీభగవానులు ఇందులో క్షమించుట కేమీ లేదని అతనితో నొక్కి-చెప్పిరి, కానీ తాంబూలము మాత్రము పుచ్చుకొనలేదు. ఇట్లు రెండుదినములు గడచిన వెనుక నేను "తాంబూలవిలాపము" అను శీర్షికతో ఈ క్రింది పద్యములు వ్రాసి శ్రీభగవానులకు సమర్పించితిని.

"శిలలతతరు లను మువ్వురు
చెలువలరన్ జననమొంది చిత్రముగాఁగన్
దలవాకిట రమియింతును;
చెలువుగ నను నెల్లవారు సేవింతు రిలన్.
నా యదృష్టమ్మునను జేసి నాకుఁగూడ
రమణభగవాను సేవించు రహి లభించె

నింతకాలమ్ము, నియ్యెడ నెదరు వచ్చె
శ్రీరమణుఁ డుజ్జగించిన కారణమున.
మాధవస్వామి యొకపూట మఱచుకతన,
నిప్పగిది నక్కటా! నాకు ముప్పు వచ్చె;
మాధవుని పొరఁబాటుకై, నాథ, నన్నుఁ
ద్రోసిపుచ్చంగ, నాయెడ దోస మున్నె?
మాధవుఁ డనంగ నెవ్వండు? నాథుఁ గొలువ
నవతరించిన దేవసేనాఖ్యసతియొ
వల్లియో గాదె? ప్రియురాలివలనఁ గలుగు
తప్పు నెంచునె ప్రియుఁడు? స్కందావతార.
తనదు మఱపునకై యెంతొ తల్లడిల్లు
మాధవస్వామి మానసబాధ నరసి,
జడమ నగు నాపయి నొకింత జాలి నూని,
విడెముసేయంగదే, నిన్ను వేఁడుదాన.''

శ్రీభగవానులు ఈ పద్యములను బిగ్గఱగాఁ జదివి నవ్వుచూ వినోద ముట్టిపడుతీఱున వాటిభావమును ఆశ్రమమువారికి విశదీకరించిరి. అయితే ఈ పద్యములుగానీ ఇతరప్రార్థన లేవి గానీ శ్రీభగవానుల మనోనిశ్చయము నావంతయుఁ ద్రిప్పలేక పోయెను. శ్రీభగవాను లీవిషయమున కిట్లు స్వస్తిచెప్పిరి:

"ఇంతకాలము నేను ఈ తాంబూలచర్వణ దురభ్యాసమును మానుటకు ఒకవ్యాజముకొఱకై వేచియుంటిని. అది

యిప్పుడు లభించినది. మాధవునిమీఁద నా కేమీకోపము లేదు. అది వాస్తవముగా అతని తప్పు గాదు. అది ఆవిధముగా జరుగవలసియుండెను. ప్రతిదీ మనమేలుకే జరుగును. మీరు చెప్పినట్లు మీకందఱికీఁగూడా తాంబూలము మానివేయవలెనని తోఁచినట్లైతే తప్పకుండా మానివేయండి. ఆ మార్పు నాకు పరమసమ్మతము.''

అటుపిమ్మట ఎప్పుడూ శ్రీభగవానులు తాంబూలము తాఁకలేదు.

ఆసమయముననే సుబ్బలక్ష్మమ్మ నాకు ఒకయుదంతముఁ జెప్పెను. అది గూడా ధర్మనిర్వహణముపట్ల శ్రీభగవానుల వజ్రకాఠిన్యము నుదాహరించుచున్నది. చారు, మజ్జిగ మొదలైనవి వడ్డన యగుచుండఁగా శ్రీభగవాను లెప్పుడునూ చేయిపట్టి వాటిని గ్రహింపకుండుట నేను గమనించితిని. కొన్నియేండ్లక్రిందట ఒకదినము సుబ్బలక్ష్మమ్మ వడ్డించునప్పుడు మజ్జిగ శ్రీభగవానులచేతిలో మెల్లగాఁ బోయుచూ వారివిస్తరి ముందు కొంచె మొలకించెనఁట. శ్రీభగవానులు దీనిని గనిపట్టి ఉద్రిక్తులై ''ప్రతివిస్తరిముందూ ఇంతకాలము నిలుచుచున్నావా? లేనియెడల, నాకు మాత్రము ఈ యాధిక్య మేల చూపినావు?'' అని మందలించిరఁట. ఆ తర్వాత, ఆమెయూ ఇతరులూ ఎంత వేఁడికొనిననూ పెడచెవిని బెట్టి, శ్రీభగవానులు మరల ఎన్నడూ భోజనమందు ఏ పదార్థమునకుఁగానీ చేయి చాపినది లేదు.

ఆ మఱునాఁడు శ్రీభగవానులు 'శ్రీరమణచత్వారింశత్' స్తోత్రమునకు మంగళాచరణముగా అంగీకరింపఁబడిన యీ క్రింది కావ్యకంఠశ్లోకమును నాకు దయచేసిరి :

"వందే శ్రీరమణర్షే
రాచార్యస్య పదాబ్జం
యో మేఽదర్శయ దీశం
భాన్తం ధ్వాన్త మతీత్య."

నేను దానిని వెంటనే తెలుఁగుపద్యముగా ఇట్లనువదించితిని:

"ఇరు లెల్లఁ గడపి తేజ
స్స్ఫురణుం డగు నీశు నాకుఁ జూపించిన స
ద్గురువు రమణర్షి చరణాం
బురుహమునకు సంతతమ్ము మ్రొక్కెద భక్తిన్."

ఆ మఱుసటియుదయము "గీతారత్నమాలిక" అచ్చు ప్రతులు ఆశ్రమము చేరినవి. ఆ పుస్తకములో శ్రీభగవానుల పటమును జేర్చనందులకు నేను కొంచెము చింత పడితిని. కావున నన్ను తృప్తిపఱుచుటకు, పై ప్రార్థన శ్లోకముతోసహా శ్రీభగవానుల చక్కనిపటము నొక్కప్రతికి అతికించి వారి యమృతహస్తము తోనే నాకు బహూకరించిరి. ఆ దినము మహానవమి పండుగ నా పుట్టినదినముకూడా అగుటవలన అది నాకు మిక్కిలి శుభ స్కరముగానూ మహాభాగ్యముగాను తోఁచెను. అంతకు

పూర్వము అదే గ్రంథముయొక్క తమిళానువాదము నాకు శ్రీకృష్ణజయన్తినాఁడు చేరినయుదంతము జ్ఞప్తికి వచ్చెను.

నేను మరల ఇల్లు చేరిన దినమే నా కడగొట్టుకొమార్తె శ్రీభగవానుల తల్లిపేరుఁ దాల్చిన అలగమ్మకు అగ్నిప్రమాదము జరిగెను. ఆబిడ్డ కుంపటిమీఁదఁ బడుటవలన చేయి కాలెను. ఈ సమాచారము నేను ఆశ్రమమునకు తంతిమూలమున విన్నవింపఁగా, ఆ శిశువునకు శ్రీభగవానుల యాశీస్సులను దెలుపుచూ జవాబు వచ్చెను. వారి యనుగ్రహబలమువలన ఆ గాయము త్వరలో మానిపోయెను.

1940 క్రిస్ట్మస్ సెలవులలో నేను ఆశ్రమమం దున్నప్పుడు శ్రీభగవానులు కొండపై నివసించుచుండిన కాలమున మలయాళములో తనకూ ఇతరులకూ నడచిన యాశుకవిత్వ సంవాదములనుగుఱించి ముచ్చటించిరి. శ్రీకుంజుకృష్ణమీనన్ అను నొకాయన ఆశువుగా శ్రీభగవానుల నిట్లు స్తోత్రము చేసిరి.

"పారిచ్చు ళ్లవివేకమాం కడలిలా ణ్డత్యన్తదుఃఖార్తరాయ్
పారం నీన్ది వలఞ్ఞిడున్న మనుజన్మారిల్ దయాపూర్ణనాయ్
నేరా యుళ్లొరుబోధ తీర మదినె చ్చేర్త్తొన్నొరప్పోతమాం
పేరాళుం రమణాఖ్యసద్గురువర శ్రీపాదపద్మం భజే"

దీనికి బదులుపద్యముగా ఆశువుగానే శ్రీభగవానులు అరుణాచలుని ఇట్లు కీర్తించిరి :

"పారిల్ప్పెట్టతిఘోరమాం భవమహాకాన్తార దేశే వల
ఞ్ఞారీత్తాప మకట్టు మెన్నక మెరి ఞ్ఞారుంకరఞ్ఞీడోలా
తీరుం క్లేశ మశేష మర్ బోడు సకృన్నామం స్మరిక్కిల్ సుఖం
చేరుం శ్రీఅరుణాచలం శివమయం కారుణ్యపూర్ణామృతం."

మరల 1914-1915 లో ఒకనాఁడు శ్రీభగవానులు వెలుపల వెళ్ళియుండినప్పుడు శ్రీఅమృతనాథయతీంద్రులు మలయాళపద్య మొక కాగితపుముక్కపై వ్రాసి దానిని శ్రీభగవానులు మామూలుగా కూర్చుండు నాసనముపై ఉంచెను. ఆ పద్య మిది :

"అరుణాచలశిఖరోపరి విరుదా ర్న్నొరు గుహాయిల్
కరుణానిధి విరుదావలి భగవాన్ మునిరమణన్
హరియో శివగురువో వరరుచియో యతివరనో
అఱివా నొరు కుతుకం మమహృదయే గురుమహిమా."

శ్రీభగవానులు తిరిగివచ్చి ఆ కాగిత మెత్తి చూచుకొనునప్పటికి అది వ్రాసిన యాసామి యదృశ్యుఁ డయ్యెను. అంతట శ్రీభగవానులు ఆ కాగితముమీఁదనే వెనుకవైపు అదేఛందస్సులో బదులుపద్య మిట్లు వ్రాసిరి :

"హరియాది యపరజీవదహారసీరజగుహాయిల్
అఱివాగ్ రమి పరమాత్మనె అరుణాచలరమణన్;

పరమాదరభరనాయ్ హృది పరనార్ నో్నరుగుహాయార్న్
అఱివా మ్మిళితుఱ నీ నిజ మఱి కాయదు వెళియాం."

ఉభయులును ఈ యుదంతమునుగూర్చి యేమియు పలుకుకొనలేదు. కానీ అమృతనాథులు శ్రీభగవానుల ప్రత్యుత్తరమును తక్కినభక్తులకుఁ జూపఁగా వారందఱును శ్రీభగవానుల యీ స్వయంప్రకటనను మహాప్రసాదముగా గ్రహించి కను లద్దుకొని యానందించిరి. భక్తుల ప్రార్థనమేరకు శ్రీభగవానులే దీనిని అఱవములోని కిట్లనువదించిరి:

" హరియాది యితరజీవర దహవారిజగుహాయిల్
అఱివాయ్ రమి పరమాత్తుమ నగుణాచలరమణన్;
పరివాలుళ మురుగానల పరనార్ నిడు గుహాయార్న్ద
అఱివా మ్మిళి తుఱ నీనిజ మఱికాయదు వెళియాం "

ఇయ్యది ఆశ్రమములో నిత్యపారాయణగేయ మైనది. తదనంతరము నేను ఆ ప్రశ్నోత్తరములను తెలుఁగు పద్యములుగా ఇట్లనువదించితిని:

అమృతనాథయతీంద్రులు :

" అరుణధరాధరేంద్రశిఖరాగ్రమునం దొక కందరమ్మునన్
గరుణనిధాన మన్ బిరుదుఁ గాంచిన శ్రీరమణర్షి యారయన్
వరరుచియొక్కొ? యీశగురువర్యుఁడొకో? హరియో?
యతీంద్రుఁడో?
గురుమహిమం బెఱుంగ నిటు కోరిక యారికలెత్తు నాహృదిన్."

శ్రీభగవానులు :

"హరి మొదలెల్లజీవుల హృదబ్జగుహల దెలివై రమించు భాస్వరపరమాత్ముఁడే యరుణశైలలసద్రమణుండు; నిండు నాదరత హృదిన్ బయిం జెసఁగు తద్గుహ దూఱుము, జ్ఞాన నేత్రమున్
దెఱచి నిజమ్ము నీ వరయ, నీ కవు డయ్యది బట్టబైలగున్."

ఆ సంవత్సరము శ్రీభగవానుల జయంతి 1941 జనవరి 13 వ తేది వచ్చుటవలన భోగిపండుగతో సంక్రమించెను. కావున నేను జయంతి మహోత్సవమును సందర్శించుటకు క్రిస్ట్మస్ సెలవులతర్వాత కొద్దిరోజులలోనే మరల ఆశ్రమము వెళ్లితిని. జయంతినాఁడు ఈ క్రింది పంచరత్నములు రచించి శ్రీభగవానులకు సమర్పించితిని :

"భోగిపండుగ యరుదెంచె; భోగితోడఁ
గలసికొనె రమణభగవానుల జయంతి
విక్రమాబ్దంబునం దార వింతసరణి
భోగయోగమ్ము లొకట సంయోగ మొందె!
పడగ యెత్తుటచే నౌనె పాము భోగి ?
హర్మ్యకనకాదులనె నరుం డౌనె భోగి ?
భోగముల కెల్లఁ దనకును మూలవస్తు
వెఱుఁగు శ్రీరమణుండె యేకైకభోగి.
తా నొకఁడే తనలోన సర్వమ్ము నాడించి సదా వినోదించు భోగి,

బ్రాహ్మ్యసౌధాంతరవాసియై భవమున్న యెండక న్నెఱుఁగక
యుండు భోగి,

ఆత్మానుభూతి దివ్యాఖండరసమునే నిరత మాస్వాదించు
పరమభోగి,

సచ్చిత్సుఖామృతసాగరగర్భమహోర్మిపై నుయ్యాల లూగు
భోగి.

సకలయోగ తపస్సులు సలుప నోదవు
నతులితాక్షరభగవన్మహావిభూతి
సహజముగఁ జూఱగొన్నట్టి మహితభోగి
రమణఋషి; తజ్జయంతి సార్థకము 'భోగి.'
పూర్వవాసన లెల్లను పూరి గాఁగ,
కర్మజాలమ్ము సకలమ్ము కట్టియలుగ,
చిత్తనెడు చిచ్చు రగిలించి చేయు మంట
భోగి రమణు జయంతికి 'భోగిమంట.'
స్వస్తి యరుణాచలేశ్వరస్వాత్మజునకు!
సచ్చిదానందమూర్తికి సర్వశుభము!
సాంగతత్త్వస్వరూపికి మంగళమ్ము!
జయము రమణమహర్షికి జయము! జయము!"

ఒకయువకుని శ్రీభగవానులు తన పూర్వసహాధ్యాయి శీరంగయ్యర్ కొమారుఁడని నా కెఱుకపఱిచిరి. ఆతఁడు తాను రచించిన "రమణకల్యాణము"ను శ్రీభగవానుల సమక్షమున చదివి వినిపించెను. అందు శ్రీరమణుఁడు వరుఁడుగానూ జ్ఞానము

ఆయనవధువుగానూ నిర్దేశింపఁబడినారు. ఆ వివాహమహోత్స వము పెండ్లిపాటలతోసహా సాంగోపాంగముగా వర్ణింపఁబడినది. శ్రీభగవానులు నవ్వుకొనుచూ అక్కడక్కడ పరిహాసపూర్వక వ్యాఖ్యానములు చేయుచూ ఆ కథనమును సావధానముగా చిత్తగించిరి. అంతట నావైపు తిరిగి శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి:

"మీరు స్వామికి షష్టిపూర్తివివాహముగుఱించి అంతగా సంకోచించితిరే, దీని కేమనెదరు? ఇది సర్వక్రియలతో ఆమతింపులతో అప్పగింతలతోసహా సంపూర్ణమైన పెండ్లి! ఒకస్వామిని పెండ్లికి లాగుకొనివచ్చి జ్ఞానమునో మఱొక దానినో పెండ్లికూతురిని జేసి అతనికిఁ గట్టిపెట్టుట చాలా మందికి ఎందునల్లనో అభిమతము. బహుశా అందలి రసా భాసము వాళ్లకు రుచించును కాఁబోలు."

నేను మనవిచేసితిని:

"శ్రీభగవానులను మేము సన్న్యాసిమాత్రునిగా భావిం పము. వాస్తవముగా శ్రీభగవానులు మేటిగృహస్థులు. ఈ యాశ్రమమే ఆయనకు నిత్యకల్యాణమంటపము. శ్రీభ గవానులు తనను బరిత్యజించినందులకు వివాహము ఈ కావ్యరూపమున కసిఁ దీర్చుకొనుచున్నట్లు తోఁచు చున్నది!"

ఈ మాటలు విని శ్రీభగవానులు గొల్లున నవ్విరి. ప్రసంగ వశమున శ్రీభగవానులు యం. వి. రామస్వామయ్యర్!

ఈ విధముగానే తనపై ఒక ప్రేమకావ్యమును "రమణశృంగారము" అని పేరు పెట్టి రచించినారని తెలియఁబడెచిరి. ఈముచ్చటకు ముగింపుగా శ్రీభగవాను లిట్లు పలికిరి:

"జనులు వాళ్ళ మనస్సులలో ఏమేమి కలదో దానినంతా స్వామి కారోపింతురు. పోనిండు, ఆవిధముగా వాళ్లను తృప్తి పడనిండు."

నేను తిరిగి వచ్చునప్పుడు మార్గమధ్యమున ఒక వీడ్కోలుపద్యము వ్రాసి ఆశ్రమమునకుఁ బంపుకొంటిని. అదే యిది :

" పుట్టింటఁ బండుగమూన్నాళ్లు గడవంగ నత్తయింటికిఁ బోవు
నబలసరణి,
పలుక్రీడ లాడుచు సెలవులు మూగియంగ బడివంక నడుగిడు
బాలునిగతి,
ఆత్మబంధువులైన యందఱి వీడ్కొని భండనమ్మున కేఁగు
భటునిభంగి,
ప్రభువైనయట్లు స్వప్నమ్మును గని యంతలోన మేల్కని
బిచ్చగానిపగిది,

" రమణఋషి జయంత్యుత్సవప్రమదవార్ధి
మగ్నమై మానసమ్ము తన్మయము గాఁగ
మూఁడునాళ్లేఁగ, భగవాను పుణ్యపదము
వదలి యూరికిఁ బోవంగవలసె, నకట! "

ఆశ్రమము వారు ఈపద్యమును చిత్తగించి 18-1-1941 తేదిన ఇట్లు వ్రాసిరి:

"భక్తిప్రేమరసప్రపూర్ణమై హృద్యమైన మీ పద్యమును ఇచ్చటి మా నోటుపుస్తకములో వ్రాయించినాము. అది గంభీరభావస్ఫోరకమై యున్నది."

నేను తిరిగీ యిల్లు చేరుసరికి నాఁస్నేహితుఁడు శ్రీ పి. టి. గోపాలాచార్యులు తన పితృపుత్రుల యనారోగ్యమును గుఱించి మిగుల దిగులుపడుచున్నట్లు తెలియవచ్చినది. నేను తెచ్చిన ప్రసాదమును ఆయన కిచ్చి ఆయన ప్రార్థనను ఆశ్రమమునకు తెలియఁబఱచితిని. శ్రీభగవానుల యనుగ్రహము వలన ఆ యస్వస్థు లిరువురును కోల్కొనిరి.

తెలుఁగు ఉగాదినాఁడు అనఁగా 1941 మార్చి 28 వ తేదీ నేను శ్రీభగవానుల నుద్దేశించి యీ క్రింది ప్రార్థన పద్యమును రచించితిని:

"వృష నశియించును గావుత,
రుషయున్ ద్వేషము నశాంతి రూపఱుత యిలన్
వృషవాహనసుతుసదయన్
'వృష' చిత్సుఖ మొసఁగుత యని వేఁడెద, రమణా"

దీని నందుకొని ఆశ్రమమువారి ట్లుత్తరము వ్రాసిరి:

"ప్రపంచము దేనికై ప్రాకులాడుచున్నదో ఆ ధర్మసహిత శాంతి శ్రీభగవానుల యనుగ్రహమువలన ఈ సంవత్సరములో నెలకొల్పఁబడునుగాక యని ఆశించుచున్నాము."

ఈ సంవత్సరము మహాపూజ మేనెల 19వ తేది వచ్చెను. నాతమ్మునకు కొమారుఁడు పుట్టినందున అప్పుడు నాకు జాతాశౌచము కలిగియుండెను. ఆ యశౌచముతో నేను మహాపూజకు రావచ్చునా అని ఆశ్రమమువారిని బ్రశ్నించితిని. అందులకు వారు మే 14వ తేదీ ఇట్లు ప్రత్యుత్తరము వ్రాసిరి:

"జాతాశౌచము కారణముగా ఆశ్రమయాత్రకు వాయిదా వేసికొన నక్కఱలేదు. అన్ని యశౌచములకూ అఘమర్షణస్నానమువంటిది గదా ఈ యాత్ర."

మహాపూజాదినమున శ్రీభగవానులు ఈక్రింది పద్యమును రచించిరి:

"తొలి యరుణాచలలింగము
కలిగెను ధనువునెల నార్ద్ర ఘనలింగమునన్;
వెలివడు శివుని హరిసురలు
గొలిచిన దినమె శివరాత్రి కుంభపునెల నా."

ఆ మఱునాడు దాని ననుకరించుచూ నేను శ్రీభగవానుల జననమును గుఱించి యొకకందపద్యము నిట్లు రచించితిని;

"తొలి యరుణాచలలింగము
కలిగిన యా పుణ్యదినమె స్కందాంశఁ దిరు
చ్చులి నలఘుసుందరతపః
ఫలమై జన్మించె రమణభగవానుండన్."

ఈపద్యమును శ్రీభగవానులు తమ నోటుపుస్తకములో తన పద్యముక్రింద వ్రాసిపెట్టుకొనిరి.

తర్వాత కొద్దిరోజులలో అప్పుడు చిత్తూరులోనుండిన మా తమ్ముఁడు వేంకటేశయ్యకు నేను ఒకబుట్ట మామిడిపండ్లు ఆశ్రమము పంపుమని వ్రాసితిని. ఆ జాబు సాయంకాలము వేసితిని. ఆ మఱునాటియుదయమే ఏ మాశ్చర్యము! మా తమ్మునివద్దనుండి మామిడిపండ్ల పార్సెలు వచ్చి చేరెను. రైల్వేరశీదుతోఁగూడా వచ్చిన జాబులో మా తమ్ముఁడు బజారులో మంచి మామిడిపండ్లను జూచినంతట వాటిని ఆశ్రమము పంపవలెనని సంకల్పము తనకు కలిగినట్లునూ వెంటనే వాటిని కొని రైలులో పార్సెలుచేసినట్లునూ వ్రాసియుండెను. ఇక్కడ నేను జాబు వ్రాయుట అక్కడ అతఁడు పార్సెలు చేయుట రెండూ సరిగా ఒకేసమయమున జరిగెను. శ్రీభగవానులు ముందటిరోజు నా జాబును జూచియుండిరి; ఈయుదయము ఈపార్సెలునూ మాతమ్ముని జాబును చూచి మందహాసముతో "ఇది నిజముగా ఆశ్చర్యమే!" అని సెలవిచ్చిరి. ఇదియూవాస్తవముగా శ్రీభగవానుల యనుగ్రహామహిమయే.

కొద్దిరోజుల పిమ్మట శ్రీ శేషుఅయ్యర్ శ్రీభగవానుల దర్శనార్థము రాఁగా, ఆయన రచించిన "రత్నము, బొగ్గు" అను శీర్షిక గల యాంగ్లపద్యమును శ్రీభగవానులు ప్రశంసించి దానిని 'శేషదర్శనము' అని పేర్కొనిరి. దానిభావమిది:

"రత్నము బొగ్గే, మరేమీ కాదు. మనస్సూ జడపదార్థమూ, రత్నమూ బొగ్గూ వంటివి. రత్నము తాను గ్రహించు కాంతిని ప్రతిఫలింపించి ప్రకాశించును. బొగ్గు తాను గ్రహించు కాంతిని అణంచుకొని నల్లగా నుండును. మనస్సు రత్నమువలెనే కోతపడకముందు మాలిన్యమూ మచ్చలూ కలిగియుండును.

రత్నమే రత్నమును గోసి మచ్చలను మాపఁగలదు. విచారమే అహంకార మను మాలిన్యమునూ అజ్ఞాన మను మచ్చలనూ మాపఁగలదు.

కోతపడిన రత్నములు అత్యంతశుద్ధకిరణములు గలయప్రతిమానములై తళతళలాడును.

(అట్లే) ఆత్మవిచారము నిన్ను స్వయంప్రకాశవంతునిగా సర్వప్రకాశకునిగా నొనర్చుఁగావుత."

ఈమాటలు నే నాశ్రమము రాఁగానే దిగ్భ్రమ గలిగించు నొకవార్త వింటిని. శ్రీభగవానులు పాకశాలకు పోవుట మానివేసినారు. మిగిలియుండిన మజ్జిగను పులుసులో వాడుఁడని శ్రీభగవానులు చెప్పఁగా వంటింటివారు అట్లు చేయక దానిని పారఁబోసిరఁట. ఆనాఁడు మొదలు శ్రీభగవానులు వంటింటి ముఖము చూడలేదు. పరిచారకు లెంత మొఱపెట్టుకొన్ననూ ప్రాధేయపడిననూ శ్రీభగవానులు వినిపించుకొనలేదు. ఈ వార్త నాహృదయముమీఁద పిడుగుపడిన

ట్టుయ్యెను. ఏలన దీనివలన శ్రీభగవానులతోఁ గలసి కూర్చుండి ముచ్చటలాడు మహాద్భాగ్యము నింకఁ గోల్పోయి తినిగదా! అందుమీఁద నేను "పాకశాలావిలాపము" అను శీర్షికతో ఈక్రింది పద్యములను రచించితిని:

"రమణాశ్రమమ్మున రాత్రి మూఁడయ్యెఁ;
బ్రమద మ్మెసంగఁ గాల్యములను దీర్చి
పాకగృహమ్ము లోపలికి నేఁగితిని;
నాకంటి కపుడు వింతగఁ దోఁచె గృహము;
కాంతివిహీనమై కనుపట్టె నద్ది;
స్వాంతమ్మునన్ గ్రమ్మె సంతమసమ్ము;
ప్రాణిసంచారమ్ము పరఁగ దయ్యెడను;
శోణాద్రిరమణుండు చూపట్టఁ డకట! ;
కన మేల శాకపాకముల కార్యములు?
అనఘుండు భగవానుఁ డగపడఁ డేల?
ఇటులు మానసమునం దేను జింతింపఁ
దటుకున స్ఫురియించెఁ దన్వి యొకర్తు;
ఒడలెల్లఁ బొగచూరియున్నట్లు తోఁచెఁ;
గడుగడు దీనమై కన్పించె మొగము;
కన్నీరు ధారయై కాఱుచుండఁగను
అన్నాతి యేడ్చి యిట్లనె గద్గదముగ
'పాకశాలాధిదేవత, నో కుమార

భగవదారాధనఁ నాకుఁ బాలు గలదు;
రమణు నుపలాలనమున డెందము రహింప,
మేలి యానందవారాశిఁ దేలుచుంటి.

ఈవేళకే నిత్య మిటకు విచ్చేయును; తాఁ గూరగాయలు తఱుఁగు విభుఁడు,
అమీఁదఁ బచ్చడియైన దప్పళమైన నోనరించుఁ దాఁ జవు లూరునట్లు;
అంత దానిని దన యమృతహస్తమ్ముతో భక్తులకెల్లఁ దాఁ బంచిపెట్టు;
పనినేర్పు మూలానఁ బరమార్థమును దెల్పుఁ; జనవిచ్చి మంచి ముచ్చటల నాడు?

వంటపని నీచమను నపవాద ముడుగ,
అంతరంగికభక్తుల కాశ్రయంబ
నగుచు నే నసమానభాగ్యమ్ముఁ గంటి
భగవదుపలాలనకు నిట్లు పాత్ర మగుట.
ఇప్పు డా భాగ్యమునకెల్ల ముప్పు వచ్చెఁ;
దెలియ కెట్టి యవజ్ఞతఁ జలిపినానొ
రమణఋషికి నాపయి ననుగ్రహము తప్పె;
నా మొగముఁ జూచుటయు మానె నాథుఁ డకట!

అప్పచ్చళుల చవి చప్పనై పోయెను; సాంబారులో రుచి సన్నగిల్లెఁ;
బలు తెగ యూరుగాయల పాక మరుదయ్యె; అవియలు గంజి యన్నవియుబోయె;

కూరలు తఱుఁగుటఁ గూరిమి లోపించెఁ; బనివారి శ్రద్ధ తత్పరత లుడిగె;
గడబిడశబ్దముల్ తడబాటు సేతలు కొండికపోరపాట్లు మెండు కొనియెఁ

గానిపించెడఁ బూర్వముకరణి నిపుడుఁ
గాని పతి యుజ్జగించిన కారణమున
నాదు సౌభాగ్యగరిమ యణంగె నకట!
ప్రాణ మేఁగిన కాయమ్ముభాతి నైతి.
రమణు హృదయ మెన్నటికిఁ గరంగునొక్కొ,
నేర మింక నెన్నటికి మన్నించునొక్కొ,
మరల నెన్నండు నాపయిఁ గరుణ కలుగు
నొక్కొ యని యాసతో వేచియున్నదాన' ''

శ్రీభగవాను లీపద్యములను జదివి యెంతో సంతోషించిరి. తాము పాకశాలాపరిచారకులమ్రోల వాటిని బిగ్గఱగాఁ జదివి అర్థము చెప్పి ప్రతిపదము అభినయించి చూపిరి. కానీ క్రియాభాగములో మాత్రము "తాంబూలవిలాపము" గతియే దీనికినీ పట్టెను. మాటలలో మెచ్చుకోలుకన్న క్రియలో ఇంచుక మెత్తపడుట మేలుగదా అని నేను విన్నవింపఁగా, శ్రీభగవానులు నవ్వి యిట్లు సెలవిచ్చిరి:

"ఏవి యెట్లు జరుగవలెనో అట్లు జరిగితీఱును. వాటిని మార్పఁజాలము. ఇప్పుడు మీపనీ నాపనీ నిస్సంశయముగా

పూర్తియైనవి. ఇంకమీఁద మనము విరామ మనుభవింప వచ్చును. ఇదంతా మేలుకే వచ్చినది. ఎల్లకాలమూ వీళ్లు నామీఁద ఆధారపడఁగూడదు. తమంతట తామే పనులు చేయుట నేర్చుకోవలెను. కాఁబట్టి మీరు దీనినిగుఱించి బెంగ పెట్టుకోవద్దు."

శ్రీభగవానుల యీవాక్కులు అనుగ్రహప్రపూర్ణములైననూ, అప్పుడు వాటివలనఁగూడ నాహృదయమున కంతగా ఊఱట చేకూఱలేదని నే నొప్పుకొనక తప్పదు.

ఈసారి నా యిద్దఱు కొమార్తెలు- తొమ్మిదేండ్ల లలిత, ఆఱేండ్ల యిందిర-నాతోఁగూడా వచ్చి కొద్దిరోజులు ఆశ్రమములో ఉండిరి. లలిత శ్రీభగవానులకు ప్రాతచుట్టము, ఇందిర క్రొత్తచుట్టము. మామూలుప్రకారము శ్రీభగవానులు ఇద్దఱు పిల్లలను హాలులో పాడుమనీ ఆడుమనీ అడిగిరి. ఇందిర వెంటనే ఆరంభించెను. కానీ లలిత యిప్పుడు కొంచె మెదిగి పెద్దపిల్ల యైనందువలన తన ప్రదర్శనము ప్రారంభించుటకు చాలా బుజ్జగింపు కావలసివచ్చెను. శ్రీభగవానులిట్లు పలికిరి.

"ఏమే లలితా, నే నింతవఱకు ఎవ్వరినీ ఏదీ అడిగినది లేదు. కానీ యిప్పుడు నాచేతఁగూడా అడిగించినావే. ఇందిరను చూడు. అది మంచిపిల్ల. దాని ననుకరించు."

అంతట ఆ యిరువురుపిల్లలూ కలసి పాడిరి, ఆడిరి. శ్రీభగవానులు లేచి కూర్చుండి తన యనుగ్రహానందములు పొంగి

పొరలు చూపులతో గమనించుచుండిరి. ఆ పిల్లలు ఆశ్రమములో నుండిన కొలందిరోజులూ ఈ 'వినోదము' శ్రీభగవానుల 'దర్బారు'లో నిత్యకార్యక్రమ మయ్యెను. ఒకనాడు ఇందిర తెలుఁగు ఉపదేశసారము గ్రంథప్రతి పుటలు తిరుగ వేయుచూ 'దేహం మృణ్మయవత్' అను శ్రీభగవానుల సంస్కృతశ్లోకము నాలుగుచరణములలో పెద్దవిగా అచ్చు పడిన మొదటిరెండక్షరములను గలుపుకొని 'దేహం-నాహం-కోఽహం-సోఽహం' అని బిగ్గఱగా చదివెను. ఇది విని శ్రీభగవాను లిట్లనిరి :

"భేష్! అది చాలు, శ్లోకములో తక్కినమాటలు చదువ నక్కఱలేదు. నీవు చదివినదే వేదాంతసారము. దానినే మంత్రముగా జపించుకో"

శ్రీభగవానులు ఇందిరను జూచినప్పుడెల్ల "ఏదీ నీ మంత్రము చెప్పు" అని అడుగుచుండిరి. కావున అది ఆమెకు కంఠపార మయ్యెను.

ఒకనాఁడు సాయంకాలము లలిత పెండలకడ భోజనము చేసికొని ఆడువాళ్లతోఁగూడ పట్టణమునకు పోయెను. ఇందిర ఒంటరిగా ఉండి నావైపు తిరిగి 'ఆకలి' అనెను. వెంటనే శ్రీభగవాను లది విని ఆబిడ్డ కింతవఱకు అన్నము పెట్టించనందులకు నన్ను తీవ్రముగా మందలించిరి. "బిడ్డను చక్కఁగా చూచుకో లేకుంటే మీధ్యానమున కేమి విలువ?" అని వారు సెలవిచ్చిరి.

బిడ్డలపై శ్రీభగవానుల కృపాకటాక్షమంత సమృద్ధిగా నుండెను.

ఆపిల్ల లిరువురు ఊరికి ప్రయాణమగుచూ శ్రీభగవానుల వద్ద సెలవు పుచ్చుకొనుటకు వచ్చిరి. అప్పుడు ఉదయము. శ్రీభగవానులు కొండమీఁదికి బయలుదేఱుచుండిరి. వారు ఇందిరను ఎంతో ప్రేమతో వీపు తట్టి కొండవైపు చూపుచూ "నీవు నీయూరికి పోవుచున్నావు. నేను నాయూరికి పోవుచున్నాను" అని పలికిరి. ఆపలుకు సార్థక మగునట్లు అదే వాళ్ల యిరువురి కడపటి వీడుకోలుగాఁ దేలెను. ఇల్లు చేరిన తర్వాత పిల్ల లిరువురు నాకు జాబు వ్రాసిరి. లలిత యిట్లు వ్రాసెను:

"నానమస్కారములు శ్రీభగవానులకును శ్రీ చిన్నస్వామి గారికిని కల్యాణసుందరమయ్యరుగారికిని తెలుపవలసినది.

నేను ప్యాసు అయినానని భగవానులతో చెప్పవలెను."

ఇందిర యిట్లు వ్రాసెను:

"మేము ఎప్పుడూ శ్రీభగవానులను ధ్యానించుకొంటున్నాము. శ్రీభగవానులకు నానమస్కారములు తెలిపేది"

ఈలేఖలను దిలకించినప్పుడు శ్రీభగవానుల వదనారవిందమున దివ్యానుగ్రహ తేజము తొణకిసలాడెను.

రెండేండ్లపిమ్మట నేను రచించిన "ఇందిరాతారావళి" అను స్మృతికావ్యములో పై యుదంతముల నిట్లు స్మరించితిని:

"అరుణాచల రమణాశ్రమ
మిరుమాఱు లలంకరించి ఋషిరాడ్వాత్స
ల్యరసమ్ముఁ జూఱగొంటివె;
ధర నీవే యిందిరమ్మ, ధన్యవు సుమ్మా.

అలయపు డాశ్రమాలయమునందు మహర్షులమ్రోల, జంటచి
లక్కల చెలువొప్ప, స్వామి మిముఁ గాంచుచుఁ దన్మయవార్ధిఁ
దేలఁగా,
లలితయు నీవుఁ బాడుచును లాస్యము సల్పిన నాఁటిలీల హృ
త్ఫలకమునందు నేటికిని దాండవముం బొనరించు, నిందిరా.
'ఆఁకలి'యంచు నీ వనినయంతనె నాఁడు కృపన్ గరంగుచున్
వాకొని 'రేల జాగిటు లొనర్చితి, వీ పసికూన యెంతగా
నాఁకట సోలె నక్కట!' యటంచు మహర్షులు; నేఁడు నిన్నె నేఁ
బోకడపెట్ట, నెట్టివెతఁ బొందుదు, రే మనుకొందు, రిందిరా!

'దేహం' 'నాహం' 'కోఽహం'
'సోఽహ' మ్మని నీవు చదువ, 'శ్రుతి యిదె' యని యెం
తో హర్షించె మహర్షి, య
దే హృది నిడి యిందిరమ్మ, దేహము విడితే!
'మీరు మీ యూరు, నేను నా యూరు పోద'
మనుచుఁ జతురమ్ముగా మీ ప్రయాణవేళఁ
దాను కొండ నెక్కుచు భగవానుఁ డనిపె;
ఇప్పు డేయూ రనిపిరమ్మ, యిందిరమ్మ!

నాఁడు రమణాశ్రమమ్మును వీడి తరలు
టిచ్ఛగింపక యెంతగా నేడ్చితమ్మ!
'నిన్ను భగవత్పదమ్మందె నిలుపనైతి
నేల? యని నేఁడు చింతింతు నిందిరమ్మ."

ఒకనాఁటిరాత్రి శ్రీభగవాను లెంతో దయతో నా యల్లుని యారోగ్యమును గుఱించి ప్రశ్నించిరి. అప్పుడు కొన్ని మాసములుగా ఆయన యనారోగ్యము ఆందోళన కలిగించు చుండెను. నేను నా గృహక్లేశములనుగూర్చి మనవిచేసికొనిన దంతయూ చిత్తగించి శ్రీభగవాను లత్యంతసానుభూతితో నిండుకటాక్షము నామోముపై నెఱపుచూ దయార్ద్రవాక్కుల నిట్లు పలికిరి:

"ఏమండీ, మీరు నావలె ఉండలేరా? నేను తిరువణ్ణామల వచ్చినప్పుడు ఏస్థితిలో ఉండినదీ మీకు తెలియునుగదా. ఆ కాలమున నేను ఊరిలో తిరిగి బిచ్చమెత్తుకొంటిని. ఆ దినములలో మౌనము పాటించుచుంటిని. కావున నేను వీధిలోఁ బోవుచూ ఒకయింటిముందు ఒకక్షణము నిలిచి మెల్లగా చేతులు తట్టుదును; దానికి జవాబు రానియెడల, సాగిపోవుదును. ఇట్లు నేనూ నాసహచరులూ సంపాదించిన కబళములను మేము ఒక్కమొత్తముగాఁ గలిపి తలకొక్క ముద్ద పంచుకొందుము. అట్లు దినమున కొక్కమాఱే భుజింతుము. మఱి నేఁడు బాహ్యముగా ఎన్నిమార్పులు

వచ్చినదీ, ఎన్నికట్టడములు లేచినదీ, ఆశ్రమ మెట్లు సర్వతోముఖాభివృద్ధిఁ గాంచినదీ చూచుచున్నారుగదా. కానీ నేనుమాత్ర మెప్పుడూ ఒక్కటిగనే ఉన్నాను. సూర్యుఁ డుదయించు చున్నాఁడు. సూర్యుఁ డస్తమించుచున్నాఁడు. ఇంతకుమించి వేఱేమార్పు నాకుఁ గనిపించదు. అట్లు మంచి రానీ, చెడ్డ రానీ, నావలె నుండండి. మీ కెప్పుడైనా చింతా వ్యాకులములు సోఁకునట్లుండె, నన్ను జ్ఞాపకము తెచ్చుకోండి''

శ్రీభగవానుల యీ యనుగ్రహవాక్కులు సర్వదా నా వీనులలో మాఱుమ్రోఁగుచూ జీవితమునందలి సకలాఘాతముల నుండి వజ్రకవచమువలె నన్ను రక్షించుచున్నవి.

ఒకనాఁ డుదయము శ్రీభగవానులు "Free India" (స్వతంత్రభారతము) అను పత్రికలో శ్రీజగదీశ్వరానందుల వ్యాసమునుండి యీ క్రింది వాక్యమును బిగ్గఱగాఁ జదివిరి.

"ప్రవృత్తిమూలమున దేవుఁడు తనను మఱచి మానవుఁ డగుచున్నాఁడు. నివృత్తిమూలమున మానవుఁడు తనను స్మరించి దేవుఁ డగుచున్నాఁడు."

నాఁటితపాలా వచ్చినప్పుడు వెరోనిక అను అమెరికన్ మహిళ వ్రాసిన లేఖనుండి శ్రీభగవాను లీ క్రింది వాక్యములు చదివి వినిపించిరి:

"విశ్వాంతర్యామి కన్న స్వాంతర్యామియే అధికుఁడు"
"వ్యక్తమగుచున్న యీ యల్పాహము తెలుపఁజాలదు
కానీ నీ వెఱుంగుదువు."

రెండు దినములతర్వాత శ్రీభగవానులు ప్రసంగవశమున "భగవద్గీత"నుండి తన యుద్ధారములగు నీ రెండుశ్లోకములనుగుఱించి ముచ్చటించిరి :

"తేషామే వానుకంపార్థ మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా"
"జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరం"
[వారికే యనుకంప వహించి నే నాత్మభావస్థితుండనై ప్రజ్వరిల్లు
జ్ఞానదీపమున నజ్ఞానసంభూతమా చీఁకటి నాశమ్ముసేయువాఁడ;
జ్ఞానముచేత నజ్ఞాన మెవ్వారికి నాశమా వారికనంతరమ్మొ
జ్ఞాన మయ్యది చండభానునికైవడిఁ దానె వెలుఁగఁజేయుఁ దత్పరమును]

ఈ శ్లోకద్వయభావము 'భాగవతము'నం దీక్రింది యేకశ్లోకములోఁ గూర్పఁబడియున్నదని శ్రీభగవానులు సెలవిచ్చిరి:

"అరుణేనేవ బోధేన పూర్వే స త్తమసే హృతే
తత ఆవిర్భవే దాత్మా స్వయమే వాంశుమా నివ"

[అంధకార మరుణోదయముచేతవలె, అజ్ఞానము జ్ఞానముచేత నాశమొందినతత్క్షణమే ఆత్మ సూర్యునివలె తానుగా ప్రకాశించును.]

ఇదే భావము మాణిక్యవాచకర్ వచించిన "తిరువాచకము"నందు

"ఇన్రెనక్కరుళి ఇరుళ్ కడి న్దుళ్ళ త్తెళుకిన్ఱ ఞాయి ఱేపోన్రు" అను నేకచరణములోనే యిమిడియున్నదనియూ శ్రీభగవానులు చెప్పిరి. దాని తాత్పర్య మిది :

ఈనాఁడు నీవు నాయెడ ననుగ్రహమునంజేసి నామనస్సునుండి యంధకారమును పటాపంచలుచేయు సూర్యుఁడవై దివ్యతేజముతో ఉదయించుచున్నావు."

'జ్ఞానేనతు' అనిన గీతాశ్లోకములో 'ప్రకాశయతి' అను పదము ఔపచారికప్రయోగముగా గ్రహింపవలెనని శ్రీభగవానులు సెలవిచ్చిరి. ఏలయనఁగా 'తత్పరము' స్వయంప్రకాశకము, మఱి దేనిచేతను ప్రకాశింపఁబడునది గాదు. మఱియు ఆశ్లోకములోనే 'ఆదిత్యవత్' అనిన పదమును 'జ్ఞానం' అన్న పదముతోఁగాక 'తత్పరం' అన్న పదముతోనే అన్వయింపవలెనని శ్రీభగవానులు పలికిరి. ఇందులకు ప్రమాణముగా శ్రీభగవానులు "భాగవతము"నుండి మఱియొక శ్లోకము నిట్లుదాహరించిరి: "అవచ్ఛిన్నఇవాజ్ఞానా త్తన్నాశేసతి కేవలః

స్వయం ప్రకాశతే హ్యాత్మా మేఘాపా యేంఽశుమానివ"

[కేవలాత్మ అజ్ఞానముచే అవచ్ఛిన్నమైనదా అన్నట్లు తోఁచును, కానీ ఆ యజ్ఞానము నాశముకాఁగా, మబ్బు వీడిన సూర్యుఁడువోలె స్వయముగా ప్రకాశించును.]

ఆనా డుదయము ఒకభక్తురాలు మలబారుగంజి తెచ్చి వడ్డించఁగా, శ్రీభగవానులు దానిరుచి బాగున్నదని మెచ్చు కొనుచూ, దానిని 'అవియలు'తో కలిపి పుచ్చుకొనినయెడల ఇంకనూ బాగుండునని పలికిరి. అది విని నేను ఆ గంజీ, అవి యలూ ఆశ్రమములోనే తయారుచేయింపుఁడని సర్వాధికారిని వేఁడుకొంటిని. మూఁడవనాఁడు చేయించుటకు ఆయన దయతో అంగీకరించెను.

ఆ మఱునాఁడు శ్రీభగవానులు ప్రాసంగికముగా "భాగ వతము" 'హంసగీత'నుండి యీక్రింది శ్లోకము నుదాహరించిరి:

"దేహం చ నశ్వర మవస్థిత ముత్థితంవా
సిద్ధో న పశ్యతి యతో౽ధ్యగమ త్స్వరూపం
దైవా దపేత ముత దైవవశా దుపేతం
వాసో యథా పరికృతం మదిరామదాన్ధః"

తర్వాత 1946 లో శ్రీభగవానులే దానిని తెలుఁగులోనూ అఱవములోనూ అనువదించిరి: ఆంధ్రానువాద మిది:

"ఒడలు నశ్వర మది స్థితం బుత్థితంబొ
కర్మవశమున విడివడఁ గలయఁ గలదొ

తను నెఱింగిన సిద్ధుఁడు తనువుఁ గసఁడు,
గుడ్డను మదిరామదమున గ్రుడ్డివలెనె.”

ఆ దినము 1941 జూన్ నెల 16 వ తేది. ఆశ్రమపాక శాలలో అపూర్వకోలాహలము కనిపించెను. వేఁకువన చాలా పెందలకడనుండి అక్కడ అన్నిదీపములు వెలుఁగుచుండెను. నాఁడు ఆశ్రమనిబంధనలు సడలింపఁబడి స్త్రీపరిచారికలు వేఁకువన 3 గంటలనుండి మగవారితోఁగూడ పాకశాలలో పనిచేయుచుండిరి. శ్రీభగవానులే ఒక్కమాఱు వంటింటిగడప దాఁటి లోపలికి తొంగిచూచి సలహాలిచ్చి పోయిరి. ఏమిటి ఈ సందడి అంతా? నాఁటి యుపాహారము అల్పాహారమునకు గంజి, అవియలు తయారగుచున్నవి. ఈ వార్త దావానలము వలె వ్యాపించినది. భక్తబృందము బారులు దీఱి కూర్చుండి అందఱికీ దొప్పలు వినియోగ మైనప్పుడు భోజనశాల పెండ్లి పందిరివలె చూపట్టెను. అప్పటి వడ్డనలో ముఖ్యపదార్థములు గంజీ, అవియలూ. అవియలుతో గంజిని ఎట్లు పుచ్చుకొనవలెనో శ్రీభగవానులే తొలుత ఆరగించిచూపిరి. మామూలు పద్ధతినిగాక ఆ రెండుపదార్థములు పరిమితి లేకుండా పలుమాఱు వడ్డించఁబడెను. ఈ భక్ష్యవిశేషములను తుష్టిగా ఆరగించుటకై మేము ఆనాఁడైనా కాఫీ మానుకొన్న బాగుండునని శ్రీభగవానులు హెచ్చరించిరి. కాఫీ బదులు వారు త్రాఁగు కషాయమునుగూడా నాఁడు మానివేసి గంజియే

త్రాగిరి. కానీ కాఫీగతప్రాణులు చాలామంది కాఫీమానుటకు ధైర్యము చాలకుండిరి. మేము కొద్దిమంది మాత్రము ఎట్లో సాహసించి కాఫీ మానితిమి. కడమవారు లేచిపోయిన పిమ్మట శ్రీభగవానులు నావైపు తిరిగి "యేమండీ, నేటి యీభిక్ష మీ యేర్పాటంటనే. కావున మీరూ నావలెనే పూర్తిగా పుచ్చుకోవలెను" అనుచూ మఱికొన్ని దొప్పల గంజి త్రాగిరి. నేను నాకడుపు నిండిపదని యంటిని. కానీ శ్రీభగవానులు "భయపడకండి. అది యేమీ చెఱుపు చేయదు. అరగంటలో జీర్ణమైపోవును. అంతట మామూలుకన్న ఎక్కువ ఆఁకలి కలుగును" అని నాకు ధైర్యము చెప్పిరి. ఆ మీఁద శ్రీభగవానులు వేడుకచూపులతో రెండుదొప్పలు త్రాగిరి. నేనునూ వారి ననుకరించితిని. వా రది చూచి "భేష్! అట్లా త్రాగవలెను", అని హర్షించిరి. ఆవేళ శ్రీభగవానులు వర్షించిన యనుగ్రహ ప్రసారము మఱి యెన్నడును నేను చూడలేదు. నిక్కముగా అది దేవతలు వీక్షింపవలసిన దివ్యదృశ్యము.

శ్రీభగవానులు కొండ దిగి వచ్చుసరికి నేను "అమృత పానము" అను శీర్షికతో ఈ క్రింది రెండుపద్యములు రచించి వారికి సమర్పించితిని:

"గంజి త్రాగుటన్నఁ గడు నేవగింతురు;
కాని నేఁటికి భగవాను కరుణ
నారగించినాఁడ నవియలుతో గంజి;
అమృతపాన మనఁగ నదియె సుమ్ము!

తొల్లి గోపసఖులతో నారగించితే
చలిది, అదియు దీని సాటి యౌనె!
వెనుక విదురునింట విం దారగించితే
అదియు దీని సాటి యౌనె, దేవ!''

శ్రీ భగవానులు వీటికి తమ హర్షామోదములు తెలుపుచూ ఎంతో ప్రీతితో వీటిని బిగ్గఱగా చదివి వ్యాఖ్యానించిరి. మఱియు ప్రసంగవశమున హస్తినాపురమందు శ్రీ కృష్ణుఁడు దుర్యోధనుని రాచవిందు నిరాకరించి విదురునింట ఆతిథ్యమడిగి గైకొనిన గాధను శ్రీభగవానులు నుడివిరి. విదురునింటిలో ప్రవేశించి శ్రీకృష్ణుఁడు "గంజి ఉన్నదా?" అని అడిగిరఁట. ఆ గంజి తన చేతులలో పోయించుకొనుచూ అది ఒక్కబొట్టుగూడ చెదరి క్రిందపడకుండుటకై చిన్న చక్కని రెండుచేతులుగూడఁ జాపిరఁట! శ్రీకృష్ణునకు గంజి అనఁగా అంత యిష్టమఁట. శ్రీభగవానులు మఱియు నిట్లు చెప్పిరి. మలబారులో గంజియే అందఱికీ ఆహారము. ప్రభువు మొదలు పల్లెవానివఱకు, భాగ్యవంతులు, పేదవారు అను భేదము లేక గంజినే త్రాఁగెదరు. భాగ్యవంతులు దానిలో కొన్ని సుగంధవిశేషములు చేర్చి సేవింతురు. కానీ అసలు వస్తువొక్కటే. కావుననే మలయాళులకు 'గంజిత్రాఁగువారు' అని యొక మాఱుపేరు.

మఱునాఁడు శ్రీభగవానులు ఒక యాంగ్లభక్తుని లేఖనుండి 'యీస్టరు' పండుగను గుఱించి యీ క్రింది యాశయములు చదివి వినిపించిరి :

"'ఈస్టరు' అనంతవస్తువులోనికి నాయాత్మ పునరుజ్జీవనము అను భావమును నా తలంపునకుఁ దెచ్చుచున్నది."

"'ఈస్టరు' కు అర్థము హిమఋతువుమృతి, వసంతఋతు పునర్జన్మము. అనఁగా మనోనాశము, ఆత్మానందములోనికి పునరుద్భావము."

ఆ మఱునాటి యుదయము వేదపారాయణాంతమున 'న కర్మణా న ప్రజయా' ఇత్యాది మంత్రపఠనానంతరము శ్రీభగవానులు

"ఆ మంత్రములో పూర్వభాగము సద్యోముక్తినీ ఉత్తర భాగము క్రమముక్తినీ ప్రతిపాదించుచున్నది"

అని సెలవిచ్చిరి; మఱియు

"'పరామృతాత్' అనుచోట 'పర' అనుటకు 'బ్రహ్మ యువు'" అని యర్థము చెప్పిరి:

ఆ మఱునటిదినము "సీతారామాంజనేయము" ను గుఱించి ముచ్చటించుచూ శ్రీభగవానులు

"'అమనస్క యోగము' అనఁగా ప్రజ్ఞ లేకపోవుట గాదు, మనస్సు స్వరూపాకార మగుటయే"

అని నుడివిరి.

ఆ మఱునాటి సాయంకాలము ఒకాయన 'ప్రశ్నోపనిషత్తు' లో 'సర్వం పశ్యతి, సర్వః పశ్యతి' అను వాక్యమున కర్థ మడుగఁగా శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి:

"చూచువాఁడు చూడఁబడునది, చూపు అంతయూ తానే, తనకన్న వేఱుగాదు అని భావము. తననే సర్వము గాఁ జూచుచున్నాఁడు."

ఆ మఱుదినము శనివారము. నాటిరాత్రి శ్రీభగవానులు హాలువరాండాలో పరుండియుండిరి. నేను దానియెదుట అరుగుమీఁద పడుకొని యుంటిని. పదిగంటలప్పుడు శ్రీభగవానులు కృష్ణస్వామి అను పరిచారకునితో "నారాయణయ్యర్ వచ్చినారా?" అని బిగ్గఱగా అడిగిరి. కృష్ణస్వామి "రాలేదు" అని బదులుచెప్పెను. శ్రీనారాయణయ్యర్ పోలూరునుండి ప్రతివారాంతము వచ్చుచుండునతఁడు ఈ యాదివారము తనకు వేలూరులో ఏమో పని యున్నందున ఆశ్రమము వచ్చుటకు వీలు లేదని నాతో చెప్పియుండెను. కానీ ఆ యాదివారము ఉదయమే ఆయన ప్రత్యక్షమగుట నా కాశ్చర్యము కలిగించెను. అందుల కాయన యిట్లు సమాధానము చెప్పెను. ఆయనకు వేలూరులో పని శనివారము సాయంకాలముననే పూర్తిఅయ్యేనఁట. ఆ రాత్రియే పోలూరుకు తిరిగివచ్చి పదిగంటలప్పుడు మామూలుప్రకారము ఆశ్రమమునకు రావలెనని తటాలున నిశ్చయించుకొని బయలుదేఱెనఁట. అట్లు ఆయన సంకల్పమూ ఆయననుగుఱించి శ్రీభగవానుల సంప్రశ్నమూ ఏకకాలములో జరిగెను. ఇదియు శ్రీభగవానుల యనుగ్రహమహిమకు మఱియొక తార్కాణము.

ఆ యాదివారము శ్రీభగవానులు "The Spiritual Front" (ఆధ్యాత్మికరంగము) అను పత్రికనుండి యీ క్రింది భావము గల వాక్యమును జదివి వినిపించిరి :

"ఇది జ్ఞాపక ముంచుకో; మనము భావాతీతమగు పరమశాంతిని మన యంతరాత్మలో అనుభవింపఁ గలిగినప్పుడే, మనము బాహ్యప్రపంచములో సు వ్యక్తమగు శాంతిని సందర్శింపఁ గలిగెదము."

నాఁటి మధ్యాహ్నముమీఁద శ్రీభగవాను లొకకథ చెప్పిరి. ఒక మాంత్రికుని ప్రభావమున ఒక ప్రభువునకు తా నొకచండాలస్త్రీని వివాహమాడినట్లు వింతదృశ్యము పొడ కట్టెను. అది తర్వాత అట్లే వాస్తవముగా జరిగెను. గాధి యను బ్రాహ్మణుఁడు విష్ణుమాయాప్రభావము ననుభవించిన మఱియొక కథఁగూడా శ్రీభగవానులు చెప్పిరి. ఈ కథల పర్యవసానము శ్రీభగవాను లిట్లు తేల్చి సెలవిచ్చిరి :

"నీకు స్వప్నమాత్రముగా నుండునది మఱియొకనికి వాస్త వము కావచ్చును. మాయాస్వభావ మట్టిది. దానిని జయించుటకు మనోవిజయము తప్ప వే ఉపాయము లేదు"

శ్రీభగవానులు 'సృష్టిదృష్టివాదము'నకునూ 'దృష్టి సృష్టివాదము'నకునూ గల భేదమునుగూడా విశదీకరించిరి. ఇందు మొదటిది శ్రీకావ్యకంఠుల కభిమతము; రెండవది

శ్రీ కె. లక్ష్మణశర్మ కభిమతము. సృష్టిదృష్టివాదము ప్రకారము విశ్వము దేవుని సృష్టి; మానవుఁడు జ్ఞానసిద్ధిమూలమున దేవునిలో ఐక్యమగును. దృష్టిసృష్టివాదముప్రకారము విశ్వము దేవుఁడు ఉభయమూ మానవునకు బహిర్ముఖమానసము కలిగించు భ్రాంతియే. 'దేవుఁడు మానవభ్రాంతిజనితుఁ డెట్లగును?' అను ప్రశ్నకు "స్వప్నములో చనిపోయిన పితరుఁడుగానీ ఒక రాజుగానీ కనిపించి తాత్కాలికముగా కలగనువాని మనస్సులో పితృభక్తియో రాజభక్తియో పురికొల్పు తీఱుననే" అని యీ వాదమువారు సమాధాన మిత్తురు. పర్యవసానమున శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి :

"చూచువాఁడు లేక చూడఁబడునది-లోకములుగానీ దేవతలుగానీ-లేవు. ఆ దృశ్యము లన్నియూ చూచువాని మీఁదనే ఆధారపడియున్నవి. సమస్తదృశ్యముల ప్రయోజనము దృక్కును నిరూపించుటయే."

అటు పిమ్మట శ్రీభగవానులు యోగజ్ఞానములను గుఱించి శ్రీకావ్యకంఠుల యాశయము నిట్లుద్ఘాటించిరి :

"సుషుమ్నానాడి మూలాధారమునుండి ఊర్ధ్వముగా సహస్రారమునకు పోయి అచ్చటనుండి ముందువైపుగా దిగి హృదయమునకు చేరుననియూ అట్లు అధోముఖమైనప్పుడు దానికి 'పరానాడి' లేక 'అమృతనాడి' అని పే రనియూ నాయనగారి మతము. కావుననే జ్ఞానమార్గమునకు పూర్వ

మార్గమనియూ యోగమార్గమునకు పశ్చిమమార్గమనియూ పేరు. యోగమార్గమున మూలాధారములో కుండలిని లేచునట్లు, విచారమార్గమున అంతఃకుండలిని హృదయములో ఉజ్జ్వలించును.''

తర్వాత ఒక మంచిసంఘటనము జరిగెను. ఎచ్చమ్మ మేనల్లుడు కృష్ణమూర్తి, అతని నూతనవధువు తమ వివాహానంతరము శ్రీభగవానుల సందర్శనాశీస్సుల నర్థించి వచ్చిరి. శ్రీభగవానులు వెలుపల నెచ్చటనుండి యో అప్పుడే హాలులో తిరిగి ప్రవేశించిరి. వారు నేలమీఁద తన పాదములను మోపి సోఫాపై చక్కఁగా కూర్చుండిరి. వెంటనే నూతనదంపతులు శ్రీభగవానుల చరణకమలములపై సాష్టాంగప్రణామ మొనర్చిరి. శ్రీభగవానులు వారిమీఁద నిజానుగ్రహము వర్షించిరి. ఎచ్చమ్మ యపూర్వభక్తి కిది సహజఫలితముగా స్ఫురించెను. అప్పుడా దివ్యదృశ్యమును ఫోటోతీయుటకు నావద్ద 'క్యామెరా' ఉండిన ఎంత బాగుండు ననుకొంటిని.

ఇఁక నా ప్రయాణదినము వచ్చెను. నా యల్లునకు ఎక్కువ జబ్బుగా ఉండెనట. రెండు వారములుగా ఇంటినుండి జాబే రాలేదు. అతని యారోగ్యము మఱింత క్షీణించియుండవలెనని నా మనస్సు కలవరపడుచుండెను. నేను సెలవుపుచ్చుకొనుటకై శ్రీభగవానులవద్దకు వెళ్ళినప్పుడు, నాకుఁ గల యేకైకాశ్రయము వదలి ఒక యఘాతములో పడిపోవుచున్నట్లు

భయకంపితుఁడనై తిని. నేను వెక్కి వెక్కి యేడ్చుచూ ఇంటికి తిరిగివెళ్ళుట కెంత భయపడుచుంటినో శ్రీభగవానులతో మొఱపెట్టుకొంటిని. వారు తన యఖండదివ్యానుగ్రహాపూరిత సుదీర్ఘవీక్షణము నాపై నెఱపుచూ ఇట్లు సెలవిచ్చిరి :

"భయపడవద్దు. మీరు వచ్చుచున్నారుగదా అని మీ వాళ్ళు జాబు వ్రాయలేదు. మీరు వెళ్ళుసరికి మీ యల్లునికి చాలా నెమ్మదిగా ఉండును."

నేను తిరిగి యిల్లు చేరుకొన్నప్పుడు శ్రీభగవానుల వాక్కులు యథాక్షరము సంపూర్ణముగ సఫలమగుటఁ గాంచి యెంతో సంతోషించితిని. అది యెంత హృద్యమైన శ్రీభగవదనుగ్రహ మహిమ !

1941 ఆగస్టు, 6-వ తేది సాయంకాలము నేను "ఉళ్ళదు నార్పదు - అనుబంధము" ను నా నోటుపుస్తకమందు తెలుఁగు లిపిలో వ్రాసికొనుచుంటిని. అందు సరిగా 'దేవ నార్?' (దేవుఁ డెవరు?) అను నక్షరములు వ్రాయుసరికి, 5-8-1941 తేది గల యాశ్రమలేఖ శ్రీ వి. వి. రమణయ్యా అను నొకాయన తీసుకవచ్చి నాచేత నుంచెను. ఆ లేఖాంతమున 'శ్రీరమణుల యనుగ్రహాశీర్వాదములతో' అను మాట లుండెను. తత్క్షణమే ఇది అత్యంతసాభిప్రాయముగా నామదికి తోఁచెను. 'దేవుఁ డెవరు?' అను ప్రశ్నకు వెంటనే 'శ్రీరమణుఁడే దేవుఁడు' అను నుత్తరము వచ్చినట్లును, ఆ యుత్తరము 'శ్రీరమణుఁడే' స్వయముగా ప్రసాదించినట్లును నాకు స్ఫురించెను.

1941 ఆగస్టు ఆఖరుదినము. నా రెండేండ్లబిడ్డ అలగమ్మకు ఆ దినమంతా హెచ్చుజ్వరము కాయుచుండెను. ఆరాత్రి ఆమెతల్లి భోజనముచేయుచుండఁగా, నేను ఉయ్యాల ఊపుచుంటిని. తటాలున ఆబిడ్డ ఒకపెద్దకేక వేసెను. నేను ఆమెను నాచేతులలో ఎత్తుకొనఁగా ఆమెదొడలు బిగిసికొని యుండెను. అన్నినాడులు పనిచేయక స్తంభించెను. ఒడలిరంగు గూడ నలుపుతిరిగెను. అన్ని మృతిలక్షణములు కనిపించెను. ఆమెకు మందిచ్చుచుండిన వైద్యుఁడు అప్పుడు వచ్చిచూచుటకు నిరాకరించెను. మఱియొక వైద్యునిఁ బిలిపించితిమి. ఇంతలో నాభార్య ఆ బిడ్డను నా చేతినుండి తీసుకొని శ్రీభగవానుల పటముముందు కూర్చుండి ఆమెను తనయొడిలో పెట్టుకొని, భయార్తిచిహ్నమావంతయుఁ జూపక 'రమణా' 'రమణా' 'రమణా' అని నిరంతరము నామోచ్చారణము చేయుచుండెను. సుమారు పదినిమిషము లిట్లు సంకీర్తనము జరుగఁగా, ఆ బిడ్డలో జీవలక్షణములు పొడకట్టెను; నాడులు తిరిగీ పని చేయ నారంభించెను. ఇది కేవలము భగవన్మహిమయే, అంతట రెండవవైద్యుఁడు వచ్చి ఆమెకు వలయు చికిత్స చేసెను. నాభార్య సంకీర్తన చేయుచుండఁగా నేను అలగమ్మ పరిస్థితిని మనవిచేయుచూ, అనుగ్రహము నర్థించుచూ శ్రీభగవానులకు తంతె పంపుకొంటిని. అది చేరినవైనము తెలుపుచూ ఆశ్రమమువారు 1-9-1941 తేది గల లేఖలో ఇట్లు వ్రాసిరి:

"తంతె సకాలమునకు చేరి శ్రీభగవానులచే కటాక్షింపఁబడినది. శ్రీభగవానుల యనుగ్రహమువలన, అలగమ్మ

జబ్బునుండి కోలుకొనఁగలదు. ఈపాటికి గండము గడచి యుండవలెను''

ఆ బిడ్డ కేవిధముగా పునర్జీవము కలిగి నెమ్మదియైనదీ నేను మనవిచేయఁగా, ఆశ్రమమువారు మరల 3-9-1941 తేదిన ఇట్లు వ్రాసిరి:

"నీ జాబు చదివి సంతోషించితిమి. ... శ్రీభగవానుల యపారానుగ్రహమే మనకు శ్రీరామరక్ష. అది అమోఘము. అంతకన్న మనకు మఱేమి కావలెను? అంతకన్న చెప్ప వలసిన దేమున్నది?"

ఆవెనుక దశరా శెలవులలో నేను ఆశ్రమమందున్నప్పుడు శ్రీభగవానులు శ్రీశంకరానందభారతిస్వామినిగుఱించి ముచ్చటించిరి. ఆ స్వామి ఒకప్పుడు హిమాలయపర్వతములో బ్రహ్మసాక్షాత్కారముకొఱకు సాధనచేయుచుండెను. అప్పటి కాయన శ్రీరమణులపేరే వినలేదు. పర్యవసానమున ఆయనకు ఒక దివ్యతేజోమూర్తి సాక్షాత్కరించెను. తర్వాత ఆయన శ్రీభగవానుల చిత్రపటమును జూచి తనకు సాక్షాత్కరించిన మూర్తి శ్రీరమణులుగా గుర్తుపట్టెను. అట్లాయన బ్రహ్మ స్వరూపమే శ్రీరమణులని గుర్తెఱిఁగి అచ్చటనుండి దూర మనక తిరువణ్ణామలకు పయనించి శ్రీభగవానుల దర్శనార్థ మేతెంచెను. ఆయన శ్రీభగవానులతోఁగూడ కొండపై

కొంతకాలముండెను. ఇచ్చటి శీతోష్ణస్థితి ఆయన యారోగ్యమునకు సరిపడనందున ఆయన విధిలేక మరల హిమాలయమేఁగుటకు శ్రీభగవానుల యనుమతి కోరవలసివచ్చెను. వీడ్కోలుసమయమున ఆయన "ప్రార్థనాఅష్టకం" అను శీర్షికతో చరమశ్లోకముతో సహా తొమ్మిది శ్లోకములు రచించి శ్రీభగవానుల పాదపద్మముల కర్పించెను. వాటిలో ఆయన తన హిమాలయవాసమును భగవత్సాక్షాత్కారమును అభివర్ణించి శ్రీభగవానుల యీ దివ్యవిగ్రహమే తన హృదయములో నిరంతరము తేజరిల్లుచుండవలెనని ప్రార్థించెను. ఆ శ్లోకములను శ్రీభగవానులు నాకు దయచేయఁగా నేను వాటిని నా నోటుపుస్తకములో ఇట్లు వ్రాసికొంటిని :

"గన్తుం న శక్యతే స్వామిం స్త్వాం త్యక్త్వా దుర్లభం
నృణాం,
అతః కిం కరణీయం భో కృపయా వద మాం మునే.
హరిద్వారాదిమం రూపం పురా దృష్టం మయా విభో,
తతో మాయామనుష్య స్త్వ మితి నిశ్చితవా నహం.
జానే త్వాం పరమాత్మానం సర్వస్థం మమహృది స్థితం
న ఘోష్యతే మయా తేఽద్య చరితం మునిపుఙ్గవ.
త్వద్ధ్యాననిరతా స్సర్వే ముక్తిభాజో న సంశయః,
అత స్త్వత్పాదభక్తేషు భక్తిరేవ సదాఽస్తు మే.
న శుశ్రూషాదికం కర్మ కర్తుం భాగ్యోఽస్మి మద్గురో,
తథా ప్యనన్యశరణే మయి పాతయ వీక్షణం.

అజానతా కృతం సర్వం క్షమస్వ కృపయా ప్రభో,
భవసాగరమగ్నం మాం పాలయస్వ మహామతే.
స్త్ర్యన్యతీర్థతటే వాసో న సుఖా యోపపద్యతే,
తస్మాన్మాం శరణాపన్నం ప్రేమ యాహి హిమాలయం.
ఈదృశం భవతో రూపం మాయామానుషవిగ్రహం
హృది మే సతతం భాతు నాన్యం యాచే వరం విభో.
గిరివరరన్ధ్రనివాసిన్,
సరసిజసంభూతసేవ్య, రమణగురో,
గిరిజాజ్ఞస్థితభూమన్,
కృపయా మాం పాహి ఘోరసంసారాత్."

ఒకయుదయము శ్రీభగవానులు "The Vision" (దర్శనము) అను పత్రికను దిలకించుచూ అందు సి. యస్. బాసి రచించిన యీ క్రింది తాత్పర్యము గల వాక్యరత్నమును జదివి వినిపింపఁగా నేను వ్రాసికొంటిని:

"దేవుని వ్యాకరణములో, ఏకవచనము తప్ప వేఱు సంఖ్య లేదు; ఉభయార్థకము తప్ప వేఱు లింగము లేదు; వర్తమానము తప్ప వేఱు కాలము లేదు, ఉత్తమపురుషము తప్ప వేఱు పురుషము లేదు."

మఱియు శ్రీభగవానులు తమపై శ్రీసుందరానంద స్వామి రచించిన హాస్యచమత్కార పూరిత శ్లోకములు రెండు

నాకుఁ జూపించిరి. వాటిలో ఆ స్వామి శ్రీభగవానులను ప్రథమమున ఒక మహామాంత్రికునిగానూ, ద్వితీయమున నవగ్రహములుగానూ సరిపోల్చినారు. వాటినికూడా నేను వ్రాసికొంటిని. అవే యివి :

"జ్యోతిర్లిఙ్గమయారుణాద్రికటకే చిత్రం మహామాన్త్రికః
కశ్చిద్దీప్యతి సచ్చిదాత్మనిరతో విశ్వాత్మవశ్యః సుధీః
మాయోచ్చాటన మోహమోహన జడావిద్వజ్జనస్తంభన
క్రోధద్వేషణ జన్మమారణ మహాసంపత్సమాకర్షణైః.
మోహధ్వాన్తనివారణే తపనతాం, మాహ్లాదనే చన్ద్రతాం,
క్షేమే మఙ్గలతాం, వినమ్రజనతాసన్దర్శనే సౌమ్యతాం,
సచ్ఛాస్త్రే గురుతాం వివాదకవితాం, దోషగ్రహే మన్దతాం,
విజ్ఞానేసతి కేతుతాం చ రమణో యోగీ భజన్ భాసతే"

నాఁడు పౌర్ణమి. మామూలు ప్రకారము శ్రీభగవానులు క్షురకర్మఁ గావించుకొనిరి. ఆ మధ్యాహ్నము మీఁద అందఱము హాలులో చేరినప్పుడు శ్రీభగవానులు నవ్వుచూ ఇట్లు సెలవిచ్చిరి :

"నేను గడ్డమెదిగిన ముదుసలిగా నుండి యిప్పుడు శిశువుగా మాఱినాను! వాస్తవముగా జ్ఞానమే నిత్యశైశవము."

ఆదినము నాకు ఒక యపూర్వసంఘటనము సంభవించెను. అది శనివారము. నేను మఱునాటి సోమవారము కాలేజికి హాజరుకావలెను. కావున ఆ మధ్యాహ్నము నేను బయలు

దేఱ నిశ్చయించుకొంటిని. ప్రయాణసన్నాహమంతయూ చేసి కొని శ్రీభగవానుల వద్దకు నమస్కారపూర్వకముగ సెలవు గైకొనుట కేఁగితిని. అట్టి సందర్భములలో శ్రీభగవానులు "సరే, పోయిరండి" అని చెప్పెదరు, లేదా ఊరక తల యూపెదరు. కానీ యీసారి శ్రీభగవానులు "మీ౦ కాలేజి సోమవారముకదా తెఱచునది; యిప్పుడే యేల పోవలెను?" అని పలికిరి. నేను వెంటనే "అయితే యిప్పుడే నేను పోను, ప్రయాణము నిలుపుకొనెదను" అని బదులుపలికితిని. ఆ మధ్యాహ్నము మీఁద శ్రీభగవానులు నాయెడ విశేషానుగ్రహము చూపిరి. ఎక్కువ శ్రద్ధ తీసికొని నాకు మలయాళలిపి నేర్పిరి. ఆ సాయంకాలము వారు కొండకు వెళ్లుచుండఁగా నేను మరల "ఈ సాయంతనము బండికి పోవుదునా?" అని యడిగితిని. "ఈ బండి నేరుగా గూడూరికి పోవునా?" అని వారు ప్రశ్నించిరి. "లేదు, కాట్పాడిలో రాత్రికి నిలుచును" అని నేను జవాబు చెప్పితిని. అందుమీఁద శ్రీభగవానులు "అట్లయితే రాత్రి కాట్పాడి స్టేషనులోఁ గడపుట యెందుకు? ఇక్కడనే ఉండిపోవచ్చునే" అని సెలవిచ్చిరి. నేను మరల నాప్రయాణము వాయిదా వేసుకొంటిని. ఆ మఱునాఁడు వేకువ బండియే నాకుఁ గడపటిది. కావున ఆ వేకువ సుమారు 5 గం టలప్పుడు నేను శ్రీభగవానుల దర్శనార్థము వెళ్లితిని. నన్ను చూడఁగానే శ్రీభగవానులే పలుకరించి "ఫలాహారము పుచ్చు కొన్నారా? సామానులు సరుదుకొన్నారా?" అని యడిగిరి-

నేను "ఔ" నని చెప్పి నమస్కారము చేసితిని. నేను తిరిగి లేచి నిలఁబడఁగానే నాపై శ్రీభగవానుల దృష్టి పూర్తిగా మాఱియుండెను. వారి కనులు విచ్చికొని నిశ్చలగంభీరములై తోఁచెను. వారు నాద్వారా నన్నధిగమించి యఖండవస్తువు లోనికిఁ జూచుచున్నట్లు కనిపించిరి. అంతకుము న్నెన్నడూ నాపై శ్రీభగవానులట్టి దృష్టి ప్రసరించినది లేదు. తొలుసారిగా నేను విశ్వరూపసందర్శనముస అర్జునునివలె నైతిని. నేను కేవల భగవద్విభూతికి ముఖాముఖి నిలిచినట్లు తోఁచెను; పరవశుఁడ నైతిని. అయిదు నిముసములు, పదినిముసములు ఇట్లు సాఁగెను. బండివాఁడు తొందఱచేయుచుండెను. "నేను సెలవుపుచ్చు కొనెదను" అని గొణిగితిని. కానీ జవాబు రాలేదు. ఆ దేదీప్య మాన దీర్ఘదృష్టిలో ఒకించుకేని మార్పు కానరాలేదు. అట్లు నేను భయవిభ్రాంతుఁడనై వచ్చివేసితిని. ఇది గమనించిన ప్రతి యొక్కరూ ఇప్పుడు శ్రీభగవానులు నన్నుఁ జూచినతీఱు అపూర్వమనియూ, ఇది నాజీవితములో ఏదో గొప్ప మార్పు నకు సూచన అనియూ అభిప్రాయపడిరి. ఈ జోస్యము తరు వాత మూఁడు నెలలలో నాయింట సంభవించిన విపత్తువలన ధ్రువపడెను. పిమ్మట నేను రచించిన "రమణసందేశము"లో ఈ వీడ్కోలును గుఱించి యిట్లు వ్రాసితిని:

"శరదారంభమహోత్సవాంతమున నీ సాన్నిధ్యముఁ
వీడుచో,
నిరుమారుల్ పయనమ్ము నాపితివి యెంతే వింతగా; నెట్టకేఁ

దరలన్, మానసముతో సిగిడ్చితివి చింతాగర్భితాచంచలతో
కరుణాలోకము నట్టె నాపయిని; సంజ్ఞన్ గాంచనైతిన్,
గటా!"

నేను తిరిగి యిల్లుచేరుకొనినప్పుడు మాపట్టణములో హిందూమహమ్మదీయసంఘర్షణ చెలరేగుచుండెను; నిరపరాధు లనేకులు బాధపడుచుండిరి; పరిస్థితి నానాటికి విషమించుచుండెను. ఈ విషయమును నేను ఆశ్రమమునకుఁ దెలుపుచూ శాంతిపునస్స్థాపనార్థము ప్రార్థించితిని. 1941 అక్టోబరు 31 వ తేదిన ఆశ్రమమువారు దీనికి ప్రత్యుత్తర మిట్లు వ్రాసిరి:

"నెల్లూరినుండి వచ్చిన వార్త అంతా విచారకరముగా నున్నది. శ్రీభగవానుల యనుగ్రహమువలన పరిస్థితులు త్వరలో మెఱుఁగగునుగాక యని ఆశించుచున్నాము".

సుమారు రొకమాసమునకు మామూలు పరిస్థితి యేర్పడెను.

నవంబరులో శ్రీభగవానుల చెల్లెలు, బావగారు నెల్లూరికి వచ్చియుండి తమ మనుమనితోఁగూడ మాయింటికి విచ్చేసి మాకుటుంబము నాశీర్వదించిరి. మా కందఱకు అది శ్రీభగవానుల యనుగ్రహవిశిష్టచిహ్నముగాఁ దోఁచెను. ఈ భావమును నేను 22-11-1941 తేదిన ఆశ్రమమునకు వ్రాసిన లేఖలో ఇట్లు తెలుపుకొంటిని:

"మాయింటికి విచ్చేసినందులకు వారికి దయచేసి నా కృతజ్ఞతావందనముల నందింపుఁడు. వారిని జూచినప్పుడు మాకు శ్రీభగవానులను సందర్శించినట్లు అనిపించినది."

అదేదినమున అప్పుడు యు. పి. గవర్నరుసలహా దారుగా నుండిన శ్రీ పన్నాలాల్ ఐ. సి. యస్. గారివద్దనుండి యొకజాబు వచ్చెను. అందులో ఆయన శ్రీ బి. వి. నరసింహ స్వామిగారు లక్నోలో శ్రీభగవానులనుగుఱించి యుపన్య సింపఁగా తా నధ్యక్షత వహించిన యుదంతమును వివరించి పర్యవసానమున ఇట్లు వ్రాసెను:

"మీరు ఆశ్రమయాత్రవేళ నన్ను స్మరింపుఁడు. ఆశ్రమము నుండి అచ్చటి వాతావరణము నొకింత దీర్ఘలేఖలో నా కందింపుఁడు."

11-12-1941 తేది గల యాశ్రమలేఖలో ఇట్లుండెను:

"జయంతి కిచ్చటికి మీరు వచ్చుచున్నారని మేము సంతసించుచున్నాము." 'మీరు' 'వచ్చుచున్నారు' అను పద ములకు నడుమ ఒకమాట పొరపాటున పైపుకాఁబడి కొట్టి వేయఁబడెను. అట్లే నాప్రయాణము నొక గొప్పవిపత్తు ఆటం కపఱిచినందువలన, ఇప్పుడు నాకు పై చిన్నపొరపాటులోఁ గూడ సాభిప్రాయము కనిపించుచున్నది. శ్రీభగవానులవద్ద నుండి వచ్చు దేనియందును సార్థక్యము లేకుండదుగదా.

నాభార్యకు ప్రసవపూర్వము తటాలున పెద్దజబ్బు చేసెను. డిసెంబరు 23 వ తేదిన ఆమెను ఆస్పత్రిలోఁ జేర్చితిమి. ఆరాత్రియే ఆమె మృతశిశువును గనెను. ఆ దినమే నేను ఆమె పరిస్థితిని మనవిచేయుచూ శ్రీ భగవానుల యను గ్రహము నర్థించుచూ ఆశ్రమమునకు తంతేఁ బంపుకొంటిని.

వెనువెంటనే వివరములఁ దెలుపుచూ ఒకజాబు వ్రాసికొంటిని. కానీ డిసెంబరు 27 వ తేది వఱకు నా కేమియూ ప్రత్యుత్తరము రాకుండుట ఆశ్చర్యము కలిగించెను. ఆనాఁటి సాయంకాలము ఆమెజబ్బు ఎక్కువ యైనదని వార్త రాఁగానే ఆస్పత్రికి పోవుటకు నేను వేగిరపడుచుండఁగా, డిసెంబరు 26 వ తేది గల యాశ్రమలేఖ నా కందెను. దానిలో ఇట్లుండెను:

> "మీజాబు నేఁడే అందినది, శ్రీభగవానులు దాసిని జూచినారు. తంతె 23 వ తేదీ చేరెను. దానిని గూడ శ్రీభగవానులు చూచిరి. ......... ఆంతె 'సుబ్రహ్మణ్య' అని తప్పుపేరు ఇచ్చినందున మేము ప్రత్యుత్తర మియ్యఁజాలకుంటిమి"

ఆజాబు శ్రీభగవానుల సానుగ్రహాశీస్సులతో ముగిసెను. కానీ దానితో నే నాసుపత్రి చేరులోపుగనే అంతా ముగిసెను. ఆమె దేహ మింకనూ వెచ్చగా నుండినందుననూ, నాచేతికి నాడీస్పందనముగూడ తగులుచుండినట్లు తోఁచినందుననూ వైద్యులు మరల ఆమెను పరీక్షించి నిర్జీవ యని నిశ్చయించువఱకూ నేను నమ్మలేదు. అంతవఱకు నేను అలజడితో నుంటిని. కానీ తత్క్షణమే నా మనస్సునుండి పెద్దబరువు తీసివేసినట్లూ, ఒక దివ్యప్రశాంతి నాపై వ్రాలినట్లూ అనిపించెను. నేను పూర్తిగా మాఱిపోతిని. వెంటనే నా మనో నేత్రము విచ్చుకొని శ్రీభగవానుల దివ్యసన్నిధానమును సందర్శించెను. శ్రీభగవానుల సానుగ్రహావీక్షణామధురప్రశాంతి నన్నుఁ దన్మయు

నొసఁగెను. అది మొదలు నా మనస్సు శ్రీభగవానుల మార్గదర్శిత్వమును పూర్తిగా గుర్తించెను. అప్పుడచ్చట గుమికూడిన శోకాతురులలో నే నొక్కఁడనే శాంతముగ నుంటినని నిక్కముగా వక్కాణింపఁగలను. నేనే చొరవపుచ్చుకొని అన్ని యేర్పాటులూ చేసితిని. తక్కినవారి నూఱడించుటకు నా శక్తి కొలఁది ప్రయత్నించితిని. కేవల మొక యంత్రమువలె పనిచేసితిని. ఆ యాపదయందు నా నడవడి నాకు శ్రీభగవానుల యనుగ్రహమహిమలలో మహాద్భుతము.

ఆ మఱునటి యుదయము మృతశరీరముప్రక్కన గూర్చుండి నేను శ్రీభగవానులకు ఒక కార్డులో ఆమె మరణమును దెలుపుకొని మఱియు నిట్లు మనవిచేసితిని:

“ఇప్పుడు తల్లిలేని యీ పిల్లలను మీ పాదముల కంకితము చేయుచున్నాను. ఇఁకమీఁద వీళ్లు మీ బిడ్డలుగానీ నా బిడ్డలు గావు. నేను కేవలము నిస్సహాయుఁడనై మీ శరణు చొచ్చుచున్నాను. నన్నూ ఈ పిన్నలనూ మీ యిచ్చవచ్చినట్లు వినియోగింపఁ బ్రార్థన.”

నా యీజాబు చేరినసమయాని కచ్చట నుండిన నా సహాధ్యాపకుఁడు శ్రీ కూచిభొట్ల సూర్యనారాయణగారివలన నా కిట్లు తర్వాతఁ దెలియవచ్చినది. ఈ కార్డు హాలుకుఁ దెచ్చినప్పుడు శ్రీభగవానులు దీనిని మౌనముతో అవలోకించి, నేను

పూర్వము వీడ్కొన్నవేళ నా కొసంగిన చూపువంటి దీర్ఘనిశ్చల దృష్టినే ఆ కార్డుకును అనుగ్రహించిరఁట. 29-12-1941 తేది గల యాశ్రమలేఖయం దిట్లు వ్రాయఁబడెను:

"మీ మందఱము మీకూ మీకుటుంబమునకూ సంభవించిన యీగొప్ప విపత్తు విని అత్యంతము చింతించుచున్నాము. ఆ కార్డు శ్రీభగవానుల సమక్షమున నుంచితిమి. వాగతీత శోకమును బ్రకటించుటకు మాటలు చాలవు. జీవిత మనఁగా ఏమిటో తెలిసికొను వయస్సు లేని, ఊఱటఁగనుటకు మనస్స్థైర్యము చాలని, నోరులేని యీ పిల్లల గోడు నెవరు వచింపఁగలరు? ఇది ఒకపువ్వురేకుల కాధారమగుకాడను క్రూరముగా పీకివేయుటవంటిది. శ్రీభగవానుల యనుగ్రహము వాళ్లను రక్షించునుగాక! శ్రీభగవానుల మాతృప్రేమ తమ నిస్సహాయతనుగూడ గుర్తింపఁజాలని యీ తల్లిలేని పిల్లలను బోషించునుగాక! మీ కందఱకు ఇదే మా గాఢసానుభూతి."

ఇప్పుడు నావద్దకు ప్రవహించిన యూరడింపులేఖల వాహిని అన్నికంఠములద్వారా శ్రీభగవానులు న న్నోదార్చుచూ, నాపై తన యనుగ్రహనేత్రత్వముల కలిమి నాకు నమ్మఁజెప్పుచున్న ట్లనిపించెను. ఒక సోదర భక్తుని లేఖలో మాట లివి:

"అదంతా అట్లే జరుగవలసియుండెను గాఁబోలు; మఱి యిట్లనుట కటువుగాఁ దోఁచిననూ, దురవగాహముగు భగవన్నిర్ణయమందు అది నీ తుదిమేలుకే కావలెను. కానిచో,

నీయెడ ఎంతో శ్రద్ధాసక్తులు గల శ్రీభగవానులు దానిని జరుగనిచ్చియుండరు. ఈగొప్ప విపత్తును సహించుటకు వలసిన విశ్వాసస్థైర్యములను శ్రీభగవానులు నీ కనుగ్రహించుననుట నిస్సంశయము. నీ యర్ధాంగి మృత్యువుపాలైన యా విపత్సమయమున శ్రీభగవానులు నీప్రక్కనే నిలిచియుండె ననుట నిస్సంశయము. ఈ వియోగము నొకింత శాంతి వైరాగ్యములతో నోర్చుకొనుటకు నీకుఁ తోడ్పడె ననుటయూ నిస్సంశయము ... నీ పరిస్థితు లవకాశ మిచ్చిన వెంటనే, శ్రీభగవానుల యొద్దకు వేగముగా రమ్మని నా హితవు. ఏలనఁగా సమస్తమూ మనలను విడనాడిననూ, మనకు ఏకైకశరణ్యము ఆయనయేగదా.''

మఱియొక సోదరభక్తుఁ డిట్లు వ్రాసెను:

"నీ యీ మహాపదయందు వట్టి మాటలు నిష్ప్రయోజకములు. ఉపశమన మియ్యగల యూఱట శ్రీభగవానుల నుండియే రావలెను. ఆయన శరణుచొచ్చిన మనలను ఎన్నడునూ విడనాడ రనుట నాకు తెలియును ...... ప్రపంచమున ప్రత్యక్షదైవమే, రూపుగొనిన యఖండవస్తువే, ప్రేమానుగ్రహస్వరూపమే మన భగవాను లనుట కణుమాత్రమునూ నాకు సంశయము లేదు. ఆయన నా హృదయమును జీల్చి యెఱ్ఱగా కాల్చిన యినుపగుదియతోఁ గలి

యఁపెట్టుచున్నను నేను దీని నుద్ఘోషించెదను. కూలఁద్రోయునట్టి యెగుడు దిగుడులు గల యీ జీవితరంగమునందలి పరీక్షలందుత్తీర్ణు లగుటకు వలసిన మనోదార్ఢ్యమును ప్రసాదింపవే యని మన మాయననే ప్రార్థింతము.''

అంత్యక్రియలనాఁడే ఒక గ్రామమునుండి నా విద్యార్థిని యొకామె నాకు వ్రాసిన వింతలేఖ నిట పేర్కొనఁదగును. శ్రీభగవానులు నెల్లూరికి వచ్చునట్లును మా యింట విడిది చేయునట్లును ఆమె వినెనఁట. తాను వచ్చి వారిని దర్శనముచేసికొనుటకై యీ వార్త నిజమేనా అని ఆ జాబులో ప్రశ్నించెను. శ్రీభగవానులు ఈ విపత్సమయమున మా యింటనే నాకు తోడునీడగా ఉన్నాఁడను నా నమ్మకమును ఈ యమాయిక లేఖ రూఢిపఱిచెను. దీనినే ''రమణసందేశము''నందిట్లు రచించితిని:

''బాలిక యోర్తు నత్తఱిని భక్తియుతమ్మగు కమ్మ
నొక్కటిన్
దా లిఖియించె: 'శ్రీరమణనామ మహర్షులు వత్తురంట మీ
ప్రోలికి, నిక్కమేని దెలుపుం' డని; హా! ననుఁగన్నతండ్రి!
యీ లీలను 'నేను మిమ్ము విడలే' దని వింతగ హెచ్చ
రించితే!''

ఆ దినములలో నాకుఁ గలిగిన యద్భుతానుభవము లనేకములందు కనులకుఁ గట్టినట్లగుపడిన యొక స్వప్నదృశ్య

మిటఁ బేర్కొనఁదగినది. శ్రీభగవానులు తన దండకమండల ములతో శ్మశానమందుఁ గ్రుమ్మరుచు విధ్యుక్తకర్మ కలాప మును వివరముగా గమనించి నడపించుచున్నట్లు కనిపించిరి. ఇదియు శ్రీభగవానుల యధినేతృత్వమందు నా విశ్వాసమును మఱింత దృఢపఱిచెను. దీనినిగూడ "రమణసందేశము"సం దిట్లు వర్ణించితిని:

"దండకమండులుల్ కయిని దాలిచి మెల్లెడ నంచరించుచున్
డండికృపన్ విచారణ మొనర్చుచుఁ గర్మముసేయు
చోట మా
యండనె యుండునట్లు నిను నయ్యరొ కంటిని
స్వప్నమందు, బ్ర
హ్మాండసమస్తకర్మవహనా, శరణాగతమాదృశావనా."

కొన్ని వేళలందు ముఖ్యముగా ఏకాంతమందు నా మనస్సు బలహీనమై చింతా నిరాశలకు లోఁబడుచుండెను. దీనిని ముందుగనే ఊహించినట్లుగా, నన్నుదోర్బోధించుచూ హెచ్చరించుచూ ఆశ్రమమునుండి జాబువెంబడి జాబు వచ్చు చుండెను. 1942 జనవరి 2 వ తేదీ గల జాబునం దిట్లుండెను:

"నీ వన్నట్లు శ్రీభగవానులే మన యేకైకశరణ్యము. ఆయన కేవలపరమాత్మయే... ఆయన దివ్యానుగ్రహము నీకు మనశ్శాంతిని బ్రసాదించుఁగాక!"

జనవరి 14 వ తేదీ జాబులో ఇట్లు వ్రాయఁబడెను:

"పిల్లలకీ నష్టము అత్యంతవిషాదావహము. తల్లికి అందునూ అట్టి తల్లికి మాటలు కలుగుట అసంభవము. సానుభూతిమూ

టలు ని న్నూ ఉడిం పఁజాలవు. కానీ నీవు చదివినట్టి వినినట్టి గ్రహించినట్టి వివేకపదములే దుఃఖోపశమనమున కాస్పద

గీతావాక్యములు శాశ్వతసత్యమును బ్రతిపాదించు

. నీవు వాటిని గీతాసంపాదకుఁడవుగా ఎంతో శ్రద్ధా

తో గమనించియున్నావు. ఆ సత్యమును అనుభవము నకుఁ దెచ్చుకొనుటయే వివేకము; లేనియెడ, మనము 'శబ్ద గ్రహణయంత్రములమే యగుదుము ... ఆ బోధ నా చరణలో పెట్టనియెడల, మనస్సు మనుష్యునిఁ గ్రుంగించి నాశముచేయును. నీవు హృదయమును మనస్సు కబళింప నీయఁగూడదు.

రెండు దినములక్రింద, అనేకసంవత్సరములు శ్రీభగవాను లతోఁగూడా నిరంతర ముండిన యొకభక్తుఁడు తటాలున కాలధర్మముఁ జెందెను. ఆతని నెఱింగినవా రందఱు ఎంతో చింతించిరి. శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి. 'సత్తుగాని దానిని (దేహమును) సత్తుగా భావించుచున్నారు, తత్ఫలి తమే దుఃఖము'."

14-3-1942 తేదిన ఒక భక్తప్రముఖుఁడు ఒక చీటి పంపెను. దానియందు నే నొకమాఱు ఆశ్రమము రావలెనని యెచ్చమ్మ కబురుపంపినట్లు వ్రాయఁబడెను. ఎచ్చమ్మ కబురనఁగా శ్రీభగ వానుల సందేశమే అని నాకు తెలియును. కావున శ్రీభగవానుల నద్దనుండియే పిలుపు వచ్చినట్లు నేను భావించితిని.

25-4-1942 తేదిన, మరల రెండురోజుల తర్వాత, శ్రీ ఎ. దొరస్వామి మొదలియార్ అను నొక సోదరసద్భక్తుఁడు నాకు జాబులు వ్రాసెను. అందులో ఏప్రిల్ 13 వ తేదీ శ్రీభగవానులు ఆశ్రమము మెట్లమీఁద ఆకస్మికముగా పడిరనీ వారి కుడివైపు మెడయెముక విఱిగెనని ఆయన వ్రాసెను. ఆ 13 వ తేదీ ఉదయము ఫలాహారానంతరము శ్రీభగవానులు కొండ నెక్కుటకు ఆశ్రమముమెట్లు దాఁటుచూ తన దారిలో ఒక కుక్క ఒక యుడుతను దఱుముకొని వచ్చుటఁ జూచి ఆ యుడుతను గాపాడుటకు తన చేతికఱ్ఱ నడ్డముపెట్టిరఁట. ఆ కఱ్ఱ జాఱఁగా శ్రీభగవానులు పడిరఁట. సరిగా యిది జరిగినప్పుడే ఒక గొప్ప రాజకీయవిపత్తు చెన్నరాష్ట్రమునకు తప్పెను. అదేసమయమున జపాను నౌకాదళము మదరాసు పైదండెత్తి వచ్చుచూ తమ ప్రభుత్వమువారి క్రొత్త యుత్తరువు మేరకు తటాలున మదరాసు తీరమునుండి వెనుకకు తిరిగి పోయెను. మేము కొందఱ మీ యోగపద్యమునం దొక గంభీరాంతరార్థమును గ్రహించితిమి. ఉడుతకును కుక్కకును రాజకీయసామ్యములు నిరూపించి, శ్రీభగవానులు ఆ యాపదను తమ దేహముమీఁదికే తెచ్చుకొని స్వదేశమును ముప్పునుండి తప్పించిరని మేము నమ్మితిమి. అది యెట్లయిననూ, ఈ పతనవార్తవలన కలిగిన భయోద్వేగము నా మనస్సును దుర్భరవియోగ దుఃఖమునుండి మరలించుట కుపయోగపడెను. రెండవ జాబులో మఱియు నిట్లు వ్రాయఁబడెను:

"నిన్న సాయంకాలము శ్రీ భగవానులు శ్రీ నారాయణయ్యరుతో మాటాడుచూ మీ జాబును ప్రస్తావించిరి. మీ ప్రస్తుత పరిస్థితులలో మీరు ముందుగా ఇచ్చటికి రాలేకుండుటను వా రామోదించిరి."

ఇది శ్రీభగవానులనుండి మఱియు సూటియైన యాహ్వానముగా నా మనస్సునకుఁ దట్టెను. వెంటనే నేను శ్రీభగవానుల శీఘ్రదర్శనమును గోరుచూ ఆశ్రమమునకు జాబు వ్రాసితిని. దీనికి 1942 మే 2-వ తేదీ ఆశ్రమమునుండి ప్రత్యుత్తర మిట్లు వచ్చెను :

"నీ విచ్చటికి త్వరలో రాఁగలుగుటకు సంతసించుచున్నాము...... మహాపూజవఱకు నీవు మాతోఁగూఁడ నుందువని ఆశించుచున్నాము."

ఆ దినములలో పట్టరాని భావోద్రేకముతో నేను "శ్రీరమణ సందేశము" అను నొక తెలుఁగుకావ్యమును రచించుచుంటిని. దానియందు కవి తన సందేశమును దివంగతయైన తన ప్రియురాలి కందించుటకై శ్రీ రమణులను బ్రార్థించును. ఆ ప్రార్థన పద్య మిది :

"మందుండన్; దెలియంగనేర మృతయై మత్కాంత యెందున్నదో;
సందేహింపను జాన దా నెటులొ యే స్థానాననో యుండుటన్;

స్కందాంశోద్భవ, నీకె తద్విధము సుజ్ఞాతమ్ము సర్వమ్ము; నీ
సందేశమ్ము గ్రహించి నిందుకృప నా సాధ్వీమణిన్ జేర్పవే."

అందు 1942 జూన్ 1-వ తేదీ నేనీ క్రింది పద్యమును వ్రాయు
చుంటిని :

"తిరువణ్ణామల చను ము
'న్నరుణఘనజ్యోతిఁ గంటి' నంటి; వహా! నీ
కరుణాచల తేజోలిం
గరూపమే సంస్ఫురించెఁ గరుణన్, గాంతా."

దీనిలో 'తిరువణ్ణామల చను మున్' అను తొలిచరణము
నివ్రాయుచుండఁగా, శ్రీ చిదంబర శాస్త్రి యను పురాతన భక్త
కొమారుఁడు ప్రవేశించి యిట్లు పలికెను: "అయ్యా, మీరు
ఆశ్రమమునకు ఎప్పుడు పోయెదరో మా తండ్రిగారు తెలిసి
కొనిరమ్మనినారు. మీరు తిరువణ్ణామల పోవుముందు వారికి
కబురుచేయఁ గోరుచున్నారు." ఈ వాక్కుల యాగపద్యము
కూడ నా కాశ్చర్యముఁ గలిగించెను. నా యాశ్రమయాత్రా
సంకల్పమును బలపఱిచెను.

12-6-1942 తేదీ ఉదయము నేను హాలులో ప్రవేశించి
ఒక మూలఁ గూర్చుంటిని. శ్రీ భగవానులు నన్ను గమనించి
నట్లు కనిపించలేదు. మెడయెముక చక్కగా కుదురుకొనినందున
శ్రీ భగవానులు కట్టు వదలివైచిరి, కానీ యింకనూ చాలా

బలహీనముగా నగపడిరి. ఆ సమయమున వారు అరగన్ను మోడ్పుతో అసాధారణమౌనముతో ధ్యానసిమగ్నులై నట్లు కనఁబడిరి. కానీ మధ్యాహ్నభోజనానంతరము పరిచారకుఁడు వచ్చి శ్రీ భగవానులు రమ్మనుచున్నారని నన్నుఁ బిలిచెను. అప్పుడు శ్రీభగవానులకు విశ్రాంతిసమయమనీ, వారు ఏకాంత మున నుందురనీ నాకుఁ దెలియును. నేను తల వంచుకొని వారి సన్నిధానమునకు రాఁగానే హృదయవిదారకమగు నొక యుచ్చైస్స్వనము వినఁబడెను. అది యెటనుండి వచ్చెనో నాకు తెలియదు. తత్క్షణమే నేను కూలఁబడి ప్రజ్ఞఁగోల్పోయితిని. నాకు మరల స్పృహ వచ్చినప్పుడు శ్రీభగవానులు నన్నుఁ దన సమీపమునకుఁ బిలిచి తన పాదములవద్దఁ గూర్చుండఁ బెట్టిరి. వారు నాతో కొలఁది మాటలే మాటాడిరి. కా కరుణ జాలువాఱు వారి చల్లనిచూపు చాలసేపు నాపై నెలకొని నా హృదయవ్రణమును నిశ్శేషముగా మాన్పెన వారి వాక్కుల సారాంశ మిది :

"ఆవిడ పోయినది అనిన తలంపు పోవలెను. ఆమె యె క్కడకును బోలేదు. తనలో తానుగా నిలిచియున్నది. ఆమె యెట్లు లేకపోవును ? దేవుఁడు లేక మన మున్నామా? అట్లే ఆమె లేక పిల్ల లెక్కడివారు? సంసార మెక్కడిది?"

అటుతరువాత నేను ప్రతి మధ్యాహ్నమును శ్రీభగవానుల నేకాంతమునఁ గలసికొనుచూ నా హృదయమున నుప్పొంగు

భావోద్రేకమును నిరాటంకముగా వెడలఁగ్రక్కుచుంటిని. శ్రీ భగవానులు నా మొఱ సంతయూ ఓపికతో నాలకించి ఒకటి రెండు ఊఱట మాటలు పలుకుచుండిరి. జూన్ 17-వ తేదీ నేను వారితో నిట్లంటిని :

"భగవాన్, ఇటీవల ఆ విడ నాకు స్వప్నములోఁగూడ కని పించుటలేదు. కావున ఆపాటి యూఱటగూడ నాకు పోయినది."

అందుమీఁద శ్రీభగవానులు చింతాసహిత మందహాసముతో

"ఏమీ ! నీకు స్వప్నదృశ్యములో ఊఱట కలుగునా?"

అని యడిగిరి.

"అవును, భగవాన్, నేను నా వాస్తవభావమును గప్పి పుచ్చుదునేని, కపటి నగుదును"

అని నేను బదులు పలికితిని. ఇది విని శ్రీభగవానులు నిట్టూర్చి మిన్నకుండిరి.

ఆ రాత్రి శ్రీభగవానులు నిద్రించుచుండు వరాండా కెదురుగా నుండిన యాశ్రమ కార్యాలయపు టరఁగుమీఁద నేను పండుకొని యుంటిని. ఒక పెద్దసత్రము కనిపించెను. దాని వాకిలితలుపు సగము తెఱచికొనియుండెను. కొందఱు వయస్సు చెల్లిన బ్రాహ్మణులు దారి కడ్డముగా నిలువఁబడి లోపలికి తొంగిచూచుచుండిరి. నా పెద్ద మేనమామ కాశీవాస్తవ్యుఁడు

వారిలో ప్రముఖముగా నిలుచుండెను. ఆయన లోపల ఎవరినో చూపించి వాళ్లతో ఇట్లు పలికెను:

> "అక్కడ చూడండి, ఆమె యింటి పెద్దకోడలు, సామాన్యురాలు కాదు. ఆమె అంతా *బంగారము*"

ఇది వినగా నాకుగూడ ఎవరో చూడవలెనని కుతూహలము కలిగెను. నేను ఆ బ్రాహ్మణుల వెనుక మునివ్రేళ్లపై నిలబడి వాళ్ల భుజములకు మీదుగా లోపలికి చూచితిని. అహో! నా ప్రియతమ దివంగత భార్య. ఆవిడ నేలపై కూర్చుండియుండెను. వాస్తవముగా ఆమె జీవించియుండినపు డెప్పుడునూ అంత సుస్పష్టముగా ప్రస్ఫుటముగా ఆమెరూపమును జూచి యెఱుగను. ఆ చూపుతోడనే ఒక యానందలహరి నన్ను ముంచెత్తెను. అ ట్లెంతసే పుంటినో నాకు తెలియదు. తటాలున 'అదంతా స్వప్నమే' అనిన యెఱుక నాపై దుమికెను! స్వప్నమే! ఈ తలంపు అనిదంపూర్వ శోకవిజృంభణమును నామీదికి ప్రయోగించెను. దాని నాపుకొనలేక నేను లేచి కూర్చుంటిని. అప్పుడే శ్రీభగవానులు ఒక బ్యాటరీ దీపముఁ గైకొని హాలులోనికిఁ బోవుచుండుటను జూచితిని. వెంటనే నేను లేచి వారివెంబడి హాలులోనికి పోయితిని. అంతసేపూ వెక్కి వెక్కి ఏడ్చుచుంటిని. అప్పుడు వేకువ 5 గంటలు. శ్రీభగవానులు సోఫాపైఁ గూర్చుండి నన్నుఁ జూచి "ఏమి! ఏల యిట్లున్నావు? కల వచ్చినదా?" అని యడిగిరి. "అవును

భగవాన్" అని నేను బదులుపలికి యెంతో సంతాపముతో నా స్వప్నవృత్తాంతమును వారికి నివేదించుకొంటిని. అంతట వారిట్లు సెలవిచ్చిరి:

"ఇప్పు డేల శోకించెదవు? స్వప్నదృశ్యమును గోరుకొంటివి, కంటివి. దానివల్ల ఊఱట కలుగునని యనుకొంటివి. అందుకు మాఱుగా, దుర్భరదుఃఖమును గంటివి. భ్రాంతి యంతయు దుఃఖమే. వాస్తవాత్మ యొక్కటియే నిక్కముగా ఆనందము."

అంతట నా మనస్సును మరల్చుటకేమో అన్నట్లు, శ్రీభగవానులు "ఆ సత్రముప్రక్క నేమైనా చూచితివా?" అని యడిగిరి. ఈ ప్రశ్న వినినంతట నాస్మరణకు వచ్చెను. ఆప్రక్కనే ఒక పెద్దనది ప్రవహించుచుండినదని. ఆ యంశము వారితోఁ జెప్పితిని. అంతట శ్రీభగవానులు

"ఆ నది గంగ, ఆ స్థలము కాశీ కాఁబోలు"

అని నుడివిరి. వారి పలుకులవలన నా శోకావేగ ముపశమించెను. నా హృదయమునుండి పెద్దబరువు తీసివైచిన ట్లయ్యెను. ఆ యుదయము ఆకాశీమామనుండియే ఒక జాబు వచ్చెను. దానిలో ఆయన నాభార్య మాసికము తేదీ నాకు జ్ఞాపకము చేయుచూ సకాలమున ఇంటికి మరలి రావలెనని వ్రాసెను. ఆ జాబును నేను శ్రీభగవానులకుఁ జూపఁగా వారిట్లు సెలవిచ్చిరి:

"ఇది నిజముగా చిత్రమే. ఈ మాయదేవే నేఁటి వేకువను నీకు నీ భార్యను జూపించెను. ఇప్పుడు మరల ఈఁబాబులో ఆమెనే చూపించుచున్నాఁడు!"

ఈ యుదంత మంతా ఒక బ్రహ్మాండచిత్రము, శ్రీభగవానుని గ్రహామహిమ. ఇది షేక్సుపియర్ మహాకవి నుడివిన యీప్రశస్త వాక్యమును స్మరణకుఁ దెచ్చెను:

"మీ తత్త్వశాస్త్రములలో స్వప్నమునకుఁగూడ నాని వింతలూ విశేషములూ దివియందును భువియందును గలవు."

నేను "శ్రీరమణసందేశము"ను ఆశ్రమములో పూర్తి చేసి జూన్ 20 వ తేది యుదయము శ్రీభగవానులకు సమర్పించితిని. శ్రీభగవానులు నాఁటి మధ్యాహ్నము సన్నుఁ బిలిపించి నాతో నిట్లు సెలవిచ్చిరి.

"అవును, ఆవిడ నీ 'సందేశము' నాలకించినది. ఆమె ప్రస్యుత్తరము ఆమె యణఁగిన క్రొత్తలో నీకు స్వప్నమునఁ గనిపించి పలికిన మాటలే. వాటిని నీవే 'ఉత్తరభాగము' పదియవ పద్యములో ఇట్లు వ్రాసికొని యున్నావుగదా :

'నే నెటుఁ బోవలే దెపుడు, నిత్యము, సమ్ముఁడి, మీ సమీపమందే నెలకొన్నదాన' నని యీవల నా కలయందు తోఁచి మెంతో నెన రొప్పఁ బల్కితివె, యే నదె నా మది వేదవాక్కు చందాన గ్రహించి సత్యమను సమ్మిగ్గాఁ గాంచినవాఁడఁ, బ్రేయసీ.

అదే ఆమె సందేశము. ఇదివఱ కామె నీకు వేఱుగా కనఁబడు చుండినది. కానీ యిప్పుడు నీతోడ నీలోనే ఉన్నది. అదే వాస్తవము. నీవు ఆమెను గుఱించి చింతింప నక్కఱ లేదు. ఆమె యే కొదువ లేక బాగుగా ఉన్నది. ఆమెను గోల్పోయినా మన్న ఁలంపుతో నీవూ పిల్లలూ మాత్రమే ఇచ్చట బాధపడుచున్నారు."

అప్పుడు నా 'డైరీ' (దినచర్యాజ్ఞాపిక)లో ఇట్లు వ్రాసికొంటిని:

"ఈ సమావేశములు నా జీవితములో మఱవరాని దివ్య ఘట్టములు; నా హృదయవ్రణమును మాన్పుట కమోఘ చికిత్సలైనవి"

ఇప్పట్టున నేనుమఱియొక విషయమును గూడఁ బేర్కొన వలెను. శ్రీభగవానుల దివ్యతేజోవిగ్రహసన్నిధానముతో సహా ఆశ్రమములో ఎచ్చమ్మాళ్ మొదలగు భక్తుల నేకుల సానుభూతులునూ నా యూఱట కుపకరించినవి. ఈ సమయమున ఆశ్రమమునకు విచ్చేసియుండిన కాశీవాస్తవ్యులు శ్రీనారాయణానంద సరస్వతి స్వాములవారితో పరిచయ భాగ్యము నాకు లభించినది. స్వాములవారికి "భగవద్గీత" యంతయు కంఠపాఠము. వారు నిత్యమూ శ్రీభగవానుల సన్నిధానమున అష్టాదశాధ్యాయము లన్నింటిని పఠించుచుండిరి. వారి

పిడితో గ్రాలు ఘట్టము మఱచిపోయిరి. వారు సాష్టాంగదండ ప్రణామ మాచరించి శ్రీభగవానులను సంస్కృతమున 'హే నారాయణస్వరూప' అని సంబోధించుచుగా ప్రార్థించిరి. శ్రీభగవానులు తన హస్తమును స్వాములవారి మస్తకముపైనుంచి ఆయనను లేవనెత్తిరి.

1942 జూలై 15 వ తేదీ, శ్రీభగవానుల నూతన ప్రచురణలఁ గొన్నింటితోఁగూడఁ బంపిన లేఖలో ఆశ్రమము వారిట్లు వ్రాసిరి.

"శ్రీభగవానుల బోధనలు ఉపనిషత్తుల యుపనిషత్తని ప్రశంసింపఁ దగినవి. వేదములందు ఉపనిషత్తులందు పూర్ణ పాండిత్యము గల భక్తులనేకులు శ్రీభగవత్ప్రబోధ ప్రకాశమువలన తాము చదివిన పాఠములకు ఒక యపూర్వార్థము స్ఫురించు చున్నదని నుడివియున్నారు."

కొద్దిరోజుల తర్వాత నా కొక వింతకల వచ్చెను. నే నాశ్రమములో నుండినట్లుగా అచ్చట శ్రీభగవానులు నా కెందునూ కనిపించనట్లుగా కలఁ గంటిని. వారు కనఁబడనందున నేను వారికై వెదకి వెదకి యేడ్చి యేడ్చి తుదకు అలసి సొలసి నిద్రావివశుఁడ నైతిని. అంతట ఆ నిద్రలో నేను మఱియొక కలఁ (కలలోకలఁ) గంటిని. నేను శ్రీభగవానుల యెట్టి

యెదుటఁ గూర్చుండి యుంటిని. అట్లు కూర్చుండి అంతకు ముందు శ్రీభగవానులు కనుపడ కుండుటను దలపోసి అది కలయే గదా అని త్రోసిపుచ్చితిని. అప్పుడు నేను శ్రీభగవానుల సన్నిధానములో నుండుట యొక్కటే వాస్తవమని నా కనిపించెను. ఆ దృశ్య మెంత ప్రస్ఫుటముగా వాస్తవికముగా ఉండిన దనఁగా, దానితో సరిపోల్చినపుడు నేను మేల్కొన్న పిదపఁ గలిగిన జాగ్రదవస్థ అస్పష్టముగాఁ దోఁచెను. కరుడు గట్టిన వాస్తవసారము కరఁగి సురిగిపోయిన ట్లనిపించెను. స్వాప్నిక జాగ్రదవస్థలు తమ పొర్లుకట్టలను ముంచివైచి యొండొంటిలోనికి ప్రవహించి కలసికొని యేకమైనట్లు తోఁచెను. పై యనుభవమును నేను ఒకలేఖలో ఆశ్రమము నకు వ్రాయుచుండఁగా, నేను నిక్కముగా మేల్కొనియుంటినా లేక ఆ జాబు వ్రాయుచున్న జాగ్రద్వ్యవహార మనునదిగూడ దీర్ఘ స్వప్నములో ఒక భాగమేనా అని సంశయము కలిగెను. ఇప్పు డా యుదంతమును స్మరించుటచే ఈ వ్రాఁతగూడ స్వప్నాంతర్భాగమేననీ తుదిమేలుకోలు ఏకైకవాస్తవమగు శ్రీభగవానులలోనే అనీ యొక సంశయమును వెలువఱుచు చున్నందులకు క్షంతవ్యుఁడను. దీనికి 1942 జులై 24 వ తేదీ ఆశ్రమమునుండి వచ్చిన ప్రత్యుత్తరము ప్రబోధావహమై యుండెను. దాని యం దిట్లు వ్రాయఁబడెను.

“నీవు పేర్కొన్న యనుభవము అసాధారణము కాదు.

కొందఱికి ఈ యశాశ్వత ప్రపంచములో నిత్యమేది యను హృదయపూర్వక తీవ్రవిచారణవలనఁగాని, ఆచరణాదర్శ ములయెడ నేకాగ్రనిష్ఠవలనఁగానీ, జీవిత మనఁగా నేమిటో స్పష్టముగా కనుగొనినందువలనఁగాని, యింద్రియ గోచరమగు ప్రపంచ మొక్కటే వాస్తవ మను భావము నశించును. అది వాస్తవమూ కాదు, అవాస్తవమూ కాదు. అట్టివారు చాలా కొద్దిమందియే. వారికి ప్రపంచ స్వప్నము స్వప్నప్రపంచముల మధ్య విభేదము ఆభాస మాత్రమే. తత్ఫలితముగా బాహ్యజీవిత దీర్ఘపరిమాణము గూడా స్వప్నాంతర్జీవితహ్రస్వతమానుభవముచేతఁ బూర్తిగా మాఱుచున్నది. మానసికావస్థల కన్నింటికిఁ గేవల సాక్షీభూతుఁడుగా నుండుటకన్న మిన్న యగు సుఖ మే మున్నది! అట్లుండుటకన్న వివేకము వే ఱేది?"

ఆ కాలమున నా సహాధ్యాపకుఁడొక మౌల్వీసాహెబు తీవ్రవ్యాధితో బాధపడుచుండెను. శ్రీభగవానుల యనుగ్ర హార్థ మాయన గావించిన ప్రార్థన నే నాశ్రమమున కందఁజేసి తిని. అందులకు 28-7-1942 తేదీ గల ప్రత్యుత్తరము శ్రీభగ వానుల సానుగ్రహాశీర్వాదము లాయన కొసంగుటయే గాక "నే నెవఁడను?" అను శ్రీభగవానుల కృతికి ఉర్దూ అనువాద ప్రచురణమును ఆయనకు బహూకరించెను. ఆ జాబులో ఇట్లు వ్రాయఁబడెను :

"జీవితక్లేశముల కన్నింటికినీ ఒకే యూఅట శ్రీభగవానుల బోధనలను బఠించుట, తద్వివేకము నవగాహనచేసికొనుట."

ఆ లేఖ చివర నీ వాక్యములు చేర్పఁబడెను:

"ఇందుఁ బంపఁబడిన పుస్తకము పుటలఁ ద్రిప్పుచుండఁగా, ఈ క్రింది వాక్యము మా దృష్టి నాకర్షించెను. మా కడ పటి లేఖలోని యంశమును రూఢిపఱుచుచున్నందున అది మీకునూ ఆకర్షణీయమే అని యిట్లు తెలుపుచున్నాము: 'జాగ్రత్తు దీర్ఘము, స్వప్నము క్షణికము అనుటతప్ప వేఱు భేదము లేదు.' "

1942 దశారాసెలవులలో నేను మరల ఆశ్రమము వెళ్ళితిని. దేవాలయనిర్మాణకార్యము క్రమక్రమముగా కొన సాఁగుచుండెను. అప్పుడు ఆశ్రమమునందు తాత్కాలికాలయములో నవరాత్రిలక్షార్చన ప్రారంభము నూతనవిశేషమై శోభిల్లెను. ఆశ్రమము బహుముఖకార్యక్రమవిస్తరణతో వర్ధిల్లుచుండుటఁ గాంచి సంతోషించితిమి. కానీ ఆశ్రమజీవితము ప్రత్యక్షముగా మాఱుచుండెను. ఒకవైపు ఆశ్రమాగంతుకుల సంఖ్య నానాఁటికి పెచ్చుపెరిగిపోవుచుండెను. మఱొకవైపు శ్రీభగవానుల యారోగ్యము నానాఁటికి క్షీణించుచుండెను. అందుచేత శ్రీభగవానుల సందర్శనకాలము పరిమితముచేయ వలసివచ్చెను. పూర్వము శ్రీభగవానులతో అత్యంత సన్నిహితముగా నుండిన యాశ్రమజీవితము ఈ క్రొత్త పరిసితులలో

దుస్సాధ్య మయ్యెను. ఇది ముఖ్యముగా స్రాంతభక్తులకుఁ గొంత చింతను గలిగించక తప్పదాయెను. వీడ్కోలు సమయమున నేను "కైవల్యనవనీతము" "ఆముక్తమాల్యద" అను రెండు తెలుఁగుకావ్యములను శ్రీభగవానులకు సమర్పించి, విరామకాలమున వాటిని గటాక్షింపఁ బ్రార్థించితిని.

అప్పుడు నేను కార్యదర్శిగా నుండిన నెల్లూరువర్ధమాన సమాజమునందు మహాకవి రవీంద్రనాథటాగూరు జయంతి మహోత్సవాహ్వానమునకుఁ బ్రత్యుత్తరముగా ఆశ్రమమువారు 1942 అక్టోబరు 22-వ తేదీ యీ క్రింది సందేశము ననుగ్రహించిరి:

"భారతీయ పుత్రరత్నముల యెడ గాఢభక్తి గౌరవములను బ్రకటించుటకై యిట్టి యుత్సవముల జరపుట యావత్ప్రపంచము చూచి, గ్రహించి యనుసరింపఁదగిన మన పురాతన సంస్కృతిస్వామ్యమును బ్రచారము చేయుటకు ఉత్తమ మార్గములలో నొకటి. శ్రీభగవానుల యనుగ్రహమువలన ఉత్సవము జయప్రదముగా నెరవేఱును గాక యని యాశించుచున్నాము."

అటుపిమ్మట 1942 నవంబరు 1 వ తేదీ వచ్చిన లేఖయందు నేను శ్రీభగవానులకు సమర్పించివచ్చిన రెండు గ్రంథముల ప్రస్తావన యిట్లుండెను:

"కైవల్య'పఠనము పూర్తియైనది. ఇతరకార్యములకు తోడు ఒక తమిళగ్రంథము ప్రూఫులు సరిదిద్దవలసినందున, వ్యవధియున్నప్పుడెల్ల 'ఆముక్తమాల్యద' అవలోకింపఁబడు చున్నది."

ఈ లేఖ శ్రీభగవానుల కార్యబాహుళ్యమును జిత్రించెను. ఇందలి వాక్యమందెల్ల కర్మణ్యర్థక ప్రయోగమునూ, శ్రీభగవానులను వాచ్యముగాఁ బేర్కొనకుండుటయూ సాభిప్రాయ గమనార్హము లయ్యెను.

నేను మరల సంవత్సరాంత్యదివసమున (డిసెంబరు 31 వ తేదీ) ఆశ్రమముఁ జేరుకొంటిని. అప్పటికి జయంత్యుత్సవము జరిగి కొన్ని దినములు కడచెను. మఱునాఁడు ఉగాదిపండుగ వేఁకువన నేను సోదరభక్తుఁడు శ్రీ ఆర్. నారాయణయ్యరు తోఁగూడ గిరిప్రదక్షిణము చేసితిని. ఆ దినపు మఱి యిరువురు సోదరభక్తులు సాధుఅరుణాచల (మేజర్ చాడ్విక్), శ్రీ ఎ. దేవరాజమొదలియార్, తాము ఆంగ్లములో పద్యగద్యక్రమమున జయంతి మహోత్సవమందు శ్రీభగవానుల గుఱించి రచించిన స్తోత్రములను ఉగాదికానుకలుగా నాకొసంగిరి. సాధు వి ట్లాలాపించెను:

"నే నిచ్చునది యొక వచ్చుఁబడి;

అది వృథా పోవదు.

నే నొకటొకటిగా వదలు నొక్కొక తలంపునకు మాఱుగా
నన్ను మోక్షమునకుఁ గొనిపోవు
ఱెక్కలలో మఱొక్క యీక నెదుగును.''

శ్రీ మొదలియారు తనను 'రమణశిశువు' అని పేర్కొనుచూ ఇట్లు వ్రాసెను.

''నేను స్వభావముచేతనూ, అభిరుచిచేతనూ, సామర్థ్యము చేతనూ, స్వశక్తితో తన తల్లిని గఱచుగొని పోవు మర్కట కిశోరముగా నుండుట కనర్హుఁడనను నా ప్రాఁతనమ్మకము రూఢిపడినది. కావున తల్లిపిల్లి తనగొంతుకను గట్టిగాఁ బట్టుకొని యిచ్చవచ్చిన తావునకుఁ గొనిపోవు మార్జాలకిశోరముగా నుండుటయే నాకు సంతృప్తి.''

శ్రీ భగవానుల సన్నిధానములో శ్రీ మొదలియారు నేను జయంతికి రానందులకు నన్ను మందముగా మందలించి యిట్లనెను :

''ముఖ్యముగా అటువంటి సమయములందు శ్రీభగవానులు వారి బిడ్డలమగు మనలను వారి పాదములకడఁ జేరుకొన నిరీక్షింతురని నా నమ్మకము''.

అది విని శ్రీభగవానులు మందహాసముతో నిట్లు సెలవిచ్చిరి :

''భగవానుల పాదము లెల్లెడ నున్నవి. కావున ఆయన పాద

ములకడఁ గాక మఱెచ్చటఁ జేరుకొనఁగలము? హృదయ
ముల సమావేశమునకు కాలదేశము లాటంకముగావు.”

జయంతి యనంతరము కొంతకాలమువఱకు మామూలగు పండుగనాటి వాతావరణము సర్వేయుండినను, శ్రీభగవానులు చాలా బలహీనముగా సీరసముగాఁ గనిపించినందున, నే నీమారు కరము నిరుత్సాహముతో ఆశ్రమము వెడలి పయన మైతిని.

1943 జనవరి 15-వ తేదీ నా భార్య ప్రథమాబ్దికము నాఁడు ఆశ్రమమునుండి యీ క్రింది సానుగ్రహసందేశము నందుకొంటిని :

“గతించినయామెయాత్మ శాంతియందు నిలుచునుగాక !
ఆమె బిడ్డలను నీ కొప్పగించినది. నీ బిడ్డల సౌఖ్యసంక్షేమ
ములే నీ సౌఖ్యసంక్షేమములు. వారియందు నీవు నీచింత
నుపశమింపఁజేయు నూఱటను గనుఁగొనవలెను. బిడ్డల
యందునూ నీ యందునూ శ్రీభగవానులయనుగ్రహము
నెలకొనునుగాక !”

శ్రీభగవానుల యారోగ్యమును గుఱించిన నా ప్రశ్నకు ఆ జాబులలో ఈ క్రింది సంగ్రహ ప్రత్యుత్తరము చేర్చఁబడెను :

“ఆరోగ్యము చాలవఱకు మెఱుఁగైనది. కొద్దిరోజులలో
అంతయూ సరిపడును.”

శ్రీభగవానులగుఱించి వ్యక్తిపరమైన ప్రశ్నలకు సాధారణముగా ఆశ్రమమువారు అతిక్లిష్టముగా జవాబిత్తురని నాకుఁ దెలియును. కాఁబట్టి ఈ ప్రత్యుత్తరమువలన నామనస్సునకు సమాధానము కలుగలేదు. కావున శ్రీభగవానుల యారోగ్యమునుగుఱించి సవిస్తరముగాఁ దెలుపుఁడని మఱికొందఱు స్నేహితులకు వ్రాసితిని. వారి యుత్తరములవలన, జనవరి 14-వ తేది నుండి 18-వ తేదివఱకు శ్రీభగవానులు అవిరామముగా ఎక్కిళ్ళతో బాధపడుచుండిరనీ, ఏ యాహారమునూ పుచ్చుకొనలేకుండిరనీ నాకుఁ దెలియవచ్చెను. ఎక్కిళ్లు తగ్గినతర్వాత శ్రీభగవానులకు ఆఁకలి బొత్తిగా లేకపోయెను. వారియందు కామెర్ల చిహ్నములు కనిపించెను. శ్రీభగవానులకు వైద్యము చేయుటయందు ఒకేయొక్కచిక్కేమనఁగా, అచ్చటనున్న యందఱితో సమానముగా ఆహారముఁ గైకోవలెను అను నిబంధనకు విరుద్ధమగు నెట్టి ప్రత్యేకపథ్యమును వారు పుచ్చుకొనరు. మదరాసు డాక్టరు టి.యన్. కృష్ణస్వామి పంపిన క్రొంగ్రొత్త యౌషధమును డాక్టరు శ్రీనివాసరావియ్యఁబోవఁగా, శ్రీభగవానులాయనతో

"అది నీకుఁగదా పంపఁబడినది. కావున నీవే దానిని పుచ్చుకొనుట మేలు"

అని పలికిరఁట! తత్ఫలితముగా శ్రీభగవానులు మిక్కిలి

చిక్కిపోయిరి. పై వివరముల నొసంగుచూ సాధుఅరుణాచల (మేజర్ చాడ్విక్) జనవరి 21 వ తేదీ ఇట్లు వ్రాసిరి:

"మనము చేయఁగలదంతా ఏది యుత్తమమో దాని నొన రింపుఁడని శ్రీభగవానులను ప్రార్థించుటయే. బయట నున్న ప్పుడు నా కెంతో దిగులు పొడమిననూ, హాలులో ప్రవేశిం పఁగనే అదంతయు దిగజాఱిపోవుచున్నది. కావున దీనిని గుఱించి దిగులుపడుట మానుకొన్నాను. సమస్తమూ సరి పడునని నాకు నమ్మకము కుదిరినది."

సాధు అరుణాచల శ్రీభగవానులను నెమ్మది గమ్మని యర్థిం చుచూ మఱియు ఆజ్ఞాపించుచూ ఒక యాంగ్లపద్యముఁ గూడ రచించి దానిప్రతిని నాకుఁ బంపిరి. ఆ పద్య మిట్లు పర్యవసించుచున్నది.

"నీ వాగ్దానమును జెల్లింపుము. ఈ యాట నాగిం
పుము. దీనిని నే నిప్పుడు హక్కుగా అడుగుచున్నాను.
మా కిది యుపేక్ష్యము కానేకాదు.
నీ యిడుమను జూచి వాపోవుచున్నాము.
నీ బిడ్డలము సవినయముగా వేఁడుచున్నాము.
నీ సంకల్పబలమువలన
ఈ వ్యాధిని ద్రోసిపుచ్చి
మా మనోవ్యాధిని మాన్పవే."

జనవరి 27 వ తేదీ భక్తసముదాయ ప్రార్థనలో నా వంతుగా నేనునూ ఈ రెండు పద్యములఁ బంపుకొంటిని:

"ఈ యఖిలలోక భాగ్యము
నీ యఱచేతిది గదయ్య, నిరుపమచరితా,
మా యెల్లర యాయువులను
మా యయ్యా, నీవె తాల్చి మనఁగదవయ్యా.
కన్నతండ్రి వీవు కరుణాసుధాబ్ధివి,
మా ప్రమాదములకు మము క్షమించి
యిమ్మెయినె చిరమ్ము మమ్ముఁ బాలింపవే,
పాద మంటి సేతుఁ బ్రార్థనమ్ము".

ఫిబ్రవరి 7 వ తేదీ పురాతనభక్తుఁడైన శ్రీ యం. వి. రామస్వామయ్యర్ వద్దనుండి నాకు అడలెత్తించు జాబొకటి వచ్చెను. అం దిట్లుండెను.

"శ్రీభగవానుల యారోగ్యము క్షీణించిన సమాచారము నీకుఁ దెలిసినదో లేదో నే నెఱుఁగను. మే మందఱము మిగుల దిగులుపడి యున్నాము".

మరల మూఁడు దినములలో ఆయనయే యిట్లు వ్రాసెను:

"శ్రీభగవానుల యారోగ్య మిప్పుడు చాలా మెఱుఁగు పడినదని నీకు దెలుపుట కెంతయు సంతస మగుచున్నది. రిపుడు మామూలుప్రకారము కొంచె మాహారము చ్చుకొనుచున్నారు."

ఆ మఱునాడు ఆశ్రమమువారుగూడా ఇట్లు వ్రాసిరి:

"భక్తులందఱి ప్రార్థన యొక్కటే. అది యొక్కరికే అనఁగా వారికే. వారి యనుగ్రహమువలన ఆ ప్రార్థన వ్యర్థమైపోవదని కనుగొన్నాము.

అభివృద్ధి చిహ్నములు యథార్థములు. బలహీనత తాత్కాలికము. వ్యాధిస్వభావమునుబట్టి క్రమేణ నెమ్మదిగావలసి యున్నది. వారు చేయలేనిదిగానీ మనంతట మనము చేయఁగలసినదిగానీ యే మున్నది?"

ఆ సమయమున నా కొమార్తె యిందిర కొక్కాయి దగ్గుతో బాధపడుచుండెను. దానినిగూర్చి నేను వ్రాసికొనఁగా ఆశ్రమమువారు మార్చి 17 వ తేదిన ఇట్లు జవాబిచ్చిరి.

"శ్రీభగవానుల యనుగ్రహమువలన ఇందిర యారోగ్యము మెఱుఁగుపడుచున్నదని యాశింతుము. *అంతయూ వాస్తవము, అంతయూ అవాస్తవము, జీవితములో ఈ పరస్పరవైరుధ్యమును సమరసపఱుచుట దేవుఁడు మానవుని కర్తవ్యము గావించినాఁడు. అదిగూడా వాస్తవమూ, అవాస్తవము"*

మార్చి 30 వ తేదీ నా స్నేహితుఁడు శ్రీ ఆర్. నారాయణయ్యర్ నేనాశ్రమ మెప్పుడు వత్తునో తెలుపుమని యుత్తరము వ్రాయుచూ, ఇట్లు నుడివెను:

"ఈ రోజులలో సర్వమూ మిక్కిలి నిశ్శబ్దముగా ఉన్నది. నీ సాహచర్యమందు మనకు లభించుచుండిన యుత్తేజకరసంభాషణ లిప్పుడు వినరావు. మే మందఱము నీ యాగమనముకై తహతహపడుచున్నాము. శ్రీభగవానుల దేహము అనారోగ్యము నధిగమించినది, కానీ చాలా బలహీనముగా నున్నది."

ఏప్రిల్ 5-వ తేదీ తెలుఁగు ఉగాదిపండుగనాఁడు సోదరభక్తుఁడు విద్వత్పోషకుఁడు వదాన్యశేఖరుఁడు శ్రీ తిక్కవరపు రామరెడ్డిగారు నాకు నూటపదాఱురూప్యములు బహూకరించిరి. నే నామొత్తమును ఆశ్రమమున కర్పించుకొంటిని. ఇట్టి భాగ్యము నన్నుఁ జేపట్టు సమయముననే విపత్తు నాసమీపమున పొంచియుండెను. ఇందిర మశూచివ్యాధితో రెండు వారములు బాధపడి ఏప్రిల్ 13-వ తేదీ శ్రీరామనవమినాడుఁ దేహమును త్యజించి శ్రీరామపాదారవిందముల నందెను. ఇది విని, ఆశ్రమమువా రిట్లు వ్రాసిరి :

"ఇందిర నిన్ను వదలినదని విని శోకించుచున్నాము...గత మాసములలో నీవూ నీ బిడ్డలూ ఎంతో మనోవ్యథతో బాధపడినారు. నీ యిరవున సౌఖ్యము కఱవైనది. మఱి యిప్పుడు ప్రియతనయ పోయినది. నీ యిల్లూ నీబాధా చూచు నీ వృద్ధపితరుల దుఃఖ మెంతగా నుండవలెను! మఱి, తనభక్తులకెల్లఁ దానే తండ్రియు తల్లియు నైన

యా మొక్కని యావేదన నెవఁడు వర్ణింపఁగలఁడు!
ఆయన యనుగ్రహము నీకు శాంతి నొసంగునుగాక!"

మేనెల 15-వ తేదీ ఆశ్రమమువారు నాకు "ఆంధ్ర రమణగీత" ను బహూకరించుచూ ఇట్లు వ్రాసిరి:

"ప్రత్యేకతపాలాలో శ్రీనారునాగనార్యుని యనువాదమగు 'ఆంధ్రరమణగీత' ప్రతిని బంపినాము. కొన్ని యేండ్లక్రిందట నీవు దాని వ్రాఁతప్రతిని శ్రద్ధతోఁ జదివి సరిదిద్దినావు. నూఱుప్రతులు మాత్రమే ముద్రింపఁబడినవి. అందులకు ముఖ్యకారణము కాగితముల కఱవు, మఱియుఁ గారణము అర్థతాత్పర్యసహితమూలశ్లోకములునూ, నీవు తెలుఁగు పద్యములుగా రచించిన యుత్తమానువాదమునూ కలవు గదా. శ్రీభగవానుల యనుగ్రహమువలన నీవు మనశ్శాంతి నొందఁగలవని యాశింతుము. శాంతిప్రదాయి యగు తదనుగ్రహము సమృద్ధిగా నీకడకుఁ బ్రవహించునుగాక!"

మేనెల 21-వ తేదీ శ్రీ యం. వి. రామస్వామయ్యరు ఆశ్రమమునుండి యిందిర నిర్యాణమునుగుఱించి సార్ద్రముగా ఒక యూఱడింపులేఖ వ్రాసెను. దానిలో ఇటీవల సంభవించిన మఱియొక భక్తుని పుత్రవియోగము నిట్లుపేర్కొనెను:

"శ్రీబోసుగారి కుమారుఁడు ఇరువదేండ్ల యువకుఁడు మరణించినందులకు మేము చాలమంది గాఢముగ కుందుచున్న యీ సమయముననే నీ యీ వియోగము వ్రణమును

గలియంబెట్టినది....ఇచ్చటికి వచ్చివేయుమనిరో నీకు నా సలహా, ఏలన మఱెచ్చటనూ శాంతి లభించదు....ప్రపంచమునుండి మన మనస్సును మరలించి యందలి క్రౌర్యములకుఁ జలింపకుండుట నేర్చుకొందము. వాస్తవముగా అనుభవమున పురోగమించునప్పుడు ప్రతియొక్కఁడును దీనిని సాధింపవలసియున్నది. అందుచేతనే మనపూర్వులు ఆత్మతత్త్వాన్వేషణమందు దీనినుండి నిర్గమించు మార్గమును మనకుఁ బ్రదర్శించినారు."

మేనెల 26-వ తేదీ నేనొకస్వల్పకైంకర్యమును 'భగ్న హృదయముతోఁగూడ' సమర్పించుకొనఁగా, అది చేరినవైనముఁ దెలుపుచూ ఆశ్రమమువారిట్లు వ్రాసిరి :

"నీ పంచరూపిక చేరినది. దీనిని మహాపూజకు వినియోగింతుము. నీవు సమర్పించిన యీ రెండవ 'వస్తువు' ను భగవానులే చక్కపఱుపవలెను. వారట్లొనర్తురుగాక!"

జులై 23-వ తేదీ ఆశ్రమమువారు శ్రీభగవానులను గుఱించి శ్రీమతి హిడ్డింగ్ రచించిన వ్యాసమును దెలిఁగించుటకై నాకుఁ బంపుచూ ఇట్లు వ్రాసిరి :

"అనువాదము సుమారు రెండువారములలో పూర్తియైనఁ జాలును. ఇంగ్లీషురానివారు ఈ ఫ్రెంచివిదుషీమణి రచనఁ బఠించు లాభమును బడయఁగలుగుదురు.

జీవిత మొక కలవంటి కల్లగా గ్రహించుటకన్న గత్యంత రము లేదు. అట్లవగాహనచేసికొని సంపూర్ణసౌమ్యము నలవఱుచుకొనవలెను. ఇది నిక్కముగా అతిమానుష కార్యము. దీనిని సాధించుటకొఱకు శ్రీభగవానుల యను గ్రహ మొక్కటియే వారి భక్తులకుఁ దోడ్పడఁగలదు. అది యట్లు చేకూఱునుగాక!"

ఆగస్టు 5 వ తేదీ ఆశ్రమమువారు శ్రీఛగన్‌లాల్ యోగి రచించిన "The song of slavery" (దాస్యగీతము) అను పద్యమును నాకుఁ బంపిరి. ఆకవి 'దాస్య' గుణములను గొనియాడుచూ ఇట్లుపసంహరించును :

"దాసుఁడుగా నుండుటకన్న మరణించుట మే లనెదరు.
అహంకృతి పోరాటము దాస్యమే అని నే ననెదను.
ఓయి సర్వాత్మా, నీ దాసుఁ డగుటయే స్వాతంత్ర్యమున
కేకైకమార్గము.
ఓ సద్గురుభగవాన్, నేను నిరంతరము వినీతదాసుఁడనై
చిరకాలము జీవింపఁ గోరెదను"

ఈ గీతముపై ఆశ్రమలేఖ యిట్లు వ్యాఖ్యానించినది:

"ఈ రచయిత కాంగ్రెసు ఉద్యమకార్యకర్తలలో ప్రము ఖుఁడు, పలుమారు కారాగారమునకు వెళ్లియుండినవాఁడు అని తెలిసికొన్నప్పుడు ఈతని దాస్యేచ్ఛ మఱెంత సాభి ప్రాయము కాఁగలదు. స్వభావమున ఇతఁడు స్వతంత్రుఁడు,

ఇతరుల యనుగ్రహములకు తలయొగ్గువాఁడు కాఁడు. జీవిత మిట్లు పరస్పరవిరుద్ధసిద్ధిగాఁ దోఁచుచున్నది."

ఆ సమయమున నేను కరచరణములందు పగుళ్ళతో బాధపడుచుంటిని. కావున శ్రీమతిహిడ్డింగ్ వ్యాసమునకు తెనుఁగు అనువాదమును నేను చెప్పి ఉక్తలేఖనముగా వ్రాయించి పంపుకొంటిని. అది చేరినట్లు తెలుపుచూ 6-9-1943 వ తేదిన ఆశ్రమము వారిట్లు వ్రాసిరి :

నీ యనువాదమును జదువుచున్నాము. నీవు బహు జాగ్రత్తగా ఆంగ్లవ్యాసము ననుసరించినది గ్రహించినాము. ఇచ్చటికి వచ్చియున్న శ్రీ సత్యానందస్వామివారుగూడా నీ యనువాదమును జదివి చాలా మెచ్చుకొన్నారు. శ్రీభగవానుల యనుగ్రహమువలన నీవు త్వరితముగా ఆరోగ్యాభివృద్ధిఁ గాంచుచున్నావని నమ్మెదము"

ఆ దినమే ఇందిర సమాధిపై ఒక తులసికోట నిర్మిత మయ్యెను. దానిమీఁద శ్రీభగవాను లామె కుపదేశించిన "దేహం నాహం కోఽహం సోఽహం" అను మంత్రాక్షరములు చెక్కఁబడెను.

అటుపయి వచ్చిన దశారా సెలవులలో నేను మామూలు ప్రకారము శ్రీభగవానుల దర్శనార్థము వెళ్ళి వారి సన్నిధానమువల్లను అనుగ్రహపూరిత సానుభూతి సంభాషణలవల

నను ఎంతో యాఱటఁ గంటిని. ఈమారు నేను వచ్చి తొలుత స్నానముచేసికొనుటచేతఁ గొంచె మాలస్యముగా శ్రీభగవానులను సందర్శించితిని. వెంటనే వారు "ఏమి యీదినము రైలు ఆలస్యమైనదా?" అని యాశ్చర్యపడిరి; "ఈయుదయము సకాలముననే రైలుకూఁత వింటి ననుకొంటినే" అనియుఁ బలికిరి. నేను నా యాలస్యకారణమును జెప్పుటకు నిజముగా సిగ్గుపడితిని. అ దేమైననూ సర్వకాలమునకు ఒక గుణపాఠము నేర్చుకొంటిని. తర్వాత ఎప్పుడుఁగానీ నేను ఆశ్రమము చేరఁగానే ముందు శ్రీభగవానులకు 'నన్నుఁ దెలుపుకొని' పిమ్మట మ తేమైననూ చేయువాఁడను.

ఒకనాఁ డుదయము శ్రీభగవానులు 'ఉపదేశసారము'లో

"ప్రాణబంధనా ల్లీనమానసం
ఏకచిన్తనా న్నాశ మే త్యదః"

అను శ్లోకమును వివరించుచూ ఇట్లు పలికిరి :

"ప్రాణాయామమువలనఁ గలుగునది మనోలయమే అనఁగా తాత్కాలికముగ మనస్సు స్తంభించుటయే, ఏకాగ్రధ్యానమే మనోనాశమునకు దారితీయఁ గలయది."

ఇది విని నేను నా ధ్యానములో పలుమారు నిద్రావివశుఁడ నగుచుంటినని మనవిచేసికొంటిని. అందులకు శ్రీభగవానులు నాతో నిట్లనిరి:

"సాధనవేళ జాగరూకత కలిగి సాధ్యమైనంతవఱకు నిద్ర పట్టకుండ చూచుకోవలెను. కానీ నిద్ర పైకొనివచ్చునేని ఫరవాలేదు. మెలఁకువ రాఁగానే నీ ధ్యానధారను బట్టుకొని సాధన సాగించుకో, అందుచేత నిద్ర ఒకయాటంకము గానేరదు."

ఒకనాఁడు సాయంకాలము శ్రీభగవానులు బయట నుండి ఆశ్రమమునకు మరలివచ్చుచూ "మీ గృహనిర్మాణము ఎంతలో ఉన్నదండీ!" అని దయతో నన్నుఁ బ్రశ్నించిరి. మే మప్పుడు నడచుచున్న తావునకు ప్రక్కనేయున్న యాశ్రమ వైద్యాలయమువైపు చూపించి ఆ కట్టడ మెంతలో ఉన్నదో నా గృహమునూ అంతలోనే ఉన్నదని మనవిచేసితిని.

22-12-1943 వ తేదీన ఆశ్రమమువారు నా గృహ ప్రవేశాహ్వానపత్రిక తమకు చేరినవైనముఁ దెలుపుచూ,

"శ్రీభగవానుల యనుగ్రహ మీ తరుణమున మిమ్మందఱ నాశీర్వదించుఁగాక!" అని వ్రాసిరి.

19-1-1944 వ తేదీ సర్వాధికారిగారి యత్యవసరాహ్వానముమీఁద నేను మదరాసు వెళ్ళి అచ్చట వారిని గలసికొని ఆశ్రమ దేవాలయనిర్మాణమునకుఁ గావలసిన యినుపసామాను అప్పుడు ప్రభుత్వాధికారమునకు లోఁబడియుండినందున దానిని సేకరించుట కించుక తోడ్పడితిని. శ్రీభగవానుల యనుగ్రహము వలన మా ప్రయత్నము సఫలీకృత మాయెను.

నేను 16-5-1944 వ తేదీ ఆశ్రమములో మహాపూజకు హాజరైతిని. ఆ మాసాంతమువఱకు అచ్చట నుంటిని. ఒక దినము శ్రీభగవానులు "రామగీత" నుండి యీ క్రింది శ్లోకము నుదాహరించిరి :

"ఐన్ద్రిజాలికకర్తాఽపి
భ్రాన్తః భ్రమయతి స్వయం
అభ్రాన్త ఏవ, సిద్ధస్తు
స్వభ్రాన్త్యో భ్రమయ త్యహో!"

శ్రీభగవాను లెప్పుడునూ సిద్ధులకై ప్రాకులాట కూడ దను వారు; అవి ఆత్మసాక్షాత్కారసాధననుండి దృష్టిని మరల్చునవి కావున అపాయకరము లనువారు. 'దేవీకాలోత్తరము'లో సిద్ధుల నిరసించు ఘట్టమును తమిళములోని కనువదించినవారు. శ్రీభగవాను లిప్పు డా శ్లోకము ని ట్లాంధ్రీకరించిరి :

"ఇంద్రజాలికుండు నందక తా భ్రమం
బందఁజేయు భ్రాంతులందు భ్రమము;
సిద్ధుఁడన్నఁ దాను జెంది భ్రమం బహో!
చెందఁజేయు భ్రమము జీవులకును."

మఱియొక దినము శ్రీభగవానులు మంచినీటి గుణముల నుత్కర్షించు నీ క్రింది శ్లోకమును బఠించిరి :

"అజీర్ణే భేషజం వారి
జీర్ణే వారి బలప్రదం

భోజనాన్తేఽమృతం వారి
భోజనాదౌ విషం స్మృతం"

శ్రీభగవానులకు కాఫీ, తేనీరు మున్నగు తీక్ష్ణపానీయములు గిట్టవు. వారి కెప్పుడూ మంచినీరే ప్రియము. వారు భోజనాంతముననే మంచినీరు త్రాఁగువారు, మఱియు నడచి వచ్చుటచేతఁగానీ మఱే హేతువునఁగానీ అలసినప్పుడు కొంచెము మంచినీరు పుచ్చుకొనువారు. ఈ శ్లోకమునుగూడ శ్రీభగవానులే యి ట్లనువదించిరి :

"మందు జలము జీర్ణమాంద్యసమయమందు;
జీర్ణమందు జలము చేర్చు బలము!
అశనమునకు వెనుక నమృత మగు జలము
అశనమునకుఁ బూర్వ మదియె విషము."

మఱియునొక దినము శ్రీభగవానులు మజ్జిగమహిమను సన్నుతించు నీక్రింది శ్లోకమును స్మరించిరి :

"ఏలానాగరసంయుక్తం కించిల్లవణమిశ్రితం
జంబీరరససంయుక్తం తక్రం శక్రస్య దుర్లభం."

పై తీరున తయారుచేసిన పలుచని మజ్జిగయే శ్రీభగవానుల కిష్టము. ఒకనాఁడు మధ్యాహ్నభోజనసమయమున శ్రీభగవానులు సారములేని మఱీపలుచని మజ్జిగ అన్నములో కలుపుకొనుచుండఁగాఁ జూచి "ఇట్టి మజ్జిగవలన ఏమిసత్తువ వచ్చును?" అని యంటిని. అందులకు శ్రీభగవానులు నవ్వుచూ

"ఓహో! నన్ను పెరుగు పుచ్చుకోమనెదవా? అట్లైన ఇఁక నాకు బ్రాఁతబల్ల అక్కఱయుండదు"

అని వెంటనే బదులుపలికిరి. అది నా కర్థముగాకుండుట గమనించి వారే యిట్లు విశదీకరించిరి :

"ఇప్పటికే నా బొజ్జ భారముగా ఉన్నది. ఇఁక నీ సలహాను పాటించినట్లైన, అది త్వరలో ఒక బ్రాఁతబల్ల పరిమాణమునకు పెరుగఁగలదు!"

పై శ్లోకమును శ్రీభగవానులే యిట్లాంధ్రీకరించిరి.

ఏలకులను సొంటి నీ రెంటితో నుప్పు
నిమ్మపండురసము సమ్మిళించు
మజ్జిగ దొరకుటయు మహితేంద్రునికినైన
హెచ్చు దుర్లభ మని యెఱుఁగు, వత్స."

ఈ కాలమందు శ్రీభగవానులు రచించిన తెలుఁగుపద్యములు మూఁడును ఆటవెలఁదులే.

ఒకనాఁడు మధ్యాహ్నము శ్రీభగవానులు హాలులోనికి తిరిగి ప్రవేశించుచుండఁగా, పరిచారకుఁడు గాలి బిగించి యుండినందున విద్యుత్ పంకాను త్రిప్పెను. కొద్దినిమిషాల తర్వాత శ్రీభగవానులు పంకాను ఆపివేయుమని పట్టుపట్టిరి. వా రిట్లనిరి.

"అలసియున్నప్పుడు ఊపిరి సరిగా సలుపకుండును. అట్టి వేళ పంకా ఊపిరిని క్రమపఱుచుట కుపకరించును. దాని ప్రయోజన మంతే. తర్వాతఁగూడ దానిని వీచుచుండుట వ్యర్థము."

ఎట్టి వ్యర్థకార్యమునకూ శ్రీభగవానులు సహజముగా ప్రతికూలురు.

1944 మే నెల 26 వ తేదీ శ్రీభగవానులు చాలకాలము క్రింద శ్రీకావ్యకంఠులు ఒక లేఖలో తననుగుఱించి వ్రాసియుండిన యొకశ్లోకమును స్మరించి పునరావర్తించిరి. దానిలో ఆ నాఁటి శ్రీభగవానుల సహచరుల ప్రస్తావన గలదు. ఆ శ్లోక మిది:

"పరిముక్త భవ 'పల్ని' పర దేశి వినుతం
గంభీరకుల శేష హృదయాబ్జ భృంగం
అతిముగ్ధమతి కృష్ణ భవరోగభిషజం
ప్రణమామి యతివేష మహిభూషతనుజం".

దాని తాత్పర్య మిట్టిది:

"జన్మవిముక్తుఁడైన పలనిస్వామిచేత సన్నుతుఁడు, గంభీరం శేషయ్య హృదయకమలమందు విహరించు తుమ్మెద, అతిముగ్ధచిత్తుఁడైన కృష్ణయ్య సంసారవ్యాధి కుదుర్చుటకు వైద్యుఁడు, యతివేషధారియును అగు శివకుమారున కిదే నమస్కారము"

31-5-1944 వ తేదీ, శ్రీకృష్ణుం డర్జునునకు భగవద్గీత నుపదేశించుచున్నట్లు వ్రాయంబడిన చిత్రపటమునొకటికు తాను రచించియుండిన యీ క్రింది తమిళగీతమును శ్రీభగవానులు జ్ఞాపకముచేసికొనిరి:

"పార్థన్ తేరిల్ నల్
వార్తయా లవన్
ఆర్తి పో క్కరుళ్
మూర్తి కాక్కవే".

శ్రీభగవానుల సలహాప్రకారము పై గీతము వారు సరిగ్రుచ్చిన 'భగవద్గీతా రత్నమాలిక''కు మంగళగీతముగా గ్రహింపంబడెను. దాని నిప్పుడు శ్రీభగవానులే మలయాళములోనికి ట్లనువదించిరి:

"పార్థసారథియా య్యారర
వార్తకళ్ చెవి వార్తవన్
ఆర్తితీర్తోరు కారుణ్య
మూర్తి కాత్తరుళేణ మే."

దానినే శ్రీజగదీశ్వరశాస్త్రిగారు శ్లోకముగా ఇట్లు ర

"పార్థసారథి రూపేణ
శ్రావయిత్వా శుభాం గిరం
పార్థస్యార్తిహరో దేవః
కృపామూర్తి స్స పాతు నః"

దానినే తెలుఁగు పద్యముగా నే ని ట్లనువదించితిని:

"అమలశుభతరదివ్యవాగమృతరసము
శ్రవణపుటముల నిండారఁ ద్రావనిచ్చి
నరుని యార్తిని బాపిన కరుణమూర్తి
పార్థసారథి మనలఁ గాపాడుఁగాత."

ఆ మఱునాడు నా కడగొట్టుకొమార్తె అలగమ్మకు సన్నిపాతజ్వరమని తంతె వచ్చినందున నా యాశ్రమవాస మంతటితో ముగించుకొని మరలి యిల్లు చేరవలసినవాఁడ నైతిని. శ్రీభగవానుల యనుగ్రహమువలన మూఁడువారములలో అమ్మాయికి నెమ్మదియయ్యెను.

9-6-1944-వ తేదీ 'నే నెవఁడను?' అను శ్రీభగవానుల కృతి ప్రూఫు దిద్దుమనీ, దానిలో వ్యాకరణదోషము లేవేని యుండిన సవరింపుమనీ, కడపటిపుటయందు "దేహం నాహం కోఽహం సోఽహం' అను శ్లోకమును ప్రతిపదార్థతాత్పర్యములతోసహా తెలుఁగులిపిలో వ్రాసి ముద్రింపించుమనీ ఆశ్రమ లేఖ నన్నుఁ గోరెను. నేను ఆ ప్రకారమే చేసితిని.

ఆ కాలమున, శ్రీభగవానులు వారి 'ఉళ్లదు నార్పదు' (ఉన్నది నలువది) గ్రంథమును, వారి "ఉపదేశసారము"ను జేసినట్లే, తెనుఁగుపద్యములలోనికి వారే దయచేసి అనువదింతురుగాక యని ప్రార్థించుచూ నేను రెండుసారు లాశ్రమమునకు వ్రాసికొంటిని. 11-6-1946-వ తేదీ ఆశ్రమమువా రిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి:

"నీవు చేసిన విలువ గల సూచనయందన్ని యంశములును సమాలోచింపఁబడినవి. 'ఇది చేయవలెను అది చేయరాదు' అని నిర్ధారించుటకుసాధ్యముగాని విషయమది. *ఏదిజరుగవలెనో అది జరుగును.* బహుశః కర్తవ్యశేష మేదియు లేదని యనుకొనుటే ఉత్తమపద్ధతి గావచ్చును. ఏలనఁగా చెప్పి యున్నారుగడా:

"నష్టమానసోత్కృష్ట యోగినః
కృత్య మస్తి కిం? స్వస్థితిం యతః'
'మనసుఁజూపును మాపు మహాసీయ యోగి

తనఁజూప మందిన పనిలేని వాఁడు' (ఉపదేశసారము 15)
అని."

"నే నెవఁడను?" ప్రూఫు దిద్దునపుడు, శీర్షికను 'నే నెవరు?' అని మార్చిన లింగవివక్షత పోయి "నాన్ యార్?" అనిన తమిళమాతృకకు మఱింత చేరువగా నుండునని నేను సూచించితిని. 15-6-1944 వ తేదీ ఆశ్రమమువారు తమ యుత్తరములో నా సూచనకు పరితోషమును దెలిపియు ఇట్లుపసంహరించిరి.

"భగవద్గీతయందు
'ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః'
(13-22)

"అను శ్లోకమున 'పురుష' శబ్దములోఁ గల పుల్లింగమే ఈ శీర్షికయందును వ్యక్తమగుచున్నది. గీతాపాఠమును జూచినంతట, 'నే నెవఁడను?' అను శీర్షిక సరియైనదే అని మాకు తోఁచినది."

అటుపిమ్మట ఆశ్రమమువారి కోరిక ననుసరించి నేను "విచారసంగ్రహము" ప్రూఫునుగూడా దిద్దితిని.

"నే నెవఁడను?" కృతిలో 'దేహం నాహం కోఽహం సోఽహం' శ్లోకమును జేర్చుటను గూర్చి ప్రస్తావించుచూ ఆశ్రమమువా రిట్లు వ్రాసిరి:

"మేము తొలుత ఈ యేకశ్లోకిని చేర్చ సూచనచేసి నప్పుడు చాలా సంకోచించితిమి. కానీ యిప్పుడు ఆ సూచన వాస్తవముగా యుక్తమైనదని మే మనుకొనుచున్నాము. ఆ యేకశ్లోకము గ్రంథసారాంశము నుడువుటయేగాక గ్రంథవిషయమునకు మఱియుఁగొంతఁ జేర్చుచున్నది గదా."

ఆ తరువాత దశారా సెలవులలో అనఁగా 1944 సెప్టెంబరు కడపటి వారములో నేను మామూలుప్రకారము ఆశ్రమమునకు యాత్రవెళ్లితిని. ఒక సాయంకాలము 'తిరుప్పుగళ్'ను అనుకరించుచూ శ్రీకావ్యకంఠులు రచించిన 'శ్రీరమణ తిరుప్పుగళ్'ను శ్రీభగవానులు స్మరించి యాలపించిరి. ఆ గేయములో కవి యెల్లమానవులను రమణముని దివ్యచరణములను

భజింపుఁ డని యుద్బోధించినాఁడు. శ్రీభగవానులు పాడుచుం డఁగా దానిని నేను నానోటులో ని ట్లుక్త లేఖన మొనర్చు కొంటిని :

"రమణముని విమలతర చరణే భజమనుజ
నమదఖిల నరనికరశరణే సుమవిశిఖ
సమరపర హృదయమదహరణే యదికుతుక
మధునా తే;

అనిశమపి వినమదలినలి తే భజమనుజ
నను మనసి నవజలజలలి తే వివిధకవి
జనవచన జటిలరుచికలి తే గిరిశిఖర
మణిభూ తే;

నిరతిశయ నిఖిలసుఖనిలయే వినతజన
భరణధృత కనకమయవలయే భవజలధి
తరణవిధి తరలహృదివలయే బహుమహిమ
సముపే తే;

జననమృతి రహితజనవినుతే కలికలుష
జనకమపి హృదయమిహమనుతే పరమసుఖ
పరవశిత పదనిహితవినతే భ్రమవిజిత
జలజా తే;

రమణముని విమలతరచరణే భజమనుజ."

ఆ కాలమున నేను నా కొమార్తె లలితకు మనువు కుదుర్చుకొనుటకై ఆవేదనపడుచుంటిని. ఆ సందర్భములో

ఆశ్రమమునుండి కోలారుకు వెళ్లవలెనని నాకు సంకల్ప ముండెను. నేను శ్రీభగవానుల సలహా నర్థింపఁగా వారు "ఆందోళనపడకు. అది జరుగవలసినప్పుడు జరుగును" అని మాత్రమే సెలవిచ్చిరి. దీనినిబట్టి నా కోలారుప్రయాణము శ్రీభగవానులకు సమ్మతము గాదని నేను మానుకొంటిని. ఆ మఱునాడు శ్రీభగవానులు 'తిరుప్పుగళ్'' నుండి'కల్యాణప్పాట్టు' (కల్యాణగీతము)ను పఠించి తెలుఁగున అర్థముచెప్పఁగా వారి వాక్కు నప్పుడే యిట్లు వ్రాసికొంటిని:

"నీలంకొళ్ మేఘత్తిన్ మయిల్ మీదే-
నీవంద వాళ్వైక్కణ్డదనాలే;
మాల్కొండ పేదైక్కున్ మణంనాఱుం-
మార్తంగు తారైత్తం దరుళ్వాయే;
వేల్కొండు వేలైప్పం డెఱివోనే-
వీరంకొళ్ శూరర్కుం కులకాలా;
నాలంత వేదత్తిన్ పొరుళోనే-
నానెన్ఱు మార్తట్టుం పెరుమాళే."

"పూర్వము శక్తిఆయుధమును సముద్రునిపై ప్రయోగించిన వాఁడా,
వీరులైన శూరాదుల వంశమునకు యమునివంటి వాఁడా,
'చతుర్వేదాంతార్థ స్వరూపుఁడే నేను' అని ఱొమ్ము తట్టు పరమాత్ముఁడా

నీలమేఘచ్ఛాయఁ గల నెమలిపై నీవరుదెంచిన వైభవమును జూచుటచే ప్రేమించిన నా బిడ్డకు నీ వక్షస్థలమున నుండు వాసనాయుతమగు మాల నొసఁగి అనుగ్రహింపుము''

ఈ గీతమును తలిదండ్రులు నిత్యపారాయణ చేయుదు రేని వారి పిల్లకు త్వరగా పెండ్లియగునని యొక నమ్మకము వ్యాపించియున్న గనుచూ శ్రీభగవానులు నుడివిరి. నేను 1944 సెప్టెంబరు మాసాంతమునుండి దాని నిత్యపారాయణ ముపక్ర మించితిని. 1945 ఫిబ్రవరిలో లలితకు వివాహ మయ్యెను.

28-9-1944 వ తేదీ ఆశ్రమకార్యాలయమువారు నాచేత సోదరభక్తుఁడు శ్రీవేదం అనంతాచారికి అతఁడు వాగ్దా నమొనర్చిన ద్రవ్యమును గూర్చి జ్ఞాపకముచేయుచూ ఒక యుత్తరము వ్రాయించిరి. ఆతని ప్రత్యుత్తర మిట్లు వచ్చెను.

"ఆశ్రమమునుండి 28-9-1944 వ తేదిగల మీ జాబుచేరినది. ఆ నాఁడే నేను మనియార్డరు పంపియుంటినే. అదేమి 'టెలి పతి'యా? (మనస్సమీకరణవిద్యయా?) బహుశః మీ రచ్చట జాబు వ్రాయుచుండఁగా, నే నిచ్చట మనియార్డరు ఫారము వ్రాయుచుంటిని."

ఆశ్రమములో ఇట్టి యసంఖ్యాకసంభవములకు ఇది యొక నిదర్శనము. దీని కేమి పేరు పెట్టినను, ఇది శ్రీభగవానుల యనుగ్రహమునకు ప్రస్ఫుటచిహ్నము.

తదనంతరము 1944 డిసెంబరు 30 వ తేదీ జరిగిన జయంతి మహోత్సవమునకు నా పరిస్థితుల యాటంకమువలన నేను హాజరుకాలేకపోయితిని. దీనికై నన్ను మందలించుచూ శ్రీ ఎ. దేవరాజ మొదలియార్‌గారు 4-1-1945 తేదిన ఇట్లు వ్రాసిరి :

"నీవు రానిదానికి నేనామోదింపను ... బాహ్యసన్నిధిలో నున్న మాలో కొందఱికన్న మిన్నగా నీ హృదయములో భగవానులున్నారనీ, అందువలన వారి యనుగ్రహమును గ్రహించుటకు చేతఁగాని నావంటివానికన్న నీకుఁ గావల సిన యనుగ్రహమంతయు అచ్చటనుండియే కొల్లగొనఁగల నని నీవు సంతృప్తి చెందవచ్చును. కానీ జయంతివంటి యుత్సవసమయములందన్నింటను నీ విచ్చట నుండవలె నని మా కోరిక. భగవానులుగూడా ఆయన బిడ్డలను మనలను జయంతినాఁడు మన మేలుకొఱకే ఆయనపాద ములవ్రాల సాధ్యమైనంతవఱకు సమావేశముకాఁ గోరె దరని నా ముగ్ధవిశ్వాసము. ఇట్టి విశ్వాసమును నీవు పరిహాసము చేయవచ్చును. కానీ నాకు భయములేదు."

శ్రీభగవానులకు వారి భక్తులకు నడుమఁగల సంబంధముసం దలి మానవచ్ఛాయను ఈ లేఖ ప్రతిబింబించుచున్నది.

5-1-1945 వ తేదీ సూరినాగమ్మ జాబు వ్రాయుచూ అంతకుముందు 27-12-1944 వ తేదీ ఎచ్చమ్మగారు ప్రశాంత

ముగా హఠాత్తుగా పరమపదించి రను వార్తఁ దెలిపిరి. ఎచ్చమ్మగారు తక్కినభక్తులనువలె నన్నునూ తల్లికన్న నెక్కువ వాత్సల్యముతో నెల్లప్పుడుఁ జూచుచుండిరి. ఆమె ప్రాతకాలములో శ్రీభగవానులనుగురించి లెక్కలేనన్ని గాథలూ, ముచ్చటలూ చెప్పి మమ్మానందింపఁజేయుచుండెను. ముప్పదేండ్లు తప్పనిసరిగా ఆమె నిత్యమూ మధ్యాహ్నవేళ ఊరినుండి శ్రీభగవానులకూ ఆశ్రమవాసులగు భక్తులకూ భోజనము తీసికొనిపోయి పెట్టుచుండెను. కావున ఆమె నిర్యాణ వార్త నాకు పిడుగుపడినట్లై నన్ను శోకసాగరమున ముంచెను. ఆమె చనిపోయినదని వినఁగానే శ్రీభగవానులు భావోద్వేగ ముతో నిట్లు పలికిరఁట:

"నే నామెతో ఈ శ్రమ పడవద్దని ఎన్నిసారులో చెప్పితిని; కానీ ఆమె వినిపించుకోలేదు. తన భగవానులకు భోజనముపెట్టనిదీ తా నెన్నడూ భుజించి యెఱుఁగదు. ఇంక, ఈ మొదలియార్ పాటి (అవ్వ) ఆమెమార్గమునే అనుసరించుచున్నది. సరి. ఎచ్చమ్మ తన బరువును ద్రోసివైచినది. కానీ నా బరువుమాత్ర మింకనూ మిగిలియున్నది."

27-1-1945వ తేదీ ఆ మరుసటి నెలలో జరుగవలసిన లలితపెండ్లినిగూర్చి నేను ఆశ్రమమునకు వ్రాసికొంటిని: లలితయే స్వయముగా తన వివాహమునకు శ్రీభగవానుల యామోదము నర్థించుచూ వారు తప్పక దయచేయవలెనని

వేఁడుకొనుచూ వారికి వ్రాసికొన్న లేఖ అందులో బిడాయింపఁ బడెను. రెండుదినములపిమ్మట ఆశ్రమమునుండి యీ జవాబు వచ్చెను.

"27 వ తేది గల నీ జాబునూ లలిత లక్ష్మీ భక్తులతో వ్రాసి కొన్న లేఖనూ శ్రీభగవానులసమోల నుంచినాము. లేత వయస్సులోఁ గుదిరిన యట్టి భక్తి తప్పక పెరిగి యని తరసాధ్య మగు నాధ్యాత్మికసంపన్నిధానము కాఁగలదు. లలిత వివాహము ఫిబ్రవరి 24 వ తేదీ జరుగునని వినుట కెంతయు సంతసించుచున్నాము. ఇందులో ఆమెకు ప్రత్యు త్తరము బిడాయింపఁబడినది. శ్రీభగవానుల యనుగ్రహము వలన వివాహకార్యము జయప్రదముగా జరుగఁగలదు."

ఆ యంతర్లేఖ శ్రీభగవానులు నుడివిన మేరకు సూరినాగమ్మచే తెలుఁగున లిఖింపఁబడెను. శ్రీభగవానులు స్వయముగా తన చిత్రపటము నొకదానిని వధూవరులకు బహుమానముగా నేర్పఱిచి దానిని ఆ లేఖలోపల బిడాయింపించి యేమి వ్రాయ వలయునో నాగమ్మకు సెలవిచ్చిరఁట. ఆ జాబులో ఇట్లుండెను :

"నీ వివాహమునుగుఱించి విని శ్రీభగవానులు అనుగ్రహ పూర్వకముగా సంతోషించినారు. దీనిలోపల వారు తననే నీకు బహూకరించు కొనుచున్నారు. ఈ కార్య మప్పుడే గాక యెల్లప్పుడూ వారు నీకు సన్నిధాన మనుగ్రహించుచునే యుందురు."

ఆ చిత్తరువు లలితకు నిత్యపూజార్చిత దైవత మైనదని వేఱుగ వచింపవలెనా! వివాహమహోత్సవానంతరము పెండ్లి కుమారునకూ మా తల్లికీ తీవ్రముగా జబ్బుచేసెను. శ్రీభగవానుల యనుగ్రహమువలన ఉభయులును శీఘ్రముగా కోలుకొనిరి.

1945 జూన్ 4-వ తేదీ ఆశ్రమములో జరిగిన మహా పూజామహోత్సవమునకు నేను హాజరై ఒక పక్షమురోజులచ్చట నిలిచితిని. ఒకనాఁ డుదయము శ్రీభగవానులు పూర్వము తాను మౌనమునుగుఱించి వచించిన వాక్యమును మాధవస్వామి నోటుపుస్తకమునుండి బిగ్గఱగాఁ జదివి దానిని తెలుఁగున అనువదించి చెప్పిరి. నేను వారి వాక్కును వెంటనే నా నోటులో ఇట్లు వ్రాసికొంటిని:

"మోన ము ళ్ళెళు మొరు మొళి యరుళ్ నిలై యే."
"మౌనము లోపలనుండి యేకాక్షరరూపమైన యనుగ్రహశక్తి స్థితి.

ప్రాసంగికముగా శ్రీ భగవాను లొక ప్రాఁతయుదంతము నుడివిరి. పెక్కేండ్లక్రిందట స్వర్గీయ సోమసుందరస్వామి శ్రీ భగవానులయొద్దకు ఒక క్రొత్త నోటుపుస్తకముఁదెచ్చి దానిలో 'ఓంప్రథమము' గా ఏదేని 'ఒక యక్షరము వ్రాయుఁడని నిర్బంధించెనఁట. అందుమీఁదట శ్రీభగవానులు ఈ క్రింది తమిళకురళ్ వ్రాసిరఁట :

“ఓ రెళు త్తొన్ఱుం తానా యుళ్ళ త్తోఱ్ఱివిడా
మా రెళుద వల్లా రదై.”

తర్వాత శ్రీభగవానులే స్వయముగా దానిని సంస్కృతశ్లోకముగనూ తెలుఁగుద్విపదగనూ అనువదించిరఁట. . ఇప్పుడు శ్రీభగవానులు ఆ తమిళకురళ్ నా నోటుపుస్తకమునందు తెలుఁగులిపిలో స్వహస్తలిఖిత మొసర్చి యనుగ్రహించిరి. సంస్కృతాంధ్రానువాదములను నే నిట్లు ప్రతి వ్రాసికొంటిని:

“ఏక మక్షరం హృది నిరంతరం
భాసతే స్వయం, లిఖ్యతే కథం?”
“ఏక మక్షరము తా హృదయమం దెపుడు
నేకమై వెలుఁగునే, యెటు వ్రాయఁగలము?”
(పాఠాంతరము)

“ఏకమై వెలుఁగునే హృదయమం దెపుడు
నేక మక్షరము తా, నెటు వ్రాయగలము?”

ఆ మఱుదినము శ్రీభగవానులు తాను 1912 లో వినాయకచతుర్థిపండుగనాఁడు రచించిన వినాయక ప్రార్థనము (తమిళవెణ్బా)ను స్మరించిరి. ఇప్పుడు దానికి తెలుఁగుతాత్పర్యము దయచేసిరి. ఆ వెణ్బానూ దాని తాత్పర్యమునూ శ్రీభగవానులు వచించుచుండఁగా నేను నా నోటులో నిట్లు వ్రాసికొంటిని:

“పిళ్ళైయా ప్పెట్రవనై ప్పిచ్చాండి యాక్కి-యెంగుం
పిళ్ళైయా ప్పేళ్వాయిఱ్పై ప్పేణినీర్ - పిళ్ళైయార్
కన్నెంజో మాడత్తు ప్పిళ్ళైయరే కణ్ణారుం
పిన్వందార్ తన్నై నీర్ పెట్రు.”

“బిడ్డగాఁ గన్నవానిని బిచ్చగానిని జేసి యెక్కుడను బిడ్డఁడవై పెద్దపొట్ట పెంచుకొంటివి. ఓ గూటిలోని వినాయకుఁడా, వెనుక వచ్చినవానిని బొందియు, నీది జాతిగుండెయా, కంటఁ జూడుము.”

మఱియొకదినము శ్రీభగవానులు అరుణాచలము యొక్కయు తన స్వగ్రామమైన తిరుచ్చుళియొక్కయు మహిమావిశేషమునుగుఱించి ముచ్చటించిరి. తిరుచ్చుళిలో వేంచేసియుండు శ్రీభూమినాథేశ్వరునిపై శ్రీమాణిక్యవాచకర్ పాడిన ‘అన్బుడై’ ఇత్యాది స్తోత్రము ననుకరించుచూ తాను పూర్వము రచించియుండిన పాటను శ్రీభగవానులు స్మరించి యా రెంటిని వాటి తాత్పర్యముతోసహా యిట్లనుగ్రహించిరి:

శ్రీభగవానుల పాట :

“అన్బుడై యార్త మకనుకలామ లనవరత
మిన్బుడై యాట్ట మిడలెనవెండ్రు మెళిల్ చుళియ
అన్బుడై నీఙ్గా తొళి ర్పరఙ్ జోతి తనిచ్చివమే
యెన్బుడై యన్బిం దిలగిడయండ్రి నిరుదయమే.”

తాత్పర్యము :

"ప్రేమ గలవారియొక్క హృదయము విడువకుండ ఎప్పుడును ఆనందము గల నర్తనచేయునట్లు, ఎప్పుడూ అందమైన తిరుచ్చుళియందు విడువకుండ వెలుఁగు పరంజ్యోతియైన యేకశివమే యెముకలను గరఁగఁజేయు ప్రేమ నిచ్చి నా హృదయమందు వెలుఁగుఁగాక !"

శ్రీ మాణిక్యవాచకర్ పాట :

"అన్బుడై నెంజ త్తివళ్ళై దుఱవం బల త్తడియా
రెన్బిడై వందమి ర్దాఱని న్డాడి యిరుంచుళియ
అన్బిడై నైయ్యాత్తకవళిం దన్నం చలంచల త్తిళ్
వన్బిడై మేట్టుయిలుం వయలూరళ్ వరంబిలనే"

"ప్రేమతోఁడి మనస్సుగల యీామె (నాయిక) ఛేదిల్లునట్లు సభాభక్తుని యెముకలలో దూరి అమృత మూరునట్లు నిలిచి నటించు (అచల తాండవము)వాఁడు, శ్రేష్ఠమైన తిరుచ్చుళి క్షేత్రమునందు తన నాయిక నోచ్చుకొనఁగా తగవు మాలి హంసము చలంజలము (శంఖవిశేషము) కఠినమైన దాని (శంఖ) పై నిద్రపోవు పొలముగల యూరిలో నున్న వాఁడు, వ్యవస్థ (ఎల్ల) లేనివాఁడు."

శ్రీమాణిక్యవాచకర్ రచనలోను శ్రీభగవానుల రచనలోను 'ఈశ్వరుని యానందనర్తనము ఎముకలను గరఁగఁజేయు ప్రేమ నిచ్చు' ననుటయందు భావసామ్యము కన్పట్టుచున్నది. మఱియు చాలకాలము క్రింద తన యభిజనముంగూర్చి ఈశ్వర

స్వామి పాటకు బదులుగా తాను చెప్పిన మఱి రెండు తమిళ వృత్తములనుగూడా శ్రీభగవాను లుదాహరించిరి.

ఈశ్వరుని యానందనర్తనము, ఎముకలఁ గరఁగించు ప్రేమ—ఈ భావములు నా హృదయమున గాఢముగా నాటుకొని కొన్ని దినముల పర్యంతము నా మనస్సులో మెదలుచుండినవి. వాటి ప్రభావముచేత నేను 1945 జూన్ 14 వ తేదిన 'శ్రీరమణ విహారము' అను శీర్షికతో ఈ క్రింది పద్యము రచించితిని.

"తడఁబడుచున్ మెలమెల్లగ
నడుగులతో మిన్నుఁ గొలుచునటు వచ్చు నినున్
బుడుతని గని యరుణాచలుఁ
డెడంద యుప్పొంగ నచలనృత్య మ్మాడున్."

ఆ కాలమున ఆశ్రమములో ఒక చిన్న రోగికుంటికుక్క పిల్ల ఉండెను. అది యేనిమిషమో చనిపోవునని యనుకొంటిమి. కానీ శ్రీభగవానుల నిరంతర జాగరూకతవలన అది ఆరోగ్యముఁగోల్కొనుటేగాక నిత్యమూ మిక్కిలి మక్కువతో ఇడ్లీలు మెక్క నారంభించెను. అది చూచి శ్రీభగవానులు దానికి 'ఇడ్లీస్వామి' అని ముద్దుపేరు పెట్టిరి. 15-6-1945 వ తేదీ ఈ యుందంతమును గుఱించి నే నొకపద్య మిట్లు రచించితిని:

"అక్కుబ్జఁ జక్కనొనరిచి
యక్కటికము మీఱ నేలినటు, శ్రీరమణా,
యిక్కుంటికుక్కపిల్లను
జక్కని 'యిడ్లీలసామి'ఁ జలిపితి, వౌరా!"

రెండుదినముల తర్వాత 'శ్రీరమణకరుణ'ను గూర్చి యీ క్రింది పద్యద్వయ మల్లితిని :

"నెమళుల నుడుతల గో శున
కములను వానరులను గసుఁగందులఁ గరుణన్
దమ రుపలాలించుటఁ గన
నెముకలును గరంగకున్నె యెవరికి, రమణా!

ఎన్నో ఖగములు మృగములు
మున్నగునవి నిన్నుఁ జేరి ముక్తిని బడయున్;
ని న్నటులె శరణు వేఁడిన
యి న్నరపశువును ననుగ్రహింపవె, రమణా!"

19-6-1945 వ తేదీ నే నాఱుపద్యములలో నా "పిడ్శోలు విన్నపము" నిట్లు రచించి సమర్పించుకొంటిని :

"స్కందుఁడవో హరివో సం
బందుఁడవో యనుచు నడుగఁ, బరమాత్మ నటం
చంద తెలుఁగఁ జాటిన హృ
న్మందిరరమణా, గ్రహింపుమా వందనముల్.

కరుణావతార, భక్తుల
పరితాపముఁ బాప నిలను భవముఁగొనిన స
ద్గురురూప పరమ తత్త్వమ,
నిరతము కల్యాణ మగుత నీ, కో రమణా!

కాపురమ్ము లోని కడగండ్ల నన్నింటి
బాల తల్లితోడఁ బలికికొనెడు
మాడ్కి, రమణ, నిన్ను మాతగా భావించి
మనసులోని మాట మనవిసేతు.

గాయము లవెన్నొ పడినట్టి ఘటము నాటఁ
జీమ చిటుకన్నఁ బెనుభూత మేమొ యనుచు
భయము పైకొన నాదుగుండియ వణంకు;
అభయ మిచ్చి రక్షింపవే, యార్తశరణ.

కామింపను గతసౌఖ్యముఁ;
బ్రేమాస్పదులైన యెల్ల పిన్నలు పెద్దల్
సేమమ్మున నిల నుండఁగఁ
గామింతును వారిమోలఁ గాయము వాయన్.

ఎట్టి యిక్కట్టులం దెడయని ధైర్యమ్ము,
మానావమానసమానబుద్ధి,
సర్వభూతములందు సమహితత్వమ్మును,
పరులు చేసిన మేలు మఱవమియును,
అఖిలమ్ము నీమయ మ్మను పూర్ణ భావమ్ము,
నీ పదాబ్జములందు నిరతభక్తి,
సంభవ మ్మెల్ల నీ చైదమే యను తెల్వి,
యింతయు మేలుకే యనెడు నెఱుక,

ఈ తలఁపు లెవరికి? నాకు ' నే నెవండ '
నను విచారణచేఁ దలం పణఁగ నణఁగ
స్వానుభవమగు సద్వస్తుసంస్ఫురణము
తనయునకు దయసేయవే, తండ్రి, రమణ."

జూన్ 20-వ తేదీ నేను మదరాసుమీఁదుగా పయనించి యిల్లు చేరుకొంటిని. ఆ మఱునాఁడు నాగమ్మ మదరాసు నుండి ఆశ్రమము వెళ్ళెను. శ్రీభగవానులు ఆమె కనుపడఁగానే మదరాసులో నన్నామె చూచెనా అని యడిగిరఁట. మదరాసులో మేము కలసికొనలేదు. ఈ సంగతి నాగమ్మ నాకు జూన్ 28-వ తేదీ జాబులో వ్రాసెను. శ్రీభగవానులు తన భక్తపరమాణువు పర్యటనమునుగూడా ఎంతదయతో శ్రద్ధతో గమనించుచుండిరో ఈ యుదంత ముదాహరించుచున్నది.

శ్రీభగవానులకు ఆకస్మికముగా కాలు దెబ్బ తగిలినట్లు విని నేను కుశలప్రశ్నము వ్రాసికొనఁగా ఆశ్రమమువారు 9-9-1945 వ తేది ఇట్లు బదులువ్రాసిరి:

"శ్రీభగవానుల యారోగ్య మిప్పుడు చక్కగానున్నది. అది యొక చిన్న బెణుకు. డాక్టరు శ్రీనివాసరావు గారిచ్చటనే యుండి తగు చికిత్స చేయుచున్నారు"

ఆ డాక్టరుగారే శ్రీఅరవిందులు పడినప్పుడు వారికిఁగూడా చికిత్స చేసియుండిరి.

తర్వాత దశారా సెలవులలో నేను మరల ఆశ్రమము వెళ్లితిని. శ్రీభగవానులు ఆ బెణుకు పోయి మామూలుగా నడచుచుండుటఁ గాంచి యూఱడిల్లితిని. కాని వా రిప్పుడు కీళ్లనొప్పులు కలిగియుండిరి. దానికై వారు హస్తసంవాహ విద్యాచ్చికిత్సల నొందుచుండిరి. ఈ యొత్తుటయందు భక్తులలో తీవ్రమైన పోటీ యేర్పడెను. వైద్యభక్తులు తాము సంవాహ విద్యలో నిపుణులమని యెక్కువభాగము నాచికొనుచుండిరి. శ్రీభగవానులు న్యాయ్యముగా భక్తులలో ఒక్కొకరికి తన యొక్కయవయవమును బంచిపెట్టి కనీసపు సంవాహమును మాత్రమే యనుమతించిరి. ఒక్కొకప్పుడు శ్రీభగవానులే స్వయముగా ఒత్తుకొనుచుండిరి. ఒకమా అట్లు చేయుచూ వారు పరిహాసపూర్వకముగా ఇట్లు సెలవిచ్చిరి :

"వీళ్లు దీనివల్ల తమ కేదో పుణ్యము వచ్చునను నమ్మకముతో దీనిని చేయుచున్నారుగదా. ఈ పుణ్యములో నాకుఁగూడా భాగ మెందుకు రాఁగూడదు !"

మహానవమి నా పుట్టినదినము. ఆ నాఁడు శ్రీ ఆర్. నారాయణయ్యరుతోఁగూడా నేను గిరిప్రదక్షిణము చేసి వచ్చితిని. మేము తిరిగివచ్చుట కొంచె మాలస్యమైనందున, శ్రీభగవాను లందులకుఁ గారణ మడిగిరి. నాఁడు నా పుట్టినదిన మగుటవలన ఊరిలో మార్గమధ్యమున ఇరువురము కలసి కాఫీ ఫలాహారము పుచ్చుకోవలెనని నేను పట్టుపట్టినట్లు నా స్నేహితుఁడు జవాబుచెప్పెను. శ్రీభగవానులు వెంటనే

"ఓహో! సుబ్బరామయ్య హోటలులో నీకు తన జన్మ దినోత్సవపువిందు చేసినాఁ డన్నమాట. దానికి మమ్ములనెవ్వరినీ ఆహ్వానించలేదే! పోనిలే!"

అని యనుగ్రహగర్భితహాస్యము పలికిరి.

మఱునాఁడు శ్రీభగవానులు ఆత్మసాక్షాత్కారమును గుఱించి ప్రసంగించుచూ ఇట్లు సెలవిచ్చిరి :

" 'ఆత్మసాక్షాత్కార' మనఁగా నేమి? ఒక శబ్దమాత్రము. ఏదోయొక విచిత్రము జరుగుననీ, ఏదో ఆకాశమునుండి మెఱపు మెఱసినట్లు క్రింద పడుననీ జనులు నిరీక్షించెదరు. అది అట్టి దేమీ కాదు. నీవు దేహమవు, నీ వదీ, నీ విదీ అన్న భావము పోవును. *నీవు నీవుగానే నిలుతువు. నిక్కముగా సాక్షాత్కారము ఆత్మకు పర్యాయనామమాత్రమే."*

అక్టోబరు 21 వ తేదీ నేను మరల ఇల్లు చేరుకొంటిని.

డిసెంబరు మాసారంభమున శ్రీభగవానుల పూర్వగిరి నివాసము స్కందాశ్రమము బాగుచేసినారనీ శ్రీభగవానులచ్చట భక్తులతో ఒకదినముఁ గడపినారనీ వింటిని. దీనిని గూర్చి నా ప్రశ్నలకు ఆశ్రమమువారు 10-12-1945 వ తేదిన ఇట్లు వ్రాసిరి :

"స్కందాశ్రమగాథ యొక రసాత్మకస్వప్నసదృశ్యము. ఉత్తరప్రదేశమునుండి రాజాగా రొకరు స్కందాశ్రమము

18

సందర్శించి ముగ్ధులై దానిని బాగుచేయుట కుదారముగా విరాళ మియ్య నియ్యకొనిరి. అది పూర్తియైనంతట, ఆ యాశ్రమమునకు పోవు దారి చాలకాలము వాడుకలో లేకుండెనని రాజాగారికిఁ దెలియరాఁగా, ఆ బాటను తిరిగీ వేయించుటకు వారే పూనుకొనిరి. అదియు జరిగినంతట, శ్రీభగవానులు స్కందాశ్రమములో ఒకదినముఁ గడపుటకు సమ్మతించిరి. దాదాపు ఐదువందలమంది భక్తులచ్చటికి వచ్చిరి. ఈ యందఱికి భోజనాది సౌకర్యములు సమకూర్పఁబడెను. తమ యిటీవలి లేఖలో రాజాగారు స్కందాశ్రమమునకు విద్యుచ్ఛక్తిసరఫరా సూచించినారు. అనఁగా కొండదారి పొడుగునా ఒక మైలువఱకూ విద్యుద్దీపములు వెలుఁగును. స్కందాశ్రమ పునర్నిర్మాణమునకూ బాట వేయించుటకూ కొంచెము పూర్వమే రమణాశ్రమ పశ్చిమ భాగము నానుకొని దారి యారంభమున ఒక తాతివంతెన కట్టఁబడెను. దానికైన వ్యయము ఊటుకూరువాస్తవ్యుఁడు శ్రీ యస్. బలరామరెడ్డి కైంకర్యము. ఇప్పుడు స్కందాశ్రమనిర్మాణకార్యములో పాల్గొన్న పనివాళ్లు పూర్వమా యాశ్రమమును మొదట కట్టినవాళ్ళ సంతతివారే. *భక్తిభావము భక్తులను బంధించు ననునది యొక ప్రధాన సత్యము. శ్రీభగవానుల యనుగ్రహముచేత ఈ భక్తి నిరంతర ప్రవర్ధమానమై సమస్తమానవకోటిని సంశ్లేషించు నంతగా వ్యాపించునుగాక!*"

ఆ మఱునాఁడు స్కందాశ్రమప్రవేశోత్సవమును వర్ణించు లేఖ నాగమ్మవద్దనుండి వచ్చెను. ఆమె యిట్లు వ్రాసెను :

"స్కందాశ్రమం విందారగింపులో నేనున్నా పాల్గొను భాగ్యం కలిగింది. మీరు లేరని చాలా అనుకున్నాను. స్కందాశ్రమంలో చెట్లనీడన సోఫాపై ఉన్న భగవానులను చూస్తే మూర్ధాభిషిక్తుఁ డగు సార్వభౌమునికంటె నధికమని తోచింది. అరుణగిరియే సింహాపీఠంగా, మేఘావృతాంబరమే శ్వేతచ్ఛత్రంగా, వృక్షాలే వింజామరలుగా, సెలయేటి ధార తుంపురులే అభిషేకజలంగా పట్టభద్రుఁడైన ఆ యోగసామ్రాట్టునకు ప్రకృతికాంత నీరెండచే నివాళు లెత్తిం దన్నా. ఆ దృశ్యం వ్రాయ నావశమా?

వినవలెఁ గనవలెఁగా కే
యనువున వ్రాయంగవచ్చు నన్నా! విను మా
యనుపమ తేజుని మహిమలు
వనజజునకుఁ గా దటన్న, వశమే నాకున్!"

డిసెంబరు కడపటివారమున నేను పంజాబులోని యమృతసరమునకు వెళ్లితిని. అచ్చటి కేంద్రఖాల్సా కళాశాలవారు ఆంగ్లభాషా ప్రధానాచార్యపదవికి నన్ను నియమించు నుద్దేశ్యముతోఁ బిలిపించుకొనిరి. తొలుదొల్త నే నీ యుద్యోగము నంగీకరింపవలెనా వలదా అను విషయమునుగుఱించి శ్రీభగవానుల హితవు నర్థించితిని. ఇందులకు 19-12-1945 వ తేదీ ఆశ్రమమువా రిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి.

"నీ తెలుఁగులేఖలో పేర్కొనఁబడిన విషయము దీర్ఘఫలితములు గలయది. ఎవరికైనను ప్రబలతరశక్తి శ్రీభగవానుల యనుగ్రహ మొక్కటే, అదే నిన్ను నడపించవలెను. తథాస్తు!"

పరిస్థితులు చివరకు నన్నా యుద్యోగ మంగీకరింప నియ్యలేదు. తేలిన ఫలితార్థము డిసెంబరు 21 వ తేదీ జరగిన శ్రీభగవానుల జయంతిమహోత్సవములో నేను పాల్గొనలేక పోవుటయే. కానీ నా యమృతసరః ప్రయాణ మొక యాత్రగా పరిణమించెను. మార్గమధ్యమున పుణ్యక్షేత్రములను సందర్శించుట కవకాశము లభించెను. ముఖ్యముగా అమృతసరములోని స్వర్ణ దేవాలయమందునూ క్రొత్తఢిల్లీలోని లక్ష్మీనారాయణ దేవాలయమందునూ నేను శ్రీభగవానుల ప్రశాంతసన్నిధానానందము ననుభవించితిని. మఱియు దేశవిభజనానంతరము అమృతసరములో జరిగిన కొట్లాటలు హత్యలు తర్వాత సింహావలోకనము చేసికొన్నప్పుడు, ఆ యుద్యోగమును నే నంగీకరింపకుండుట శ్రీభగవానులనుండి యెంతటి యనుగ్రహరక్షయో గ్రహింపఁగలిగితిని.

1946 జనవరి ప్రారంభమున శ్రీశంకరాచార్యకృత దక్షిణామూర్తి స్తోత్రస్వకీయతమిళానువాదపీఠికకు శ్రీ భగవానులే యిటీవలఁ గావించిన యాంధ్రానువాదము ప్రతిని నాగమ్మ వద్దనుండి నేను తెప్పించుకొంటిని. అందు శ్రీభగవాను లిట్లు రచించిరి :

"జగత్సృష్టికర్త యగు బ్రహ్మదేవుని మానసపుత్రు లగు సనకసనందనసనత్కుమారసనత్సుజాతు లనఁబడు నలువురును జగత్సృష్ట్యాది కార్యములకై తాము సృజింపఁబడినది తండ్రివలన విని, దానియందు విరక్తి గలవారై, ఉపశాంతి నపేక్షించి, అది తెలుపఁగలవారిని వెదకుచువచ్చి యతితీవ్రపక్వులకై, పరమకారుణ్యమూర్తి యగు సాక్షాత్పరమేశ్వరుఁడు దక్షిణామూర్తియై మౌనముగా స్వస్థితిలో చిన్ముద్రాంకితుఁడై యుండుటఁ గాంచి అయస్కాంతమును గాంచిన యినుమువలె నాకర్షింపఁబడి వారిసన్నిధి నటులే స్వస్వరూపమున నెలకొనిరి.

ఆ మౌనమైన స్వస్థితియొక్క యాథార్థ్యమును గుర్తింపఁజాలని యుత్తమాధికారులకు అద్దంగాఁ దోఁచు లోకము, చూచువాఁడు, చూపించుప్రకాశము అయి విజృంభించి లయించు శక్తి తనకన్న భిన్నము కానందున 'అంతయు తన్మయమే' అను సర్వాత్మత్వమును సంగ్రహించి యీ స్తోత్రమునందు ఆచార్యశంకరులు తెలియపఱచినారు."

13-1-1946-వ తేది గల లేఖలో నాగమ్మ స్వకీయ విషయముగా ఇట్లు వ్రాసెను:

"అమ్మలాంటి ఎచ్చమ్మ నామావశిష్టమైనది. నా కిట నింక ఆడుతోడు అలమేలమ్మలత్త ఒక్కతెయే. తల్లీ తండ్రి గురువు దైవము తానే యని నమ్మియుండుటచే పక్షి పిల

పెక్కంలో గ్రుడ్డును పొదిపి రక్షించినట్లు భగవానులే న న్నన్నివిధముల కాపాడుచున్నారు. అన్నా, ఆ మహాత్ముని కరుణ కంతులేదు. ఏ జన్మ సుకృతమో గాకున్న ఈ క్షుద్ర జీవిపై వారి కేల ఈ కరుణ! ఏ మిచ్చి ఋణ మీఁగఁగలను? ఈయఁదగిన దే మున్నది? అయ్యో నా వెఱ్ఱి! ఇఁక చాలును!! ”

అటు పిమ్మట వేసవిసెలవులకు 1946 మే నెల చివర ఆశ్రమయాత్ర సాగింపఁ దలఁచియుంటిని. కాని ఆశ్రమములో మేనెల 19 వ తేదీ శ్రీ వేంకటరామన్ (ప్రస్తుతము ఆశ్రమ నిర్వాహకులు) పెద్దకొమా ళ్లిరువురి యుపనయనము నడచు నని మేనెల 25 వ తేదీ మహాపూజ జరుగుననీ నాగమ్మ 26-4-1946 తేదిగల లేఖలో నాకు కబురు చేయుచూ, పై రెండుత్సవములలోనూ పాల్గొనుటకు వలసినంత ముందుగా న న్నాశ్రమము చేరుకొనఁగోరెను. పై పెచ్చు “ఈ వ్రాత కామోదించిన వారిలో భగవానులున్నూ భాగస్థులో ప్రధా నులో ఏదో అనుకోండి” అనికూడా వ్రాసెను. కావున నేను మేనెల 13 వ తేదీ లలిత, రమణప్రసాదము, అలగమ్మ అను నాపిల్లలతో బయలు దేఱితిని. మార్గమధ్యమున శ్రీ వెంకటగిరి రాజాగారిని సందర్శించుట తటస్థించఁగా, వా రాశ్రమమునకు తమ కైంకర్యముగా 116 రూపాయలచెక్కు నాయొద్ద నొసఁ గిరి. ఇది శ్రీభగవానుల యనుగ్రహమునకు మంచి సంచకరు వుగా నేను గ్రహించితిని.

శ్రీభగవానులు అలగమ్మ తమ తల్లిపేరగుట దయతో గమనించి ఆ పిల్ల నెప్పుడునూ 'అమ్మా' అనియే పిలుచుచుండిరి. అలగమ్మ బాల్యచాపలముతో శ్రీభగవానులకు చేతికఱ్ఱ యెందుకని సవాలుచేసెను. శ్రీభగవానులు నవ్వుచూ 'అది ముసలివాళ్ళ కెదుగు మూఁడవకాలులే' అని జవాబిచ్చిరి. మఱియు ఆ పిల్ల వేసికొనిన రెండుజడలను జూపుచూ, 'నీకీ రెండు కొమ్ము లెందుకు!' అని శ్రీభగవానులు ఛలోక్తి విసరఁగా అందఱూ గొల్లున నవ్విరి. అంతట శ్రీభగవానులు నావైపు తిరిగి రెండుజడల యల్లిక మన పిల్లల యందమును ప్రోదిచేయునట్లు కనిపించుట లేదని సెలవిచ్చిరి. అది మొదలు అలగమ్మ యెప్పుడునూ రెండుజడలు వేసికొనలేదు.

ఒకనాఁ డుదయము మేము, నాగమ్మ, ఆమె మేనకోడళ్లు విద్య, స్వర్ణ అను పిల్లలు ఒకజట్టుగా కొండ యెక్కి స్కందాశ్రమమును సందర్శించితిమి. స్కందాశ్రమము ప్రక్కన పాఱుచున్న సెలయేటి యూటబుగ్గ (శ్రీభగవానులచేఁ గనుఁగొనఁబడినదాని) లో ఆడుకొనుట పిల్లలకు చాలా సరదాగా నుండెను. మేము మరలివచ్చి మా సందర్శనవిషయము శ్రీభగవానులకు మనవిచేయఁగా వారెంతో సంతోషించి స్కందాశ్రమమునకు సంబంధించిన గాథ లనేకములు దయతోఁ జెప్పిరి. ఆ యాశ్రమమును 'కందసామి' అను శేర్వారి భక్తుఁడు కట్టుటచేత దానికి స్కందాశ్రమము అను పేరు వచ్చెనని

శ్రీభగవానులు సెలవిచ్చిరి. శ్రీభగవానులు స్కందావతారమని నమ్ముచున్నాము. గావున వారినివాసమునకు 'స్కందాశ్రమ' నామము ద్విగుణీకృతసార్థక మని నేను మనవిచేసితిని. శ్రీభగవాను లింతమాత్ర ముత్తర మిచ్చిరి :

"నామరూపములు మాఱవచ్చును, గానీ వస్తు వొక్కటే."

మఱియొకనాఁ డుదయము చిన్నపిల్ల స్వర్ణ శ్రీభగవానులను తనతోఁగూడ తనయూరికి రమ్మని ఆహ్వానించెను; శ్రీభగవానులు దేశమంతటా పర్యటించి తనభక్తుల నాశీర్వదింప రేల యనియూ ప్రశ్నించెను. శ్రీభగవానులు మందహాసముతో ఇట్లు మాఱుపలికిరి :

"'నేను' నీతోఁగూడ రానని యేల అనుకొనెదవు? నీ వెప్పుడూ 'నన్ను' నీ హృదయములో తీసికొని పోవుచున్నావు. మఱి నే నీ దేహముతో దేశాటనము చేయుదునేని దానిఫలితము లేమిటో తెలియునా? ఆశ్రమమంతా యాత్రికులతోసహా నన్ను వెన్నంటి వచ్చును. ఈ యందఱికీ నీవు సపర్య చేయుదువా? అంతేగాక, దర్శనార్థము ఇచ్చటివచ్చు వారెందఱో ఆశాభంగము చెంది పోవుదురు. ఇటీవల నేను స్కందాశ్రమము వెళ్లి కొన్ని గంటలు మాత్ర మచ్చట నుండఁగా, ఇచ్చట ఎంతో తాఱుమాఱు అయ్యెను. కాఁబట్టి నే నిచ్చటనే యుండుట ఉత్తమము. అప్పుడు దినచర్య అంతయూ సాఫీగా నడచును. అందఱూ ఇచ్చట నన్ను చూడఁగలుగుదురు."

ఒకనాఁటిరాత్రి శ్రీ భగవానులు "భాగవతము"లో ఒక శ్లోకము నుదహరించి తత్పూర్వము జనవరిలో దానికి తాము రచించిన యాంధ్రానువాదము నిట్లు నుడివిరి.

"దేహం చ నశ్వర మవస్థిత ముత్థితం వా
సిద్ధో నపశ్యతి య తోఽధ్యగమ త్స్వరూపం।
దైవా దపేత ముత దైవవశా దుపేతం
వాసో యథా పరికృతం మదిరామదాంధః"

(భాగవతము స్కందము XIII శ్లో. 36)

"ఒడలు నశ్వర మది స్థితం బుత్థితంబొ?
కర్మవశమున విడివడఁ గలయఁ గలదొ?
తను నెఱింగిన సిద్ధుఁడు తనవుఁ గనఁడు,
గుడ్డను మదిరామదమున గ్రుడ్డిపలెనె"

శ్రీభగవానుల యారోగ్యము క్షీణించుచుండినందున వారి యీ రచన ఏమ్యసూచనగాఁ దోఁచెను.

25-6-1946 వ తేదీ మహాపూజాసందర్భమున 'మాతృభూతేశ్వరమహాపూజా పంచరత్నముల'ను మంగళపద్య సహిముగా నిట్లు రచించితిని:

"భక్తురాలికిఁ గాన్పుచేసిన పట్టునన్ జననీత్వమున్
శక్తిమై గయికొంటివి; వి త్తతిఁ జానవై జగదంబవై
దిక్తతిన్ నుతిఁ గొన్న మా గురుదేవుఁ గంటివి; నిన్ను సం
సక్తచిత్తమునన్ భజించెద, మాతృభూతమహేశ్వరా.

ఉర్వి నెవ్వని జన్మముపనిషత్తుల కెల్ల నభినవవ్యాఖ్యాన
మనఁగఁ దనరు,
సకలమతమ్ముల సారసమన్వయం బెవని జీవితమున నెఱుక
పడును,
గహనతమఖ్యాతిఁ గను బ్రహ్మవిద్య దే యతనియం
దెసఁగుఁ బ్రత్యక్షభంగి,
స్వాత్మనిష్ఠాయోగసామ్రాజ్యవైభవజగ దేకజీవద్ధ్వజం
బెవండు,

భక్తవాత్సల్యమునఁజేసి భవముఁ గొనిన
పరమకరుణాబ్ధి శ్రీభగవానుఁ డెవఁడు
అట్టి రమణుఁ గుమారుగా నవనిఁ గనిన
మాతృభూతమహేశ ! నమస్కరింతు.

ఇలు వీడి ప్రియపుత్రుఁ డేఁగినజాడను గనరాక
యెంతెంత పనవినావో,
కడ కిందె సుతుఁ గాంచి కన్నీరు గురియించి
బదులుపల్కమి కెంత పనవినావో,
చివర కా కొమరునే చేరి తత్త్వ మెఱింగి యెంతటి
వైరాగ్య మెనసినావో,
పుత్త్రమోహము మాని పూర్ణసామ్యము నూని
జ్ఞానసాధన మెంత జరపినావో,

అంత్యవేళ సద్యోముక్తి నొర! యెట్లు
భగవదమృతకరస్పర్శఁ బడసినావొ,
జాల మిది నీ యనుగ్రహలీల యనుచు
నెంతు, నలగాఖ్యమాతృభూతేశ, దేవ.

ఐహికబంధమ్ము లఖిలమ్ముఁ ద్యజియించి మహితాత్ముఁడైన యాత్మజునిఁ జేరి
స్కందాశ్రమమ్మున సందర్శనార్థమ్ము చనుదెంచు భక్తుల జననికరణి
నుపచారము లొనర్చి యుదరమ్ముఁ దనియించి జన్మమ్ముఁ గడపి తాఁ జనెడువేళ
ఆ జగన్మాత హృదాశయమం దెట్టి యలఘుసంకల్పమ్ము నెలకొనియెనొ:

ఆశ్రమ మ్మిది యన్నపూర్ణాలయముగ
ఖండఖండాంతరమ్ముల ఖ్యాతి గొలిపి
రమణభగవాను నద్భుతప్రభు నొనర్చెఁ
దల్లియవతార మగుట సార్థకము గాఁగ.
తన ఘనసమాధిపై దేవతాప్రతిష్ఠ
అందె నిరతాన్నదానమహావిభూతి
ఆశ్రమమ్ము దిగంతవిఖ్యాతిఁగనుట
అల్ల యలగమ్మ చలువయే యని తలంతు.

మంగళ మ్మలగాంబాకుమారకునకు
జయము జయ మరుణాచలస్వాత్మజునకు !
జయము రమణమహర్షికి జయము జయము !
మాతృభూతేశ్వరునకు సన్మంగళమ్ము !"

ఆనాఁడుదయము శ్రీభగవానులు ఆలయసమ్ముఖమున గొప్ప జనసందోహముమధ్య కటకటాలలోపల నాసీనులై నప్పుడు, కటకటాలవెలుపల దగ్గఱనే కూర్చుండియున్న అలగమ్మతో వారు పరిహాసముగా "చూచావా అమ్మా, నీ కొడుకు నిక్కడ బంధించి యెట్లు జైలులో పెట్టినారో!" అని పలికిరి.

ఈ కాలమున విభూతిస్వామి యను పేరుతో ఒక పరదేశి ఆశ్రమమునకు కొలఁదిదూరమున విడిసి వచ్చినయందఱికి విభూతి నిచ్చుచుండెను. అది సకలసంతాపనివారిణి యను నమ్మకము వ్యాపించుటచేత జనులు పెద్దగుంపులుగా ఆయన వద్ద కాకర్షింపఁబడుచుండిరి. దారినడుమ వాళ్లు ఆశ్రమముఁగూడఁబ్రవేశించి శ్రీభగవానుల దర్శనముఁ బడసి పోవుచుండిరి. ఒక నాఁటి వేకువవేళ ఆ గుంపును జూచి శ్రీభగవానులు చిఱునవ్వునవ్వుచూ నాతో నిట్లు సెలవిచ్చిరి :

"నా యనారోగ్యము నిక్కముగా నాకు ప్రచ్ఛన్నోపకారకము. ఏలన, నా యొడలు పిసికించుకొనుటను జూచి యీ జనులు 'పాపము! స్వామియే యిట్లు బాధపడుచున్నారే,

వీరు మనకేమి చేయఁగలరు!' అనుకొని నన్ను వదలిపోవు చున్నారు. కానీ నేనుగూడా విభూతియో తీర్థమో యిచ్చుచుంటినేని నన్నుఁ జుట్టుముట్టి నలిపివేసియుండరా!"

ఒకదినము మధ్యాహ్నము శ్రీ టి.పి. రామచంద్రయ్యరు, శ్రీ విశ్వమూర్తి నేనూ మఱికొందఱూ కలసి గురుమూర్తము నకు వెళ్లితిమి. మార్గమధ్యమున శ్రీ నారాయణయ్యర్ (తంత్రీ శాఖోద్యోగి) స్వగృహమున మాకు మేలి మామిడిపండ్లతో విందుచేసెను. గురుమూర్తములో శ్రీ భగవానుల యాసన స్థానమున ఇప్పుడు పొగాకుబస్తాలు వేయఁబడి దుర్వాసన కొట్టుచుండెను. ఆప్రక్కన నున్న మామిడితోపులో శ్రీ భగవాను లెక్కడ నెలలపర్యంతము గాలికిఁ గొట్టువడుచూ వానకుఁ దడియుచూ నిరంతర నిశ్చలసమాధిలోఁ గూర్చుండి యుండి ప్రప్రథమమున భక్తులప్రార్థనమేరకు నేత్రములు విచ్చి లోకముపై చూడ్కి సారించి మౌనము విరమించిరో ఆ పావనస్థానమునుగూడా సందర్శించితిమి. మేము తిరిగి వచ్చు నప్పుడు దారిలో ఎచ్చట శ్రీ భగవానులు అరుణాచలాగమన దివసమున తనసర్వస్వమును విసరివైచిరో ఆ 'అయ్యంకులము'ను జూచితిమి. దానిగట్టున శ్రీ ఆదిశంకరాచార్యులవారిక్షేత్రము నకు యాత్ర వచ్చినప్పుడు విడిసి పావనమొనర్చి రని ప్రతీతిఁ గన్న దేవాలయమునుగూడ సందర్శించితిమి. అంతట మేమ పట్టరాని యుత్సాహముతో శ్రీ విశ్వమూర్తి నాయకత్వమున భజనఁ బ్రారంభించి దారిపొడుగునా ఆశ్రమము చేరువఱకూ

పాడుచూ ఆడుచూ వచ్చితిమి. శ్రీ భగవానులు దయతో మా ప్రయాణోదంతమునుగూర్చి ప్రశ్నింపఁగా నేను వారికి సర్వమూ విన్నవించితిని. శ్రీ భగవానుల కోర్కెపై శ్రీ విశ్వమూర్తి విష్ణు దశావతారగేయమగు "కాట్రాయి సామి దేవుఁడా" అను పాటను బాడెను. శ్రీ భగవాను లీపాటకు ముగ్ధులైనట్లు కన్పించిరి. ఆ మఱునాడు గురుమూర్తము నిర్వాహకుఁడు దర్శనార్థము వచ్చుట తటస్థింపఁగా శ్రీ భగవానులు పోగాకుబస్తాలను గుఱించి మా నివేదికను ఆయన దృష్టికిఁ దెచ్చిరి. ఆయన తన యనుతాపమును దెలుపుకొని తత్క్షణము ఆ బస్తాల నచ్చటనుండి తీసివేయించి ఆస్థలమును శుభ్రపఱిచి సందర్శనయోగ్యము గావింతునని వాగ్దాన మొనర్చెను.

28-5-1946 వ తేదీ శ్రీరామచంద్రుని వెంకటప్ప అను నా స్నేహితుఁడు దేశభక్తుఁడు నాపేరట ఆశ్రమమున కొక వింతలేఖ వ్రాసెను. ఆయన తన బిడ్డకు శ్రీభగవానుల ప్రసాదముఁ బంపుమని నన్నడిగియుండెను. పై తేదిన ఆయన తన కోరికను నాకు జ్ఞాపకము చేయుచూ ఒక జాబు వ్రాయవలెనను కొనుచుండెనఁట. అప్పుడే ఆయన బావమఱఁది శ్రీపైడి పాటి పుల్లయ్య, ఆ ముందటిరాత్రి ఆశ్రమమునుండి మరలివచ్చియుండి, తనకడ కేతెంచి అయాచితముగా ప్రసాదమును దన కిచ్చెనఁట. తత్క్షణమే ఈ యుదంతమును నాకుఁ దెలుపుచూ ఆయన యిట్లు వ్రాసెను.

"అయాచితముగా మా పుల్లయ్యవల్ల శ్రీవారి ప్రసాద మం దుటచే శ్రీవారి యనుగ్రహమునకు పాత్రులము కావచ్చు ననియే నా విశ్వాసము. మహాత్ముల విషయమున 'ప్రసాద చిహ్నాని పురఃఫలాని' అనికదా కాళిదాసోక్తి."

ఈ లేఖను శ్రీభగవానుల సానుగ్రహవీక్షణమునకు సమర్పించు కొంటిని.

రెండు దినముల తర్వాత లలితవద్దనుండి నాకు జాబు వచ్చెను. అప్పుడు లలిత తక్కిన పిల్లలతోఁగూడ మదరాసులో నుండెను. ఇటీవల వాళ్లు ఆశ్రమము వచ్చినప్పటినుండి శ్రీభగ వానుల ధ్యానములోనే మునిఁగియున్నామనీ, వారివాక్కులే తమకు మామూలుమాటలైనవనీ, అందుల కుదాహరణము భోజనసమయమున నెయ్యి కావలసినప్పుడు 'ఆజ్యధారయా' అనియూ నీళ్లు కావలసినప్పుడు 'స్రోతసాసమం' అనియూ అడుగుచున్నామనీ లలిత వ్రాసెను. శ్రీభవాను లా జాబును దిలకించి పరమానుగ్రహముతో "లలిత చక్కగా వ్రాయఁ గలదు" అని సెలవిచ్చిరి.

జూన్ నెలలో ఒకనాఁ డుదయము శ్రీభగవానులు కొండ నెక్కుచూ 1946 సెప్టెంబరు మొదటి తేదీ జరుగఁబోవు తమ యరుణాచలాగమనస్వర్ణోత్సవమునుగురించి నాతో తమా షాగా ముచ్చటించిరి. వా రిట్లు పలికిరి:

"వేంకటాచలం శెట్టికి ఒక భావతరంగము లేచినది. ఈ స్వర్ణోత్సవంపు తలంపు తొలుత అతనికి పుట్టినది. అతఁ డీ యుద్దేశ్యమును ప్రకటింపఁగానే అది దావానలమువలె అల్లుకొన్నది. దానితో అందరికీ వెఱ్ఱియెత్తిన ట్లున్నది!"

ఈ శుభవార్త వినినంతనే నాకునూ వెఱ్ఱియెత్తి నేను బ్రహ్మానందతన్మయుఁడనై ఆనాఁడే ఆంగ్లమున ఒక గేయము **(Sonnet)** రచించి శ్రీభగవానుల యానతిమేరకు హాలులో పఠించితిని. తర్వాత దానిని తెలుఁగుపద్యముగా ని ట్లనువదించితిని :

"అరుణాచలమ్మున నర్ధశతాబ్దిగా నహహా! మహాద్భుతం
బదిగో కనుఁడు!
సకలభావాతీతసచ్చిదానందమ్మె మానవాకారమై కానుపించు;
తత్సన్నిధాన మందలి నిత్యశాంతిసౌఖ్యార్ణవలహరి నోలాడఁ
జేయు :
ఒకపల్కు పల్కెనా యొకచూపు చూచెనా సకలసందేహముల్
సమసిపోవు;
శుద్ధసద్బ్రహ్మతేజోరాశి జీవుల సరిదిద్ది రక్షింప నరయుచుండు;
ఆతఁడే రమణమహర్షి విశ్వయశస్వి పరదేవుఁ డాత్మాత్మ
కరుణామూర్తి;
మాయచే బద్ధులౌ సర్వమర్త్యులార,
రం డతని శరణొంది సత్ప్రభను గనుఁడు,
ఈ యపూర్వావకాశమ్ము నెట్టులేని
జాఱిపోనీక స్వసుఖమ్ముఁ జూఱగొనుఁడు."

ఈ మారు నేను శ్రీభగవానులతో సుదీర్ఘసహవాస భాగ్య మనుభవించి జూన్ 19 వ తేదీ తిరిగి బయలుదేఱుట నాకు దుస్సహదుఃఖావహ మయ్యెను. ఈ భావోద్రేకము నేను మదరాసునుండి వ్రాసికొన్న లేఖలో ఇట్లు పద్యాకృతిని దాల్చెను:

"నెలదినమ్ములు కడచనె నిమిషమట్లు!
పోయివచ్చెద నని పల్క వాయి రాద!
కన్నతండ్రిని విడనాడఁ గాలురాద!
కర్మఫల మీ ప్రవాసమ్ము కష్టతరము!"

14-7-1946 వ తేదీ నాగమ్మ జాబు వ్రాయుచూ శ్రీభగవానుల ప్రియపరిచారకుఁడు మాధవస్వామి కుంభకోణం మఠమునందు చనిపోయె ననియూ శ్రీకుంజుస్వామి వెళ్లి అంత్య క్రియలు జరిపి వచ్చెననియూ సంతాపవార్తను దెలిపెను.

స్వర్ణోత్సవమునుగుఱించి నాప్రశ్నకు ఆశ్రమము వారు 15-7-1946 తేదిన ఇట్లు ప్రత్యుత్తర మిచ్చిరి:

"స్వర్ణోత్సవమునకు ప్రత్యేక కార్యక్రమము లేదు. భక్తులందఱు ఉత్సవములో పాల్గొందురని ఆశించెదము. శ్రీభగవానులను ఆయన బోధనలను గుఱించి యిదివఱకు వ్రాయ నవకాశము లేకుండిన భక్తుల వ్యాసములుగల యుత్సవ సంచిక **(Souvenir volume)** యొకటి నాఁడు ప్రకటింపఁబడును. కాగితపుఁగఱవువలన సంచికపుటలు పరిమితములు కావలసి వచ్చినది"

నాగమ్మ కోరినమేరకు మౌన నిర్వచనమునకు శ్రీభగవానుల తెనుఁగనువాదమును నా నోటునుండి ప్రతి వ్రాసి యామెకుఁ బంపితిని. అది చేరినవైనముఁ దెలుపుచూ ఆమె 30-7-1946 న తేదిన ఇట్లు వ్రాసెను.

“మీజా బందినది. నాలుగురోజుల కవతల ఏదో ప్రసంగ వశాత్తు భగవానులతో చెప్పఁగా, మౌననిర్వచనము చూచేనిమిత్తము జాబు తీసుకొని సాంగోపాంగముగా చూచినారు. అప్పుడు సోదరులు రామచంద్రయ్యరు ఇక్కడున్నారు. వారినిగురించి మీరు వ్రాయలేదని వారితో ఛలోక్తిగా చెప్పినారు. ఆ మౌననిర్వచనము నోటులో వ్రాసిపెట్టినాను. దానికి తెనుఁగు రామచంద్రయ్యర్ నోటులో భగవానులు వ్రాసినదే ఉన్నదని వారు పట్నము నుంచి వ్రాసి పంపినారు. అది మీకు వ్రాయుచున్నాను: *‘మౌనము లోపలనుండి లేచు ఏకాక్షరరూపశక్తిస్థితి’* ”

7-8-1946 న తేదీ ఆశ్రమమువారు ‘ఉపదేశసారము’ ప్రతి నాకుఁ బంపుచూ దానిని మఱుసటి కూర్పునకు తయారు చేసి తిరిగి పంపుమనికోరిరి. వా రిట్లు వ్రాసిరి :

“ఇప్పుడు నీకు పంపిన ప్రతిలో నీవు గావించు సవరణలు ఆ గ్రంథముద్రణ తరుణమున ప్రూఫులో చేర్పఁబడును” నే నా ప్రకారమే చేసితిని.

ఈ కాలముననే తూర్పుగోదావరి వాస్తవ్యులు శ్రీ ఓరుగంటి నరసింహయోగిగారు శ్రీ భగవానుల దర్శనార్థ మాశ్రమమునకుఁ బోవ నభిలషించిరి. ఆయన హిమాలయములో ఒక గురువు నాశ్రయించి యోగాభ్యాసముఁ గావించి యుండిరి. ఆయన స్నేహితుఁడొక యోగి శ్రీ వివేకానంద స్వామి శ్రీ అరవిందులు మున్నగు పలువురు మహనీయుల సూక్ష్మ శరీరములను సందర్శించి తత్పరిమాణములను గొలత వెట్టి యుండెనఁట. కానీ శ్రీ భగవానుల సూక్ష్మ శరీరము మాత్రము అరుణాచల జ్యోతిస్తంబమువలె దృక్పథపరిమితి నతిక్రమించి వ్యాపించియున్నందున, దాని పరిమాణము నిర్ణయించలేకపోయెనఁట! ఈ సమాచారము నేను నాగమ్మకు వ్రాయఁగా ఆమె 14-8-1946 వ తేదిన ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"శ్రీ నరసింహమూర్తిగారు ఇక్కడికి రాఁదలచుట చాలా మంచిది. శ్రీ భగవానులు మీజాబంతా సావకాశంగా చదివి 'నరసింహమూర్తిగారిని గురించి లోఁగడ వినే ఉన్నాను. వారి స్నేహితులు మా సూక్ష్మశరీరాలు అంత దూరం ఇంతదూరం అని నిర్ణయించారుగదా. వారి శరీరం ఎంతదూర మున్నదో ముందు చూచుకోమని వ్రాయండి' అని హాలులో అందరితో చెప్పినారీ సంగతి."

అప్పుడు రైళ్లలోను బస్సులలోను సమ్మెలు నడచుచుండినందున నేను స్వర్ణోత్సవమునకు వెళ్ళఁజాలక యెంతో

చింతించితిని. ఈ నా దురదృష్టమును దెలుపుకొను జాబులో ఈ క్రింది పద్యము వ్రాసితిని.

"భువిం గరుణించు కుమారుని
యవతార మ్మైన రమణు నరుణాచలుండౌ
శివుని సమాగమదివసపు
సువర్ణసుమహోత్సవమ్ము శోభిలుఁగాతన్."

ఆశ్రమము వారు 6-9-1946 వ తేదీ గల ప్రత్యుత్తరములో ఇట్లు వ్రాసిరి :

"భక్తిపూరితమైన నీ మొదటి తేదీ యుత్తరము చేరి శ్రీ భగవానులచేఁ గటాక్షింపఁబడినది ... పద్యము హృద్యముగా నున్నది. అది శ్రీ భగవానుల సమ్ముఖమునఁ బఠింపఁబడినది. ప్రేమమయ హృదయానికి దూర మొకటెక్కడియా? శ్రీ భగవానులు కరుణాస్వరూపులు గావున తన శరణుచొచ్చిన భక్తుల ప్రార్థన లాలకించి నెరవేర్తురు. స్వర్ణోత్సవము మిక్కిలి వైభవముగా జరగెను. ప్రయాణ సాధనములు లేకున్ననూ సమీపదూరభక్తులనేకు లెట్లో ఈ యుత్సవమునకు రాఁగలిగిరి. ఆనాఁ డుదయము 4 గంటలకు వేద పారాయణముతో ఉత్సవ కార్యక్రమ మారంభమాయెను. ఆ దిన మంతయూ శ్రీ భగవానులు ఉత్సవార్థము నిర్మింపఁబడిన చలువపందిరిలో ఆసీనులైరి.

పూర్వాహ్ణ మెల్లనూ భక్తులు పలు భాషలలో రచించిన పద్యములు గేయములు పఠించుటందుఁ గడచెను.

అపరాహ్ణ కార్యక్రమము సరిగా రెండున్నర గంటలకు ప్రారంభమయ్యెను. బ్రాహ్మణులు వేదబుక్కులను భగవత్ స్తోత్రములను బఠించుచూ పూర్ణకుంభసహితస్వస్తి వాచక మొసంగుటతో సాయంకాల కార్యక్రమ ముపక్రమింపఁబడెను. శ్రీ కుప్పుస్వామయ్య రను జడ్జీగారు అధ్యక్షత వహించిరి. ఆంగ్లాంధ్ర తమిళ మలయాళములలో శ్రీ భగవానులను వారి బోధనలను గీర్తించు నుపన్యాసము లియ్యఁబడెను. శ్రీ ముసిరి సుబ్రహ్మణ్యయ్యరు బృందము తమ గానముచే శ్రోతల డెందముల నానందసాగరమున నోలలాడించిరి. వేద పారాయణముతో నాఁటి కార్యక్రమము సమాప్తమయ్యెను. సర్వమునూ సవ్యముగా దివ్యముగా నడచెను.”

26-9-1946 వ తేదిన ఒక స్నేహితుఁడు స్వర్ణోత్సవ చిత్రము స్థానిక సినిమాహాలులో ప్రదర్శింపఁబడుచున్నదని కబురుచెప్పి నన్ను దానినిఁ జూచుటకుఁ దీసుకవెళ్ళెను. అది మిక్కిలి స్ఫుటముగా సుందరముగా హృదయంగమముగా నుండెను. ఆ ప్రదర్శనమున కా నాఁ డంత్యదినమని తెలియ వచ్చినప్పుడు నేను నా యదృష్టమునూ సకాలమున నాకీ వార్తఁ దెలిపిన నా స్నేహితుసీ ఎంతో కొనియాడితిని. ఆ

మఱియు నాఁడా చిత్రప్రదర్శనమునుగుఱించి ఆశ్రమమునకు నివేదించితిని. ఆశ్రమమువారు 29-9-1946 వ తేదీ తమ ప్రత్యుత్తరములో

"మేము మదరాసు, బొంబాయి భక్తులనుండిగూడా ఆ చిత్రము ఏకకాలమున విడుదలయైనట్లు విన్నాము" అని వ్రాసిరి.

అటుపిమ్మట దశారా సెలవులలో నేను మరల ఆశ్రమము చేరుకొన్నప్పుడు నేను స్వర్ణోత్సవచిత్రమును సందర్శించి వర్ణించినందులకు తోడిభక్తులనేకులు నన్నభినందించిరి. చిత్రమునుగూర్చి వార్తఁ దెలిపినవారలలో నేనే ప్రథముఁడనని శ్రీ భగవానులు పలికిరి. మఱియు వారు దయతో ఇట్లు సెలవిచ్చిరి :

"కాఁబట్టి నీవు ఇచ్చటి యుత్సవమునకు హాజరుకాలేదని చింతింప నక్కఱలేదు. అంతే గాదు దానిలో పాల్గొన్న పెక్కుమందికన్న నీవు మిన్నగా సమగ్రముగా చూచినావు. కిటికీనుండి యూరేఁగింపును జూచువాఁడు ఊరేఁగు పాటికన్నను సమగ్రతర దృశ్యమును చూడఁగలుగునని చెప్పినారుగదా."

నా దృష్టిలో ఆ దినముల విశేషము ఆశ్రమమునకు నా పురాతన గురువర్యులు ప్రొఫెసర్ డి. యస్. శర్మగారి సకుటుంబాగమనము. శ్రీ భగవానులాయనపట్ల ప్రత్యేకాను

గ్రహాదరములు చూపిరి. ఒకనాఁ డుదయము ప్రొఫెసర్ శర్మగారూ మేము కొందఱమూ స్కందాశ్రమము సందర్శించుటకు గిరి నధిరోహించుచుండఁగా దారిలో శ్రీ భగవానులు మమ్ముఁ గలసికొని స్వాగతముఁ బలికిరి. వారు తమ పరిచారకునితో ఇట్లు నుడువుచుండఁగా మేము వింటిమి :

"అక్కడ పోవుచున్నారే ఆయన పెద్ద 'సార్' (అయ్యవారు.) ఆయన మన సుబ్బరామయ్యకు గురువు. అంటె ప్రొఫెసరుకు ప్రొఫెసర్ అన్నమాట."

4-10-1946 వ తేది మహానవమి పండుగ, నా జన్మదినముకూడా. ఆనాఁడు వేకువనే నా స్నేహితుఁడు శ్రీ ఆర్ నారాయణయ్యర్‌తోఁగూడా గిరిప్రదక్షిణము చేసితిని. తిరిగి వచ్చునప్పుడు శ్రీ అరుణాచలేశ్వరాలయములో పూజ చేయించితిమి. మఱియు దారిలో దేవుని యూరేఁగింపుఁ దిలకించి కొంతదూర మా యుత్సవములోఁ బాల్గొంటిమి. ఇది నాకు మిక్కిలి శుభసూచకముగఁ దోఁచెను. ఆనాఁడు నే నీ క్రింది 'జన్మదినప్రార్థన' పద్యమును రచించి శ్రీ భగవానులకు సమర్పించుకొంటిని.

పుట్టినదిన మేపండువు!
పుట్టిననే నెవ్వఁడనుచు మూలము నరయక్
దట్టును స్వరూప మెప్పుడా
పుట్టనిదిన మనెడు పండువును గూర్పఁగదే."

ఆ సాయంకాలము ప్రొఫెసర్ డి. యస్. శర్మగారొక ప్రశ్న మడిగిరి. దానికి శ్రీ భగవానులు సుదీర్ఘముగా ప్రత్యుత్తర మొసంగిరి. తర్వాత శ్రీ శర్మగారే ఆ ప్రశ్నోత్తరములను ఈ క్రింది పాఠరూపమున నా కందించిరి :-

ప్రశ్న : పాశ్చాత్యయోగుల జీవితములలో వారి యోగ విధానము మూఁడు సుప్రసిద్ధ ఘట్టములుగా వర్ణింపఁబడినది. అవి కల్మష వినాశము, సాక్షాత్కారము, సాయుజ్యము. కల్మషవినాశము మనము సాధనదశ అని పేర్కొను దానికి సరిపోవుచున్నది. శ్రీ భగవానుల జీవితములో అట్టిదశ యెప్పుడైన నుండెనా ?

ఉత్తరము: అట్టిదశను నే నెఱుఁగను, నే నెన్నఁడూ ప్రాణాయామముగానీ జపముగానీ చేయలేదు. నా కే మంత్రములునూ రావు. నా కే ధ్యాననిబంధనలునూ లేవు. తర్వాత నే నట్టి విషయములను గుఱించి విన్నప్పుడుఁగూడ నన్నవి ఆకర్షింపలేదు. ఇప్పుడుఁగూడ నా మనస్సు వాటిని గమనించ నిరాకరించును. 'సాధన' అనుటలో ఒక ప్రాప్యమూ అది లభించు సాధనమూ ఇమిడియున్నవి. మన కిదివఱకే లేనిది యింక లభించవలసినది యే మున్నది? ధ్యానములో ఏకాగ్రతలో మన కర్తవ్యము దేనినిగుఱించియూ తలంపక యూరకుండుటయే. అప్పుడు మనము మన సహజస్థితిలో నుండెదము. ఈ సహజస్థితికే మోక్షము, జ్ఞానము

ఆత్మ మున్నగు ననేక నామములు గలవు. ఇవి అనేక వివాదముల కాస్పద మగుచున్నవి. ఒకకాలమున నేను కనులు మూసికొని యుంటిని. దానినిబట్టి నే నప్పు డేదో యొకసాధన నభ్యసించు చుంటినని యనుకొనరాదు. ఇప్పుడుగూడా ఒక్కొకవేళ నేను కనులు మూసికొని యుందును. అట్టిసమయమున నే నేదో సాధన చేయు చున్నానని జను లనెద రేని వారినట్లే అననిండు. దానివల్ల నా కేమి వ్యత్యాసమూ లేదు. ఏదోయొక గొప్పసాధన వలన చివర నొకనాఁటికి బ్రహ్మాండవైభవముతో ఆత్మ తమపై ఉట్టిపడుననీ, అప్పుడు తమకు 'సాక్షాత్కారము' కలుగుననీ ప్రజ లూహించునట్లున్నది. ఆత్మ 'సాక్షాత్తు' సరియే, కానీ దానిలో 'కారము'గానీ 'కృత్యము'గానీ లేదు. 'కారం'అనుమాట మన మేదోచేయుటను సూచించు చున్నది. కానీ ఆత్మ మన మేదో చేయుటవలనఁ గాక, మన మేదియు చేయకుండుటవలన - మన మూరక యున్న ట్లుండుటవలన - లభ్యమగు చున్నది'

పై సంభాషణనుగుఱించి ప్రొఫెసర్ శర్మగారు తర్వాత 7-10-1946 వ తేదిన

"ఈ దక్షిణభారత మహాత్మునిగూర్చి రచింపఁబడు నెట్టి గ్రంథమునందైనను ఈ సూక్తి చేర్పఁదగినదిగదా"

అని నాకు వ్రాసిరి. మా ప్రొఫెసరుగారి కోరిక యిచ్చుట ఇట్లు

నెరవేర్పఁబడినది. ఆ లేఖలోనే ప్రొఫెసరుగారు మఱియు ఇట్లు వ్రాసిరి.

"శ్రీ మహర్షి నిగుఱించి యింతవరకు ప్రకటింపఁబడిన కథనముల నన్నింటి నొకచోటఁ జేర్చి ప్రతిపదమున కథానాయకుని యనుమతి నొంది దానిని విపులీకరింపఁదగునను నీ యాశయ మెంతయూ శ్లాఘ్యము...అది యెంత త్వరగా చేసిన, అంత మంచిది. నీవూ స్వామినాథనూ వంటివారే దానిని తృప్తికరముగా చేయఁగలరు. జీవిత చరిత్ర వాస్తవికముగా, క్లుప్తముగా, యథార్థముగా - భాషావిజృంభణలు అలంకారములు అతిశయోక్తులు లేకుండ - ఉండవలెను.

కానీ మే మెంత ప్రయత్నించిననూ శ్రీ భగవానుల యారోగ్యము క్షీణించుట ముఖ్యకారణముగా మేము పై సలహాను నెరవేర్పలేకపోవుట శోచనీయము.

ఇంటికి మరలివచ్చిన పిమ్మట నే నొక రాత్రి శ్రీ భగవానులను గుఱించి పాడు కలలు గంటిని. తొలి కలలో శ్రీ భగవానులు జాఱుడునేలపై నడచుచుండుటఁ గాంచి వారు జాఱిపడకుండఁ జూచుటకు నేను వారిని సమీపించితిని. కానీ శ్రీ భగవానులే నాచేయి గట్టిగా పట్టుకొని నన్నే ఆ నేల మీఁద భద్రముగా దాఁటించిరి. రెండవ కలలో శ్రీ భగవానులు నా కొక సబ్బుబిళ్ళను బ్రసాదించి అది బాహ్యదేహ

మునేగాక అంతరాత్మనుగూడా పరిశుభ్రపఱుచు నని సెల విచ్చిరి. ఈ స్వప్నద్వయమును గుఱించి నేను వ్రాసిన జాబునకు ఆశ్రమము వారిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి.

"శ్రీ మహేశ్వరుఁడే శ్రీ రమణరూపమున మనకు సాక్షాత్కరించి మన దోసఁగులను పోఁద్రోలి మనలను సర్వదా నడపించుచున్నాఁడు. ఆయనయందు మన భక్తి విశ్వాసములు నిరంతర ప్రవర్ధమానము లగునుగాక! నీ స్వప్నముల ప్రయోజనమును ఇదియే."

1946 అక్టోబరు తుదివారములో ముగ్గు రాత్మీయుల యకాలమరణమువలనఁ గలిగిన మనఃఖేదమును బాపుకొనను ద్దేశ్యముతో నేను శ్రీభగవానుల "ఉళ్లదునార్పదు" "అనుబంధము"లను తెలుఁగుసీసమాలికలుగా అనువదించుటందు పనివడితిని. ఈ ప్రేమపురస్సరకైంకర్యము నా పరితాపము నపనయించినతీరు శ్రీభగవదనుగ్రహామునకు మఱియొక తార్కాణము.

26-11-1946 వ తేదీ నాగమ్మ అప్పుడు వానలు విశేషముగా కురియుచున్నందున శ్రీభగవానులు దగ్గూ పడిశమూ పట్టి అనారోగ్యముగా ఉన్నారని జాబు వ్రాసెను.

5-12-1946 వ తేదీ మచిలీపట్టణ (బందరు) వాస్తవ్యుఁడు శ్రీవేమూరి పార్థసారథిరావు స్వర్ణోత్సవ దివసమున శ్రీభగవానుల కంకితముగా తాను రచించిన "నివేదన" అను

నామము గల యాంగ్లగేయసంపుటిని పరనార్థము నాకుఁ బంపెను. అయన దానితో జతపఱిచినలేఖలో ఇట్లు వ్రాసెను:

"మనము పరస్పరము క్రొత్తవారమైనను, శ్రీభగవానుల పవిత్రాత్మ మన శాశ్వతసహోదరత్వము నిప్పుడు మనకు ప్రత్యక్షీకరించు చున్నది. అవును! వాక్కు లణఁగినప్పుడు హృదయము లన్యోన్యము మఱింత స్వేచ్ఛానందములతో ముచ్చటింపఁగలవు. హృదయముల భాష ప్రేమతప్ప వేఱు గాదు."

1946 క్రిస్ట్మస్ సెలవులలో నేను మరల ఆశ్రమయాత్ర చేసికొంటిని. నా సీసమాలికలను శ్రీభగవచ్చరణముల మ్రోల నుంచితిని. వారు ప్రార్థనమేరకు వ్రాఁతప్రతిని బరిశీలించి సవరించుటకు పరమానుగ్రహముతో అంగీకరించిరి. సప్త మపద్యానువాదములలో ఇట్లు వ్రాసియుంటిని :

"...లోకమునకు జ్ఞానమునకును భవలయమూలమగుచు భవలయములు లేక భాసిల్లు పరిపూర్ణమైనదౌ యా వస్తు వని తెలియుము"

శ్రీ భగవానులు 'వస్తువు' నకు 'ఆ' యను నిర్దేశ ముండఁగూడదని సెలవిచ్చి 'పరిపూర్ణ మైనదియే వస్తువు' అని సరిదిద్దిరి. ఇరువదవ పద్యములో "ద్వైవ ముండనియెడఁ దా నున్నె?" అను చరణభాగమును "తా ద్వైవమునకన్న లేమిచే" అని మార్చిరి. ముప్పదిరెండవ పద్యములో

"అదియ నే నిది కాద యని తలంచుట మనోబలమేమి లేనందువలనఁజూవె" అని నేను వ్రాసియుంటిని. 'బలమేమి' యనుటలో అత్యుక్తి కలదని 'ఏమి' తీసివైచి 'బలము లేకున్నందువలనఁ జూవె' అని సవరించిరి. పండ్రెండవ పద్యములో "జ్ఞాన మజ్ఞానమ్ము లేని దే జ్ఞానమౌ" అను చరణ భాగమును జదువుచూ శ్రీ భగవాను లిట్లు సెలవిచ్చిరి. నాయన (కావ్యకంఠులు) తొలుత ఈ వాక్యము నొప్పుకొన లేదఁట. అంతట శ్రీ భగవానులు "ఉపదేశసారము" 27-వ శ్లోకము నాయనకు జ్ఞాపకము చేసిరట. అది యిట్లున్నది:

"జ్ఞానవర్జితాజ్ఞానహీనచిత్
జ్ఞాన, మస్తి కిం జ్ఞాతు మన్తరం?"
"జ్ఞానమజ్ఞానమ్ము లేని బోధమ్మె
జ్ఞాన, మెఱుఁగుట కేదేనియు లేదు."

ఈ శ్లోకము నాయనయే వ్యాఖ్యానించియుండిరఁ అప్పుడు నాయన "ఔనౌను" అని యొప్పుకొనిరఁట. ఈ యుదంతము చెప్పుచూ శ్రీ భగవాను లిట్లు సెలవిచ్చిరి.

"మాయాశక్తి మహిమ అట్టిది, ఎంతటి పండితుని మనస్సునుగూడ ఒక్కొకప్పుడు భ్రమింపఁ జేయగలయది."

ఒకనాఁడు శ్రీ భగవానులు ప్రసంగవశమున తిరుచ్చుళిలో వేంచేసియున్న దేవిసహాయవల్లినిగూర్చి కావ్యకంఠుని

ప్రార్థన శ్లోకమును పునరావర్తింపఁగా నేను దాని నిట్లు వ్రాసికొంటిని.

"భవార్గతానాం భవతాత్సహాయః
సహాయవల్లీ కరుణాకటాక్షః
యత్స్వాత్మపూతో రమణో మహర్షిః
* పరంలులోకే భగవాన్ గురుర్నః"

( * 'గుహావతారః పర మాలులోకే'- పూర్వపాఠము.)

26-12-1946 వ తేదీ శ్రీ భగవానులు హాలులో జ్ఞానేశ్వరుని కథ చెప్పి "మహాభక్తవిజయము" నుండి జ్ఞానేశ్వరునకు అతని తండ్రికి జరగిన సంవాదమును జదివి వినిపించిరి. అందులో ఒక వాక్యమును శ్రీ భగవానుల యానతి చొప్పున నే నాంగ్లీకరించితిని. ఆ వాక్యభావ మిది :

"కోల ననుసరించి నర్తించు కోఁతివలె మనస్సు దృఢజ్ఞాని యగు జనకరాజుచే నిర్జింపఁబడెను, గానీ బంధములఁ ద్రెంపుకొనుటకై అడవులకు పరుగెత్తిన శుకునిచే నిర్జింపఁబడలేదు."

ఆ రాత్రి శ్రీ భగవానులు భోజనశాలలోఁ గూర్చుండి ముచ్చటలాడుచుండఁగా, కృష్ణస్వామియను పరిచారకుఁడు వారిని దోడ్కొని పోవుటకు వారి చేతికఱ్ఱ పట్టుకొనివచ్చెను. వెంటనే శ్రీ భగవానులు లేచుచూ ఇట్లు పరిహాసమాడిరి :

"అదిగో ఆడించువాఁడు కోలతో వచ్చుచున్నాడు. ఆ కోలను జూచి యీ కోఁతి (తనను నిర్దేశించుచూ) ఆడ వలెఁగదా!"

ఆ మఱునాఁడు నే నింటికి మరలివచ్చితిని. తదనంతరము వెనువెంటనే ఆశ్రమమువారి యాదేశము ననుసరించి నేను "స్వతంత్ర" పత్రికాసంపాదకునకు సమీక్షార్థము పంపఁబడిన స్వర్ణోత్సవసంచిక విషయము జ్ఞాపకముచేయుచూ జాబు వ్రాసితిని. 9-1-1947 వ తేదీ ఆయన యిట్లు ప్రత్యుత్తర మొసఁగెను.

'నే నా గ్రంథమును డాక్టరు ఆర్. వైద్యనాథస్వామిగారి కిచ్చినాను. దానిని సమీక్షించుట కాయన యుత్తమాధికారి యని నా యభిప్రాయము. ఆయన శనివారము నాఁడు సమీక్షను బంపునట్లు వాగ్దానమొనర్చెను. అది సకాలమున వచ్చునేని, రాఁగల వారపు 'స్వతంత్ర' లో ప్రచురింపఁబడును."

నేను 4-1-1947 వ తేదిన ఆశ్రమమునకు వ్రాసిన లేఖలో భక్తులమగు మనకొఱకు శ్రీ భగవానులు పూర్ణారోగ్యమును మరలఁ బడసి కనీసము వజ్రోత్సవ పర్యంతమైనను తన దివ్యసన్నిధానముతో మనలఁ గటాక్షింతురుగాక యని ప్రార్థించితిని. దానికి ఆశ్రమమువారు 11-1-1947 వ తేదిన ఇట్లు ప్రత్యుత్తర మిచ్చిరి :

"నీ ప్రార్థనను మేము ప్రత్యేకముగా గమనించినాము. భక్తులందఱి ప్రార్థనగూడా అదే. భగవదనుగ్రహము నెర వేఱునుగాక!"

శ్రీ భగవానులు సప్తతి జన్మదినోత్సవమువఱకే భౌతికసన్నిధాన మనుగ్రహించిరి.

18-1-1947 వ తేది శ్రీ వేమూరి పార్థసారధిరావు నేను తిరిగిపంపిన తన "నివేదన" చేరిన వైనముఁ దెలుపుచూ ఇట్లు వ్రాసెను:

"మీ రొనర్చిన సవరణలును ఒసంగిన యమూల్యము లగు సలహాలును మీ రెంతటి ప్రీతిపూర్వక జాగరూకతతో నా కృతిని బరిశీలించినదీ విశదపఱుచుచున్నవి. మీ జాబుతో జతపఱిచిన మీ రెండు పద్యములు మన భావబాంధవ్య సమావేశమును ప్రతిధ్వనించుచూ నన్నుత్తేజపఱుచుచున్నవి."

20-1-1947 వ తేదిన నాగమ్మ ఆశ్రమమునుండి వ్రాసిన జాబులో శ్రీ భగవానుల చిరకాల సహచరుఁడు శ్రీ రామనాథబ్రహ్మచారి ఒకపక్షము క్రిందట మదరాసువెళ్ళి అచ్చట దివంగతుఁడైనాఁ డన్న దుఃఖవార్తను దెలిపెను. ఆ బ్రహ్మచారిని శ్రీ భగవానులు 'వాధ్యారి' (ఉపాధ్యాయుఁడు) అని పిలుచువారు. ఆయన వినయవిధేయతల మూర్తీభావమే యనఁదగియుండెను. నే నాయనను బ్రశం

సించుచూ నాగమ్మకు వ్రాసిన జాబులో శ్రీ భగవానుల సన్నిధానమున ఆయన భజనగీతమైన " రమణరసనుభూతి " నాలపించుట ఆయన స్మరణార్థము చేయు నుత్తమగౌరవము కావచ్చునని సూచించితిని. 30-1-1947 వ తేదిన ఆమె నాజాబును శ్రీ భగవానులకుఁ జదివి వినిపించితి ననియూ, అంతకు పూర్వమే ఆ బ్రహ్మచారి మరణవార్త తెలియఁగానే కడలూరుభక్తులు "రమణరసనుభూతి"ని హాలులో పాడిరనియు నాకు జవాబు వ్రాసెను. ఆ జాబులోనే శ్రీ భగవానులు మిక్కిలి చిక్కియున్నా రన్న యుద్వేజకర వార్తఁగూడ ఆమె తెలిపెను.

15-2-1947 వ తేదీ " స్వతంత్ర "లో స్వర్ణోత్సవ సంచికపై సమీక్ష ప్రకటింపఁబడెను. ఆ మఱునాఁడు దానిపై వ్యాఖ్యానించుచూ ఆశ్రమమువారు నా కిట్లు వ్రాసిరి:

"పాండితీమండితమగు తావత్సుదీర్ఘసమీక్షకు సంపాదకుఁడు తా వ్రాసంగుట ప్రశంస్యము. కానీ సమీక్షా రచయిత కేవల సద్వస్తువును విలువఁగట్టుటకు లౌకికమగు కొలమానము నవలంబించినట్లున్నది. సర్వోత్తమ సాక్షాత్కారమును వివిధజీవికలలో లభించు ఫలితములతోఁ బోల్చి గణించుట లౌకికదృక్పథమును సూచించును. ఈ మానము శాస్త్రసమ్మతమని యంగీకరించిననూ, ఆ లౌకికాత్మ (State self) వ్యవహారప్రవిష్టులగువారు ఆత్మ

విద్యామానగురువుతో 'సంపర్కము'నకై యత్నించ వలెను, సమస్త లౌకికమానమున కతీతుఁడైన గురు వట్టి 'సంపర్కము'న కుద్యమించుట అసంభవము. దానికిఁ గారణము తేటతెల్లము. మహర్షి నిత్య శాశ్వత స్వరూప నిష్ఠుఁడు. లౌకికుఁ డన్ననో, ప్రాపంచిక కార్యసిద్ధియందు శ్రద్ధాసక్తులు గలవాఁడు."

పూర్వోక్త భావముల ననుసరించి నేను వ్రాసిన యీ క్రింది లేఖ ఆ పత్రికయందు తదనంతర సంచికలో ప్రకటింపఁ బడెను:

"విద్వత్ప్రభావిభాసిత సమీక్షకై 'స్వతంత్ర'కు హృదయ పూర్వక ధన్యవాదములు. ...శ్రీ రమణమహర్షులను 'వాస్తవ వీరుఁ'డనియు, వారి 'ఉళ్లదు నార్పదు'ను 'యుద్ధసన్నద్ధుఁడగు రణవిద్యావిశారదుని సునిశిత సైనికాదేశసంపుటి యనియు వర్ణన సత్యము రస నంతము. ...మఱియు మహర్షి యాదర్శము 'కేవల మౌనస్థితి. ... ఇంద్రియవ్యాపారలేశరహితము, సృష్టి పూర్వ తద్బీజప్రాయ పుంజీభూత చిత్స్వరూప భూమిక' అను వివరణ ముత్తమనిర్వచనము.

ఈ సమీక్ష రెండు ప్రాథమిక ప్రశ్నలను లేవఁదీయు చున్నది. 1. కేవలతత్త్వస్వరూపమునకు లౌకికమగు కొల మానముతో విలువఁగట్టుట సాధ్యమా? 2. ఆత్మవిద్యా

మౌనగురువు నిత్యశాశ్వతస్వరూపనిష్ఠుఁడు, మఱి లౌకి కుఁడు దేశకాలములకు సంబంధించిన కార్యసిద్ధియందు శ్రద్ధాసక్తులు గలవాఁడు. కావున లౌకికుఁడుగదా పార మార్థికునితో 'సంపర్కము' నకు ప్రయత్నింపవలసినది. (అట్టి సంపర్కమువలన సత్ఫలితములను 'రమణగీత' దశ మాధ్యాయము ప్రదర్శించుచున్నది.)................ 'బాలుఁడు పరమాత్మాన్వేషణకై యింటినుండి పాఱిపోయి తన నెదుర్కొనిన యాటంకముల నన్నింటిని దాఁటి నిజ ప్రాప్యమును సాధించె' నను గాథ కేవలసత్యము గాదు. వాస్తవముగా మహర్షి పదునేఁడవయేట మధురలో నిజ గృహమునందే ఆత్మసాక్షాత్కారము నొందెను; తదనంత రము తన దివ్యపిత పిలుపువలననే యిల్లు వదలెను. అది మొదలాయన తపస్సు సాంప్రదాయవిధానము ననుసరించి నది గాదు. అది కేవల మాత్మనిష్ఠయే. ఒకఁడు మిక్కిలి లేఁతవయస్సులో ఎట్టి గురూపదేశముగానీ శాస్త్రపాండితి గానీ లేక ఆకస్మికముగా ఆత్మసాక్షాత్కారము నొందు టకు శ్రీ రమణులు అపూర్వనిదర్శనము. ఆ కారణము చేతనే వారివిషయమును చర్చించుటందును కేవల స్వయంప్రతిభను నిర్వక్రతను జూపెదరు. కావున వారి చరిత్రము తీవ్రహేతువాదులు మన స్తత్త్వపరిశోధకులు సైతము శ్రద్ధాసక్తులతో పరిశీలింపఁదగినది."

19-2-1947 వ తేదీ వచ్చిన మహాశివరాత్రి పండుగ సందర్భమున నేను "శ్రీ రమణుకొలువు" అను శీర్షికతో ఈ క్రింది పంచరత్నములు రచించి ఆశ్రమమునకు వ్రాసిన జాబులోఁ జేర్చి పంపుకొంటిని :

1. "వెలునడు శివుని హరిసురలు
కొలిచిన శివరాత్రి నేఁడె గురునంకమునన్
గొలువొ కుమారు నరసుర
కులపావను రమణఋషిని గొలువఁగవలదే?

2. కొలిచెనఁట నాఁడు దివమున్
ఖలుఁదారకు చూపుమాపి! క్రౌంచాచలమున్
దొలిచెనఁట! నేఁడు పుడమిన్
గొలుచునఁట! రమణమహర్షిఁ గొలువఁగవలదే?

3. కొలుచు టన దేశకాలం
బుల లోఁబడు మర్త్యపాళి బుద్ధుల రమణున్
గొలఁతయిడఁ జూచు టగునే?
కులగిరులన్ గొలఁతబద్ద కొలఁదియె కొలువన్?

4. అల తొలి యరుణాచలునిన్
గొలువం బనిగొనిన బ్రహ్మకున్ విష్ణునకున్
గలిగిన పరాభవమె గద
అలఁతిమతులు రమణుఁ గొలువ నగు నగుబాటున్.

5\. కొలుచున దేవ రను తలఁపుం
గొలిమి నిడుచు మన యహంతఁ గొల గావింపన్
గలుగుటయే శివరాత్రిని
గులపతిఁ బరమాత్ము రమణుఁ గొలుచుట యనఁగన్.

పై పద్యములలో 'కొలువు' అను శబ్దమునందు మూఁడర్థముల శ్లేష గలదు. ఆ యర్థము లెవ్వియన: 1. సేవ లేక ఆరాధన, 2. కొలువుకూటము అనఁగా ఆస్థానము, 3. కొలుచుట అనఁగా కొలమానముతో గణించుట.

నా జాబు చేరినవైనముఁ దెలుపుచూ ఆశ్రమమువారు 22-2-1947 వ తేదిన ఇట్లు వ్రాసిరి.

"నీ పద్యములు గమనింపఁబడినవి... 'స్వతంత్ర' సంపాదకునకు నీవు వ్రాసిన లేఖ సంపూర్ణప్రయోజనకారిణి."

1947 మార్చి కడపటివారములో భీమవరము వకీలు శ్రీ రాయసము నరసింహామూర్తి యిరువది రూప్యములు నా యొద్దకుఁ బంపి దానిని శ్రీ భగవానుల కైంకర్యమునకు వినియోగింపఁగోరెను. ఈ వార్త నేను దెలుపఁగా ఆశ్రమము వారా మొత్తమును "ఉళ్ళదునార్పదు" 'అనుబంధము' లకు నేను రచించిన సీసమాలికలను ముద్రించుటకై వెచ్చింపుమని యానతిచ్చిరి. ఆ ద్రవ్యము కాగితముఁ గొనుటకు సరిపోయెను. 'వైశ్యముద్రణాలయము' వారు తమ సహజభక్తిప్రవత్తు

లతో ద్రవ్యనిరపేక్షముగా దానిని ముద్రించిరి. ఆ గ్రంథ ప్రచురణ సంవిధానము నిక్కముగా శ్రీ భగవానుల యను గ్రహప్రభావమునకు మఱియొక తార్కాణము.

1947 మేనెల మధ్యభాగమున నేనాశ్రమమును మరల సందర్శించితిని. అప్పటి గొప్పవిశేషము శ్రీ భగవానులు తమిళ 'వెణ్బా' (శుక్లఛందస్సు) నవలంబించి తెలుఁగున "ఏకాత్మపంచకము" రచించుట. తత్పూర్వము "పుట్టిన దినము"పై తన వెణ్బాలను రెంటిని శ్రీభగవానులు తెలుఁగు వెణ్బాలుగా అనువదించియుండిరి. కానీ శ్రీ భగవానులు వెణ్బాఛందస్సున తెలుఁగులో స్వాతంత్రరచనఁ గావించుట కిదియే ప్రథమపర్యాయము. పదనంతరము వారీపంచక మును తమిళవెణ్బాలుగా అనువదించిరి. తర్వాత శ్రీ మురగనారా పంచకమునకు తమిళములో చరమ మంగళవెణ్బాను జేర్చిరి. దానిని శ్రీ భగవానులు తిరిగీ అదే ఛందస్సున ఆంధ్రీకరించిరి. వివిధభాషలలోని ఛందస్సులు పరస్పర వినిమయార్హము లనియూ, వస్తుతః నాయన వెణ్బాఛందస్సు లోను తిరుప్పుగళ్ ఛందస్సులోను కొన్ని శ్లోకములు రచించి యుండిరనియూ శ్రీభగవాను లొకప్పుడు సెలవిచ్చియుండిరి. భాషలో క్రొత్తఛందస్సును ప్రవేశపెట్టుట పురాతనార్ష సంప్రదాయమే. 'ఏకాత్మ పంచకము"గూడా ఒక 'మంత్రము.' దాని ఛందస్సు వెణ్బా, 'ఋషి' శ్రీరమణులు, 'దేవత'

ఏకాత్మ. ఈ రచన వాస్తవముగా సూత్రపటిమయు దివ్య చమత్కృతియుఁ గల కృతిరాజము. ఇది శ్రీ శంకరాచార్య కృత దక్షిణామూర్తిస్తోత్రమును బోలియున్నది; కడపటి పద్యములో దక్షిణామూర్తిని 'ఆదిగురువు'గా నిర్దేశించినది. అది 'సర్వాత్మ'నువలె, ఇది 'ఏకాత్మ'ను బ్రతిపాదించినది "ఏకాత్మపంచక" మియ్యది:

1. "తన్ను మఱచి, తనువుతానై తలఁచి,
యెన్నియో జన్మము లెత్తి, తుది-తన్నుఁ
దెలిసి తా నౌట, పలు దేశసంచార
కలఁ మేల్కనుట, కను.

2. తానుండి తానుగ, తన్నుఁదా నేనెవఁ
డేనుండు స్థాన మెదియను- వానికి,
నేనెవఁ డెక్కడ నేనున్నా నన్నమధు
పానుని యీడు పలుకు.

3. తనలో తనువుండఁ, దాను జడమౌ
తనువందు న్నట్టు తలఁచు- మనుజుఁడు,
చిత్రములో నున్నది చిత్రమున కాధార
వస్త్ర మనియెంచు వాఁడు.

4. పొన్నకు వేఱుగ భూషణ ముండునే?
తన్ను విడిచి తనువేది?- తన్నుఁ

దనువనువాఁ డజ్ఞుఁడు, తానను వాఁడు
తనుఁగనిన జ్ఞాని, ధరించు.

5. ఎప్పుడు నున్నది యేకాత్మ వస్తువే;
అప్పుడా వస్తువు నాదిగురు- చెప్పక
చెప్పి తెలియఁగఁ జేసినా రే, యెవరు
చెప్పి తెలుపుదురు? చెప్పు."

మంగళము.

"ఏకాత్మ తత్త్వము నిట్టిదని తేల్చి, భక్త
దేహాత్మ భావముఁ దీర్చెను- ఏకాత్మ
జ్ఞానస్వరూప రమణగురు నాథుఁడు తా
నానతిచ్చు పంచక మందు."

ఈ కృతి ముద్రణ మొక సమస్యను లేవఁదీసెను. సాధారణముగా తెలుఁగు కావ్యములు భావము ననుసరించిన స్థలవిభజన(Spacing) తో ముద్రింపఁబడుచుండెడివి. కానీ యీ ఛందస్సు తెలుఁగులో నూతన మగుటవలన, ఈ పద్యములకు గణముల ననుసరించి స్థలవిభజన యుండవలెనని శ్రీ భగవాను లాదేశించిరి. యుక్తసమాలోచనానంతరము శ్రీ భగవానులు నేను మనవిచేసిన సూచనను దయతో నంగీకరించిరి. దాని ప్రకారము పద్యములలో భావగణముల యుభయము ననుసరించి విభజన జరగెను. భావవిభజన స్థలముచేతను గణవిభజన చిన్న

నిలువుగీటుల (1) చేతను నిర్దేశింపఁబడెను. తర్వాత శ్రీ భగవానులే యీ కృతిని 'కలివెణ్బా' (వెణ్బామాలిక) గా రచించి "ఏకాత్మతత్త్వము" అని నామకరణ మొనర్చిరి. అయిదు పద్యములలో వరుసగా కడపటి రెండుగణముల 'కనుము-చలింపక', పలుకుచి-త్తైన', 'వాఁడగుఁ-వస్తువౌ', 'ధరించు-తన మహిమ' 'చెప్పుమని-యిప్పుడా' అను పదములఁ గూర్చిరి. తన వెణ్బారచనలను తర్వాత పారాయణ సౌకర్యార్థము కలివెణ్బాలుగా రచించుట శ్రీ భగవానుల కాచారమైయుండెను.

శ్రీ భగవానుల రచనచేఁ బ్రేరితులమై వారి దివ్య ప్రోత్సాహముతో ఆంధ్రభక్తుల మిరువురు ముప్వురము వెణ్బా చందస్సులో తెలుఁగున కవనముచేయ నారంభించితిమి. తిరుచ్చుళి వాస్తవ్యుఁడు శ్రీ గురుస్వామయ్యరు నాకు ఛందో నిబంధనలను నేర్పెను. 27-5-1947 వ తేది నేను "అరుణాచల పంచరత్నము" ను తెలుఁగు వెణ్బాలుగా ఇట్లనువదించితిని :

1. "కరుణాపూర్ణామృత కంధీ, కిరణో
త్కరగ్రసి తోరువిశ్వా కారా- యరుణా
చలపర మాత్మా, సరిగా మనఃక
మలమువిరి యఁరవిగ మ్మా.

2. ఇదిచిత్ర మెల్ల నరుణాద్రి నీలో
నుదయించి నిల్చిలయ మొందు- హృది 'నే'

ననినాట్య మాడెద వయ్యా, కనుక
ననెదరు నిర్హృదయ మంచు.

3. 'ఏ' నని యెచ్చట నేతెంచు నోయనియెం
తేనమల మాబు ద్ధితోఁజొచ్చి- లోనరయఁ,
దానరు ణాద్రీ, తనునెఱింగి యేఱబ్ధి
లోన ట్టణంగునీ లో.

4. వెలివిష యమ్ము విడి;ప్రాణ మాపి,
తలపునిల్పి, లోనినుఁ దాను- తలఁచు
నలయో గివరుఁడుమ హాజ్యోతిర్ శోణా
చల, నీలో నంగాం చఁగల్గు.

5. చిత్తమునీ కర్పణ చేసి,నినుఁ గాంచి, యెల్లఁ
ద్వత్తను వంచభే దప్రేమ- నెత్తఱిని
సేవించు వాఁడు చెలఁగునరు ణాచలా,
నీవనుహో యిర్మము నిఁగి.

మంగళము :

అరుణ గిరిరమణుఁ డార్యాగీ తిర్దా
దరిసెనము చేసెసంస్కృ తమ్మం- దరుణా
చలపం చకౌపని షద్ర త్నమును;
తెలిపాట దానికిది తెల్గు."

శ్రీ భగవాను లీ రచన నెంతో సంతోషముతోఁ దిల కించి సరిదిద్దిరి. నాకు వెణ్బారచనయందు సహజకౌశలము గల దనియు సెలవిచ్చిరి.

ఘూర్జరరాష్ట్రములో న్యాయాధిపతిపదవినుండి విరామ మొందిన శ్రీ దేశాయియు ఆయన సతీమణియు ఆశ్రమమునకు పలుమాఱు వచ్చుచుండిరి. శ్రీ దేశాయి ఏదైనా కాయికపరిచర్య తననుఁ జేయనిమ్మని నిరంతరము వేఁడుచున్నా డని శ్రీ భగవాను లొకనాఁడు నాతో నుడివిరి. వయస్సు చెల్లిన యా పెద్దమనుష్యుని యీ ప్రార్థన శ్రీ భగవానుల హృదయమును గరఁగించెను. శ్రీ భగవాను లాయనను ఆదర్శభక్తునిగాఁ బేర్కొనిరి.

30-5-1947 వ తేదీ వేదపారాయణ సమయమున 'తస్కరాణాం పతయే నమః' అను వాక్యము న న్నత్యంత మాకర్షించెను. అంతట నేను "తస్కరపంచకము" అను శీర్షిక క్రింద శ్రీ భగవానులనే తస్కరపతిగా వర్ణించుచు నిట్లు రచించితిని:

1. "అరచూడ్కిఁ జూచినంతనె
అరగొఱలే కెల్లజనుల యఘసంచయముల్
హరియించెద, వౌరా; త
స్కరపతి! నీ కిదె నమస్సు గైకో, రమణా

2. ధరనెల్ల 'నేను' 'నే' నని
నిరతము ప్రత్యక్షముగనె నీ వెసఁగుచుఁ, గన్
మొఱఁగెద వెల్లరకును, ద
స్కరపతి! నీ కిదె నమస్కరింతుఁ గైకో, రమణా.

3. హరియించు నగల నగళులఁ
జొఱఁబడుచున్ మేటిదొంగ; చొచ్చియు మాలో
హరియింతువు హృదయమె, త
స్కరపతి! నీ కిదె నమస్కరింతుఁ గైకో, రమణా.

4. వెరవున మా సొత్తుల నే
హరియించును దొంగ; నీవొ యణఁచి యహంతన్,
హరియింతువు మమ్మే; త
స్కరపతి! నీ కిదె నమస్కరింతుఁ గైకో, రమణా.

5. పరమాత్మస్వామ్య మ్మప
హరించుటం జేసి జీవు లందఱమును ద
స్కరులమె; కావున నో త
స్కరపతి! నీ కిదె నమస్కరింతుఁ గైకో, రమణా."

వీటిని జదివినప్పుడు శ్రీ భగవానులు హాసప్రసన్నవదనారవిందులైరి.

1947 జూన్ నెల రెండవవారములో విజయవాడవాస్తవ్యులు శ్రీ చుంచూరు వెంకటరెడ్డి సపరివారముగా శ్రీ

భగవానుల దర్శనార్థము వచ్చెను. ఆయన భావోద్రేకముఁ బట్టఁజాలక పరిచారకులు వలదనుచున్ననూ వినక శ్రీ భగవానుల పాదములపై తన శిరస్సును మోపి వాటిని తన యశ్రువులతోఁ బ్రక్షాళించెను. ఆనాఁటి సాయంకాలము శ్రీ భగవానులు గోశాలనుండి వచ్చుచుండఁగా, అతిథిగృహ పార్శ్వమున నున్న ద్వారమువద్ద సాముదాయికచ్ఛాయా చిత్రము (Group photo) తీసికొనుటకు వారిని దారిలో నడ్డగించెను. కరుణామయులు శ్రీభగవాను లంగీకరింపఁగా, అచ్చటనే అందులకు తత్క్షణ మేర్పాటు జరగెను. అప్పుడు నేను కళ్లకలఁకకు మందు వేయించుకొని ఆశ్రమ వైద్యశాలనుండి తిరిగి వచ్చుచుంటిని. శ్రీ చిన్నస్వామిగారు (సర్వాధికారి) నన్నుఁజూచి నన్నూ శ్రీ పి. టి. ముత్తుస్వామి అను మఱియొక భక్తునీ ఆ బృందములోఁ జేరరమ్మని బిగ్గఱగాఁ బిలిచిరి. నాకు దానిలో తావు లేదని నేను గొణుఁగుకొనుచుండఁగా శ్రీ చిన్నస్వామిగారు 'నమ్మాళ్' (మనమనుష్యులు) అందులో ఉండవలెనని తీర్పుచెప్పి నా యడ్డుమాటలను ద్రోసిపుచ్చిరి. నేను వెనుకకుఁ బోవుచుండఁగా, శ్రీ భగవానులు 'కేంద్రము (focus) లోనికి దగ్గఱ రా, చిన్నస్వామిప్రక్కన నిలుచుకో' అని సెలవిచ్చిరి. శ్రీ భగవదనుగ్రహ శక్తిపాత పరవశుఁడనై నేను వారి యానతిని శిరసావహించితిని.

13-6-1947 వ తేదిన మహాపూజామహోత్సవము అనఁగా శ్రీ భగవానుల తల్లిగారి మహాసమాధి దినోత్సవము

ఆశ్రమమున జరుపఁబడెను. ఆ సందర్భమును బురస్కరించుకొని నేను "మాతృపంచకము" అను శీర్షికతో ఈ క్రింది యైదు వెణ్బాలు రచించి శ్రీ భగవానులకు సమర్పించుకొంటిని :

'మాతృదేవో భవ'

1. "తల్లియే దేవుఁడు, తల్లియే దేవత,
తల్లియే తండ్రియుఁ, తల్లియే- పిల్లలు,
తల్లియే సర్వముఁ, దల్లియే తాను,
తల్లి తాఁ బ్రోచుతస దా.

2. మాతయే శాంతియు, మాతయే శక్తియు,
మాతయే సర్వని ర్మాతయు,- త్రాతయు,
మాతయే ప్రేమమ్మ, మాతయే యోగాంబ,
మాతృభూ తేశుఁడు, సుమా.

3. అమ్మ ప్రసాదమే యయ్యె రమణర్షి;
అమ్మ కుమారుఁడా నర్పించె- నిమ్మహికి;
అమ్మసం కల్పమే యాశ్రమ మయ్యె, నల
గమ్మస్వ రూపమే గా.

4. జనని పదము *జనినహిప దమ్మె;
జనన †గుడియె సకల- జనని;
జననీ జనకపద సౌంద ర్యమదె,
తనుఁగనుచి దానం దమె.

[* జనని=జని+న. †గుడి= 1. ఆలయము 2. ఇకారము (ి)]

5. తాయి సుమియి త్తఱఁదాయు మానవరు;
కాయ మ్ముఁగొనిభక్త కానుపుర్- జేయించె;
తాయిత త్త్వానుసంధానమెను హా పూజ;
తాయిఁబూ జింతముస దా. ”

ఒకనాఁడు మధ్యాహ్నము శ్రీ టి. పి. రామచంద్ర య్యరూ, ఆరోగ్యశాఖా ప్రధానాధికారి శ్రీ సుబ్రహ్మణ్య య్యరూ నేనూ స్కందాశ్రమము సందర్శించి మరలివచ్చితిమి. మేము బయలుదేఱుచూ సెలవుపుచ్చుకొనినప్పుడు శ్రీ భగ వానులు తాను మాతోఁగూడ వచ్చిన నెంత బాగుండునని పలికిరి. మేము తిరిగివచ్చినప్పుడు శ్రీ భగవానులు మమ్ముఁ జూచి నవ్వుచూ తాను తన యాసనమునుండి కదలకుండనే మాతోఁగూడ- భావమున- కొండ నెక్కి- దిగి వచ్చినానుగదా అనిరి. మఱియు “ఆత్మప్రదక్షిణమే భూ ప్రదక్షిణము అను సూక్తి సత్యము” అని వారు సెలవిచ్చిరి.

ఆ దినములలో ఒకక్రొత్తజీవి శ్రీ భగవానుల కనుంగు బిడ్డ యయ్యెను. అది బరోడామహారాణిగారు బహూకరించిన తెల్లనెమలి. బరోడానుండి యింతదూరమూ అది యొక పరి చారకునితోఁగూడ ‘రైల్వేసెలూను’ లో ప్రయాణము చేసి వచ్చెను. కనుగం దయ్యెను అది అద్భుతమగు తెలివితేట లతోఁ బ్రవర్తించుచుండెను. శ్రీ భగవానుల యాసనమునకు వెనుకనే దానిగూడు నిర్మింపఁబడెను. రేయుంబవళ్లు శ్రీ భగ

వానులు దానిని బహుజాగరూకతతోఁ గాపాడుచుండిరి. అది యొక్కొకప్పుడు శ్రీ భగవానుల పుస్తకపేటి నెక్కి ఆ గ్రంథములను జదువఁ గోరినట్లు తన ముక్కుతో వాటిని మెల్లగాఁ బొడుచును. అది నిత్యమూ వెళ్ళి అప్పుడు నడచుచుండిన దేవాలయనిర్మాణకార్యమును తనిఖీచేసి వచ్చును. అందులకై శ్రీ భగవానులు దానికి 'కట్టడముల తనిఖీదారు' అను హోదా నొసంగిరి! మఱియు అప్పుడప్పుడు అది భోజన శాలలోఁగూడఁ బ్రవేశించి భోక్తల పంక్తుల నడుమ పచారు చేయును. అట్లుచేసి అది శ్రీ భగవానులయొద్ద 'సహాయ సర్వాధికారి' అను బిరుదు సంపాదించుకొనెను!

ఒకనాఁటి మధ్యాహ్నము శ్రీ సుబ్బలక్ష్మమ్మ పాకశాల వద్ద నాతో ముచ్చటించుచూ శ్రీ భగవానులు చూపు విశేష ప్రేమనుబట్టి ఆ తెల్లనెమలి వెనుకటిజన్మలో శ్రీ భగవానుల పూర్వపరిచారకుఁడు మాధవస్వామిగా నుండవచ్చునని పలికెను. ఇది జరిగిన కొంచెముసేపటికి నేను హాలులో ప్రవేశింపఁగా కొందఱు ఈ తెల్లనెమలి మాధవస్వామి యవతారముగా నమ్ముచున్నారని శ్రీ భగవానులే సెలవిచ్చిరి. అది మొదలు శ్రీ భగవాను లెప్పుడునూ దానిని "మాధవా" అనియే పిలుచుచుండిరి.

20-6-1947 వ తేదిన నేను మయూర వృత్తములో "సితమయూరాష్టకము" అను శీర్షికతో ఈక్రింది యెనిమిది

పద్యములు రచించి జూబిలీపందిరిలో శ్రీ భగవానులకు సమర్పించుకొంటిని:

1. "ఏమయినఁగాని మిము నే విడువనంచున్
స్వామి నెటొ వీడి చని, స్వాత్మగురుసేవా
కామిత, మహిన్ దనువుఁ గైకొనిన 'అయ్యా
స్వామి' వాకొ పల్కుమ వెసన్, సితమయూరా!

2. సాధుతమశీలుఁడయి స్వామిపదసేవా
మాధురులఁ గ్రోలుచును, మందవిధి గొంపో,
నీధరణి శ్రీరమణునే మరలఁ జేరన్,
'మాధవుఁడ'వో పలుకుమా, సితమయూరా!

3. క్రొత్తయని జంకుటయుఁ గొంకుటయు లేకే,
పెత్తనము సేసెదవు ప్రీతి నిట నెందున్,
పొత్తములఁ జక్కనిడఁ బూనెదవు, నీ కీ
బత్తి యెటు వచ్చెనొకొ పల్కవె, మయూరా!

4. నీ కళయు నీ చెలువు నీ నడకనీటున్
నీ కులుకు నీ తళుకు నీ బెళుకుఁ గాంచన్,
నాక మిట డిగ్గి నటనన్ జలుపు లీలన్
మా కనులు చొక్కును సుమా, సితమయూరా!

5. గారవము ప్రీతి ఘనకారుణిమ దొల్కన్
వారక యొనర్చు భగవానులు సమీక్షన్,

తోరపుఁగుతూహలముతో నిను వచించున్,
శ్రీరమణు నాశ్రమపు శ్రీవిర, మయూరా!

6. వీణా నినదమ్ము విన వేగఁ బరువెత్తున్,
నాణెముగ నమ్రముగ నాట్య మటు సల్పున్,
శోణగిరి శ్రీరమణు శుద్ధమతి హత్తున్;
వాణి యవతారమ వనందగు, మయూరా!

7. సత్త్వగుణ తేజ మిటు సాకృతిగ వచ్చెన్,
తత్త్వమసి వాక్య మిటు ధావళిమఁ దాల్చెన్,
స్వత్వమవు నీవు భగవానులకు, సంపూ
ర్ణత్వమన నీవ యపురా, సితమయూరా!

8. ఎం దరుణశైల మిది, యెం దది బరోడా!
అందు జనియించియు మహర్షి నిటు చేరన్,
స్కందుని మయూరమవో, చంద్రనిభగాత్రా,
వందనమునీకు భగవాను ప్రియపుత్రా!"

శ్రీ భగవానులు వీటిని జిత్తగించి యమందానందకందళిత వదనారవిందులై శ్రీమతి లలితా వెంకటరామన్ చేతి కిచ్చి ఆమె వీణవాయించుచూ వాటిని పాడవచ్చునని సూచించిరి. అరగంటలో ఆమె వీణను దెచ్చి పాడుటకు సంసిద్ధమయ్యెను. ఆ నిమిషమున తెల్లనెమలి అచ్చట లేదు. శ్రీ భగవానులు "సరేకానీ, తన స్తోత్రము వినుటకు నాయకుఁడు హాజరుకావలెఁ

గదా” అని వలుకుచూ “ఒరే మాధవా, యెక్కడున్నావురా! రారా’ అని ఇంచుక బిగ్గఱగాఁ బిలిచిరి. వెంటనే పందిరిపై కప్పు నుండి తెల్లనెమలి తటాలున క్రిందికి దుమికెను. శ్రీమతి లలితా వెంకటరామన్ పాడుచుండఁగా, అది తన పించెము విప్పి నాట్యమాడఁ దొడంగెను. దాని నృత్య మాపాట నడకకు తాళము వేయుచున్నట్లు సరిపోయెను. శ్రీభగవానులు కళలు దేఱు కన్నులతో దానిని గమనించుచుండిరి. పాట పూర్తి కాఁ గానే ఆ నెమలి వీణవద్దకు నడిచిపోయి దాని తంతెలను తన ముక్కుతో పొడువసాగెను. అందుమీఁదట శ్రీభగవానులు లలితతో “మాధవుఁడు మరల పాడుమని నిన్ను వేఁడు చున్నాఁడు” అని నుడివిరి. ఆమె మఱియొకమాఱు పాడఁగా, నెమలియు మరల నాట్యమాడెను. అది అమరులు వీక్షింపఁద గిన దివ్యదృశ్యము. తర్వాత తలాయర్ ఖాన్ సతీమణి కోరిక మేరకు నే నా గేయములను ఆంగ్లములోని కనువదించితిని.

ఒకనాఁడు మధ్యాహ్నము నేను శ్రీభగవానులతో “అంతపలుచని మజ్జిగ వేసికొనుటవలన సత్తువ యెట్లు వచ్చు నండీ? ” అని మనవిచేసికొంటిని. అది విని శ్రీభగవానులు నవ్వుచూ ఇట్లు బదులుపలికిరి:

“కాఁబట్టి నీవు నన్ను చిక్కని మజ్జిగ వేసికోమనెద?
పెరుగైతే ఇంకా మంచిదికదా! అది నాకూ మేలే!

ఏలన అట్లు చేయుటవల్ల నాకు వ్యయములేకుండా
ఒక వ్రాంతబల్ల లభించును!"

వారిభావము నా కర్థముకాలే దని నే నంటిని. అంతట శ్రీభగవాను లిట్లు విశదపఱిచిరి.

"ఇప్పటికే నాకు పెద్దబొజ్జ యున్నది. ఇంక చిక్కని మజ్జిగగానీ పెరుగుగానీ ఆరగించినానంటే, అది యింకా పెరిగి నేను ముం దుంచుకొని వ్రాసికోఁదగిన యొక బల్ల రూపపరిమాణములకు సరిగా తయారగునుగదా!"

శ్రీ భగవానులు వారి యాహారసారమును మెఱుఁగు పఱుచు నెట్టి సలహాలనుగూడా ఇదేవిధముగా హేళనచేసి త్రోసిపుచ్చుచుండిరి.

ఒకనాఁడు సాయంకాలము యువదంపతులు ఫ్రెంచి వారు శ్రీ భగవానులను జూబిలి పందిరిలో సందర్శించిరి. ఆ యువకుఁడు "ఏగ్రంథము సత్యమునకు ఉత్తమమార్గదర్శకము?" అని ప్రశ్నించెను. శ్రీ భగవాను లిట్లు ప్రత్యుత్తర మొసంగిరి :

"సత్యము నీలోపల నున్నది, వాస్తవముగా నీవే అది అని యెల్లశాస్త్రములు ఘోషించుచున్నవి. కావున నీవు నీకు వెలుపల నున్న గ్రంథములలో సత్యము నెట్లు కనుఁగొనఁ గలవు? నీవు సత్యమును గ్రంథములలో అన్వేషించుట వెలుతురు తనను నీడలో వెదకుట వంటిది."

ఆ యువకుఁడు మరల "భగవద్గీత మనము మనలోపల మునిఁగి సత్యమును బడయుట కుపకరించునా?" అని యడిగెను.

"తప్పక ఉపకరించును" అని శ్రీ భగవానులు ఉత్తర మిచ్చిరి. కడపట ఆ యువకుఁడు భగవద్గీతలో శ్రీ భగవానుల కభిమానశ్లోక మేది యని యడిగెను. శ్రీ భగవానులు తొలుత ఆ ప్రశ్నమునుండి తప్పించుకొనఁ జూచిరి. కాని ఆ యువకుఁడు శ్రద్ధాభక్తులతో నిర్బంధపఱుపఁగా శ్రీ భగవానులిట్లు కేలకు

"అహ మాత్మా, గుడాకేశ, సర్వభూతాశయస్థితః,
అహ మాదిశ్చ, మధ్యం చ, భూతానా మంతఏవ చ"

అనుశ్లోకమును చేర్కొనిరి.

నేను 25-6-1947 వ తేదీ బయలు దేఱవలసియుండెను. అప్పుడు కాట్పాడి విల్లుపురముల మధ్య రైళ్ళన్నియూ నడువకుండెను. కావున నే నెట్లు ప్రయాణము చేయఁగలుగుదు నని శ్రీ భగవానులు నాఁటి వేఁకువ నన్ను హాలులోఁ బ్రశ్నించిరి. నేను బస్సులో పోయెద నని బదులుపలికితిని. అంతట శ్రీ భగవాను లిట్లు సెలవిచ్చిరి.

"బస్సులో స్థలమునకు ముందుగా ఏర్పాటుచేసుకోవలెను. ప్రయాణీకుల గుంపు అధికముగా నుండఁగలదు. కావున

చాలా ముందుగా అవి నిలుచు తావునకు పోయి కాచు
కొనియుండవలెను. ''

శ్రీభగవానులు ప్రాతఃకాలకృత్యములకై బయలువెడ
లినవెంటనే అప్పుడు హాలులో నుండిన శ్రీ వనపర్తి రాజాగారు
అతిథిగృహమునకు వచ్చి తన కార్యదర్శి శ్రీ రాజారావుచేతను
తన స్నేహితుఁడు శ్రీ మెకివర్ చేతను నాకు పరిచయము
చేయించుకొని తాము కారులో నాఁడే మదరాసుకు పోవు
చున్నందున నన్నుఁగూడ ఆ కారులోనే తోడ్కొనిపోయెదమని
దయతోఁ బలికిరి. శ్రీ భగవానులు మధురలో నివసించిన
గృహము (ఇప్పుడు 'రమణమందిరము') ను ఆశ్రమమునకుఁ
గొనియిచ్చు సంకల్పముతో శ్రీ రాజాగా రప్పుడు వచ్చియుం
డిరి. నేను వారి సాహాయ్యమునకుఁ గృతజ్ఞతఁ దెలుపుచూ
అట్లు చేయుటకు శ్రీ భగవానుల యనుజ్ఞ పొందవలెనని చెప్పి
తిని. శ్రీ భగవానులు హాలుకు మరలివచ్చుచున్నప్పుడు శ్రీ
రాజాగా రీ విషయము వారికి మనవిచేసిరి. అంతట శ్రీ భగ
వానులు చిఱునవ్వుతో నావైపు చూచి యిట్లనిరి.

''నీకు చాలా సౌకర్యమైనది. బస్సుప్రయాణపు చికాకు
తప్పినది. నీ వదృష్టవంతుడవు.

ఆప్రకారమే నేను రాజాగారితోఁగూడ వారి కారులో మద
రాసుకు ప్రయాణముచేసితిని. మార్గమధ్యమున కాంచీపుర

ములో కొంచెముసేపు నిలిచి ఆచటి దేవాలయములను సంద ర్శించు భాగ్యముగూడ కలిగెను. ఇది శ్రీభగవానుల యను గ్రహమహిమలలో అన్యతమముగ నాకు సంస్ఫురించెను.

1-7-1947 వ తేదీ శ్రీ జె. సి. నానావతి అను ప్రియభక్తుఁడు బొంబాయినుండి నా కిట్లు వ్రాసెను.

"నేను దేహముతో ఇచ్చట నున్నాను, ఇంకను కొన్ని మాసము లిచ్చటనే ఉండవలె ననుకొనుచున్నాను. కాని నా హృదయము మాత్రము మరల శ్రీభగవానుల పావన దివ్యసన్నిధానములో నుండుట కువ్విళులూరుచున్నది."

ఆనాఁడే శ్రీ ఎ. ఆర్. దొరస్వామయ్యర్ అను చిర కాలభక్తుఁడు ఆశ్రమకార్యదక్షుఁడు, ఆశ్రమారామపోషణ క్రియాతత్పరుఁడు దివంగతుఁ డయ్యెను. 4-7-1947 వ తేదీ నే నాశ్రమమునకు వ్రాసిన లేఖలో శ్రీ దొరస్వామయ్యరు సేవాభక్తిని గీర్తించుచూ ఈ క్రింది పద్యద్వయము రచించి పంపుకొంటిని:

1 "విశ్రాంతిఁ గనక శ్రీరమ
ణాశ్రమకార్యమ్ములందు ననవరతము దీ
క్షాశ్రీఁ గైకొని, జీవిత
నిశ్శ్రేయసము దొరసామి నేఁడు గడించెన్.

2 నిరత మ్మెవ్వని పోషణఁ
బెరిగెనో రమణాశ్రమంపు వీధులను లతా

తరు లా దొరసామయ్యరు
స్మరణపరీమళముల వెదచల్లుత మెపుడు౯."

12-7-1947 వ తేది గల జాబులో శ్రీ ఆర్. నారాయణయ్యా రీక్రింది మహోత్కృష్ట భావముల నుల్లేఖించెను:

"నేను నాజీవితమునే మన పరమపిత యగు భగవానుల కొక సుదీర్ఘప్రణామముగాఁ బరిగణించుచున్నాను. ఏలన నేను తొలుదొలుత వారి సన్నిధానములోనికి వచ్చినది మొదలు వారు నా తలంపులలో మెదలని జాగ్రన్నిమేష మొక్కటియైన నున్నదా?...ఈనాఁడు నే నొకవిహంగ మంత తేలికగా ఎగిరిపోవుచున్నాను... ఇప్పుడు నాహృదయమందు ఏదిగులూ ఏభారమూ లేదు. ఏమి జరిగినదని నీవు ప్రశ్నింపవచ్చును. మఱేమీ లేదు. ఈ యుదయము భగవానుల సన్నిధానమున నొకగంటసేపు కూర్చుండుట తప్ప. నేను ధ్యానముఁగూడఁ జేయను. అసలు అ దెట్లు చేయవలెనో నాకు తెలియదు. మఱి నే నందులకు ప్రయత్నింతునేని కేవలతద్విపరీతము జరుగును. భావపరంపర-ప్రాపంచికసమస్తప్రాంత చిత్రములూ శరవేగమున పరుగిడి వచ్చును. కావున నే నూరక కూర్చుందును. కానీ యేదో జరగును. నాలోనుండి యేదో భగవానులనుండి దృశ్యాతీత మగు దేనితోనో కలసికొనును. అది నాకు తెలియదుగూడా. కానీ అది జరిగినది మాత్రము నాకు నిస్సంశయము."

21-8-1947 వ తేదిన నాగమ్మ "భగవానులు సుఖులై యున్నారన్న మాటేగాని నానాటికి చిక్కిపోవుచున్నారు." అని జాబువ్రాసెను. మరల 30-9-1947 వ తేదిన "భగవానుల సంగతే విచారణీయాంశము. నానాటికి తీసికట్టే" అనియు ఆమె వ్రాసెను. ఈ వార్త సహజముగా నా మనస్సును దిగులుతో నింపెను.

8-9-1947 వ తేదీ శ్రీకృష్ణజయంతినాఁడు శ్రీ భగవానులనుగుఱించి నేనీ రెండుపద్యములు రచించి యాశ్రమమునకుఁ బంపుకొంటిని :

1 "ఆనాఁడు గీతఁ బల్కెను,
ఈనాఁడును గీతసార మిచ్చెను గరుణన్,
శ్రీనాథుఁ డపుడు కృష్ణుఁడు,
తానే గురురమణుఁ డిపుడు తథ్యము, కనుఁడీ.

2 గురువే బ్రహ్మయు విష్ణువు
గురుదేవుఁడె యీశ్వరుండు, గురువే సాక్షాత్
పరమబ్రహ్మము, గావున,
గురురమణపదాంబుజమ్ముఁ గోరి భజింతున్."

ఈ కాలముననే " విచారమణిమాలై " క్రొత్తకూర్పు ప్రకటింపఁబడెను. అది నిశ్చలదాసు హిందీలో రచించిన "విచారసాగర" మను సుప్రసిద్ధ గ్రంథమునకు అఱవములో

సారసంగ్రహము. అది శ్రీ భగవానులచే శ్రీ అరుణాచల మొదలియార్ అను భక్తుని ప్రార్థన మేరకు రచింపఁబడి ఆతనిచే తనే 1909 లో ప్రకటింపఁబడెను. ఇప్పుడు కొంద ఱాంధ్ర భక్తుల వేఁడికోలు నాలకించి శ్రీ భగవానులు పరమానుగ్రహముతో దానిని దెలిఁగింపగా, అది "విచారమణిమాల" అను శీర్షికతో ప్రకటితమయ్యెను. దానిలో ఒకవాక్య మిట్లుండెను :

"వ్రేలు మొదలైన స్వల్పనేత్రావరణ నివృత్తి కాఁగానే తోఁచు బ్రహ్మాండసూర్యప్రకాశమువలె బ్రహ్మము స్వతేజసా స్వయంప్రకాశించుచున్నది."

పై వాక్యమునందలి యుపమానములో 'వ్రేలు' ఎట్లు నేత్రావరణమో నా కర్థము కాలేదని నేను వ్రాసికొనఁగా, 30-9-1947 వ తేదీ నాగమ్మ లేఖద్వారా శ్రీ భగవానులందలి భావము నిట్లువిశదీకరించిరి :

"'వ్రేలు' అంటే అంగుళిగదా. కంటికి వ్రేలు అడ్డుపెట్టుకొని సూర్యునిఁ జూతుముగదా. 'ఆ స్వల్ప నేత్రావరణపునివృత్తి కలిగితే' అనియే భావమని భగవానులీరోజున సెల విచ్చినారు."

నేను మరల 14-10-1947 వ తేదీ ఆశ్రమముఁ జేరు కొని దశారా సెలవు లచ్చటనే కడపితిని. దేవాలయ నిర్మాణము పూర్తిగావచ్చెను. నిత్యమూ కొన్ని సహస్రముల నామావళితో లక్షార్చన జరగెను. అమ్మణ్ణియోగాంబ

ఒక్కొక్కరాత్రి యొక్కొక్క అవతారముగా రమణా లంకృత యయ్యెను. నెల్లూరువాస్తవ్యుడు శ్రీ తిక్కవరపు రామరెడ్డిగారు శ్రీ భగవానుల దర్శనార్థము వచ్చియుండి ఆశ్రమకార్యకర్తల సందటిని నూతన వస్త్రములతో బహూకరించిరి. కాంచికామకోటిపీఠాధిపతులు శ్రీ జగద్గురు శంకరాచార్యస్వాములవారప్పుడు తిరువణ్ణామలలో విజయంచేసి యుండిరి. శ్రీ స్వాములవారునూ శ్రీ భగవానులునూ కలసికొన్నారా? యని ఎవరో ప్రశ్నింపఁగా శ్రీ భగవానులు

"మే మెప్పుడు వేఱుగా నుంటిమి యిప్పుడు కలసికొనుటకు? మే మెప్పుడును ఒకటిగానే యున్నాముగదా."

అని ప్రత్యుత్తర మిచ్చిరి.

ఒకనాఁడు మధ్యాహ్నము శ్రీ భగవానులు అతిథిగృహము సమీపమున తన చేతికఱ్ఱ నూనుకొని నిలువఁబడి పేదపిల్లలైన బాలికా బాలకు లిరువురితో మాటాడుచుండిరి. అప్పుడు నే నాదారిన పోవుచుండఁగా శ్రీ భగవానులు సన్ను బిలిచి వాళ్ళను జూపించి నిట్టూర్పుచూ,

"పిల్లుగూడా పాపము! తల్లిలేని పిల్లలు"

అని పలికిరి. ఆ క్షణమున శ్రీభగవానుల కనుకొలకులందు అశ్రుబిందువు చిందులాడెను.

మఱియొకదినము చాలకాలముక్రిందట శ్రీసుందరానందస్వామి రచించిన కొన్నిశ్లోకములను శ్రీభగవానులు నాకుఁ జూపిరి. వాటిలో నొకటి ప్రశ్నోత్తరమాలికగా రసవత్తరమై యిట్లుండెను:

"భో భో భిక్షో! కుతో? వాఽరుణగిరి కటకాత్; తత్ర కోవా విశేషః?
కశ్చిత్ సిద్ధో దయాలూ రమణఇతి సతాం భుక్తిముక్తి ప్రదాతా;
కస్మా దేవం గుణోఽసౌ? దృఢనిజతపసై, వేశ్వరజ్ఞాన సిద్ధ్యా;
ముగ్ధో ద్రష్టుం గమిష్యా మ్యహ మితి తరసా, తాదృశం యోగిరాజం."

ఈ దినములలో శ్రీభగవానులు జలదోష మధికముగా కలిగియుండిరి. తన యాహారపరిమాణమును మిక్కిలి తగ్గించికొనిరి. కానీ దానిని వా రెన్నడూ ఒప్పుకొనరుగదా. పైపెచ్చు మిక్కుటముగా మెక్కుచున్నామని యుద్ఘాటింతురు. శ్రీభగవానుల యనారోగ్య కారణమున నేను 26-10-1947 వ తేది మిగులదిగులుతో ఆశ్రమమునుండి తరలితిని.

1-11-1947 వ తేదిన నాగమ్మ "మన పూర్వపుణ్యావిశేషమున శ్రీవారించుక తేరుకొన్నారు. జలదోషము తగ్గినది. ఆహారమూ కొంచెము నయమేనని విన్నాను" అని

వ్రాసిన జాబువలన నామనస్సున కెంతో యూఅట కలిగెను. ఈవార్తయే 3-11-1947 వ తేది గల యాశ్రమలేఖవలన రూఢిపడెను. ఇట్లే 1947 నవంబరు 17వ తేదీ శ్రీకావ్యకంఠుల పుత్రుఁడు శ్రీమహాదేవశాస్త్రి అప్పు డాశ్రమమునకు వచ్చి యందుండి "శ్రీభగవాన్ రమణులు లోకకల్యాణార్థము కుశల ముగా నున్నారు" అని వ్రాసిన లేఖవలన మఱింత ధ్రువపడెను. మరల 26-11-1947 వ తేదీ నాగమ్మ "శ్రీభగవానులు ప్రస్తుత మారోగ్యముగానే ఉన్నారు. ఆహారమునూ కొంచెము నయమేనని చెప్పవచ్చును. జయంతినాఁటికి బాగా కోలుకోవచ్చును" అని పై వార్తనే పునరుద్ఘాటించెను. అప్పుడు శ్రీభగవానులే నాదిగులుఁ దీర్చుటకు పరమానుగ్రహముతో ఇన్ని కంఠములద్వారా కబురుచెప్పుచున్నారా అని నా కనిపించెను.

29-12-1947 వ తేదీ జరుగఁబోవు శ్రీభగవానుల జయంతిమహోత్సవములోఁ బాల్గొనుటకు నేను 22-12-1947 వ తేదిన ఆశ్రమము చేరుకొంటిని. ఆ జయంతిసందర్భమున నే నీక్రింది పంచరత్నములు రచించి శ్రీభగవానులకు సమర్పించు కొంటిని:

1. "శ్రీరమణఋషులు భువి నవ
తారముఁగైకొనిన పుణ్యతమదివసము నే
డే రండు భక్తులారా!
శ్రీరమణపదాబ్జములను జేరి భజింపన్

2. తల్లియుఁదండ్రియుఁ గురువు దైవము తానని నమ్మి
కొన్న యీ
యెల్లజనమ్ముఁ బ్రోవఁగ మహిఁ రమణాఖ్యుఁ బరాత్ప
రుండె తా
పల్లవితాకృతిం గొనియె సత్యము; తత్కరుణామహానిధిఁ
గొల్లగొనుండు భక్తజనకోటులు, మాటలు వేయునేటికిఁ!

3. బ్రహ్మపదమ్మును బరనమ్మి సేయకే బ్రహ్మపదమ్మును
బడసినావు;
గురునుపదేశమ్ము నెఱుఁగకయుండియే గురు నుపదేశింప
నెఱిఁగినావు;
పిన్నప్రాయమునందె సన్యాసివయ్యును విశ్వసంసారివై
వెలసినావు;
మౌనసమాధినిర్మగ్నుండ వయ్యును సద్వస్తుతత్త్వమ్ముఁ
జాటినావు;

శక్తియును శాంతి, సత్యమ్ము సరసతయును,
కఠినవైరాగ్య మత్యంతగాఢకరుణ,
మేలవించె నపూర్వంపు లీలగాఁగ
నీయెడల. నెట్లు వర్ణింతు నిన్ను, రమణ!

4. ఈ పాపిష్ఠజగమ్ములో నధమమౌ నీ దుష్టకాలమ్మునఁ
మా పూర్వీకపుఁబుణ్య మెట్టిదియొ సుమ్మా! నిఁ మహర్షి
ప్రభుఁ

బ్రాపించెక్, భగవానుఁడా, యిఁకను నీ భారమ్ము మ మ్మెల్ల
మా

లోపమ్ముల్ సవరించి పూర్ణకృప నాలోకించి రక్షించఁగన్.

5. నరలోకపు నిదర్శనమ్ముగా వెలసిన సుగుణాల పుంజమా,
శుభము నీకు!

కరుణ రూపముఁ గొన్నకరణి నొప్పుచునున్న సచ్చిదానం
దమా, జయము నీకు!

అజ్ఞానతిమిరంపు టసురకోటి నడంచు శోణశైలకుమార!
సుఖము నీకు,

అరిదిగ బాల్యమం, దాత్మసాక్షాత్కార మలవడ్డ సుకృతి,
మంగలము నీకు!

భక్తహృదయాలఁ జూఱగొన భవము గన్న
భగవదవతార, కల్యాణ మగుత నీకు!
లోక మాపదఁ దరియింప నౌకమైన
లోకనాయక, పల్లాండు నీకు, రమణ!

సర్వజిన్మార్గశీర్ష కృష్ణప్రథమను
సర్వజిన్మార్గశీర్షాద్యసత్ప్రవక్త
రమణభగవంతుని జయంతి రాణ మీఱ,
భక్తుఁ డర్పించె నీ పద్యపంచకమ్ము."

1948 నాకు ఆశ్రమములో తీవ్రమగు జబ్బుతో
ప్రారంభమయ్యెను. స్కందాశ్రమమును సందర్శింపఁ బోవఁగా,

అచ్చట విరేచనములు మొదలుపెట్టి ముమ్మరమై రెండు దినములు అతిథిగృహములో నాచేత పడుక పెట్టించెను. నేను ఆశ్రమములో నున్న కాల మంతయు హాలులోనే గడపుచుండినందున, తొలిరోజే శ్రీ భగవానులు నా గైర్‌హాజరు గమనించి నేను తక్షణమే మందు పుచ్చుకోవలెననీ, ఇంగ్లీషువైద్యులేమి చెప్పిననూ పండ్లరసముమాత్రము పరిహారింపవలెననీ కబురంపిరి. మూడవనాఁడు వేఁకువన అతిథిగృహగవాక్షము బయటనుండి యెవరో నన్ను పేరుఁబెట్టి పిలుచుచున్నట్లు విన వచ్చెను. నేను లేచి చూడఁగా, ఆహా! శ్రీ భగవానులే! "ఎట్లున్నావు?" అని వా రడిగిరి. "కొంచెము మేలు" అని నేను బదులుపల్కితిని. శ్రీ భగవాను లట్లు చూపిన కరుణాకటాక్షమునకు తన్మయపారవశ్య మొందితిని. నాఁటి యుదయమే చిన్నస్వామిగారు (సర్వాధికారి) నన్నుఁ బిలిపించి తన వద్దనున్న 'అయస్సింధూరము' ఒక మోతాదు నా కొసంగిరి; నాఁడు కొంచె మన్నముఁగూడ నాచేఁ దినిపించిరి. ఆ తర్వాత నాకు విరేచనము కాలేదు. సత్వరముగా ఆరోగ్యము చేకూరెను. కానీ నాఁటిరాత్రి శ్రీ భగవానులు భోజన సమయమున వాంతిచేసికొని అస్వస్థులైరి. నా జబ్బును వారు తమమీఁదికి దీసికొనిరా అని నా కనిపించెను. అంతట నేను 1948 జనవరి 4 వ తేది శ్రీ భగవానుల యనారోగ్యమునకై మిగుల దిగులు పడుచూ ఆశ్రమమునుండి తరలితిని.

9-1-1948 వ తేది శ్రీ యస్. బలరామరెడ్డి ఆశ్రమము నుండి "శ్రీ భగవానుల జలదోష ముపశమించినది. వారు మామూలుగా నున్నట్లు కాన్పించుచున్నారు" అని జాబు వ్రాసెను. కానీ శ్రీ భగవానుల యారోగ్యము క్షీణించుచున్న దని భీతావహమైన వార్తలు నాకు వచ్చుచుండినందున నేను ఆతురముగా ఆశ్రమమునకు జాబులు వ్రాసితిని. అందులకు ప్రత్యుత్తరముగా 23-1-1948 వ తేది నాకు ఆశ్రమమువారి నుండీ, ఆర్. నారాయణయ్యారునుండీ, నాగమ్మనుండీ జాబులు వచ్చెను. అన్నింటను శ్రీ భగవానులు జబ్బునుండి కోలుకొని క్షేమముగా నున్నారను వార్తయే యుండెను.

నారాయణయ్యా రిట్లు వ్రాసెను.

"నేను నీ కార్డును శ్రీ భగవానులకు చూపించితిని. వారు దానిని జదువుచూ ఇట్లు వ్యాఖ్యానించిరి: 'అప్పుడు నేను సరిగా భోజనము చేయకుండినది వాస్తవమే. కాని యిప్పుడో తిండిఁబోతువలె మెక్కుచున్నాను. అప్పటి కన్నా ఇప్పుడు నా కెంత మేలని చెప్పవలె!' దీనినిబట్టి నీవే ఊహించుకొనవచ్చును. వారి యారోగ్యము దాదాపొక సంవత్సరముగా సరిగాలేదు. వారి కరచరణములు కృశించియున్నవి...సుమారొక సంవత్సరము భగవానులను సందర్శించని జను లిప్పుడుచూచి గాభరాపడి తమ వార్తలచే ఇతరులకును భయాందోళన వ్యాపింపఁజేయు చున్నారు. ఇది మంచిదిగాదు."

నాగమ్మ యిట్లు వ్రాసెను:

"భగవాన్ అనారోగ్యముగా ఉన్న ట్లెవరో చెప్పినారని మీరు ఆదుర్దాగా వ్రాసినారట. 'ఇప్పు డేమి ఉన్నదీ? అప్పుడంటే సుస్తీ చేసినది' అన్నారు భగవాన్...భగవాన్ శరీరము ఆరోగ్యముగానే ఉన్నది. ఎవరో ఏమేమో చెప్పితే నమ్మకండి ... ఆదుర్దా ఏమీ లేదు."

18-4-1948 వ తేదీ నాగమ్మ మరల ఇట్లు వ్రాసెను:

"హాలులో చోటు చాలదని జూబిలీహాలులోనే రాత్రి పగలూ మకాం పెట్టినారు భగవాన్. బాదంచెట్టూ కాయలతోనున్న మామిడిచెట్లూ నెమలికి కట్టిన నీళ్ల తొట్టీ అందులో పిచ్చుకల జలక్రీడలూ దృశ్యము ఎంతో బాగున్నది. ఒక సమయములో ఏమయిన దంటే

ఒకవంక తెల్లనెమలియు
నొకవంకను పెక్కురంగు లొప్పు నెమలియున్
సకలాఘహారుని రమణుని
అకలంకమతిన్ భజింప నరసితి, నన్నా!

ఆ దృశ్య మట్లే హృదయఫలకములో చిత్రించుకొన్నాను గాని వర్ణించుటకు కవితా నైపుణ్యము లేదు. చిత్రించుటకు చిత్రకళాభిజ్ఞతా లేదు."

21-4-1948 వ తేదీ అప్పుడు నేను కార్యదర్శిగా నుండిన నెల్లూరు మండలగోరక్షణసంఘపు వార్షికోత్సవమునకు ఆశ్రమమువారు అనుగ్రహపూరితశుభాకాంక్ష సందేశమును బంపిరి. అందీక్రింది వాక్య ముండెను.

"శ్రీభగవానుల యాశీస్సులచేత మీ సంఘము చిరకాలము గోసేవ చేయుచూ వర్ధిల్లునుగాక!"

6-5-1948 వ తేదిన నేను నా పెద్దకొమారుఁడు సుందరరాజమును వెంటఁబెట్టుకొని మరల ఆశ్రమముఁ జేరుకొంటిని. ఆ మఱునాఁడు మే మిరువురము తిరువణ్ణామలలో శ్రీరాజశాస్త్రిగారిని గలసికొంటిమి. శ్రీశాస్త్రిగారు ఆశ్రమమున వేదపారాయణాచార్యులు, సుప్రసిద్ధజ్యోతిష్కులు. - మేము శ్రీశాస్త్రిగారికి నా కొమారునియొక్కయు మఱియిద్దఱు బాలికలయొక్కయు జన్మపత్రికలను జూపించితిమి. ఆ రెంటిలో నొకరి జాతకమునకును పిల్లవాని జాతకమునకును సంపూర్ణ సామ్యము కలదనియు, ఉభయులకును గురుబలము విశేషముగా నున్నందున ఆనెల 21 వ తేదినే తప్పక వివాహము జరుగఁగలదనియు శ్రీశాస్త్రిగారు నొక్కి వక్కాణించిరి. ఈ విషయమే ఆయన నాఁటి సాయంకాలము వేద పారాయణానంతరము శ్రీభగవానులతోఁగూడ వాక్రుచ్చిరి. శ్రీభగవానులు నన్నుఁ బిలిచి ప్రశ్నింపఁగా నేను అంత త్వరలో ఆ కార్యము జరుప

నుద్దేశించలేదని మనవిచేసితిని. కాని శ్రీభగవాను లిట్లు సెల విచ్చిరి.

> "జరుగవలసినది నీ వుద్దేశించిననూ ఉద్దేశింపకున్ననూ జరిగి తీరును."

శ్రీభగవానుల యీ వాక్కులు నే నీ కార్యమును జరుపుటకు వెంటనే పూనుకొనవలెనను సూచనగా నేను గ్రహించితిని. కావున నేను పిల్లతండ్రికి తంతెయిచ్చి మూఁడవనాఁ డాయనను ఆశ్రమమునకు రప్పించితిని. శ్రీరాజుశాస్త్రిగారు లగ్నపత్రిక నమూనా వ్రాసియిచ్చిరి. శ్రీభగవానులు దానిని దిలకించి సరిదిద్ది యామోదించిరి. అంతట శ్రీభగవానులు మమ్ముద్దేశించి "ఇఁక మీ రిరువురు వెళ్లి, పెండ్లికార్యము జరిపించి, వధూవరులను దోడ్కొని మరల రావచ్చును" అని సెలవిచ్చిరి. వ్యవధి స్వల్పమైనను, 'గురు బలము' వల్ల వివాహము మిక్కిలి చక్కగా నేరవేఱెను.

18-5--1948 వ తేదీ శ్రీ జె. సి. నానావతి బొంబాయినుండి యిట్లు వ్రాసెను.

> "సుందరరాజమూ అతనివధువూ దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియు అత్యంతానుకూల్యదాంపత్యమును గలిగి నిరంతరభగవద్భక్తితత్పరులై మనుదురుగాక అని యాశించుచున్నాను."

ఆ మఱునాడు నాగమ్మ వధూవరులకు శ్రీ భగవానుల చిత్ర పటమును బహూకరించుచూ ఇట్లు వ్రాసెను.

"ఈ ఫోటో భగవాన్ చేతితో తాఁకి యిచ్చినారు. ఈలాంటి కానుక వే రేదీ కాదు. ఖరీదు స్వల్పమేగాని భగవత్కర స్పర్శఘనత దేనికి వచ్చును? అతిశయోక్తిగా భావించకండి... ఇదే నా ప్రేమచిహ్నము."

ఆ పట మదిమొదలు నిత్యము మాయింటఁ బూజింపఁ బడుచున్నది. ఆ దినమే శ్రీ నారాయణయ్య రిట్లు వ్రాసెను.

"శ్రీ భగవానులు తన గాఢభక్తునిపై నిజాశీస్సులను వర్షింతురుగాక!... శేషమ్మ (వధువు) గృహదీపికను మరల వెలిఁగించి సౌఖ్యసంతోషములఁ బ్రసార మొనర్చునుగాక! సుందరరాజమూ అతనివధువూ తమ భక్తియందు దొండో రులను మింతురుగాక!"

21-5-1948 వ తేదీ అనఁగా వివాహదివసమున ఆశ్రమమువా రిట్లు వ్రాసిరి:

"నేఁడు భిక్ష జరిపినాము, ప్రసాద మిందువెంటఁ బంపు చున్నాము. ఈ కార్యము చక్కగా నెరవేఱునట్లునూ, వధూవరులు దాంపత్యసౌఖ్యసాఫల్యము కలిగి చిరకాలము హాయిగా జీవించునట్లునూ శ్రీ భగవానులాశీర్వదింతురు గాక!"

10-6-1948 వ తేదిన నూతనదంపతులతోఁగూడ పెండ్లి వాళ్లము ఆశ్రమమున కేఁతెంచి శ్రీ భగవానులను సందర్శించితిమి. మిక్కిలి చిఱుతప్రాయములో నున్న వధువును దిలకించి మందహాసముతో శ్రీ భగవాను లా బాలికను 'ప్రాఁతకాలపు పెండ్లికూతురు' అని పేర్కొనిరి. ఈ సమావేశమున నా కొమార్తె అలగమ్మ "ఉపదేశసారము"ను సంస్కృతమునను తెలుఁగునను పారాయణచేయఁగా శ్రీ భగవానులు పరమానుగ్రహముతో నాలకించిరి. అదే సమయమున శ్రీ భగవానులు మాతృభూతేశ్వరాలయ కుంభాభిషేకపత్రికను సరిదిద్దుచుండిరి. అది పూర్తికాఁగానే శ్రీ భగవానులు అలగమ్మను తనవద్దకుఁ బిలిచి "ఇదిగోనమ్మా, ఇది నీ విషయముగదా" అని పలుకుచూ ఆ పత్రిక నామెచేతి కందిచ్చిరి.

పెండ్లివాళ్లు వెళ్లిన పిమ్మట నేను మాత్రము ఆశ్రమములో నిలిచితిని. 1948 జూన్ 18 వ తేది ఆశ్రమమున చిరస్మరణీయము, గోలక్ష్మి పరమపదించిన పావనదిన మగుట వలన. ఆనాఁడు వేకువన శ్రీ జగదీశ్వరశాస్త్రి శ్రీ భగవానులతో లక్ష్మి చాల జబ్బుగానున్నదని చెప్పెను. శ్రీ భగవానులు ప్రాతఃఫలాహారానంతరము గోశాలకు విచ్చేసి యచ్చట పడుకొని కష్టముతో ఊపిరి సలుపుచున్న లక్ష్మిని వీక్షించిరి. శ్రీ భగవానులు ఆమెప్రక్కన గూర్చుండి ఆమెశిరస్సును దన యొడిలోనికిఁ దీసికొని ఆమె మెడను మెల్లగా నిమురుచూ

ఆమె నేత్రములలోనికి తన యనుగ్రహదృష్టిని బాదుకొల్పిరి. తత్క్షణమే లక్ష్మి యుచ్ఛ్వాస నిశ్వాసము సుకరము సౌమ్యమయ్యెను. వాళ్ల చూపులు కలసికొనఁగా, ఉభయులకును అశ్రుబిందువులు రాలెను. అచ్చట నిలుచుండిన మేముగూడా మా భావోద్వేగమును నిలుపుకొనఁజాలకుంటిమి. సుమారొకయరగంట యిట్లు నడచెను. అది నిజముగా దేవతలు వీక్షింపఁదగిన దృశ్యము. కడపట శ్రీ భగవానులు కరుణార్ద్ర మృదులతమ కంఠస్వనముతో ఆమె నిట్లు సంబోధించిరి :

"అమ్మా, లక్ష్మి, నీ కేమి కావలెను? నే నింక పోలుకుఁబోవలెను. అక్కడ జనము నాకై వేచియున్నారు. కానీ నే నెక్కడ నున్ననూ, ని న్నెప్పుడూ వదలిపెట్టను. ఎల్లప్పుడూ నీతో నుండెదను. నీ కేమియూ కొదువలేదు, అంతా బాగున్నది."

మధ్యాహ్నము 11-45 గంటలకు లక్ష్మి ప్రశాంతముగా ఊపిరి చాలించెను. అటుపిమ్మట శ్రీ భగవానులు లక్ష్మిని గుఱించి యొకవెణ్బా తమిళమున రచించి వారే దానిని తెలుఁగులోను, మలయాళములోను అనువదించిరి. ఆ తెలుఁగు వెణ్బా యిది.

"శ్రీసర్వ ధారిసం వత్సర జ్యేష్ఠాఖ్య
మాససిత ద్వాదశిం భార్గవ - వాసరము

తారకవి శాఖసహి తమ్మావు లక్ష్మిగతి
చేరు దినమని చెప్పు."

ఇది ఆ గోవున కప్రతిమానగౌరవము. ఏలన శ్రీ భగవానులే సెలవిచ్చినారు తమ తల్లి పరమపదించినప్పుడుఁగూడ తా మిట్టి పద్యరచన చేయలేదని.

ఆ సాయంకాలము ఆశ్రమములో పశ్చిమద్వారము చెంత మృగఖగసమాధుల పార్శ్వమున త్రవ్వఁబడిన గుంట యొద్ద కా యావు కళేబరమును ఊరేఁగింపుగాఁ గొనితెచ్చిరి. వేదపారాయణ పురస్సరముగా సాంగోపాంగ పూజానంతరము లవణకర్పూరచందనచూర్ణపూరితసమాధియం దా పావన శరీరము స్థాపితమయ్యెను. ఈ యంత్యక్రియను సందర్శించుటకు పెద్దగుంపు చేరిరి. శ్రీ భగవానులు తత్సమీపమున నొక కుర్చీలో కూర్చుండి ఆద్యంతము యావత్కార్యమును బర్యవేక్షించుచుండిరి. ఇప్పుడు వారు లేచి ముందుకువచ్చి విభూతి ప్రసాదమును సమాధిలోని యా దేహముపై చల్లిరి. అంతట మిగతవా రందఱు నట్లే యొనర్చిరి. తదనంతర మా బిలమును మట్టితో పూడ్చివైచిరి. అటుపిమ్మట అందఱము జూబిలీహాలులో శ్రీ భగవానులతోఁగూడ సమావేశమైతిమి. బాగుగులు అందఱికీ వినియోగ మయ్యెను. కొన్ని దినముల తర్వాత గోసమాధిపై శ్రీ భగవానులు రచించిన తమిళవెణ్బా

చెక్కఁబడెను. తదగ్రమున జీవకళ ఉట్టిపడునట్టి యా గోవు ప్రతిమ నెలకొల్పఁబడెను.

లక్ష్మి యాశ్రమములో అసమానప్రతిష్ఠ కలిగియుండెను. దూడవయస్సునుండి యిచ్చటనే పెరిగెను. విచిత్రముగా శ్రీ భగవానుల జయంతులందును జన్మనక్షత్రతిథులందును ఆమె యెన్నియో దూడల నీనుచుండెను. ఆమె యితరు లెంద ఉన్ననూ సరకుగొనక మహారాణివలె శ్రీ భగవానులవద్దకు వచ్చివేయును; ఒక్కొకప్పుడు వారి దేహమును నాకును. ఆమె వచ్చినపుడెల్ల శ్రీ భగవానులు స్వయముగా తమ చేతులతో కొండయరఁటిపండ్లుగానీ, యిడ్లీలుగానీ యితరఫలహారములుగానీ ఆమె కారగింపుచేయింపవలెను. లక్ష్మియాగమనమే శ్రీ భగవాను లాశ్రమములో ఏ భక్ష్యములు నిలువయున్నవని విచారణచేయు తరుణము. అవి తెచ్చిపెట్టువఱకూ శ్రీ భగవానుల తహతహ, వారు లక్ష్మిని లాలించుతీరు చూచి తీఱవలయును. ఒకనాఁటి సాయంకాలము లక్ష్మి నోటికి ఫలము లందిచ్చుచూ శ్రీ భగవానులు "ఈమె పశురూపమున నున్నను, మనము మాటాడుకొను ప్రత్యక్షరమును గ్రహింపఁగలదు" అని నాతో సెలవిచ్చియుండిరి. ఇప్పుడు లక్ష్మి మోక్షపదవి నలంకరించినదని శ్రీ భగవానులే లిఖితరూపమున బాహాటముగాఁజాటిరి. ఆహా! గోలక్ష్మి యెట్టి సుకృతి! ఎంతటి యదృష్టవంతురాలు!

పలువురు భక్తులవలె నేనునూ గోలక్ష్మిని ప్రశంసించుచూ ఈ క్రింది పద్యషట్కము రచించి శ్రీ భగవానుల యానతిమేరకు వారిప్రోలఁ బఠించితిని.

"సర్వధారినామ సంవత్సరమ్మున
జ్యేష్ఠశుద్ధద్వాదశిని విశాఖ
శుక్రవాసరమున సుకృత తేజోరాశి
ధేను 'లక్ష్మి' కనె విదేహముక్తి. 1.

అమ్మా, గోవులరాణి, లక్ష్మి, భవదత్యాశ్చర్య
మాహాత్మ్యముల్
ఎమ్మార్గిన్ నుతియింప నేర్తు, భగవత్ హృత్సద్మసంవాసినీ
సమ్మానమ్మున మించి యాశ్రమపు గోసంతానసౌభాగ్యమూ
లమ్మై పాతికయేఁడు, లిప్పు డవలీలన్ జన్మఁ జాలించితే. 2

ఆకుకూరలవ్వ యపరావతారమం
చనిరి నిన్ను లక్ష్మి, యాదరమున;
కాని నిక్క మరయఁ గామధేనువ వేమొ,
లేక లక్ష్మిదేవి లీల వేమొ! 3

కోరి చేరితి వీవు శ్రీరమణాశ్రమావాస మద్భుతరీతి వత్సముగనె;
యానితి వెన్నియో ధేనువులను ప్రతివర్షజయంత్యుత్స
వమ్మునకును;
శాలాప్రవేశమ్ముఁ జలిపితి పూని నీతోడ శ్రీభగవానుఁ
దోడుకొనుచు;

అనుభవించితి విట సఖిలోపచారమ్ము లీ యాశ్రమమ్ము
నీ యిల్లుగాఁగ;

చివర కియ్యెడ భగవాను చేతిమీఁద
మహితవైభవయుక్తసమాధిఁ గాంచి
సొంపుగ 'విముక్త' పదమును జూఱగొంటి
వౌర ! నీ పూర్వపుణ్య మే మనుదు లక్ష్మి! 4

ధేనువుజన్మ మెత్తియును ధీనిధివై, పరతత్త్వవేదివై,
మానక భాషితార్థముల మానముతోనె గ్రహింప నేర్చితే!
గానుగయెద్దువోలె గతిఁగానక గ్రుడ్డిగ సాఁగుచున్న యీ
మా నరజన్మ హెచ్చనెదు మానవగర్వ మడంగఁ జెల్లదే! 5

నిన్నుఁ గవుంగిలించి, కరనీరజముల్ పయిఁజాచి, దువ్వి నీ
కన్నులఁ గన్ను నిల్పి, ప్రియగౌరవ మొప్పఁగ, అమ్మ, 'లక్ష్మి,ని
న్నెన్నఁడు బాయకుందు'నని రే భగవానులు, పుణ్యరాశి, నీ
సన్నుతజీవసంస్మరణ సర్వశుభమ్ములఁ గూర్చుఁగావుతన్." 6

ఆశ్రమమువారు కోరిన ప్రకారము నేను 23-6-1948 వ తేదీ మదరాసులో శ్రీ వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రులను గలసికొని కుంభాభిషేకపత్రిక సంస్కృతప్రతులను ధర్మముగా ముద్రించుటకు వారి యంగీకారమును బొందితిని. అదేవిధముగా నెల్లూరు 'వైశ్య' ముద్రాలయాధిపతియు పత్రిక తెలుఁగుప్రతు లొకవేయి ధర్మముగా ముద్రించుటకు నా

యభ్యర్థన మంగీకరించెను. తెలుగు ముద్రణముఁ బర్యవే క్షించు బాధ్యతను ఆశ్రమమువారు నా కనుగ్రహించి అందు లకు వలయు నా దేశములను బలుమాఱు పంపుచుండిరి.

27-6-1948 వ తేదీ గోలక్ష్మికి మృతద శాహస్సు. ఆనాఁడు ఆశ్రమములో జరిగిన క్రియాకలాపము నభివర్ణిం చుచూ నాగమ్మ యిట్లు జాబు వ్రాసెను :

"ఆశ్రమానికి మీరు వ్రాసిన జాబులోని సమాచారాలు నిన్న భగవాన్ సెలవిచ్చినారు. మీరు వెళ్ళిన మఱు నాడో మూఁడవనాఁడో మలయాళములో లక్ష్మినిగూర్చి వెణ్బా వ్రాసినారు భగవాన్. ...ఈవేళ లక్ష్మి గతించి పదినాళ్ళయినది. సమాధివద్ద పదిన్నరవఱకూ పూజ జరిపినారు. భగవాన్ వ్రాసిన వెణ్బాలు మూఁడు విశ్వనా థుల శ్లోకమూ విశ్వనాథులు చదివినారు. సుబ్బరావుగారి వెణ్బా భగవాన్ దిద్ది యిచ్చినదీ మీ పద్యాలునూ సుబ్బ రావుగారు చదివినారు. సయ్యద్ వ్యాసము ఇంగ్లీషు పత్రి కలో నేఁడే వచ్చినది. వారే చదివినారది. పూజ చక్కఁగా అయినది. ... మీరు వెళ్ళినవెనుక లక్ష్మిని తల్లితోఁగూడ తోడుకొనివచ్చిన అరుణాచలం అను వారి మనుమఁడు వచ్చినాఁడు. 1926 లో వచ్చినదఁట లక్ష్మి యిక్కడికి. వారియూరు కుమారమంగళం అను గ్రామము. లక్ష్మిని ఈ యూరిలో కాపాడినవారు పశుపతిఅయ్యర్

అను కన్నడులు. ఈ విషయము మీకు వ్రాయమని భగవాన్ సెలవిచ్చినారు.”

29-7-1948 వ తేది నాగమ్మ మరల ఇట్లు వ్రాసెను:

“గోలక్ష్మిచరిత్ర సంగ్రహముగా ద్విపదలో వ్రాసినాను. 64 ద్విపదలు ... శ్రీ భగవానులు శ్రీ శంకరుల ‘ఆత్మ బోధము’ 68 శ్లోకాలకు తమిళములో వెణ్బాలు వ్రాసి నారు. పదిరోజులలో వ్రాసి ముగించినారు. 27-వ తేదికి పూర్తి అయినది. ఇవే విశేషాలు.”

ఒక మహమ్మదీయ రచయిత ‘ఆత్మబోధము’ను తమిళములోని కనువదించి ఆ యనువాదగ్రంథమును శ్రీ భగవానులకు బహూ కృతిగా పంపెననియు అదియే శ్రీ భగవానుల రచన కవకాశ మొసంగెననియు తర్వాత నాకుఁ దెలియవచ్చినది.

23-8-1948 వ తేదీ నాగమ్మ శ్రీ భగవానులకు పంటి నొప్పి కలిగియున్నట్లు జాబు వ్రాసెను.

శ్రీ ఓరుగంటి నరసింహయోగి 3-9-1948 వ తేది సకుటుంబముగా శ్రీ భగవానులను సందర్శించి ఆశ్రమములో మూఁడుదినములు బసచేసిరి. ఆయనస్నేహితుఁ డొకయోగి ధ్యానములో చాలమంది మహనీయుల సూక్ష్మ శరీరములను సందర్శించి తత్ప్రరిమాణ మెఱిఁగెననియూ శ్రీ భగవానుల

సూక్ష్మశరీర తేజమునకుమాత్రము పరిమితిఁ గాంచలేకపోయె ననియూ నరసింహయోగి నాతో చెప్పియుండిరి. ఆయన కోర్కెమేరకు నేను ఆయనను బరిచయముచేయుచూ ఆశ్ర మమునకు వ్రాసితిని. అచ్చట ఆయన సౌకర్యమునకు వలయు సదుపాయములు సమకూర్పఁబడెను.

5-9-1948 వ తేదీ నాగమ్మ యిట్లు జాబువ్రాసెను:-
"భగవాన్ పంటినొప్పి తగ్గినది. కానీ ఎగ్జిమియా మళ్లీ వచ్చినది. మీరు చెప్పినట్లే మన ప్రారబ్ధము వారి శరీర మునుగూడా బాధించుచున్నది."

తర్వాత అక్టోబరు మాసమున దశరా సెలవులలో మామూలుప్రకారము నేను మరల ఆశ్రమయాత్ర చేసికొంటిని. అచ్చట చేరినవెంటనే శ్రీ భగవానుల దర్శనమునకు వెళ్లితిని. అప్పుడు సాయంకాలము ఏడుంబావుగంట. శ్రీ భగవానులు జూబిలీహాలులో వారి పర్యంకముపయిన కనులు మూసికొని యాసీనులై యుండిరి. భక్తులు తెలుఁగు "ఉపదేశసారము" పారాయణ మప్పుడే ప్రారంభించుచుండిరి. నేను మెల్లగా నమస్కరించి కూర్చుంటిని. పారాయణ పూర్తి కాఁగానే శ్రీ భగవానులు కనులు తెఱచి నన్నుఁ జూచి 'యెప్పుడు 'వచ్చితి? వని యడిగిరి. నా జవాబు నాలకించి శ్రీ భగవాను లిట్లు సెలవిచ్చిరి.

"ఇది చాల చిత్రముగా ఉన్నది. వీళ్లు తెలుఁగున ఉపదేశ

సార మారంభించినపుడు నీవు నా తలంపునకు వచ్చితివి. ఇప్పుడు కను తెఱువఁగా నీవు ప్రత్యక్ష మైనావు! మఱి నీవు తెలుఁగు పారాయణ మారంభించినప్పుడే యిచ్చటికి వచ్చినట్లు చెప్పుచున్నావు!"

మఱునాడు వేఁకువన శ్రీ రమణచత్వారింశత్ పారాయణ చేయువారు

'లహరీం ప్రమదస్య సదా వహతా'

అను పంక్తిని బలుకుచుండఁగా, శ్రీ భగవానులు నాతో శ్రీ నరేంద్ర కేసరిశర్మ యను నేపాలవాస్తవ్యుఁడు 'శ్రీరమణలహరి' యనుపేర నొక స్తోత్రగంథము 52 శిఖరిణీ వృత్తములుగా సంస్కృతమున రచించి శ్రీ భగవానుల ప్రథమ సందర్శనము ననే వారికి సమర్పించెనని వార్త చెప్పిరి. వెంటనే శ్రీ టి. పి. రామచంద్రయ్యరు ఆ వ్రాతప్రతిని దెచ్చి నాకుఁ జూపించెను. ఆదినమే శ్రీ నరేంద్ర కేసరిశర్మ యొద్దనుండి యొక లేఖ వచ్చెను. దానిచివర నీశ్లోక ముండెను :

"అరుణాచలసంస్థోఽపి
హృదయాంబుజభాస్కరః
కరుణార్ణవశీతాంశుః
భగవాన్ రమణోఽవతు."

దానిని శ్రీ భగవానులు నాకుఁ జూపఁగా, నేను నా నోటులో ప్రతివ్రాసికొంటిని.

15-10-1948 వ తేదీ శ్రీ భగవానులు ప్రాసంగికముగా ఈక్రింది శ్లోక ముదాహరించిరి :

"జీవం జ్ఞాత్వా భయం భవేత్
బ్రహ్మం జ్ఞాత్వా నిర్భయో భవేత్"

వారు "ఆత్మబోధము"లో ఒక సుప్రసిద్ధ శ్లోకమును గూడ నుదాహరించిరి. దానియందు 'ఆత్మారామ' అను సమాసముపై శ్లేషయు, రాముని చరితమునకు ఒకయోగి సాధనతో సామ్యమును గలవు. ఆ శ్లోక మిది :

"తీర్త్వా మోహార్ణవం, హత్వా
రాగద్వేషాదిరాక్షసాన్,
యోగీ శాంతిసమాయుక్తో
ఆత్మారామో విరాజతే."

దానిని నేను తెలుఁగు వెణ్బాగా అనువదించి శ్రీ భగవానులకు సమర్పించుకొంటిని. వారు మిక్కిలి సంతోషముతో దానిని సరిదిద్ది ఆ గ్రంథమంతయు అట్లే తెలుఁగులోని కనువదించిన నెంతో బాగుండునని సెలవిచ్చిరి. ఆ తెలుఁగువెణ్బా యిది :

"దాఁటిమో హార్ణవముఁ, దాఁబరి మార్చియరి
కూటమా రాగాది ఘోరని- శాటులను,

తాఁగూడి శాంతి, నా త్మారాముఁ డై సదా
యోగివి రాజిలున హా!"

మఱియు శ్రీభగవానులు "అరుణాచలమాహాత్మ్యము" అను తమిళగ్రంథమునుండి ఆంధ్రానువాద కావ్యములో వదలి వేయఁబడిన యొక ప్రధాన పద్యమును నిర్దేశించి పఠించిరి. ఆ మఱునాఁడు నేను దాని నీక్రింది సీసపద్యముగా అనువదించి శ్రీ భగవానులకు నివేదించుకొంటిని :

"శిలలెల్ల నిచ్చోట శివలింగములె యారా! శివలోకమే
యిది చిత్రముగను!
పాదపమ్ములు దేవపాదపమ్ములె యిందు! ఈశజటాగంగ
యిచటిజలము!
ఆరగించునదెల్ల నమృతమే యిచ్చట! ధర నడచుట
భూప్రదక్షిణమ్మొ!
వాకొనునది వేదవాక్కె యౌా నిక్కడ! మఱిందు నిద్ర
సమాధియె యగు!

గిరివరాకృతిఁ దాలిచి పరమశివుఁడె
నిరత మియ్యెడ సాక్షాత్తు నిలుచుకతన,
జగతి వేఱొండు క్షేత్రమ్ము సాటి యగునె
శ్రీమదరుణాచలాఖ్య సుక్షేత్రమునకు!"

శ్రీ భగవానులు దీనిని దిలకించి యామోదించి ప్రతివ్రాయించి

తెలుఁగు గ్రంథములో అది యుండవలసిన తావున దాని నతికించిరి.

రెండుదినముల తర్వాత నేను సాయంకాలము తిరిగి యూరికి బయలు దేఱుచుండఁగా శ్రీభగవాను లిట్లు సెలవిచ్చిరి:

"ఇదిగూడా ఎంతవింతగా నున్నది! చక్ర మొక్కమాఱు పూర్తిగా తిరిగివచ్చినది. ఇప్పుడునూ ఏడుంబావు గంట. మరల తెలుఁగు ఉపదేశసార మారంభించు చున్నారు. కావున దేనితో నీకు స్వాగతమో దానితోనే వీడ్కోలు!"

శ్రీ భగవానుల యీ యనుగ్రహ ప్రపూర్ణాశీర్వచనముతో నేను పరవశుఁడనైతిని.

నేను మరల డిసెంబరు మాసాంతమున ఆశ్రమము వెళ్లి ఒక పక్షముదినము లచ్చట నుంటిని. ఈసారి ఉదయము చేరుకొంటిని. శ్రీ భగవాను లప్పుడే ప్రాతఃకాల్యములకై లేచుచుండిరి. వారు నన్ను నాగమ్మకుఁ జూపించి నవ్వుచూ "మన మనుకొన్నట్లే వచ్చినాఁడు" అని పలికిరి. నాఁడు వేఁకువ శ్రీ భగవానులు నన్నుఁగూర్చి ఆమెను బ్రశ్నించునప్పుడు ఆమె 'కాకికబురు' విని నేను తప్పక నేఁడే వత్తునని యను కొన్నట్లు ఆమె జవాబుచెప్పెను. తర్వాత శ్రీ గ్రిద్దలూరు సాంబశివరావుగూడ త్వరలోవచ్చి ఆశ్రమమున షష్టిపూర్తి మహోత్సవము జరపుకొందురని శ్రీ భగవానులు నాకు తెలిపిరి.

1949 జనవరి 9 వ తేది. నాఁడు నాకు ద్విగుణీకృత సుదినము, శ్రీ సాంబశివరావు షష్టిపూర్త్యుత్సవ దివసము, నా యర్ధాంగి యాబ్దికదినము. నాఁటి యుదయమే శ్రీ సాంబ శివరావు వచ్చెను. శ్రీభగవానులు ఫలాహారమునకుఁ బోవుచూ "పెండ్లికొమారునిఁ జూచితివా!" అని నన్నడిగిరి. "లే"దని నేను బదులుచెప్పితిని. అంతట శ్రీ భగవానులు వెనుకకుఁ దిరిగి శ్రీ సాంబశివరావును నిర్దేశించి నవ్వుచూ "అదుగో అతఁడే!" అని పలికిరి. నాఁటి తపాలాలో నెల్లూరునుండి శ్రీ మోచర్ల రామకృష్ణకవి శ్రీ సాంబశివరావును గుఱించి రచించి పంపిన ప్రశంసాపద్యము లుండెను. శ్రీ భగవాను లా పద్యము లను నాచేతి కిచ్చుచూ ఆసందర్భమున నే నేమీ వ్రాయలేదా అని యడిగిరి. అది నేను భగవానుల యానతిగా గ్రహించి ఆ మాననీయమిత్రవరునిఁగూర్చి కొన్ని పద్యములు వ్రాసితిని. ఆ కవనధోరణిలో నాభార్యనుగూర్చిగూడా పంచరత్నములు రచించితిని. మధ్యాహ్న భోజనానంతరము నేను భోజనాల హాలువెనుకఁ గూర్చుండి శ్రీ భగవానులు కొండ దిగివచ్చు దివ్యదృశ్యమును దిలకించి పరమానందభరితుఁడ నైతిని. అనారోగ్యకారణమున శ్రీ భగవానులు చాలాకాలముగా కొండ నెక్కుట మానియుండిరి. కావున కైలాసము దిగివచ్చు పరమశివునివలె అరుణాచలము దిగివచ్చు శ్రీ భగవానుల యరిదిదృశ్యము నా హృదయమున బ్రహ్మానందము వెల్లి విరియించెను. ఆ మధ్యాహ్నమే పూరి జగన్నాథపీఠాధిపతులు

శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు ఆశ్రమమునకు విచ్చేసి రనియు మూఁడుగంటలకు శ్రీ భగవానుల దర్శనముచేయుదు రనియు వింటిమి. రెండున్నరగంటలకు నేను జూబిలీహాలుకు వెళ్లితిని. అప్పుడు భగవాను లేకాంతమున నుండిరి. నన్నుఁ జూడఁగానే వారు "ఇప్పుడు మనపిల్లవాఁడు విష్ణుపాదమున పిండము పెట్టుచుండును" అని పలికిరి. వారి యీ యనుగ్రహ వాక్కునకు నే నాశ్చర్యపడితిని. ఏలయన వాస్తవముగా అదే సమయమున గయలో నా కొమారుఁడు సుందరరాజము వానితల్లి శ్రాద్ధముఁ బెట్టుచుండెను. నేను నాభార్యనుగుఱించి రచించిన పద్యములను శ్రీ భగవాను లనుగ్రహముతో నవలోకించి నాపై నొక సుదీర్ఘకరుణాపూర్ణదృష్టిని బ్రసారించిరి. ఆ పద్యము లియ్యవి:

1. "శ్రీరమణనియతి నిమ్మహి
నాఱునునొక్కటియు నేడు లరిగెను స్వర్గా
గారమును నీవు చేరియు,
ఆఱిద, ప్రియ, నాహృది విరహానల మిపుడుఁ.

2. కాని శ్రీభగవానుల కరుణఁజేసి
తీఱని శమమ్ము, నిశ్చలధీరతయును,
నీ విశుద్ధాత్మసంస్మృతి పావనతయు,
నియ్యిలను నన్ను నిల్పిన వింతదనుక,

3. పెట్టును విష్ణుపాదమున బిండము నేఁడు కుమారుఁ
డా గయన్;
బెట్టుదు నేను శ్రీరమణు ప్రేమపదమ్మున నీదు
సంస్మృతిన్,
బెట్టుదు రెల్లబందుగులు ప్రీతిని నీపయి నెమ్మనమ్ములన్,
ఎట్టిదొ నీదుపుణ్య మది యెన్నఁగ నాకు వశమ్మె
ప్రేయసీ!

4. కాశివిశ్వేశ్వరుఁడు నాఁడు కానుపించి
పేరుఁ దెల్పియు నిన్ను రప్పించికొనియె,
నేఁటి యారాధన మ్మిట్లు నెగడుచుండె,
ఎంత సుకృతంపు రాశివో, యింతి నీవు!

5. దారి గనరాని నా జీవితపు నిశీధి
విమలదీప్తిద్వయ మ్మహో! తమముఁ జీల్చు:
శోణగిరిశ్రీరమణుఁ డన్న జ్యోతి యొకటి,
నాతి, నీదు సంస్మృతి యన్న జ్యోతి యొకటి.''

అంతట శ్రీభగవానులు నాతో శ్రీసాంబశివరావును బిలుచుకరమ్మని చెప్పుచూ "సన్న్యాసి వచ్చులోపల పెండ్లి కొమారుని కార్యము పూర్తికావలెఁగదా" అని చమత్కారముగాఁ బలికిరి. శ్రీసాంబశివరావు రాఁగానే శ్రీభగవానులు నాతో శ్రీ రామకృష్ణకవి పద్యములనూ నా పద్యములనూ జదువుకుని యానతియ్యగా నే నిట్లు పఠించితిని:

శ్రీరామకృష్ణకవి రచితములు :

1. "నేమమున రమణమునివరు
ధామమ్మున వారి యడుగుదామరల దరిన్
క్షేమంకరపష్ట్యబ్ది
శ్రీమాస్యతఁ గనుము సాంబశివసుగుణమణీ.

2. మావంటివారికోఱకై
జీవింపన్ వలయు మీరు చిరకాలము. మీ
సేవలఁ జేకొనుటకు గురు
దేవుం డరుణాచలమునఁ దిరపడవలయున్.

3. ముత్తాటిపండుఁ దినఁగల
సత్తాస్ఫూర్తుల్ మహర్షి సత్తముఁ డొసఁగున్,
తత్తేజోవిస్ఫూర్జిత
విత్తములై సెలవుపొంది వేరం డిటకున్."

నాపద్యములు :

1. "శ్రీరమణుల కరుణను నీ
కారోగ్యచిరాయువుల్ మనోభీష్టఫలం
బారూఢిఁ గనుత మని మన
సారఁగఁ బ్రార్థింతు నేఁడు సాంబశివార్యా.

2. నిఖిలసుగుణమూర్తి, నిర్మలసత్కీర్తి,
భక్తలోకచక్రవర్తి నీకు

షష్టివర్ష పూర్తి సంపూర్ణమోదాప్తి
యుమిద చన్న కొదువ యొకటె గాని.

3. తమ్ములుఁ బిల్ల లెల్లరు సదా ముదముం
బొనఁగూర్చు చుండఁగా,
నెమ్మది శాంతియుఁ సుఖము నిత్యము నీయెడ
నిండియుండఁగా,
కమ్మని రమ్యకీర్తి నిజకాంత యనన్ నినుఁ
బాయకుండఁగా,
నిమ్మహిఁ బూర్ణజీవితము నిచ్చునుగా భగవానుఁ
డర్మిలిన్."

'ఉమిద చన్న కొదువ యొకటె గాని' అను పక్తిని విని శ్రీ భగవాను లిట్లు విమర్శించిరి :

"'ఉమిద' యెక్కడికి చనినది? అస లాయనపేరునే మీరు మఱచిపోవుచున్నారు. ఆయన స + అంబ - శివరావు, అనఁగా, అంబాసహితుఁడగు శివుఁ డన్నమాట. అంబ యెప్పుడూ శివుని యంతర్భాగమై యున్నదిగదా."

పఠనానంతరము శ్రీ భగవానులు పై పద్యములను నాయొద్దనుండి తాను గైకొని పరమానుగ్రహమున మహాశీస్సులతో శ్రీసాంబశివరావుచేతికి బ్రసాదించిరి.

అప్పటికి జూబిలీహాలు భక్తబృందముతో నిండి పోయెను. శ్రీభగవానులు పద్మాసనాసీనులై చక్కగాఁ

గూర్చుండిరి. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కాషాయాంబరధారులై దండముఁ బట్టుకొని ప్రవేశించిరి. వారు సంప్రదాయపద్ధతిలో శ్రీ భగవానులకు దండప్రణామ మాచరించి తచ్చరణసన్నిధి నాసీనులైరి. శ్రీ భగవానులు శ్రీ స్వాములపై పరిపూర్ణ సుదీర్ఘానుగ్రహవీక్షణమును బ్రసారించిరి. ఆ దివ్యదృశ్యమున కెల్లరమును మహానానందతన్మయుల మైతిమి. అప్పుడు శ్రీభగవానులు 'మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వ' స్వరూపు లగు శ్రీదక్షిణామూర్తి సజీవ సాక్షాత్కారముగాఁ బ్రకాశించిరి. అది నిక్కముగా దేవతలు సేవింపఁదగిన దివ్యదర్శనము.

10-1-1949 వ తేదీ నాకొమరుఁడు నా కిట్లు వ్రాసెను :

"నిన్నప్రొద్దున నేను గయకు వెళ్ళి తల్లి యాబ్దికమును నెరవేర్చుకొంటిని ... (నిన్న) మధ్యాహ్నము నేను విష్ణుపాదముపై ఆబ్దిపిండములు పెట్టితిని. సాయంకాలము బుద్ధగయనుగూడ సందర్శించి ప్రార్థనలు జరపితిని...

*ఇది యంతయు శ్రీ భగవానులే నా సమీపమున నెలకొని నాచేత నడపించుచుండినట్లు నా కనిపించెను."*

ఈజాబుఁ జదివినప్పుడు శ్రీ భగవానుల యనుగ్రహమహిమకు నే నాశ్చర్యచకితుఁడ నైతిని.

అప్పుడు మాతృభూతేశ్వరకుంభాభిషేకమహోత్సవ సన్నాహములందు ఆశ్రమము పనివడియుండెను. కుంభాభి

షేకము 1949 మార్చి మూఁడవవారములో జరుపనిశ్చ యింపఁబడెను. ఆ యుత్సవమునకు 50,000 రూపాయలు ఖర్చు కావచ్చునని అంచనా వేయఁబడెను. అప్పుడు మదరాసు ముఖ్యమంత్రిగా ఉండిన భక్తప్రముఖుఁడు శ్రీ ఓ. పి. రామ స్వామిరెడ్డిగారు ఆశ్రమమునకు వచ్చి, ఆంతరంగిక సమా వేశము జరిపి, ఉత్తరార్కాటుజల్లా యెప్పుడూ క్షామప్రదేశ మైనందున, 'దక్షిణభారతధాన్యనిధి' యని పేర్గాంచిన మా నెల్లూరుమండలమునుండి ఇరువదిపుట్లు ధాన్యము విరాళముగా సేకరింపవలెనని శ్రీ సాంబశివరావుగారినీ నన్నూ నియోగించిరి. ప్రభుత్వపక్షమున రవాణాసౌకర్యము లొసంగుదుమని రెడ్డి గారు వాగ్దానమొనర్చిరి.

పాట్నాలో నాకొమారుని యింట దొంగతనము జరి గిన విషయము తెలియరాఁగా ఆశ్రమమువారూ 26-1-1949వ తేదీ తపుజాబులో అర్థవంతమగు వ్యాఖ్యానము చేయుచూ ఇట్లు వ్రాసిరి.

> " నీ కొమారుని గృహమున చౌర్యమును గుఱించి, చోరుని లోని చోరుఁడు పట్టుబడి మరల దొంగసొత్తును అప్ప గింపవలెను."

శ్రీ సాంబశివరావుగారూ నేనూ ధాన్యపుసేకరణ కొఱక కార్యక్రమము నిర్ణయించుకొని ఆశ్రమమునకుఁ దెలిపితిమి. ఆశ్రమమువారు 29-1-1949 వ తేదీ 'మీ సేకరణ కార్య

క్రమము గమనించినాము. అది సఫల మగుఁగాక అని కోరు చున్నాము' అని యాశీర్వదించుచూ వ్రాసిరి.

అప్పుడు నాకొమారుఁడు సుందరరాజము పాట్నాలో జబ్బుపడి పరీక్షనుండి విరమించుకోవలసి వచ్చెను. నాకొమార్తె లలిత 'స్ప్రూ' వ్యాధిపీడిత యయ్యెను. ఆశ్రమమువారు పై జాబులోనే యిరువురికి శ్రీభగవానుల యనుగ్రహము నిట్లందఁ జేసిరి:

"నీ కొమారునికి వాని యిక్కట్టు లన్నింటను శ్రీభగవానుల సానుగ్రహరక్షణ తప్పక యుండఁగలదు. లలిత శ్రీభగవానుల ముద్దుబిడ్డ గావున 'స్ప్రూ' వ్యాధి ఆమెనుండి పలాయనము కావలెను."

నెల్లూరిలో ధాన్యపుసేకరణకై మా ప్రయత్నములు మే మనుకొన్న దానికన్న మిక్కుటముగా ఫలించెను. అవి వాస్తవముగా శ్రీ భగవానుల యనుగ్రహ క్రియాశక్తికి ప్రత్యక్ష ప్రదర్శనము లయ్యెను. తొలుతనే మేము నెల్లూరు పురపాలకసంఘాధ్యక్షుఁ డగు శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డిగారిని ఆయన సోదరుఁడు మంచిభక్తుఁడు అగు శ్రీ ఎ. వెంకటరెడ్డిగారి ద్వారా కలసికొంటిమి. మేము సేకరించుధాన్యము ఇరువది పుట్లు కెంత తక్కువపడునో ఆ లోటు నంతయు తాను భరించుటకునూ, ధాన్యమంతటిని మిల్లులో ధర్మముగా దంపించి బియ్యమును కోఆపరేటివ్ స్టోర్సులారీద్వారా ఆశ్రమమునకు రవాణా

చేయించుటకునూ శ్రీ సుబ్బారెడ్డిగారు వెంటనే వాగ్దాన మొనర్చిరి. అప్పుడు దక్షిణభారతరైల్వేకార్మికులు సమ్మె చేయఁబోవు సందర్భమున, పై రవాణాసహాయము మా కమూల్యసౌకర్య మయ్యెను. శ్రీ యర్. బలరామరెడ్డిగారు తాను తనబంధువులుఁ గలసి అయిదుపుట్లు విరాళమిచ్చిరి. శ్రీ టి. రామరెడ్డిగారు తనవిరాళ మిచ్చుటయేగాక కొందఱు దాతలవద్దకు మాతోఁగూడ వచ్చి తన పలుకుఁబడిని వినియోగించి యుపకరించిరి. ప్రసిద్ధదాతలే గాక రాజకీయవేత్తలునూ హృదయపూర్వకముగ సహకరించిరి. కొందఱు ధాన్యపు విరాళమేగాక అయాచితముగా ద్రవ్యముఁగూడ నొసంగిరి. మాసంబంధి శ్రీ అష్టకాల సుబ్రహ్మణ్యముగారు తన ధాన్యముతోఁగూడ హోమమునకై నాలుగువీసెల గోఘృతము సమర్పించిరి. అప్పటికినీ దాదాపు నాలుగుపుట్ల ధాన్యము కొఱఁతపడఁగా, ఆ లోటును శ్రీ. ఏ. సి. సుబ్బారెడ్డిగారి యౌదార్యము పూరించెను.

ఇది నిక్కముగా శ్రీ సాంబశివరావుగారికీ నాకూ అద్భుతానుభవ మయ్యెను. మచ్చున కొక్క యుదంతము చాలును. నాఁడు మహాశివరాత్రి. నాఁటి యుదయము నే మిరుపురము అల్లూరను గ్రామమునకు బస్సులో బయలు దేఱితిమి. మాకు దారిలో వచ్చు మోపూరను గ్రామమున మధ్యాహ్న భోజనము చేయుటకు శ్రీ సాంబశివరావుగా

ేర్పాటుచేసిరి. కానీ మేము సంభాషణలో మగ్నులమై మోపూరులో దిగుట మఱచితిమి. బస్సు దాటిపోయిన తర్వాత మా పొరఁబాటును దెలిసికొంటిమి. కావున మేము నేఱుగా అల్లూరికే పోవలసివచ్చెను. అచ్చట కార్యక్రమ మేమియు లేకుండ బస్సు దిగితిమి. వెంటనే ఆయూరి యున్నత పాఠశాలా ప్రధానాధ్యాపకుఁడు శ్రీ మాడభూషి నరసింహా చారి నా పూర్వశిష్యుఁ డను సంగతి నాకు జ్ఞాపకమువచ్చెను. అంతట మే మిరువురము తిన్నగా ఆయనయింటికి వెళ్లితిమి. అప్పుడు మధ్యాహ్నము 11 గంటలు, ఆశ్రమములో భోజన వేళ. శ్రీ నరసింహాచారి భోజనమున కప్పుడే కూర్చుండెను. ఆయన మాకు హృదయపూర్వకముగ స్వాగత మిచ్చుటయే గాక, తనతోఁగూడ భోజనము చేయవలెనని మమ్ము నిర్బంధించెను. భోజనానంతరము ఆయన మాతోఁగూడ ఆయూరి దాత లందఱివద్దకు వచ్చి ప్రతిగృహమునను మాకు హృదయ పూర్వక సమ్మానమును సమకూర్చెను. మఱియు ఆయన ఆయూరి ధాన్యమును వసూలుచేసి నెల్లూరికిఁ జేర్చు బాధ్యతను స్వీకరించెను. ఆయన శ్రీ భగవానుల నెప్పుడునూ సందర్శించి యుండకున్ననూ ఇంతగా మా కుపకరించెను. ఆయన నాఁటి సాయంకాలము ఫలాహారాదికముతో మాకు వీడ్కోలొసంగెను. అట్లు శివరాత్రినాఁడు స్మార్తులమగు మే మిరువురము ఒక వైష్ణవభక్తునిచే ఆశ్రమములోవలె రాజోపచార

ములతో సత్కరింపఁబడి యీ పావనోద్యమమున ఎంతయో సాహాయ్యమును బడయఁగల్గితిమి. ఇది శ్రీ భగవానుల విశ్వాత్మత్వ నిదర్శనముగా మాకు స్ఫురించెను.

ఆ యిరువదిపుట్ల ధాన్యమును దంపించి రవాణాకు తయారు చేసితిమి. ఈ ధాన్యమును వసూలుచేసి దంపించుటకు నాపేరటనూ, ఆ బియ్యమును నెల్లూరినుండి తిరువణ్ణామలకు లారీలో రవాణాచేయుటకు శ్రీ ఎ. సీ. సుబ్బారెడ్డిగారి పేరటనూ ప్రభుత్వమువారు అనుమతి పత్రములను మంజూరుచేసిరి. కానీ చివరనిమిషమున ఒక యాటంక మేర్పడెను. వేలూరిలోని రవాణాస్థానికోద్యోగి శ్రీసుబ్బారెడ్డిగారి యనుమతి పత్రముతోఁ దనివినొందక తనకు పై యధికారులనుండి యుత్తరువు వచ్చినఁగానీ పెట్రోలుకూపనుల నిచ్చుటకు నిరాకరించెను. కావున 13-3-1949 వ తేదీ నేను శ్రీ సుబ్బారెడ్డిగారి వద్దనుండి ప్రభుత్వమువారికి పెట్రోలు కూపనులకై ఒకయర్జీని దీసికొని మదరాసునకు ఎకాయెకీ వెళ్లితిని. కుంభాభిషేక కార్యక్రమము ఆ మఱునాఁడే ఆరంభింపవలసియుండెను. నా మూటముల్లెలు సెంట్రల్ స్టేషన్ సామానులగదిలో వదిలి నేను ముఖ్యమంత్రి శ్రీ ఒ. పి. రామస్వామిరెడ్డిగారి వద్దకు పరుగిడితిని. ఆయన నారాక కాశ్చర్యపడి రవాణారాష్ట్రోద్యోగికి ఈ విషయముఁ దెలుపుచూ 'దేవుఁడు వరమిచ్చిననూ పూజారి వరమియ్యఁ డను సామెత కిది సాదృశ్యముగా నున్నదనీ తత్క్ష

ణము పెట్రోలు కూపనులు నాపరముగా ఇచ్చి తనకుఁ దెలుప వలసినదనీ టెలిఫోన్ చేసిరి. ఆసమయమున ముఖ్యమంత్రితోఁ గూడ నుండిన రమణభక్తుఁడు శ్రీ డి. యస్. శాస్త్రిగారు నన్నుఁ దనకారులో రవాణారాష్ట్రోద్యోగి శ్రీ యం. హనుమంతరావుగారి యొద్దకుఁ దీసుకవెళ్లి పరిచయము చేసిరి. శ్రీ హనుమంతరావుగారునూ సకుటుంబము రమణభక్తులే అని తెలియవచ్చెను. కానీ నాఁ డాదివారము సాయంకాల మైనందున, రాత్రి ప్రొద్దు పోవువఱకూ మేము ఏ స్థానికోద్యోగినీ కలసికొనలేక పోయితిమి. రాత్రి 10-30 గంII లకు కూపనులు లభించెను. వెంటనే నేను రైల్వేస్టేషనుకు మరలిరాఁగా అచ్చట సామానులగదియూ భోజనశాల లన్నియూ మూతవడి యుండెను. కావున ఆ రాత్రి నేను నిర్బంధోపవాస మొనర్చి కటికనేలమీఁద పైపంచె బఱచుకొని పరుండి నిద్రించితిని. నా కది యొక తపస్సువలెఁ దోఁచెను. కానీ నేను వచ్చిన గురు కార్యము నెరవేఱినందులకు పరమానందభరితుఁడ నైతిని. మఱునాఁటి యుదయము వేలూరుకుపోయి ప్రథమపర్యాయము బియ్యపు మూటలు తెచ్చిన మా లారీతోఁగూడా అచ్చటినుండి పయనించితిని. నే నాశ్రమము చేరినప్పుడు శ్రీభగవానులు దేవాలయపార్శ్వమున ఒకపందిరిలో గొప్పజన సమూహము నడుమఁ గొలువుదీరి యుండిరి. నేను ద్వారము వద్దఁ బ్రవేశింపఁగనే నాకొఱకు నిరీక్షించుచుండినట్లుగా శ్రీభగవానులు నాపైఁ దనకటాక్షవీక్షణామృతముఁ బ్రసారించి శ్రీసాంబశివరావుగారితో ఇట్లు సెలవిచ్చిరి.

"అదుగో చూడండి! సుబ్బరామయ్య వచ్చినాఁడు. రేపటికిఁగాని రాఁడని మీరు చెప్పుచుంటిరే!"
అట్లు శ్రీ భగవానులు నన్నుఁ బరమానుగ్రహదృష్టితోడనూ మధురమందహాసముతోడనూ ఆహ్వానించిరి.

నెల్లూరు ఇంత మహోదారముగా కైంకర్య మొన ర్చుట ఎంతయో సంతుష్టిఁగొలుపు విషయము. కఠినమైన రేషన్ పద్ధతి అమలులో నుండిన కాలమున ధాన్యము పుట్టి 400 రూపాయలు అమ్ముచుండిన దినములలో ఈ కైంకర్యము కేవల ధర్మముగా భక్తిప్రపత్తులతోఁ గావింపఁబడెను. ఆ దాత లలో పలువురు సకుటుంబముగా మహోత్సవమున కరుదెంచి శ్రీ భగవానుల పాదపద్మముల సేవించు భాగ్యమును బడసిరి.

పారాయణహోమాదులకై నిర్మింపఁబడిన ప్రత్యేక శాలలతో నిండి ఆశ్రమము కనుపండువుగా నుండెను. ఇంద్ర ధనుర్వర్ణ చిత్రవిచిత్ర విద్యుద్దీపాలంకరణ కాంతిపుంజములవలన రాత్రివేళ ఆశ్రమము దేవలోకమువలెఁ బ్రకాశించెను. సంగీత మంత్రపఠనహోమములు రేయుంబవళ్లు సాగుచూ వీనులవిందు సేయుచుండెను. ఆశ్రమస్థులు నిరంతరకార్యదీక్షతో ఉత్సవ ముల కేతెంచిన యసంఖ్యాక యాత్రికబృందములను వసతి సౌకర్యాదులతో మృష్టాన్నపానాదులతో ఉపచరించుచుం డిరి. ఈ సందర్భమునఁ బ్రకటితమైన పరమోత్సాహమూ,

ప్రస్ఫుటకార్యదక్షతయూ హృదయపూర్వకపరస్పర సహకారమూ మహాద్భుతమై, శ్రీ భగవానుల యనుగ్రహామహిమకు సాక్షాద్దివ్యప్రదర్శనముగా గోచరించెను.

ఉత్సవకార్య మంతయూ మార్చి 14 వ తేదినుండి 17 వ తేదివఱకు నాలుగుదినములు పట్టెను. ఈ నాలుగురోజులూ రేయుంబవలు వివిధవైదికక్రియాకలాపముతోడను, భజన పారాయణలతోడను, ఊరేగింపులతోడను, వాద్యమేళముల తోడను, యాత్రికజనమహార్ణవఘోషముతోడను ఆశ్రమము మాఱుమ్రోగుచుండెను. ప్రధానకార్యము అనఁగా మహాకుంభాభిషేకము 1949 మార్చి 17 వ తేదీ మధ్యాహ్నము 11 గంటలనుండి 12½ గంటలలోపుగ దేవాలయ గోపురశిఖరమున నడచెను. అది నేలమీఁద, మేడలమీఁద, చెట్లమీఁద, కొండమీఁద జనకోటులచే వీక్షింపఁబడెను. శ్రీపూరిజగన్నాథ పీఠాధిపతులగు జగద్గురు శంకరాచార్యులవారును విచ్చేసి తమ సన్నిధిచే ఈ యుత్సవమునకు మఱింత వన్నె పెట్టిరి. ఆనాఁటి రాత్రి మహాభిషేకమునూ శ్రీచక్రపూజయూ 11 గంటల వఱకు దేవాలయములో జరగెను. గుడిహాలొక దర్బారువలె అలంకరింపఁబడెను. దానిలో ఒకరాతిసోఫాపై తివాసీలు, వాటిపై అరుణకాంతులచేఁ గన్నులకు మిఱుమిట్లుగొలుపునొక కాంచనచేలము, దానిపై వ్యాఘ్రాజినముమీఁద శ్రీ భగవాను లాసీనులై వైకుంఠమునందు మహావిష్ణువో కైలాసమున మహేశ్వరుఁడో అనునట్లు ప్రేక్షకజననేత్రపర్వ మొన

ర్చిరి. పూజాభిషేకాదులు జరుగుచున్నంతసేపూ గుడిహాలులో శ్రావ్యతమమైన మేళము వాయించుచుండిరి. భక్తవాహినులు బారులు తీరి ప్రవేశించి శ్రీభగవానులను సందర్శించి సాష్టాంగ దండప్రణామములను స్థలాభావమగుటచేత శిరమువంచుటతోఁ దనివినొంది సాగిపోవుచుండిరి. అప్పుడుఁగూడ ఆశ్రమమునందలి దైనందిన కార్యక్రమమునకు అభ్యంతరము కలుగలేదు. మామూలుప్రకారము రాత్రి 8 గంటలకు భోజనము పెట్టిరి. కానీ శ్రీభగవానులు మాత్రము పూజ పూర్తియగువఱకూ తనయాసనమునుండి కదలక మెదలకుండిరి. ఇతరులు భోజనమునకు వెళ్లఁగా, శ్రీభగవానుల సమీపమున నిలువఁబడి జనసమూహము రాకపోకలను సక్రమముగా నడపించు భాగ్యము నాకు లభించెను. శ్రీభగవానులు నన్నుఁ గటాక్షించి "నీ వేల భోజనమునకు పోలేదు?" అని ప్రశ్నించిరి. "నేను భగవానులతోఁగూడ పోయెదను" అని మనవిచేసితిని. శ్రీభగవానులు శిరఃకంపముతోఁ దమయనుమతి ననుగ్రహించిరి. అది నిక్కముగా నాజీవితములో మఱవరాని మహోన్నతఘట్టము.

తత్సవానంతరము గృహమునకు మరలివచ్చి నేను పంపుకొనిన లేఖకుఁ బ్రత్యుత్తరముగా ఆశ్రమమువారు 28-3-'49 న తేదిన ఇట్లు వ్రాసిరి :

"పావనత్వపరమావధి యగు మాతృభూతేశ్వరాలయము సర్వదా శాంతి విజ్ఞానములఁ బ్రసారించుచుండవలె నను

నీ పవిత్రాకాంక్షయే సమస్తభక్తుల సంప్రార్థనము. శ్రీ భగవానులీ మన యాశయము నెరవేఱునట్లు మనల నాశీర్వదింతురుగాత!"

కుంభాభిషేకమహోత్సవ సమాప్తితో మా సౌఖ్యము గూడ సమాప్తియైనట్లు తోఁచెను. చింతావిషాదరూపనూతనాధ్యాయ మారంభమయ్యెను. ఆ యుత్సవమునకు కొద్దిరోజులు ముందు శ్రీ భగవానుల యెడమరెట్టమీఁద ఒక చిన్న కురుపు పొటమరింపఁగా ఆశ్రమవైద్యుఁడు దానిని శస్త్రచికిత్సతో ఛేదించెనఁట. ఉత్సవసమయమున నాకూ మాలో చాలా మందికీ ఈ విషయమే తెలియదు. ఉత్సవానంతరము అచిరకాలములోనే అదే తావున ఒక క్రొత్తకురుపు లేచి త్వరగా ఎదిగెను. దానినిగూడ 27-3-1949 వ తేదిన 'ఆపరేషను' చేసి తీసివైచిరి. ఆ తావున 'రేడియం' ప్రయోగించిరి. ఈ సంగతి వినియు నేను వెళ్ళి శ్రీ భగవానులను సందర్శింపలేకపోయితిని. ఏలన ఆ సమయముననే నా కొమార్తె అలగమ్మకు 'టైఫాయిడ్' జ్వరము రెండుసారులు వచ్చి దాదాపు రెండున్నరనెలలు చాలా జబ్బుగా నుండెను. 9-5-1949 వ తేదీ శ్రీ ఆర్. నారాయణయ్యరాశ్రమమునుండి యిట్లు వ్రాసెను:

"శ్రీ భగవానుల యారోగ్యము క్రమాభివృద్ధిఁ గనుచున్నది. వారు వైద్యులను దిగ్భ్రాంతిఁ గొలిపినారు. వైద్య

శాస్త్రమును ధిక్కరించినారు - దివీకరించినారనెదమా! ఎంత గాభరా చెలరేఁగిన దనుకొన్నావు! మరల భుజాంత ర్భాగమున కురుపు లేచవచ్చును గావున ఆ బాహువునే ఖండింపవలె నన్నారు చికిత్సకులు. అనూహ్యము! మఱి మే మేమి చేయఁగలము? భావోద్రేకమును వాగ్రూప మునఁ బ్రకటింపఁజాలని నాబోంట్లు కొందఱు కన్నీరు ద్రింగుకొనుచుండిరి, కొందఱు కన్నీరు జార్చుకొనుచుండిరి. మురుగనారు భగవానుచరణములద్రోలఁ గొన్ని పంక్తు లను సమర్పించెను. వాటిలో నాకు జ్ఞాపక మున్నంతపఱకు ఇట వ్రాయుచున్నాను:

'అడిమోంగ ళారుయిర్ కోఁరుయి రాని -
న్నరుమై త్తిరువురువై
ప్పడిమోంగ ప్పన్నెడుం కాలం పరివాడు
పాలి త్తరుళవేణ్డుమ్
కోడిమోం గరుట్పయర్ కొండదు ముట్రుక్కై
కూడ ప్పెఱాదిరుక్కుం
కుడిమోంగ ళున్నడి కూడిత్తొళు దే
కుత్తైయిర క్కిన్నమే.'

ఈ విధముగా మనప్రార్థన లాలకింపఁబడినవి. కురుపు తగ్గి పోవుచున్నదని చెప్పుచున్నారు.............
మీా చిన్నకొమార్తెకు టైఫాయిడ్‌జ్వరము వచ్చుచున్న

దని శ్రీ భగవానులతో సివేదించితిని. వారు 'అవునవును. లేకున్న, అతఁ డచ్చట నుండునా! అని పలికిరి."

పై పద్యమును 'కాపీ' చేసికొను నుద్దేశ్యముతో నా నోటు పుస్తకములో అందలి తొలియక్షరములు 'అ-డి' అని వ్రాయు చుంటిని. 'అడి' అను తమిళపదమునకు 'అడుగు' లేక 'పాదము' అని యర్థము. అప్పుడే ఊరినుండి యింటికి మరలివచ్చిన నా కొమారుఁడు సుందరరాజము "ఇదిగో నేను గయనుండి తెచ్చిన 'విష్ణుపాదము' అనుచూ ఒక రజతపాదమును నాచేతి కందిచ్చెను. ఈ యద్భుతయోగపద్యము శ్రీ రమణులు శ్రీ విష్ణువు కన్న వేఱు కారను సమ్మకమును నాలో నాఢిపటిచెను. తత్ క్షణమే నేను ఆ విష్ణుపాదమును నా నోటుపుస్తకములో 'అడి' యను పదమునొద్ద నుంచితిని. అది నాఁడు మొదల చ్చటనే యున్నది.

ఆ దినమే నాగమ్మగూడ అదేసమాచారముఁ దెలుపుచూ ఇట్లు వ్రాసెను:

"శ్రీ భగవానుల విషయములో మీరు విన్నదంతా నిజమే. ఎడమభుజము కాదు గాని, మోచేతికి పైభాగములో. ప్రస్తుత మయిదాఱు రోజులనుంచీ కొద్దిగా మాను పడుచున్నది. క్రిందటి యీ సోమవారమునాఁడు భక్తుల మంతా ఘోరున విలపించి ప్రార్థించినాము. భగవానుని హృదయము కరఁగి తానుగానే నయముచేసికోవలెనని

విన్నవించినాము. కొద్దిరోజులలో స్వస్థత నందగలరని నమ్ముచున్నాము... ఈసందర్భములో మూడు పద్యములు వ్రాసినాను. అందులో ఒకటి క్రింద వ్రాసెదను, చూడండి :

'భవరోగభిషగ్వరునకు
నవునా చీ కొకటి కలుగు?, నది మా దోషం
బవుగా, పరీక్షచేసెద
వవురా! యిక జాలు, శాంతి నందవె, రమణా."

మరల 19-5-1949 వ తేదీ శ్రీ నారాయణయ్య యిట్లు వ్రాసెను :
"భగవానులే చెప్పిరిగదా నీకొమార్తె జబ్బుకారణము లేకుండిన నీ వెప్పుడో యిచ్చుటకై పరుగిడియుందు వని... కాబట్టి ఆ తల్లిలేనిపిల్లకు కొన్ని పితృవిధులు నెరవేర్చుటకై నీవు దేహమునుమాత్ర మచ్చట నుంచియున్ననూ, నీ మన స్సంతయూ ఇచ్చటనే యున్నందున, నీవునూ ఇచ్చట నున్నట్లే. నీ కొమార్తెకేగాక మన కందఱికుం గూడా మన భగవానులే తల్లీ తండ్రీ. మన యోగక్షేమ బాధ్యత తప్పక ఆయనే నిర్వహించును.
భగవానుల 'ఆపరేషన్' గాయము మానుచున్నదనీ, కురుపు తగ్గిపోవుచున్నదనీ అనుచున్నారు. కాని వైద్యులు మాత్ర మింతవఱకు నది యిదమిత్థమని తేల్చి చెప్పలే కున్నారు."

ఆదినమే ఆశ్రమమువారుగూడా "శ్రీభగవానుల రెట్టమీది గాయము మానుచున్నది" అని జాబు వ్రాసిరి. 31-5-1949 వ తేదీ శ్రీ గిద్దలూరు సాంబశివరావు ఆశ్రమమునుండి ధైర్యము కలుగున ట్లీ వాక్యములు వ్రాసెను :

"శ్రీవారి యారోగ్యము బాగున్నది. గాయము మాని పోయినట్లే. ఇఁక అయిదాఱురోజులలో అది పూర్తిగా మూతపడును. ఇఁక దిగులున కేమియు కారణము లేదు."

జూన్ నెల రెండవవారములో అలగమ్మకు కొంచెము నెమ్మది యైన వెంటనే నేను వేగిరపడి ఆశ్రమము వెళ్లితిని. నే నచ్చటికి చేరినప్పుడు శ్రీ భగవానులు ఉదయ ఫలాహారమునకై భోజనాలహాలులో ఆసీనులై యుండిరి. నన్నుఁ జూచిన తత్క్షణమే వారు "అలగమ్మ యెట్లున్నది?" అని మిక్కిలి దయతో అడిగిరి. "తేలికగా ఉన్న"దని నేను బదులుచెప్పితిని. ఫలాహారానంతరము ఆశ్రమమువారి యనుజ్ఞతో నేను శ్రీ భగవానుల వెంట గోశాలవెలుపల ఉత్తరావరణమునకు వెళ్లితిని. అచ్చట రంగరావను పురాతనభక్తుఁడు ఆయుర్వేదవైద్యుఁడు శ్రీ భగవానుల భుజవ్రణముమీఁద కట్టు మార్చెను. కురుపు రక్తారుణమై రూప పరిమాణములందు 'కాలిఫ్లవర్'ను బోలి యుండెను. అది చూడఁగానే నాచూపు చెదరెను. కానీ శ్రీ భగవానులు మాత్రము మా దృష్టిని మరలించి మమ్ముఁ బ్రోత్సహించుటకై అంతసేపూ నవ్వుచూ ఏమేమో తమా

షాగా మాటాడుచుండిరి. ఇప్పుడు శ్రీ భగవానులు తమ యాస్థానమును దేవాలయహాలుకు మార్చి అందే తమ మామూలు కార్యక్రమమును జరపుకొనుచుండిరి. ఆగంతుకుల ప్రశ్నలకు సమాధాన మిచ్చుచూ అందులకై నన్ను అను వాదకునిగా వినియోగించుకొనుచుండిరి. కానీ వ్రణమునుండి అప్పుడప్పుడూ రక్తము స్రవించుటచేత పలుమారు కట్టు మార్చుట అవసరమగుచుండెను. శ్రీ భగవానులు ప్రత్యక్షముగా కృశించుచుండిరి.

ఒకనాఁడు మధ్యాహ్నము నేను ఒకపత్రికలో రోగి సంకల్పశక్తి వలసినంత ప్రబలముగా నుండెనేని ఎట్టిరోగము నైనఁ గుదుర్చుటకు సంపూర్ణముగా సమర్థ మగునని చదివి దానిని శ్రీ భగవానుల దృష్టికిఁ దెచ్చితిని. శ్రీ భగవాను లది చదివి, నవ్వుచూ, మఱుమాటాడక దానిని తిరిగీ నాచేతి కిచ్చివేసిరి. కానీ నాఁటిరాత్రి నేను అతిథిగృహములోఁ గూర్చుండి శ్రీ భగవానులాప్రక్కన నడచిపోవుచూ శ్రీ టి.పి. రామచంద్రయ్యరుతోనూ పరిచారకులతోనూ ఇట్లు పలుకుచుండఁగా వింటిని :

"సుబ్బరామయ్య నన్ను సంకల్పశక్తితో కుదుర్చుకొనుమని కోరుచున్నాఁడు. నేఁడు నా కొక పత్రికలో వ్యాసమును జూపించుటవలన తన యభిప్రాయమును సూచించినాఁడు. కానీ జ్ఞానికి సంకల్పము లేదే. అతనికి దేహమే లేదు, తత్సంబంధమగు వ్యాధులు లేనేలేవు."

ఆ మఱునాఁడు మధ్యాహ్నము శ్రీ భగవానులు లోకమ్మ యను భక్తురాలిని శ్రీకృష్ణునిమీఁద అరవములో ఒక జోలపాటను బాడమని చెప్పి, ఆమె పాడుచుండఁగా, ప్రతి చరణమును తెనుఁగున సంగ్రహముగా అనువదించుచూ అభినయించిరి. వా రప్పుడు ఒకే కుడిచేతితోఁ గావించిన యనుగ్రహపూర్వకాభినయము జాలిఁగొలుపు దృశ్యముగా నుండెను. ఆ సాయంకాలము శ్రీ భగవానులు "ఆత్మబోధము" నకు నా తెలుఁగు వెణ్బా వృత్తానువాదమును గుఱించి ప్రశ్నించిరి. నా పద్యములను గొన్నింటి నాలకించి సవరించిరి. గ్రంథ మంతయు తానే చూడఁగోరిరి. కానీ వారికి శ్రమ నియ్యకుండుటకై నే నాగ్రంథమును శ్రీ మురుగనారుకు వినిపించి సరిదిద్దించుకొను సలహాను శ్రీ భగవానులు విధిలేక అంగీకరించిరి.

మఱునాఁటి సాయంకాలము దేవాలయముహాలులో శ్రీ భగవానుల సమీపమున ఒక స్తంభము నానుకొని కూర్చుండియుంటిని. శ్రీ బోస్ అను నొక భక్తుఁడు అప్పుడే ప్రవేశించుటను శ్రీ భగవానులు గమనించి అతఁడు గుండె జబ్బుతోఁ చాలా బలహీనముగా నున్నందున, నేను కొంచెము జరిగి నా స్థానము నాతని కిమ్మని నాతోఁ జెప్పిరి. ఇట్టి కృపామయసంభావనము శ్రీ భగవానులకు సహజమై యొప్పెను.

మఱునాఁటి యుదయము తలాయర్ ఖాన్ సతీమణి అను పారసీకవనిత గాఢభక్తురాలు శ్రీ అరుణాచలేశ్వరాలయ

ములో పాతాళలింగజీర్ణోద్ధరణమహోత్సవ సందర్భమునఁ దీయఁబడిన ఛాయాచిత్రముల సంపుటిని శ్రీ భగవానులకుఁ దెచ్చి చూపెను. శ్రీ భగవానులు వాటిని శ్రద్ధతో అవలోకించి నాచేతి కందిచ్చుచూ ఇట్లు సెలవిచ్చిరి:

"ఈ పాతాళలింగపునరుద్ధరణ మంతయు తలాయర్ ఖాన్ పని, ఈమె చాలా కాలముగా కనుచుండిన కలయొక్క సాఫల్యము."

జూన్ నెల 25-వ తేదీ నేను "భక్తులమొఱ" అను శీర్షికతో ఎనిమిది పద్యములు రచించి శ్రీ భగవానులకు సమర్పించితిని. అవే యివి:

"శ్రీ రమణదేవు సంపూ
ర్ణారోగ్యార్థమ్ము భక్తు లందఱును సదా
కారుణ్యామృతవార్ధీ,
శ్రీ రమణా, ప్రార్థనమ్ము సేతుము నిన్నే. 1

తల్లియుఁ దండ్రియున్ గురువు దైవము సర్వము నీవ మాకు; మా యుల్లము లన్నిటన్ వెలుఁగుచుండువు నీవె సదా తదాత్మవై; అల్లలనాడు నేఁ డవి మహార్తిని, జ్ఞానముగ నీవె దిక్కు; నీ చల్లనిచూపు లేక మనఁజాలము, తండ్రి, నిమేషమేనియున్, 2.
నీపయిఁ జిత్తమున్ నిలిపి నిత్యము నిన్ను భజించుచున్, మన స్తాపము లెల్లఁ బోనడఁచి తన్మయతాంబుధి నోలలాడు నీ

యీ పదభక్తబృందమును నెవ్విధిఁ బ్రోచెదో నీ దయార్ద్రపుం
జూ పభయ మ్మొసంగి మనసుల్ దనియింపఁగ, దేశికోత్తమా.
కాయము చిన్మయమ్మయిన జ్ఞానికి రుగ్మత యెట్లు కల్గు? దే
వాయతనమ్మునన్ మయిల యంటఁగ నేర్చునె? నీదు భక్తులా
మా యఘసంచయమ్ములు మానక నిన్నలయించు నక్కటా!
మా యపరాధముల్ సయిచి మాన్పి వ్రణమ్మును, మన్పవే
మముల్. 4.

నీ కుపేక్ష్యమె యగుఁగాక నీదు నొడలు.
జ్ఞాని కుండదుగాక సంకల్ప మెదియు.
దీనభక్తులఁ బ్రోచుట హీన మగునె!
మాకొఱకు వాసిఁ గనుమయ్య, మానివర్య. 5.
సన్నిధానమ్ముమాత్రనే జగములెల్లఁ
జక్క సృజియింపఁ బెంపఁగా సంహరింప
నఖిలశక్తులు గల పరమాత్మ వీవ;
లీల రుజ మాన్ప నీ కవలీలగాదె! 6.

నీ యుపదేశముల్ మదిని నిత్యముఁ దాలిచి, నీ ప్రవర్తనన్
బాయక చూపు నిల్పి గుణపారము లెల్ల గ్రహించి, నీవలెన్
మా యహమన్న మాయ మటుమాయ మొనర్చి నిజస్వ
రూపసు
స్థాయిని గాంచుకే రమణదాసుల సద్గురుసేవ యెయ్యెడన్. 7.

మంగళ మ్మరుణగిరికుమారకునకు!

జయ మమలసచ్చిదానంద సాగరునకు!
అతులితారోగ్యసిద్ధి బ్రహ్మయు వగుత
రమణఋషినాముఁడౌ పరబ్రహ్మమునకు!" 8.

జూన్ మాసాంతమున నేను తిరిగీ యిల్లు చేరుకొంటిని. అప్పుడు నా మనస్సున కొంతదిగులును గొంతప్రత్యాశయుఁ బెనగొనియుండెను. శ్రీభగవానుల యారోగ్యమును గుఱించి పలుమాఱు వ్రాయుచుండునట్లు అప్పు డాశ్రమములో నుండిన యాయుర్వేదవైద్యుఁడు సోదరభక్తుఁడు శ్రీ యస్. రామచంద్రరావునుండి వాగ్దానముఁ గైకొంటిని. ఆ ప్రకారమే ఆయన వద్దనుండీ నాగమ్మ వద్దనుండీ నాకు జాబులు వచ్చుచుండెను. వాటినిబట్టి, 3-7-1949 వ తేదీన కొందఱు మదరాసుడాక్ట వచ్చి శ్రీభగవానులను బరీక్షించి తా మింకను జేయఁద చికిత్స కవకాశ మేమియుఁ గనిపించనందున తిరిగి వెళ్లి తెలియవచ్చెను. 5-7-1949 వ తేదీ ఒక గ్రామీణ వైద్యుఁడు పచ్చాకుల పట్టుతో క్రొత్తచికిత్స నారంభించెను. ఆతఁడే పూర్వ మొకప్పుడు శ్రీభగవానులకు ఎముక విఱిగిన సందర్భమున దానిని గుదిర్చియుండెను. వ్రణచికిత్సను బ్రవచించు "యోగరత్నాకరము" రెండుసంపుటములు నేను బంపుకొనఁగా శ్రీభగవానులు వాటిని దిలకించి ఆశ్రమగ్రంథాలయములోఁ జేర్పించిరఁట. 15-7-1949 వ తేదీ శ్రీభగవానులు గోశాలనుండి మరలివచ్చుచూదారిలో కాళ్లు వణఁకి నేలపై కొఱిగి యొక్కనిమిషము స్పృహఁ గోల్పోయిరనీ త్వరలోనే

తెప్పిరిలి కోల్కొనిరనీ నాకుఁ దెలియవచ్చెను. ఆదినమే, నా రెండవకొమారుఁడు రమణప్రసాదమునకు హెచ్చుజ్వరము వచ్చి పదిరోజులు గ్రాఁగెను. ఈ లోపల శ్రీ యస్. రామచంద్రరావు ఆశ్రమమునుండి బెంగుళూరికి తిరిగిపోయి పచ్చాకుల వైద్య మేమీ ఫలప్రదము కాలేదనీ భక్తులందఱు ఏమీ తోఁచక దిగులుపడుచున్నారనీ వ్రాసెను. అందుచేత నాకొమారుని జ్వరము తగ్గఁగానే 27-7-1949 వ తేదీ ఆశ్రమమునకు పరుగిడితిని. కురుపునుండి పలుమాఱు రక్తస్రావ మగుచుండినందున శ్రీభగవానులు మిక్కిలి చిక్కియుండిరి. దానిలో చీము చేరినందున, వారికి జ్వరముగూడ వచ్చుచుండెను. ఆ వ్రణ మెట్లు పోవునని నేను ప్రశ్నింపఁగా శ్రీభగవానులు "ఎట్లు వచ్చెనో అట్లే పోవును" అని స్పష్టముగా బదులు పలికిరి.

డాక్టరు యం. గురుస్వామి మొదలియారుగారు వైద్య బృందముతో మదరాసునుండి వచ్చి శ్రీ భగవానులను బరీక్షించిరి. అంతట వారు పరస్పరము సంప్రదించుకొని 'డయాథర్మిక్ ఆపరేషన్' చేయవలెనని సలహాయిచ్చిరి. దానివలన వ్రణము నిర్మూల మగుటయేగాక జబ్బుపడిన 'టిష్యూలు' విద్యుచ్ఛక్తిచే దగ్ధమగును. కాని వైద్యము మార్చుటకు ముందు పచ్చాకువైద్యుని యనుమతి పొందవలెనని శ్రీ భగవానులు పట్టుపట్టిరి. ఆ ప్రకారమే డాక్టరు గురుస్వామి మొదలి

యారో అతనికి బిలిపించి యొప్పించిరి. 30-7-1949 వ తేదీ రమణప్రసాదమునకు నేను బయలు దేఱినదినమే జ్వరము తిరుగఁబెట్టినదనీ, నన్ను వెంటనే మా లిరమ్మనీ మాతల్లి యింటి నుండి జాబు వ్రాసెను. మఱునాఁటి యుదయము ఆజాబు నాకు చేరినప్పుడు శ్రీ భగవానులకు వ్రణములో కొంత భాగము శటాలున జాఱిపడిపోయి విస్తారముగా రక్తస్రావ మయ్యెను. దానికి వలయు చికిత్స చేయుటకొఱకై ఆగంతు కుల నందఱిని హాలువెలుపల నుంచవలసివచ్చెను. నాఁటి మధ్యాహ్నము శ్రీ భగవానులు భోజనాల హాలులో నుండఁగా నేను సెలవుపుచ్చుకొనుటకు వెళ్ళినప్పుడు ఈ దుస్సంఘటన ద్వయమువలని దుఃఖము నాపుకొనలేక పోయితిని. శ్రీ భగ వాను లనుగ్రహముతో ఇట్లు పలుకుచూ నన్నూఱడించిరి :

"దిగులుపడవద్దు. ప్రశాంతముగా నుండుము. అంతయు చక్కపడును. *ఉండుట* మనస్స్వభావము *గానీ*, రాక పోకలు *గాదు*. ఒకవేళ రాకపోకలనే నీవు భావించవలసి నచో, ఆశ్రమమునుండి పోవుచున్నానని అనుకొనక ఆశ్రమ మునకు వచ్చుచున్నానని తలంపుము. ఇదంతా మనస్సు యొక్క తంత్రము."

నే నింటికి మరలివచ్చినప్పుడు, మా యబ్బాయికి హెచ్చుజ్వరము గాఁచుచుండెను. సన్నిపాతలక్షణములు కని పించెను. వాఁడు నన్ను గుఱితించలేదు. అది టైఫాయిడ్

జ్వరమని నిర్ణయించి, అప్పుడే మన దేశమునకు దిగుమతియైన 'క్లోరోమిసెటిన్' అను నౌషధమును వాడిరి. కానీ ఆ జ్వరము రెండుమాసములు వదలకుండెను. సెప్టెంబరు సగము గడచు నప్పటికి శ్రీ భగవానుల యనుగ్రహమువలన అబ్బాయికి నెమ్మదించెను.

ఈలోపుగ శ్రీ భగవానుల యారోగ్యమునుగుఱించి నాకు పలుమాఱు జాబులు వచ్చుచుండెను. 3-8-1949 వ తేదిన శ్రీ యన్. బలరామరెడ్డి యిట్లు వ్రాసెను:

"వ్రణమునుండి మరల ఏమియు పీడిపడలేదు. నిన్న జ్వరము రాలేదు. భగవానులు బాగుగా ఉన్నట్లగపడిరి. నేఁడు కొద్దిగా రూత్ష తగిలినది. ఇప్పటి యారోగ్యస్థితినిబట్టి యేమియు దిగులుపడ నవసరములేదు."

ఆపరేషన్ 7-8-1949 వ తేదిన జరిగెను. ఆ మఱునాఁడు శ్రీ బలరామరెడ్డి యిట్లు వ్రాసెను:

"భగవానులు నిన్నటిదినము ఆపరేషన్ చేయించుకొనిరి. దీనివల్ల ఈజబ్బు నిర్బీజమైనదని శ్రీ గురుస్వామి మొదలి యార్ చెప్పుచూ ఇది మరల పొడచూపకుండునుగాక అని యాశించిరి. భగవానులిప్పుడే ఆస్పత్రినుండి హాలుకు వచ్చినారు. ఆపరేషన్ సమయమున పండ్రెండుగురు వైద్యు లిచ్చట నుండిరి. భగవానులు సరిగా ఏడుగంటలు కొట్టి నప్పుడు ఆస్పత్రిఁ బ్రవేశించిరి. పదకొండు గంటలకు

వైద్యులు బయటికి వచ్చి ఆపరేషన్ మిక్కిలి జయప్రదముగా నెరవేఱినదనీ భుజము 'ప్లాస్టర్'లో ఉంచఁబడినదనీ చెప్పిరి. నేఁడు పదకొండున్నరకు 'ప్లాస్టర్' తీసివేసినారు. భగవానులు బాగుగా ఉన్నట్లగపడుచున్నారు."

13-8-1949 వ తేదిన ఆశ్రమమువారు "శ్రీభగవానుల యారోగ్యము తృప్తికరముగ అభివృద్ధియగుచున్న" దని వ్రాసిరి. మరల 31-8-1949 వ తేదీ ఆశ్రమమువా రిట్లు కబురుచేసిరి :

"డాక్టర్ల నివేదికనుబట్టి భుజమునందు స్థానికస్థితి మిక్కిలి తృప్తికరముగా ఉన్నది. జ్వరము బొత్తిగా లేదు. కొంత బలహీనతమాత్ర మున్నది."

సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు నెలలలో శ్రీ భగవానుల యారోగ్యము క్రమాభివృద్ధిఁ గాంచుటవలన ఆశ్రమమువారు తిరిగీ ధైర్య మవలంబించి శ్రీ భగవానుల గ్రంథముద్రణకార్య ముపక్రమించి "విచారసంగ్రహము" "వివేకచూడామణి" అను గ్రంథములను 'వైశ్య' ముద్రణాలయములో పునర్ముద్రణ మొనర్చు సందర్భమున నాకు ఆదేశము లొసంగుచూ అనేక లేఖలు వ్రాసిరి.

కానీ అక్కటా! అచిరకాలముననే మా యాశ లంతరించెను. డిసెంబరు మొదటివారముతో మఱియొక కురుపు పూర్వము ఆపరేషన్ చేసిన వ్రణమున కించుక పైభాగమున పుటమరించి వేగముగా ఎదిగెను. అందుచేత 19-12-1949 వ

తేది నాల్గవసారి ఆపరేషన్ జరిపించి దానిని దీసివైచిరి. ఇంక ఆపరేషన్ గాయమునకు కట్టుం గట్టుటతప్ప మఱేమియు చేయం జాలమని 'ఆలోపతి' డాక్టర్లు చెప్పివేసినందున, శ్రీ టి. యస్ అయ్యర్ అను సుప్రసిద్ధ హోమియోపతివైద్య నిపుణునిం బిలిపించిరి. ఆయన ఇండియాప్రభుత్వములో గొప్పయుద్యోగమున నుండి విరామమొంది మాయవరములో నివసించుచుండెను. ఆయన 24-12-1949 వ తేదీ వచ్చెను. ఆ మఱునాంటి యుదయము నేనాశ్రమముం జేరుకొంటిని. శ్రీభగవానులింకనూ ఆశ్రమ వైద్యశాలలోనే ఉన్నారనీ, ఉదయమూ సాయంకాలమూ ఒక యరగంటసేపుమాత్రము భక్తులు శ్రీ భగవానులముందు వరుసగా నడచిపోవుట కనుమతి కలదనీ నాకు తెలియవచ్చెను. కానీ నేనాశ్రమము చేరినవెంటనే దర్శనము చేసికొనుటకు ఆశ్రమమువారు నా యాతురతను గ్రహించి మిక్కిలి దయతో నాకు ప్రత్యేకముగ ఉత్తరువిచ్చిరి. నేను భగవానులను బలుకరించం గూడదు, వారికేవిధముగను విశ్రాంతిభంగము చేయరాదు అని నన్నాదేశించిరి. నేను శ్రీ భగవానులను సందర్శింపంగానే వారియందుం గనిపించిన మార్పునకు అదలిపోయితిని. వారు పడుకపై వెల్లకిల పండుకొనియుండిరి. వారి దేహము కాగితమువలె తెల్లగా పాలిపోయియుండెను. శరీర మిట్లు కృశించియుండంగా, వారి ముఖము కనులు మఱింత కాంతివంతములై శోభిల్లుచుండెను.

వా రేమియుఁ బలుకలేదు. కానీ వారి యామహానేక్షణమే నాపై వారి యనుగ్రహమును మతింతగా వర్షించుచుండెను.

27-12-1949 వ తేదిన శ్రీ భగవాను లెట్లున్నదీ, యేమి పథ్యము పుచ్చుకొనుచున్నదీ, స్ఫుటమైన కంఠస్వరముతో మాటాడఁ గలిగియున్నదీ తెలుపుమని మా తల్లి ఆతురముతో ఇంటినుండి జాబు వ్రాసెను. నాఁటియుదయమే నేను 'క్యూ' (వరుస) లో ఒక్క-క్షణము వారిముందు నిలఁబడినప్పుడు, మా తల్లి ప్రార్థనను నాకన్నముందుగా తానే ఆలకించెనో యన్నట్లు, శ్రీభగవానులు నేను వచ్చినది మొదలు తొలిసారిగా నాతో మాటాడిరి. వారు కష్టముతో హీనస్వనమున భాషించిరి. "వైశ్యముద్రాలయములో ఆశ్రమగ్రంథముల పునర్ముద్రణము పూర్తియైనదా?" అని ప్రశ్నించిరి. "విచారసంగ్రహ" ముద్రణము పూర్తియైనదనీ, ప్రతులు త్వరలోనే రావచ్చుననీ నేను బదులు పలికితిని.

హోమియోపతి వైద్యము గుణమునిచ్చుచున్నదని చెప్పిరి. శ్రీభగవానుల వ్రణము క్రమముగా మానుపడుచుండెను. వారిసామాన్యారోగ్యము అభివృద్ధి యగుచుండెను. వారు తిరిగీ అన్నప్రాశనము చేసుకొనిరి. ఒక వారమురోజులు నిత్యమూ నేను అప్పుడు మదరాసులోనుండిన శ్రీ టి. పి. రామచంద్రయ్యరుతో శ్రీ భగవానుల యారోగ్యమును

గుఱించి ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచుంటిని. నెల్లూరు నుండి శ్రీ చుండి విశ్వనాథ మను వకీలు సకుటుంబముగా ఆశ్రమమును సందర్శించి మరలిపోయి 29-12-1949 వ తేదిన ఇట్లు వ్రాసెను :

"ఈ మారు నేను ఆశ్రమములో నున్న కాలమున శ్రీ భగవానుల దివ్యసన్నిధానమందును దర్శనమందును ఒకవిశిష్ట ప్రశాంతిని అనుభవించినాను."

ఆనాఁడూ మఱునాఁడూ నేను ఆశ్రమ దేవాలయములోను పట్టణ దేవాలయములోనూ శ్రీ భగవానుల యారోగ్యము కొఱకు విశేషపూజల జరిపించితిని. అదేసంకల్పముతోఁ బ్రార్థన చేయుచూ గిరిప్రదక్షిణముగూడఁ జేసితిని.

30-12-1949 వ తేదిన నేను సాహసించి శ్రీభగవానులనే వారి యారోగ్యమును గుఱించి ప్రశ్నించితిని. వారు శ్రీ టి. యస్. అయ్యరువద్దకు వెళ్లి యడుగుమని సెలవిచ్చిరి. ఆప్రకారమే నాఁటి మధ్యాహ్నము నే నాయనను ఆయన గదిలోఁ గలసికొంటిని. ఆయన దయతో శ్రీభగవానుల యప్పటి శరీరస్థితిని సవిస్తరముగా విశదీకరించిరి. ఆయన చెప్పినదానినిబట్టి నామనస్సున కెంతో యూఱట, ధైర్యమూ చేకూఱెను. ఆసమయముననే ఆయన నా యెడమపాదము మీఁద పొడను గమనించెను. అది యెనిమిదేండ్లుగా బాధించు

చుండెను. ఎన్ని వైద్యములును నిరుపయోగమై పోయెను. దానియందు దుర్భరమైన దురద. అందుల కుపశమనముగా నిరంతర మొకతైలమును రుద్దుచుంటిని. దానిని గుఱించిన తన ప్రశ్నలకు నేను ప్రత్యుత్తరము లొసంగిన తత్క్షణమే ఆయన నాచేత ఒకచూర్ణము మ్రింగించెను. తొలిమోతాదే అద్భుతఫలప్రద మయ్యెను. దురద వెంటనే ఆగిపోయెను. తిరిగీ తైలమును వాడవలసిన యవసర మెన్నడును గలుగ లేదు. కొంచెము కఠినమైన పథ్యముతో కొన్ని మాసము లాయనయౌషధమును సేవింపఁగా, ఆ పొడ పూర్తిగ అదృశ్యమయ్యెను, తిరిగీ పొడచూపలేదు. నేనీ విషయమును శ్రీ భగవానులకు మనవిచేయగా, వారు మిక్కిలి సంతో షించిరి. ఈ వైద్యవ్యాజము వాస్తవముగా శ్రీ భగవానుల యనుగ్రహామహిమయే.

31-12-1949 వ తేదీ నా కొమారుఁడు సుందరరాజన్ పాట్నానుండి తనతల్లి యాబ్దికము 29 వ తేదీన కాశీలో జరపు కొన్నట్లు జాబు వ్రాయుచూ, అందులో "శ్రీ భగవానులు మనపై వారి యనుగ్రహము వర్షించుటకు ఇంకమీాద ఇప్పటి కిరుమాఱులు సంభవించినట్ట యాటంకము లెన్నండును గలుగ కుండుఁగాక" యని ప్రార్థించెను.

1950 సంవత్సరాదినాడు శ్రీ భగవానులు మా కందఱ కాశ్చర్యముఁ గలిగించిరి; రాత్రి తొమ్మిది గంటలప్పుడు వారు

గుట్టుగా ఆస్పత్రినుండి వెలువడి గుడిహాలుకు ఎదుటనున్న చిన్న గదిలోనికి వచ్చి చేరిరి. మఱునాఁ డుదయము దర్శనార్థులను గుడి యుత్తరపు వరాండాలోనికి పోండని యుత్తరువు వచ్చు వఱకు చాలమందికి పై మార్పు విషయమే తెలియదు. ఆ గది ముందఱి చిన్న వరాండాలోనికి శ్రీ భగవానులే వచ్చి యొక సోఫాపైఁ గూర్చుండిరి. ఇప్పు డందఱు కూర్చుండి శ్రీభగవానులు గదివెలుపల ఆసీనులై యున్నంతసేపు వారి దర్శనభాగ్యమేక కాలములో పొందఁగలిగినందున ఇది తత్పూర్వపు టేర్పాటుకన్న ఎంతో మెఱుఁగయ్యెను. దీనికై భక్తులందఱు ధన్యవాదము లర్పించిరి. కానీ గుంపు మిక్కుటమైనందున, స్త్రీలు గదియెదుట నున్న టెంకాయతోఁపులో గూర్చుండి శ్రీ భగవానుల సందర్శనము నొందిరి.

ఆ మఱునాఁడు "వైశ్యముద్రణాలయము" వారు అట్ట వేయించి ముందుగాఁ బంపుకొన్న "విచారసంగ్రహము" ప్రతిని శ్రీ భగవానులు తిలకించి ప్రాతస్సమావేశమున నాచేతి కందిచ్చిరి. నాఁటి మధ్యాహ్నము డంకన్ గ్రీన్ లీస్ అను భక్తుఁడు భగవద్దర్శనార్థము వచ్చెను. అతనిని జూచిన తత్క్షణమే శ్రీ భగవానులు నాతో ఆశ్రమకార్యాలయములో డంకన్ గ్రీన్ లీసుకు వచ్చియుండిన టెలిగ్రాము తెచ్చి ఆయన కిమ్మని చెప్పిరి. ఆ తంతెలో ఆయనస్నేహితుఁ డొకఁడు ఆయన ప్రస్తుతపుఁ జిరునామా నడిగియుండెను. దీనినిబట్టి శ్రీ భగవా

నులు తీవ్రమైన తన జబ్బులోఁగూడ తన భక్తుల స్వల్ప వ్యవహారములందును ఎంత నిశితమైన శ్రద్ధఁ జూపుచుండెనో తెల్లమయ్యెను. వారి యనుగ్రహదృష్టిలో ఏదియు గమనించుట కనర్హ మగునంత స్వల్పము గాదుగదా?

3-1-1950 వ తేదీ నెల్లూరిలో శ్రీ రేబాల పట్టాభి రామరెడ్డి మరణించె నను దుఃఖవార్త నొక టెలిగ్రామ్ నాకుఁ దెచ్చెను. తత్క్షణమే నేను దానిని శ్రీ భగవానులకు నివేదించి మృతుని యాత్మకు శాంతి కలుగుఁగాక యని ప్రార్థించితిని. సోదరభక్తుఁడైన నా ప్రాణమిత్రునకు నేను చేయఁగలిగిన యంతిమసేవ అంతమాత్రమే.

5-1-1950 వ తేదిన శ్రీ భగవానుల సప్తతి (70) వర్ష జయంతి మహోత్సవము జరుపఁబడెను. ఆనాఁడు శ్రీ భగవానులు మామూలుకన్న రెండుగంట లెక్కువసేపు దర్శన మిచ్చిరి. దేవాలయములో విశేషపూజ జరిపి హారతి యెత్తి ప్రసాదమును శ్రీ భగవానులకును భక్తులకును వినియోగ మొసర్చిరి. ఆ యుత్సవమునఁ బాల్గొనుట కెందఱో భక్తులు, యాత్రికులు దూరదేశములనుండియు వచ్చిరి. నాఁటి మధ్యాహ్నము నేను నా స్నేహితునిఁ గోల్పోయినందులకు శోక వివశుఁడనై అతిథిగృహములో పరుండియుండఁగా, ఒక పరిచారకుఁడు వచ్చి మూఁడు గంటలకు సభలో నేను కడపట రచించియుండిన 'భక్తులమొఱ'ను బఠించవలెనని శ్రీ భగవాను

లా దేశించినట్లు చెప్పెను. దానిచేత నా మనస్సు దుఃఖము నుండి సభాకార్యమువైపు మరలెను. దానినిబట్టి మనఃఖేద మను నగర్తనుండి నన్ను లేవనెత్తుటకు శ్రీ భగవానుల యను గ్రహ మెట్లుద్యమించుచుండెనో స్పష్టమయ్యెను. నేను శ్రీ భగవానులముందర నిలువఁబడి 'భక్తులమొఱ' నాక్రందించు నప్పుడు నాకు కంఠరుద్ధ మయ్యెను. పెక్కుసారులు నేను దుఃఖ మాఁపుకొనలేకపోయితిని. అప్పుడు శ్రీ భగవానులుగూడ భావా వేశముతో కన్నీరు కార్చిరని వారిని గమనించుచుండిన స్నేహితులు నాతోఁ జెప్పిరి.

వ్రణము క్రమముగా మానుకొనివచ్చుట, జ్వరము రాకుండుట, ఆఁకలి కలుగుట, శ్రీ టి. యస్. అయ్యర్ హోమియోపతివైద్యమువలన శ్రీ భగవానుల సామాన్యా రోగ్యమందు క్రమాభివృద్ధి - వీటిచేత మాకు ప్రత్యాశ కొకింత యవకాశము దొరకెను. ప్రాతస్సాయంకాలమౌన సమావేశములు శ్రీ భగవానుల దివ్యసన్నిధానమునుండి ప్రసార మగుచున్నట్లు కాన్పించు గాఢప్రశాంతి పరిపక్వసౌమ్యతా కిరణములతో నిండి నిబిడీకృతము లయ్యెను.

14-1-1950 వ తేది మధ్యాహ్నము నేను ప్రత్యేకమైన యుత్తరువు నొంది శ్రీ భగవానుల సెలవుఁ గైకొన నేఁగి నప్పుడు, దుఃఖవివశుఁడనైతిని. శ్రీ భగవానులు నన్నుఁ దన

సమీపమునకు చేరఁదీసి వ్రణశితభుజమును స్పృశింపఁజేసిరి. వారు పరమానుగ్రహముతో నన్నాఅడించుచు ఇట్లు సెల విచ్చిరి :

"ఏమీ దిగులుపడకు. అది పోవును. అది యెట్లువచ్చెనో అట్లేపోవును. దేహమే ఒకవ్యాధి, స్థౌల్యమను వ్యాధి. సూక్ష్మాత్మ యీ స్థూలదేహమాంసభారముతో క్రుంగు చున్నది. మానవుఁడు సజీవముగా నున్నప్పుడుఁగూడ ఈ దేహము మృతమే, ఏలన అది నిర్జీవజడపదార్థమే గదా. ఆత్మచ్ఛాయ దాని నావరించినందుననే దానియందొక చైతన్యము, క్రియాశక్తి కనిపించుచున్నవి.

మీ రందఱూ ఏమో 'ట్యూమర్' అనుచున్నారు. దానికి 'సర్కోమాక్యాన్సర్' అని నామకరణము చేసినారు. కానీ నా దృష్టిలో ట్యూమరూ, సర్కోమా లేనెలే దంటే నమ్మండి"

నే నింటికి తిరిగివచ్చినతర్వాత సుమా రొకమాసము వఱకూ ఆశ్రమమునుండి శ్రీ భగవానుల యారోగ్యమును గుఱించి ప్రోత్సాహకరములు ప్రత్యాశాజనకము లగు వార్తలు నాకు వచ్చుచుండెను. 19-1-1950 వ తేదిన శ్రీ టి. పి. రామ చంద్రయ్యా రిట్లు వ్రాసెను :

"కడపటి యాదివారము వచ్చిన మదరాసుడాక్టర్లు శ్రీ భగ వానుల యారోగ్యాభివృద్ధికి తృప్తిపడిరి. వ్రణము మిక్కిలి

నక్కగా మానుకొనివచ్చుచున్నదని చెప్పిరి. వాళ్ళు చర్మాచ్ఛాదనమును (Skin - grafting), పెన్సిలిన్ పూయుటయు బాగుండునని సలహా యిచ్చిరి. కానీ యీ సలహాలు ప్రస్తుత మాచరింపఁ దలంపు లేదు.''

ఆ మఱునాఁడు శ్రీ ఆర్. నారాయణయ్యరిట్లు వ్రాసెను :

"ఏమియు విపరిణామములు లేవన్న భావముతో శ్రీ భగవానుల దేహస్థితి తృప్తికరమని చెప్పుచున్నారు. పూర్వ వ్రణము పూర్తిగా మానిపోయినది. ఈవలి వ్రణము క్రమముగా మానుచున్నది. చర్మాచ్ఛాదన కనుమతింపలేదు. ఆహారనియమమువలన మలబంధ మేర్పడినది... వారి సామాన్యపరిస్థితి మిక్కిలి బలహీనముగా ఉన్నది. వారికి కొంత బాధగూడా ఉండవలెను. కానీ వారు దానిని ప్రదర్శింపరు. వారి ప్రోల మామూలుసమావేశములు జరపుకొనుచున్నాము, వారును దన మామూలు పద్ధతిలో వారి సన్నిధానమునకు వచ్చు నెల్లరలోనికిఁ దన యను గ్రహదృష్టిని బ్రసారించుచున్నారు.''

ఆదినమే శ్రీ జె. సి. నానావతిగూడ అదేవిధముగా వ్రాసి యీ వాక్యములఁ జేర్చెను :

"బొంబాయివాస్తవ్యుఁడు సర్. చునిలాల్ మెహతా యిప్పుడిచ్చట నున్నందున, నిన్న మధ్యాహ్నము మూఁడుగంటలప్పుడు ఆయనతోఁగూడ శ్రీ భగవానుల సన్నిధానము

లోనికిఁ బోవు నవకాశము నాకు లభించినది. అది వాక్కుతో వర్ణింపరాని మధురతమానుభవము. వారి యనుగ్రహము పొంగి పొరలి ప్రవహించుచున్నది. వారు మనలను తన కర్హమైన సాధనములుగా నొనర్తురుగాక యని నా నిరంతర ప్రార్థన.''

ఆ మఱునాఁడు ఆశ్రమమువారు "ఆరోగ్య పునర్లాభమువైపు మంచియభివృద్ధి కనిపించుచున్నది'' అని వ్రాసిరి. 21-1-1950వ తేదీ మరల శ్రీ టి. పి. రామచంద్రయ్యరు "శ్రీ భగవానుల యారోగ్యాభివృద్ధి బాగున్నది'' అని వ్రాసిరి. జనవరి కడపటి దినము శ్రీ జె. సి. నానావతి మరల నిట్లు వ్రాసెను:

"శ్రీ భగవానుల శరీరారోగ్యము చక్కఁగా నున్నది. నిన్నటివఱకూ వారు కొంచెము బలహీనముగాఁ గానిపించిరి, కానీ నేఁడు వారు మిక్కిలి హుషారుగా సంతోషముగాఁ గనఁబడుచున్నారు. ...నేఁటి యుదయము నీ కుశలప్రశ్నమునూ నమస్కారమునూ వారి కందించు నవకాశము నాకు లభించినది. వారు 'ఊఁ, ఊఁ' అని తల యూపిరి.''

2-2-1950 వ తేదీ డాక్టర్ టి. యస్. అయ్యరాశ్రమము నుండి యిట్లు వ్రాసెను:

"జనవరి 26 వ తేదీ సాయంకాలము నే నీస్థలముఁ జేరు కొంటిని. నేను వచ్చుటకుముందు రెండుమూఁడు రోజు

లుగా భుజములో కొంతభాగమునందు కందినట్లు కొద్ది యెఱుపు కనిపించి భయాందోళన కలిగించెను. మందు పనిచేయుట మానినందున అది వచ్చియుండునని నాకుఁ దోఁచి నేను మఱునాఁటినుండి క్రొత్తమోతాదు లారంభించినాను. ఇప్పుడు మొత్తముమీఁద శ్రీ భగవానుల యారోగ్యాభివృద్ధి తృప్తికరముగా నున్నది.”

మరల 6-2-1950 వ తేదిన డాక్టర్ టి. యస్. అయ్యరిట్లు వ్రాసెను:

“నిన్న మదరాసు డాక్టర్లు వచ్చి చూచి యభివృద్ధి మిక్కిలి తృప్తికరముగా నున్నట్లు కనుగొనిరి. వారు డ్రెస్సింగులో ‘కాడ్లివరాయిల్’ చేర్చఁదగునని సలహా యిచ్చిరి. దీనికి నే నంగీకరించినాను. తర్వాత మోతాదు నే నీ యుదయమునుండి మొదలుపెట్టినాను. ఇది బుధవారమునకు పూర్తియగును.”

8-2-1950 వ తేదీ శ్రీ ఆర్. నారాయణయ్య రిట్లు వ్రాసెను:

“శ్రీ భగవానులు బాగుగా నున్న ట్లగపడుచున్నారు. వారు మామూలుప్రకారము కూర్చుండి ప్రాతస్సాయం కాలములు రెండుగంటలపర్యంత మెల్లరకు దర్శన మిచ్చుచున్నారు. సహజముగా వారు బలహీనతవలన తనంతట నడవలేకున్నారు.”

కానీ 16-2-1950 వ తేదీ శ్రీ టి. కె. సుందరేశయ్యరు వ్రాసిన జాబులో క్రొత్తవార్త యిట్లు శ్రుతమయ్యెను:

"శ్రీ భగవానుల సామాన్యారోగ్యము తృప్తికరమే.... కానీ 'ట్యూమరు' మరల పొడచూపవచ్చునను భయ మేర్పడియున్నది."

ఆమఱునాఁడు శ్రీ ఆర్. నారాయణయ్యర్ జాబు పైవార్తనిట్లు ధ్రువపఱిచెను.

"బాహుమూలముక్రింద మరల 'ట్యూమరు' పొటమరించినది. శ్రీ భగవానుల నిత్యకార్యక్రమము పూర్వము వలెనే సాగుచున్నది. కానీ వారు అలసిసొలసినట్లగు పడుచున్నారు. వెంటనే గాభరాపడుటకుఁ గారణము లేకున్ననూ, ఈ విషయము తీవ్రాందోళనను గలిగించుచున్నది."

9-2-1950 వ తేదిన మాయవరమువాస్తవ్యుఁడు శ్రీ యం. వేంకటరామయ్యరు ఇట్లు వ్రాసెను:

"పూర్వవ్రణమునకు పై భాగమున మఱియొక 'ట్యూమరు' పొడచూపి వేగముగా ఎదుగుచున్నది ... ఇది యిచ్చట అందఱూ దిగులుపడుటకుఁ గారణమైనది... శ్రీ భగవానునకు చేయి యంతయు ఎంతో నొప్పిగా ఉండవలెను. కానీ వారెప్పుడూ నవ్వుమొగమునే చూపుచున్నారు."

ఆ మఱునాఁడు శ్రీ టి. కె. సుందరేశయ్యరు తన మనోవేదనను గ్రుమ్మరించుచు ఇట్లు వ్రాసెను :

"కురుపు లేచినది, జ్వరములేదు ... డాక్టర్ టి. యస్. అయ్యరు తిరిగీ మాయవరము చేరుకొన్నారు. మదరాసు డాక్టరులు ఏమీ చేయలేకున్నారు. మలబారునుండి మూస్ అను వైద్యుని రమ్మని చెప్పిపంపినాము ... ప్రార్థింపు, ప్రార్థింపు, ప్రార్థింపు. నేను ప్రార్థనఁగూడఁ జేయలేని స్థితిలో నున్నాను, దిగ్భ్రాంతునివలె అయినాను."

12-2-1950 వ తేదిన శ్రీ ఆర్. నారాయణయ్యరుగూడా ఇట్లు వ్రాసెను :

"ఆ కురుపు మరల ఒక నారింజపండు పరిమాణమునకు పెరిగినది. ఆ బాహువు వాచియున్నట్లు కొంచెము నల్లపడినట్లు అగపడుచున్నది. కొచ్చిన్‌నుండి మూస్ వచ్చినాఁడు ...సరి, మనమేమి చేయఁగలము ? మన జనకుఁడు మనలోపల రగిలించిన యీ కణిక తేజ మాఱిపోకుండ నిలుపుకోవలెను."

24-2-1950 వ తేదీ శ్రీ ఆర్. నారాయణయ్యరు మరల నిట్లు వ్రాసెను :

"ఆయుర్వేదవైద్యుఁడు మూస్ తన చికిత్సను ప్రారంభించినాఁడు ... ఎంతో అణఁకువతో ఆయన తన యావచ్ఛక్తి

వినియోగించి ప్రయత్నింతుననియు శ్రీ భగవానుల యను గ్రహముచేఁ దాను నెమ్మదిచేయవచ్చుననియు చెప్పినాఁ డఁట. ఆయన వైద్యుఁడేగాక, ఉపాసకుఁడుగూడా, ఆయన యీ చికిత్సను సఫలీకరింపుమని ధన్వంతరి నారాధించి వచ్చినాఁడఁట ... నిన్నటిదినము నేను శ్రీ భగవాను లతో నీవు జాబువ్రాసిన సంగతి చెప్పితిని. వెంటనే వారు 'నేనుగూడా అతనిజాబు నిప్పుడే చదువుచుంటిని' అని పలికిరి. నా వెనుకఁ గూర్చుండిన యనేకులు 'నాకు వ్రాసి నాఁడు - నాకు వ్రాసినాఁడు' అని యొక్కమారుగా నుడి విరి. సరి, నీ వింతపని చేయఁగలవని నే నూహించియే యుంటిని!"

ఆ మఱునాఁడు ఆశ్రమమువా రిట్లు వ్రాసిరి :

"మలబారు డాక్టరు మూస్ ఇప్పుడు వైద్యము చేయుచు న్నాఁడు. ఇప్పుడు కురుపు ఎదిగియున్నది గావున ఏవిధ ముగా నెమ్మదించునో వేచి చూడవలసియున్నది."

ఆదినమే శ్రీ జి. సాంబశివరావుగా రిట్లు వ్రాసిరి :

"నేఁడు నొప్పి కొంచెము తగ్గినదని నీకు తెలుపుటకు సంతోష మగుచున్నది. కురుపు అణఁగిపోవచ్చునని డాక్టరు మూస్ అనుకొనుచున్నాఁడు."

26-2-1950 వ తేదీ డాక్టర్ టి. యస్. అయ్యరు తన వైద్య వైఫల్యమునకై చింతిల్లుచు ఇట్లు వ్రాసెను :

"నే నెంత ప్రయత్నించియు నా యౌషధములు కురుపు పెరుగుదల నరికట్టలేకపోవుట మిక్కిలి దురదృష్టము."

ఈ వార్తలచే నే నెంతో దిగులుపడి మార్చి ప్రారంభమున మరల ఆశ్రమమునకు పరువిడితిని. ఆ కురుపు కొబ్బరికాయ పరిమాణమునకు పెరిగియుండెను. కట్టు విప్పినప్పు డది భయంకరదృశ్య మయ్యెను. శ్రీ టి. కె. సుందరేశయ్యరుతోఁ గూడ నేను గిరిప్రదక్షిణముచేసి శ్రీభగవానుల యారోగ్యము కొఱకు ఊరిలోని దుర్గాలయములో అర్చన చేయించితిని. నాఁటి జాబులకట్టతోఁగూడ లలిత నాచేతఁ బంపిన రహస్యలేఖ విప్పకుండ శ్రీ భగవానుల కందియ్యఁబడెను. వారు దానిలో ప్రత్యక్షరమునూ ప్రతిపంక్తినీ పొంగిపొరలు నను గ్రహముతో చాలసేపు చదువుకొని తన తలగడక్రింద నుంచుకొనిరి. కురుపు బ్రహ్మాండముగా పెరిగినందువల్లను, దానినుండి పలుమాఱు రక్తము స్రవించుచున్నందువల్లను, శ్రీ భగవానుల జీవసారము క్షీణించుచుండెను. వారి దేహము మిక్కిలి బలహీనముగా రక్తహీనముగాఁ గనిపించెను. కానీ వారిముఖమూ వీక్షణమూ ఏమాత్రము బాధను సూచింపలేదుగదా, మఱింత యనుగ్రహముతో కళకళలాడుచుండెను.

ఇప్పుడు నేను డాక్టర్ మూసుతో పరిచయము నొందితిని. ఆయన సుప్రసిద్ధ 'అష్టవైద్యుఁ'డేగాక తీవ్ర నిష్ఠాగరిష్ఠుఁడగు తపస్వి, విద్వత్కవీశ్వరుఁడు గూడా. ఒకభక్తుఁడు తన

యుపాస్యదైవతమును భజించురీతినే ఆయన శ్రీ భగవానులను బరిగణించి సేవించెను. 6-3-1950 వ తేదిన, "ఆదిపాద స్తవ షట్క-మాల" (=అకారాదియగు నాలు శ్లోకముల స్తోత్ర మాలిక) అను శీర్షిక గల తన సంస్కృతరచనను ఆయన నాకుఁ జూపించెను. ఆ శ్లోకము లియ్యవి:

"అన్తే వసన్ యస్య జడోఽపి పాద
శుశ్రూషయైవాఖిలకర్మశుద్ధః
సమస్తభూతేషు నిరస్తభేదం
తం శ్రేయసే శ్రీరమణం ప్రపద్యే॥ 1

ఆనన్దయన్ యః కరుణార్ద్రదృష్ట్యా
భక్తాన్ బహిష్ఠాన్ స్వయమాత్మనిష్ఠాః
హృదశ్చిదానన్దరసం వహన్త్యై
తం శ్రేయసే శ్రీరమణం ప్రపద్యే॥ 2

ఇన్ద్రాతిశాయిప్రభవోఽపి శాన్తా
యస్య ప్రభావాత్ కృపణైకభావాః
పరస్సహస్రం ప్రణమన్తి నిత్యం
తం శ్రేయసే శ్రీరమణం ప్రపద్యే॥ 3

ఈశాననారాయణపద్మయోని -
మూర్తిత్రయస్యాపి నియన్తృభూతాత్ ।
గుణత్రయాత్ గుప్తపరస్వరూపం
తం శ్రేయసే శ్రీరమణం ప్రపద్యే॥ 4

ఉదీరితత్రిశ్రుతిసారసారం
దృష్ట్వా సదస్తః స్వత ఏవ సిద్ధ్యా।
విభిన్నవాగ్భిస్తు జనావలీనాం
తం శ్రేయసే శ్రీరమణం ప్రపద్యే॥ 5

ఊర్ధ్వంగతం యత్పదపద్మసద్మ-
సంసేవినాం హంసపదక్రమేణ।
ప్రత్యగ్దృశాం మానసతీర్థదశ్చ
తం శ్రేయసే శ్రీరమణం ప్రపద్యే॥
సకృద్యదఙ్ఘ్రిప్రణిపాతవైభవాత్
గుణీభవద్భక్తినిబద్ధయాఽనయా।
మ 'మాదిపాదస్తవషట్క-మాల'యా
స సద్గురుః శ్రీరమణః ప్రసీదతు.॥ 6

ప్రార్థనా

అశాస్త్రవిషయే మోహాత్ ప్రయాసం కుర్వతా మిహ॥
భగవన్, కరుణామూర్తే, శం నో దేహి నమో నమః॥

త్వచ్ఛరీరం నః శరీరం, మాస్తు తేఽర్థో, న స్తతః స్యాత్।
రక్ష తన్న శిక్ష నాన్యం త్వన్న విద్మో నః శరణ్యం॥ "

జలగలు చెడ్డనెత్తురుఁ బీల్చుకోవలె నను నుద్దేశ్యముతో డాక్టరు మూసు నిత్యమూ వాటిని కురుపునకుఁ గరిపించుచుండెను. ఒకనాఁడు మధ్యాహ్నము అవి రక్తముఁ బీల్చిన

తర్వాత గట్టిగా అంటుకపోవుటచేత వాటిని విడదీయుట దుస్సాధ్య మయ్యెను. ఇది దుర్భర వేదనను గలిగించియుండ వలెను. కాని శ్రీ భగవానులు ఆ బాధ నంతయూ సంతోష ముతో భరించుటేగాక, ఈ చమత్కృతి నుడివెను:

"ఓహో! ఈ జలగ లన్నికూడ జ్ఞానులై సమాధిలో నిలిచి పోయిన ట్లున్నవి!"

12-3-1950 వ తేదీ అప్పుడు పాట్నాలో నుండిన నా కొమారుడు సుందరరాజన్ వద్దనుండి వచ్చిన ఈ క్రింది లేఖను శ్రీ భగవానుల యవలోకనమునకు సమర్పించుకొంటిని:

"శ్రీ భగవానుల బాహువుపై మఱియొక కురుపు లేచి యెదిగినదనియూ, అది అచ్చటి భక్తబృందమునకూ దర్శ నార్థులకూ మిక్కిలి యలజడి కలిగించుచున్నదనియూ తెలియవచ్చుటచే నా కెంతో ఆవేదనగా నున్నది. ఇంత దూరమందున్న నాకు మఱెంత యలజడిగా నుండునో మీరు చక్కగా ఊహింపగలరు. వైద్యుల సామర్థ్యమంతా చూచినాము. సర్వకాల సర్వావస్థలయందును శ్రీ భగవా నులే తనకు ఏకైక శ్రేష్ఠవైద్యులు. ఇక నేను చేయగలిగి నది మనస్ఫూర్తిగా ఇట్లు కోరి ప్రార్థించుటయే: చిరకా లము మనకు తన దివ్యదర్శనానుగ్రహమును బ్రసాదించు టకై శ్రీ భగవానులు తానే తనకు స్వారిగా నెమ్మదిచేసి

*కొని మామూలుదేహారోగ్యమును బడయుదురుగాక! దయ చేసి యీ నా ప్రార్థనను శ్రీ భగవానుం డందింపుఁడు."*

శ్రీ భగవానులు దీనిని బిగ్గఱగా చదువుటేగాక, పరిచారకుల వైపు తిరిగి "ఇదిగో చూడండి! సుబ్బరామయ్యపిల్లవాఁ డేమి వ్రాసినాఁడో వినండి" అని పలుకుచూ ఆ జాబులో కడపటి నాలుగు వాక్యములను అఱవములో తర్జుమాచేసి చెప్పిరి. వా రది చెప్పుచుండఁగా నేను దుఃఖ మాపుకొనలేక యేడ్చివేసితిని. శ్రీ భగవానులు నన్నూఱడించుచూ ఇట్లు పలికిరి:

"ఎందుల కీ యీవేదన? ఇది పోవును. ఇది యెట్లు వచ్చెనో అట్లే పోవును. మీ యబ్బాయివలె 'కిట్టీ' (కుమారిఆస్ బోర్న్) కూడా '*మన కేది శ్రేయస్తమమో భగవానులకే తెలియును*' అనివ్రాసినది."

ఈ యనుగ్రహవాక్కులు నా హృదయవ్రణమునకు శీతల తైలమువలె ఎంతో ఆప్యాయముగా నుండెను.

నాఁటి సాయంకాలము అందఱము శ్రీ భగవానుల సాన్నిధ్యమునఁ గూర్చుండినప్పుడు శ్రీ టి. కె. సుందరేశ య్యరు అమ్మగుడిలో 8-6-1950 వ తేదిన జరుగవలసిన మహా పూజకై ఆహ్వానపత్రిక మసోదాను శ్రీ భగవానుల యీ లోకనమునకు సమర్పించుచు ఆపత్రికను నెల్లూరు 'వైశ్యముద్ర ణాలయము' లో అచ్చువేయించు బాధ్యత నా కొప్పగింపఁ

బడినదని శ్రీ భగవానులతో మనవి చేసెను. శ్రీ భగవానులు దానిని క్షుణ్ణముగాఁ బరిశీలించి, నన్నుఁ గనవద్దకుఁ బిలిచి, అది యెట్లు ముద్రించవలెనో వివరముగా నాకుఁ దెలిపిరి. ఈ విషయమందు శ్రీ భగవానులు చూపిన శ్రద్ధాసక్తులు నా కెంతో ప్రోత్సాహమును జేకూర్చెను.

ఆ మఱునాఁడు వేఁకువన నేను శ్రీ భగవానుల సెలవు పుచ్చుకొనుటకు వెళ్లఁగా వారు పూర్వము కొన్ని యేండ్లక్రింద డాక్టరు మేల్కోట్ తనకు వైద్యముచేసిన సందర్భములను స్మరణకుఁ దెచ్చుకొని డాక్టర్ శంకరరావుతో పరిహాసము లాడుచుండిరి. నన్నుఁ జూడఁగానే శ్రీ భగవానులు మహా పూజా మహోత్సవాహ్వానపత్రికల విషయము జ్ఞప్తికిఁ దెచ్చి వాటిని త్వరలో ముద్రింపించవలెనని ఆదేశించిరి. అంతట నేను శ్రీ భగవానులను లలిత వ్రాసిన జాబున కేమి బదులు చెప్పెద రని యడిగితిని. శ్రీ భగవానులు ఇంచుక ఆగి సంపూర్ణానుగ్రహదృష్టి సారించుచూ "సరే అని చెప్పు" మని సెలవిచ్చిరి. అందువలన నేను ఊఱట చెందిన హృదయముతో గృహోన్ముఖుఁడ నైతిని.

16-3-1950 వ తేదీన శ్రీ టి. కె. సుందరేశయ్యరిట్లు వ్రాసెను :

"శ్రీ భగవానుల యారోగ్యపరిస్థితిలో చెప్పుకోఁదగినంత మార్పు కనిపించదు."

ఆ తేదిననే శ్రీ టి. సి. రామచంద్రయ్యగారు వ్రాసిన లేఖ మరి కొన్ని వివరముల నిట్లొసంగెను :

"జ్వరము నీవు కడసారి చూచినప్పటివలెనే ఉన్నది. రక్త స్రావము నిలువనూ లేదు, నిరంతరముగానూ లేదు. ఒక్కొక్కప్పు డది అధికముగా నున్నది. ...టెంపరేచరు ఉదయములం దెప్పుడూ మామూలుగానే యుండును. కానీ సాయంకాలమునకు కొంచెము హెచ్చుచుండును. కడచిన రెండురాత్రులందు 8 గంటలప్పుడు నూఱు డిగ్రీ లుండెను. ...నిన్నటిదినము మదరాసు డాక్టరులు వచ్చి శ్రీ భగవానులను బరీక్షించిరి. శ్రీ భగవానుల సాధారణ పరిస్థితి వాళ్ళ కంత తృప్తికరముగా లేదు."

పై వార్తయే నాటి 'హిందూ'పత్రికలో డాక్టరు ఆర్. సుబ్రహ్మణ్యం, శ్రీ కె. కె. నంబియారుగారలు విలేఖరుల కొసంగిన భాషణములో సూచింపబడెను. డాక్టరు సుబ్రహ్మణ్య మిట్లు చెప్పెను :

"మహర్షుల సాధారణపరిస్థితి పది దినములకన్న ఇప్పుడు బలహీనముగ నున్నది. వారు రక్తహీన మగుచున్నారు. వారి టెంపరేచరు సాయంకాలములందు హెచ్చుచున్నది. నిన్నటిదినము వారియొంటిలో నెత్తురుపారుదల కొంత క్లేశమును సూచించెను."

17-3-1950 వ తేదిన శ్రీ ఆర్. నారాయణయ్యరిట్లు వ్రాసెను:
"డాక్టరు మూసును గొందఱు ప్రశ్నల పరంపరతో అధిక్షేపింపఁగా శ్రీ భగవానులే కలుగఁజేసికొని యిట్లు పలికిరట: 'ఏల మీ రాయనను అల్లాడినలె అష్టప్రశ్నలు వేసి వేధించెదరు? నన్నడుగండి, నేను చెప్పెదను. ఆయన వైద్యము ప్రారంభించినతర్వాత లోఁగడ 18 మాసముల కన్న నా యారోగ్యము మెఱుఁగుగా నున్నది.'..."

ఆనాఁడు మధ్యాహ్నము 1-15 గంటలప్పుడు అచ్చట భూకంపము కలిగెననికూడా అజాబులో వ్రాయబడియుండెను.

19-3-1950 వ తేదీ శ్రీ ఆర్. నారాయణయ్యరు మరల ఇట్లు వ్రాసెను:

"అలోపతీవైద్యాభిప్రాయము ప్రకారము పరిస్థితి మిక్కిలి తీవ్రము, విషమముగూడా. రక్తము కాఱుచునేయున్నది, సత్తువ తగ్గిపోవుచున్నది. గుండెకూడ బలహీనమై యించుక శబ్దించుచున్నట్లు చెప్పుచున్నారు. నాడి స్ఫుటముగా లేదు. కురుపు పెరుగుచున్నది. దానినుండి యొక భాగము పడిపోయినప్పుడు అది కొంచెము తగ్గిన ట్లగపడును.... గంజియే ఆహారము. కనఁబడు లక్షణములనుబట్టి సామాన్య మానవులైనచో ఇప్పటి కెప్పుడో క్రుంగిపోయి యుండవలెను. కానీ మన భగవానులు తాళుకొనియున్నారు. ..ఈ యుదయము జాతిపడినారు, పడకుండ పట్టుకొను

టకు ప్రక్కల నెవ్వరూ లేరు. మఱియెవ్వరికైననూ దీని వలన వెంటనే గుండె ఆగిపోవలసినది. కానీ భగవానులు మెల్లగా లేచి తన దినచర్య జరపుకొనినారు. దర్శనసమయమున ఎవ్వరుగానీ ఏమియు విశేషము గమనించలేదు, చెప్పలేదు.''

ఆ మఱునాఁడు ఈ స్నేహితుఁడే మరల ఇట్లు వ్రాసెను:

''బోస్ ఎంతఖర్చయినభరించి కవిరాజ్ సేన్ను విమానములో రప్పించుట కొప్పుకొనినారు. కవిరాజు ఇట్టి వ్యాధులను గుదిర్చియున్నాఁడఁట ... శ్రీ భగవానులు మామూలు ప్రకారము పరిహాసములాడుచూ హార్షోత్కర్షముతో మందహాసములతో భాసిల్లుచున్నారు.''

ఆనాడే మేజర్ చాడ్విక్ గూడ ఇట్లు వ్రాసెను:

''సన్నటిదినము భగవానులు పడినారు. అందువలన కురుపునుండి రక్తము స్రవించినది, రెండుమారులు వమనము చేసికొన్నారు ... కురుపు పెరుగుచునే యున్నది. వారికి రాత్రులందు కొద్దిగా రూక్ష తగులుచున్నది. గుండె బలహీనమగుచున్నట్లున్నది.''

21-3-1950 వ తేదిన శ్రీ జె. సి. నానావతి యిట్లు వ్రాసెను:

''నీవు వెళ్ళినతర్వాత, నిత్యరక్తస్రావమువల్ల ఒంటిలో నెత్తురు తగ్గి దేహము బలహీన మగుచుండుటతప్ప వేఱే

మార్పు లేదు. నిన్నటిదినము ప్రాతస్సమావేశమప్పుడు వారు చాలకాలము దివ్యానుగ్రహముఁ బ్రసారించుచుండిరి. వారి చూపును వర్ణించుటకు నాకు మాటలు చాలవు; వారి సన్నిధానమున ప్రతియొక్కరును ఆనందాంబుధి నోలలాడిరి.''

ఆ మఱునాఁడు శ్రీ ఆర్. నారాయణయ్య రిట్లు వ్రాసెను :

"డాక్టర్ మూస్ తాను క్యాన్సరునుగుఱించిగాక, భగవానుల సామాన్య దేహస్థితినిగుఱించి యాందోళనపడుచున్నానని చెప్పెను ... నిన్నటిదినము ఆలోపతిడాక్టరులు హృదయమూ నాడీ బలహీనముగా నున్నవనీ ఈ విధముగా ఎట్టిదేహమూ దీర్ఘకాలము నిలువఁజాలదనీ చెప్పిరి. ఈ యుదయము సర్జన్ జనరల్ భాటియా తనిఖీచేసి హృదయమూ నాడీ క్షీణించినట్లు కనిపించలేదనీ, సంకల్పబలమో మఱేదియో వారిని నిలఁబెట్టి యున్నదనీ నుడివెను. కొందఱు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ఏప్రిల్ రెండవ తేదీ గ్రహణము గండ మనుచున్నారు, మఱికొందఱు అటి గడచుననుచున్నారు.''

ఆనాఁడే, అచ్చటికి శ్రీ భగవానుల దర్శనార్థము నాయొద్ద జాబు పుచ్చుకొని వెడలిన నా సహాధ్యాపకు లిరువురు శ్రీ జానకిరామశర్మ శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిలను గుఱించి ఆశ్రమమువా రిట్లు వ్రాసిరి :

వరినుండియో ఉపశ్రమయుట లేదు. భగవానులు దీని నంతటినీ సహించుటయేగాక మందహాసముతో మహాను గ్రహమును వర్షించుచున్నారు. సిలువపై యేసుక్రీస్తువు కరుణ రసమునకు ఆత్మబలిదానమునకు మూర్తిభావము. కాని మనతండ్రి. పరమదివ్యవిభూతిమూర్తిభావము.''

25-3-1950 వ తేదీ శ్రీ ఎ. దేవరాజమొదలియార్ ఇట్లువ్రాసెను:

"శ్రీ భగవానుల యారోగ్యమును గురించి తెలుపందగిన ప్రోత్సాహకరమగు వార్త యేమియు లేదు. వ్యాధి దిన దినమునకు ముదురుచున్నట్లున్నది. భగవానుల యను గ్రహ మొక్కటితప్ప ఆపదం గడచుటకు గత్యంతరము కాన్పింపదు.''

26-3-1950 వ తేదిన శ్రీ ఆర్. నారాయణయ్యరు మరల ఇట్లు వ్రాసెను :

"నిన్నటిదినము టెంపరేచరు 96 డిగ్రీలు, ప్రాణశక్తి మిక్కిలి నీరసించినది. జ్యోతిమాత్రము దేదీప్యముగ వెలుంగుచునేయున్నది. దీనికి చమురు యెచ్చటినుండి వచ్చు చున్నదో దేవునికే యెఱుక. కవిరాజ్ రే ఫుదయము వచ్చునంట.''

ఆ మఱునాం డా స్నేహితుడే మరల ఇట్లు వ్రాసెను :

"భగవానులకు పిత్తప్రకోపము (Nausea) కలిగియున్నది. కడుపులోనికి పోవు పదార్థ మేదిగానీ వమనమగుచున్నది. ...మూఁడు నాలుగు రోజులుగా వారికి ఆహారమే లేదు. కొద్ది నారింజపండురసముమాత్రమే యిప్పుడు వారి యాహారము, వారికి సత్తువ మిక్కిలి క్షీణించినది, నాడి తగ్గియున్నది. గుండె నిండా బలహీనమై యున్నది, రక్తప్రసారము మందగించినది, కాళ్లూ చేతులుగూడా వాచియున్నవి. డాక్టరులందఱూ ఆశను పూర్తిగా వదలుకొన్నారు. ...క్లేశముతో దినచర్య నడచుచున్నది. *నిన్నటిదినము నేను గూఢముగా భగవానుల గదిలో ప్రవేశించి దీనియంతటి భావ మేమని కన్నీటితో వారినే అడిగితిని. వారు హీనస్వరముతో 'అది పోవును' అని చెప్పిరి. 'అది' అనఁగా క్యాన్సరేనా? అట్లే తలంతును."*

29-3-1950 వ తేదీ నాగమ్మ స్త్రీసహజసౌకుమార్యముతో ఇట్లు వ్రాసెను :

"నిన్నటివఱకూ శ్రీ భగవానులు మామూలు ప్రకారము దర్శనమిచ్చుచుండిరి. కానీ నేఁడు మొదలు వారు వరండా లోనికి వెలువడుట ఆగిపోయినది. వారి గదియెదుట నున్న పరదాలను ఎత్తివేసి మనలను వారి దర్శనము చేసికోమన్నారు. అదే పరిస్థితి. కుంభాభిషేక వార్షికోత్సవము

ఏప్రిల్ 2 వ తేదీ వచ్చును. ఏమైతే అప్పటికి మీ రిచ్చ టికి రావచ్చును."

ఆనాఁడే శ్రీ ఎ. దేవరాజముదలియారుగూడా ఇట్లు వ్రాసెను:

"కలకత్తా కవిరాజ్ నిన్నటిదిన మిచ్చటికి వచ్చెను ..... ఆయన భగవానులకు వైద్యముచేయ నిశ్చయించు కొన్నారు. వ్యాధి చాలా ముదిరినందున భగవానుల పరి స్థితి క్లిష్టముగా ఉన్నదని ఆయనగూడా తలంచుచున్నారు."

ఆ మఱునాఁడు శ్రీ ఆర్. నారాయణయ్య రిట్లు వ్రాసెను:

"కవిరాజ్ మందులు కొన్ని వాడినపిమ్మట శ్రీ భగవానుల పరిస్థితి నేఁడు కొంచెము మెఱుఁగైనట్లు చెప్పుచున్నారు. ... నేఁడు భగవానులకు మూత్రము వచ్చినది. కాళ్ళలో, పాదముమీఁద వాపు కొద్దిగా తగ్గినది. కొంచెము పాలు పుచ్చుకొండని కవిరాజ్ నిర్బంధముచేసినారు. అదిగాక వారి కిచ్చునట్టి యాహారము ఫలరసము. బయటికి వచ్చి దర్శనమిచ్చుట ఆపివేసినారు. వారికి నిలుచుట నడచుట సాధ్యముకా లేదు. స్నానాలగదినుంచీ భగవానులను దర్శ నము చేసికోవచ్చును; కాదా, కరగోడవద్దకు పోయి దాని లోని కలుగులద్వారా జంతుప్రదర్శనశాలలోవలె తొంగి చూడవచ్చును."

31-3-1950 వ తేదీ "హిందూ" పత్రిక శ్రీ భగవా నులు బొత్తిగా లేవలేని స్థితిలో నున్నారనీ వారి పరిస్థితి ఆందో

శనఁ గలిగించుచున్నదనీ ప్రకటించెను. నాఁటి మధ్యాహ్నమే నేను బయలుదేఱి మఱునాఁ డుదయము దర్శనార్థుల 'క్యూ' (శ్రేణి) యేర్పడుచుండఁగా దానిలోఁ జేరుటకు సకాలమున ఆశ్రమము జేరుకొంటిని. శ్రీ భగవానులు పడుకపై ఒత్తగిలి పవ్వళించి, మేము కరగోడపుండు బారులుతీరి ఒకత్రుటి కాలము వారిని దర్శనముచేసికొని సాగిపోవుచుండఁగా మా వైపు మొగముఁ ద్రిప్పి వీక్షించుచుండిరి. వారి వదనము, కన్నులు యథాప్రకారము దివ్యానుగ్రహ తేజముతో దేదీప్యమానములై యుండెను. నా క్షణమాత్రవీక్షణము నా మనస్సునకు ధైర్యావహమయ్యెను. నేను 'క్యూ' నుండి బయట రాఁగానే రంగస్వామి అను పరిచారకుఁడు నన్నుఁ గలసికొని యిట్లు పలికెను :

"శ్రీ భగవానులు 'క్యూ' లో మిమ్ము గమనించినారు. నాతో ఇట్లన్నారు: 'చూడు! మన సుబ్బరామయ్య గూడా వచ్చినాఁడు పాపము! నిన్నటి పత్రికలలో మన వార్తఁ జదివి గాభరాపడి పరుగెత్తివచ్చినాఁడు. నీవు వెళ్ళి అతనికి స్వాగతము చెప్పు'."

అనుగ్రహప్రపూర్ణమైన యీ గమనింపు, ఈ సందేశము నన్ను భావోద్రేకమున ముంచెత్తెను.

నిరుత్సాహనిరాశా వాతావరణము ఆశ్రమము నావరించియుండెను. చాలామంది ఏప్రిల్ రెండవ తేది గడవ దిను

భయమునకు లోనై యుండిరి. అన్ని చిహ్నములుగూడ ఈ జోస్యమును రూఢిపఱుచునట్లే యుండెను. శ్రీ భగవానులగది నానుకొనియున్న వృక్షముపై ఒక పెద్ద తేనెతెట్టె ప్రముఖముగాఁ గానిపించుచుండెను. కొన్ని దినములుగా శ్రీ భగవానులేయాహారమూ పుచ్చుకొనుట లేదు. వారి మూత్రకోశములు పనిచేయుట లేదు. భయపడుచుండిన దిన ముదయమయ్యెను. భక్తులందఱూ ఏమియు తోఁచక ఊపిరి బిగఁబట్టుకొని యుండిరి. కానీ అతివిచిత్రసంఘటనము! ఉదయము తొమ్మిది గంటలప్పుడు పౌర్ణమినాఁటి మామూలుప్రకారము శ్రీ భగవానులు క్షురకర్మఁ జేయించుకొనుచున్నారను వార్త వినవచ్చెను. ఆ సమయమున నేను మెట్రిక్యులేషన్ పరీక్షాపత్రములు దిద్దుచుంటిని. వాటిలో ఒకప్రశ్న బుద్ధదేవుని జీవితమునకు సంబంధించియుండెను. ప్రతి విద్యార్థియు ఆప్రశ్నను దీసికొని యిట్లు వ్రాసియుండెను :

*"ఆనాఁడు పౌర్ణమియగుటవలన, బుద్ధభగవానుఁడు క్షౌరముఁ గావించుకొని స్నాన మాచరించెను. అంతట ఆయన తనశిష్యులను బిలిచి వారితో 'నేను పోయినప్పుడు, సత్యమే మీకు గురువుగా నుండఁగలదు' అని సెలవిచ్చెను."*

నేను దీనిని మాటిమాటికి చదువుచుండఁగా, ఈ యోగపద్యము మిక్కిలి సాభిప్రాయముగా ప్రబోధకరముగా నాకు

స్ఫురించెను. ప్రతిపరీక్షాపత్రములో పునఃపునరుద్ఘాటింపఁబడిన
యీ బుద్ధభాషణము శ్రీ భగవానుల యంత్యసందేశమా
అన్నట్లు నా వీనులలో మాఱుమ్రోఁగెను. కొంతసేపటికి క్షౌర
కుఁడు నటేశన్ వచ్చి శ్రీ భగవానులే తనను బిలిపించిరనియు,
తాను క్షౌరము చేయుచున్నంతసేపూ చక్కఁగాఁ గూర్చుండి
తనతో ఎకసక్కెము లాడుచుండిరనియు చెప్పెను. క్షౌరా
నంతరము శ్రీ భగవానులు మామూలుగా స్నానముచేసిరి,
ఇంచుక మూత్రవిసర్జనముచేసికొనిరి. వారు మిక్కిలి తేటగా
ఉత్సాహముగాఁ గనిపించిరి. ఇదంతయు ఆనాఁడు గండ మను
జోస్యమును సత్యదూర మొనర్చునట్లుండెను.

నాఁటి రాత్రి చంద్రగ్రహణవేళ, శ్రీ ఆర్. నారాయ
ణయ్యరూ నేనూ గిరిప్రదక్షిణము వెళ్లితిమి. గ్రహణము
పూర్తిగా పట్టినప్పుడు, మనుష్యుల కందరాని గిరిశిఖరమువద్ద
రెండరుణజ్యోతులు సంచరించుట మాకు దృగ్గోచర
మయ్యెను. అట్టి పర్వసమయములందు అరుణాచలగుహలలో
అదృశ్యులై నివసించు మహాసిద్ధులు ప్రత్యక్షమగుదురని విని
యున్నందున మే మా దృశ్యముంగాంచి భయసంభ్రమములు
పెనఁగొనఁగాఁ దిరిగివచ్చి ఆశ్రమమునకు ఆ యుదంతము నివే
దించితిమి.

3-4-1950 వ తేదీ కవిరాజ్ మరలవచ్చి అవసర సంప్ర
దింపులు జరిపి, శ్రీ భగవానులకు అప్పటిస్థితిలో తీవ్రౌషధము
లియ్యఁగూడదని తీర్మానించెను.

ఆ మఱునాఁడు అప్పుడు మదరాసుగవర్నరుగా నుం భవనగర్ మహారాజాగారును మహారాణిగారును శ్రీ భగ-వానుల దర్శనార్థము వచ్చిరి. సర్వాధికారియు మదరాసుముఖ్య మంత్రి శ్రీ ఓ. పీ. రామస్వామిరెడ్డియారును స్వాగతమొసఁగి వారిని శ్రీ భగవానుల గదిలోనికిఁ గొనిపోయిరి. వారు తత్పూర్వమే పాతాళలింగపునరుద్ధారణ సమయమున తిరువణ్ణామలకు వచ్చినప్పుడు శ్రీ భగవానులను సందర్శించి యుండిరి. మఱియు వారు ఆశ్రమమునకు తెల్లనెమళ్ల జంటను బహూకరించియుండిరి. ఇప్పుడు వారు ఆతురముతో శ్రీ భగవానులనే కుశలప్రశ్న మడిగిరి. శ్రీ భగవానులు "అంతా సరిగా ఉన్నది". అని ప్రత్యుత్తర మిచ్చిరఁట. దర్శనానంతరము వారు మాతృభూతేశ్వరాలయములో అర్చనచేయించి ప్రసాదము స్వీకరించిరి. వారికి అధికారహోదాలో కార్యక్రమ మేమియు లేకున్ననూ శ్రీ భగవానులను సందర్శించు నుద్దేశ్యముతోనే వచ్చిరఁట. వారు వచ్చినవేళకు శ్రీ భగవానులు తమ స్వల్పపథ్యముఁ బుచ్చుకొనవలసియుండెను. కానీ శ్రీ భగవానులు దానికిఁగూడ వాయిదావేయుచూ ఇట్లు పలికిరి :

"ఎన్నో అవసరములైన కార్యములమధ్య మహారాజాగారు నన్నుఁ జూచుటకు వేగిరపడి వచ్చుచున్నారు. కావున ఇచ్చట నేను వారి కొక్క-క్షణముగూడ ఆలస్యము చేయఁగూడదు."

వాళ్లు వెళ్లినతర్వాతనే శ్రీ భగవానులు పథ్యము పుచ్చుకొనిరి. నవమాసములపిమ్మట మహారాజాగారు నెల్లూరిలో శ్రీ భగవానుల రూపపటము నావిష్కరించినప్పుడు నే నీ యుదంతము వారికిఁ దెలుపఁగా, శ్రీ భగవాను లంతగాఁ దమపైఁ గురియించిన యనుగ్రహావర్షమునకు వారు తన్మయులైరి.

ఆనాఁడే అనఁగా 1950 ఏప్రిల్ 4 వ తేదిన తమగదిలో ఉన్నతశయ్యపై ఒత్తిగిలి పరుండియున్న శ్రీ భగవానుల ఛాయాచిత్రము ఒక సుప్రసిద్ధ ఫ్రెంచి చిత్రకారునిచేఁ దీయఁబడెను.

శ్రీ భగవానుల యత్యంత బలహీనస్థితి కారణముగా వారి దర్శనము ఉదయ సాయంకాలములందు 'క్యూ'లోని వాళ్లకుమాత్ర మనుమతింపఁబడెను. వారి పరిచారకులూ వైద్యులూ తప్ప మరెవ్వరూ శ్రీ భగవానులను సందర్శింపరాదని గట్టికట్టుడి చేయఁబడెను. కావున ఆరాత్రి నేను బరువెక్కిన హృదయముతో తిరిగి బయలుదేఱితిని. నేను శ్రీ భగవానుల గదిప్రక్క నున్న బహిర్ద్వారము (wicket gate) సమీపింపఁగా, ఆ ద్వారపాలకుఁడు శ్రీజయదేవలాల్ నాచెవిలో 'భగవానులను చూడఁగోరెదవా?'' అని పలికెను. నేను "అవును, కానీ ఉత్తరువు లేదుగదా'' అని బదులుపలికితిని. ఆయన "పరవాలేదు, లోపలికి పో'' అని నన్ను లోపలికి

నెత్తెను. శ్రీ భగవానులు ఎవరినో యెదురుచూచుచుండినట్లు గదిద్వారమువైపు మొగముఁద్రిప్పి ఒంటరిగా పరుండియుండిరి. నేను గడపవెలుపల నమస్కరించి లేవఁగానే శ్రీ భగవానులు "లోపలికి రండి" అని పిలిచిరి. నేను లోపల వెళ్లి వారిముందు నిలఁబడఁగా, శ్రీ భగవానులు నన్ను

"నీ కేమి కావలెను?"

అని యడిగిరి. నేను కన్నీరు కార్చుచూ

"నాకు అభయము కావలెను."

అని పలికితిని. శ్రీ భగవానులు పొంగిపొరలుచున్న యను గ్రహముతో

"సరే, ఇచ్చాను"

అని సెలవిచ్చిరి. శ్రీ భగవానులు మఱియు ఇట్లనిరి :

"ఏమీ భయపడకు. అది యెట్లు వచ్చెనో అట్లే పోవును."

తత్క్షణమే నా హృదయమునుండి ఒక పెద్దబరువు తీసివైచినట్లు నా కనిపించెను. నేను వారి పాదారవిందములను నా హస్త మస్తకములతో స్పృశింపఁగా, నా యొడలంతయు హర్ష పులకాంకితమయ్యెను, నేను శాంత్యానందసాగరములో నిర్మగ్న

మైన ట్లనిపించెను. అభయప్రదానపరమానుగ్రహవాక్కుల
నెలవిచ్చు శ్రీ భగవానుల యీ దివ్యదృశ్యము నా యంతరా
త్మలో శాశ్వతముగ నెలకొని నన్ను సమస్తజీవితవిపత్తుల
నుండి సంరక్షించుచున్నది.

6-4-1950 వ తేదీ శ్రీ ఆర్. నారాయణయ్యగా రిట్లు వ్రాసెను :

"భగవానుల పరిస్థితి అట్లే యున్నది. 'క్యాన్సర్' ద్వారా నిత్యమూ ఎంతో రక్తము పోవుచున్నది. అందుకు పరిహారముగా తీసికొను ఆహారమో అతిస్వల్పము. అందువలన వారు కృశించుచున్నారు. మూత్రము చాలా కొద్దిగా వచ్చుచున్నది. చేతి వెనుకభాగమున, వెన్నెముక పైన, మెడపైన, దుస్సహబాధ. 'అది పోవునేని, అంతా పోవును' అని భగవాను లన్నారఁట."

7-4-1950 వ తేదీ ఆశ్రమమువా రిట్లు వ్రాసిరి :

"శ్రీ భగవానుల శరీరపరిస్థితి మీరు చూచినప్పటివలెనే ఉన్నది. అటుపిమ్మటఁ గలిగిన శిరోవేదన తగ్గిపోవు చున్నది."

ఆనాఁడే శ్రీ ఆర్. నారాయణయ్యగారుగూడ ఇట్లు వ్రాసెను :

"నీ కార్డు చూచి నే నెంతో సంతసించితిని. నేఁటి యుదయము నేను 'క్యూ'లో ఉన్నప్పుడు దానిని నాచేతి కిచ్చిరి. భగవానుల దర్శనకాలమంతయు దానిని నేను జదువు

చుంటిని. నీ అభయప్రార్థనము నాహృదయములో మాఱు
మ్రోఁగుచూ స్పందించుచుండెను. ... నేఁడు భగవానుల
పరిస్థితి ప్రత్యంశములోనూ మెఱుఁగుగా నున్నట్లు దెలియు
చున్నది. 'క్యూ'పద్ధతి కొనసాగుచున్నది. తలనొప్పితీవ్రత
కొంచె ముపశమించినట్లున్నది."

10-4-1950 వ తేదీ, శ్రీభగవానులను సందర్శించి తిరిగివచ్చిన శ్రీ టి. రామరెడ్డిగా రిట్లు వ్రాసిరి :

"శ్రీ భగవానుల పరిస్థితి చాలా జబ్బుగా ఉన్నది....
భగవానులకు నా నమస్కారములు చెల్లించి రాఁగలిగి
నందులకు నేను ధన్యోఽస్మి అనుకొనుచున్నాను. వారు
నిశ్చలముగా, ప్రశాంతముగా, అనుగ్రహప్రపూర్ణముగా
ఉన్నారు."

ఆనాఁడే శ్రీ ఆర్. నారాయణయ్యర్ నా కిట్లు తంతెవార్తఁ బంపెను :

"పరిస్థితి విషమము, విపత్కర మనుకొనుచున్నారు."

అదేసమయమున శ్రీ ఎ. దేవరాజమొదలియారుగూడ ఇట్లు తంతె నిచ్చెను :

పరిస్థితి మిక్కిలి విషమము."

పై వార్తలను రూఢిపఱుచుచూ ఆదినమే శ్రీ టి. రామచంద్రరా విట్లు వ్రాసెను ;

"నిన్నటినుండి వారి యారోగ్యస్థితి విషమించినది. ...నేఁటి యుదయము మాకు శ్రీ భగవానుల దర్శనము కాలేదు."

ఏప్రిల్ 11 వ తేదీ యుదయము నే నాశ్రమమునకు బయలు దేఱుచుండఁగా, సోదరభక్తుఁడు శ్రీ యస్. కోళందవేలు మొదలియార్ మాయింటికి వచ్చి శ్రీ భగవానుల పరిస్థితి మెఱుఁగుపడుచుండెననియు ఇప్పుడు ఆందోళనపడవలసిన కారణము లేదనియు తిరువణ్ణామలనుంచి వచ్చిన టెలిఫోన్ సమాచారమును నా కందఁజేసెను. అందుమీఁదట నేను నా ప్రయాణమునకు వాయిదా వేసికొంటిని.

ఆనాఁడే శ్రీ ఆర్. నారాయణయ్య రిట్లు వ్రాసెను:

"ఆదివారము రాత్రి 8½ గంటలప్పుడు భగవానుల పరిస్థితి మిక్కిలి విషమముగాఁ బరిగణింపఁబడెను. ద్రవాహారము కూడా లేదు. మలమూత్రవిసర్జన లేదు. నాడి కడుంగడు క్షీణించినది. రక్తపుఁబోటు ఎంతో తగ్గిపోయినది. గుండె బలహీనమైనది. టెంపరేచరు 96.8 డిగ్రీలు. పలుమాఱు వెక్కిళ్లు రాఁదొడంగినని. ...మఱునాఁడునూ ఇదే స్థితి. ఆసాయంకాలము భగవానులు ప్రొద్దున 'క్యూ' ఉండెనా అని ప్రశ్నించిరి. సర్వాధికారి తాత్కాలికముగా అది ఆపివేయఁబడినదని బదులు చెప్పెను. *ఆగంతుకుల కందఱికి దర్శనమగునంతవఱకూ తాను నీటిబొట్టునుగూడ ముట్టుట ఆపివేయుచున్నానని భగవానులు పలికిరి.* కావున

నిన్న సాయంకాలము 'కుర్యా' మరల జరగెను. వెక్కిళ్లు, నొప్పులు సమస్తము నాపివేసి భగవానులు యథాపూర్వము సుఖాసీనులైరి. దర్శనానంతరము వెక్కిళ్లు మరలఁ బ్రారంభించెనని తెలియవచ్చినది. వారు స్వల్ప పథ్యము లనఁగా కొద్దిగా మజ్జిగ, ఫలరసముఁ బుచ్చుకొనుచున్నారు. మందులు మానివేసినారు. బలహీనత యెక్కువగుచున్నది."

తర్వాత ఆనాఁడే ఆస్నేహితుఁడు ఇట్లు తంతెగూడఁ బంపెను:

"ఆందోళనకరపరిస్థితి చెదరక సాగుచున్నది."

ఆ మఱునాఁడు సర్వాధికారి యిట్లు తంతె నిచ్చెను:

"ఆరోగ్యము యథాపూర్వమే. అభివృద్ధిని ఆశించుచున్నాము."

ఏప్రిల్ 13, 14 తేదులలో శ్రీ ఆర్. నారాయణయ్యరు రెండు జాబులు వ్రాసెను. కానీ వాటిని 14 వ తేదిననే తపాలా పెట్టెలో వేయఁగలిగెను. అందుచేత అవి రెండును అంతయు పూర్తియైన మఱునాఁడు నాకు చేరినవి. వాటిలో ఇట్లు వ్రాయఁబడియుండెను:

"ఆందోళనకరపరిస్థితి చెదరక సాగుచున్నది' అను నా బదులుతంతె ఉన్నస్థితిని సూటిగాఁ దెలుపుచున్నది. నాడి అంతగా క్షీణించి, హృదయస్పందనములు విసరా

నంత హీనమై, ఉంపరేచరు నార్మలుకన్న చాలా తగ్గి పోయి, రక్తపుఁబోటు 36, 38 మధ్యకు రాఁగా, ఎవ రేమి చెప్పఁగలరు? రక్తపుఁబోటు 60 యందున్నప్పుడే, అపాయకరమనెదరు. 60 కి దిగితే ఆశ పూర్తిగా వదలు కొనెదరు ... *ఇప్పుడు భగవానులు జీవమరణముల మధ్యా రేఖను దుడిచివైచినారు.* నేఁటి యుదయము 'కూ్యా' అంత్యమున నేనూ మురగనారూ వెళ్ళి కొంచెము సేపు నిలుచుంటిమి. భగవానులు కనులు మూసికొని వెల్లకిలఁ బరుండియుండిరి. ఏ మాశ్చర్యము! ఎట్టి యపారకరుణ! వారు మావైపు తిరిగి మాకు ఒకర్ సుదీర్ఘ నిశ్చలదృకుర్నొసంగిరి. వారు కనులు మూసికొనిరి. కొన్ని సెకండ్లలో మరల కనులు తెఱచి నిండు కనికరముతో మమ్ము వీక్షించిరి. ఆ చూపు నాలోపలఁ జొచ్చి నన్నుఁ బరవశునిఁ జేసినది. హా! భగవాన్, దీనియంతటికి అర్థమేమి? నీ మర్మ మేమిటి? కాఱు కన్నీటితో వ్రాయుచున్నాను. ...నా ప్రియమిత్రమా, సోదరా, నీవును మనప్రభువునకు మనతండ్రికి మౌనముగాఁ బ్రార్థించుచూ కన్నీరుఁ గార్చుము."

"(14-4-1950) ఈ రెండుకార్డులు వ్రాయుచూ నేను 'కూ్యా'లోకి వెళ్ళితిని. అందువలన వాటిని తపాలాపెట్టెలో వేయలేకపోయితిని. ...భగవానులు డాక్టరులను ధికర్

రించినారు. నిన్న రాత్రి 12-30 గంటలప్పుడు వారి దేహాము నిశ్చలమై బిగిసికొనినందున అందఱూ అదే అంత్యమను కొన్నారు. కానీ 1-30 గంటలప్పుడు భగవానులు కొద్దిగా కదలి చేయిఁజాపిరి. ఎవ్వరేమి చెప్పఁగలిగిరి ? టెంపరే చరు, రక్తపుఁబోటు తీసుకొనుటగూడ మానివేసినారు. భగవాను లేమందునూ పుచ్చుకొనుటకు గట్టిగా నిరాక రించినారు. వారు ఒక్కొకవేళ మాటాడుచున్నారు. ...వారి కంఠస్వరములో పటిమ కొంతధైర్యముఁ గొలుపు చున్నది. కానీ పరిస్థితిలో అభివృద్ధిచిహ్న మేమియు లేదు. ...రాఁగలవేని, రా. రాఁజాలవేని, చింతిల్లకు. *మన మెల్లప్పుడూ వారితోనేగదా ఉన్నాము."*

ఏప్రిల్ 15 వ తేదీ ఉదయము ఆ ముందటిరాత్రి రేడియో శ్రీ భగవానుల నిర్యాణమును బ్రకటించెనని ఒక స్నేహితుడు నాకు వార్త చెప్పెను. వెంటనే నేను తిరువణ్ణా మలకు టెలిఫోను చేసి ఆవార్త వాస్తవమని రూఢిపఱచు కొంటిని. మఱియు వారి మహాసమాధి మధ్యాహ్నములోపుగ పూర్తియగుననిగూడ ఫోనులో వింటిని. ఆశ్రమము వెళ్లి ఆ పవిత్రదేహామును కడసారి సందర్శింపవలెనని నేనెంత ప్రయ త్నించిననూ కారు దొరకనందున సాధ్యముగాలేదు. ఆ హృదయవిదారకదృశ్యమును గాంచకుండుట బహుశా అభయప్రదానములో భాగము కాఁబోలు.

నేను దీనిని ఆంగ్లమున 1956 మే నెల 11 వ తేదీ శుక్ర వారమునాఁడు వ్రాయుచుండఁగా, బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు నేఁటివేఁకువన పరమపదించినా రను వార్త వినవచ్చినది. శ్రీ శర్మగారు ఆంధ్ర విద్వత్కవులలో అగ్రగణ్యు లగుటయేగాక శ్రీ భగవానుల భక్తులుగూడా. ఈ యోగపద్యము భావగర్భితముగా నాకుఁ దోఁచినది.

15-4-1950 వ తేదిన శ్రీ యస్. రామచంద్రరా విట్లు వ్రాసెను :

"నిన్న రాత్రి 8-47 గంటలకు భగవాను లస్తమించినారు. ఇప్పుడు వారిభక్తుల హృదయములలో నెలకొని భాసిల్లు చున్నారు."

ఆనాఁడే శ్రీ ఆర్. నారాయణయ్య రొకజాబు వ్రాయ నారం భించి ఆ మఱునాఁడు పూర్తిచేసి తపాలాలో వేసెను. అం దిట్లుండెను :

"ఇప్పటికి నీకు తెలిసియుండును. అంతా పూర్తియైనది. నిన్న రాత్రి భోజనానంతరము నేను మాయింటిముంగిటఁ గూర్చుండియుంటిని. *ప్రాగ్దిగంతమున దక్షిణకోణమునుండి కాంతివంతమగు పెద్దతోకచుక్క యొక్కటి పైకి లేచి, మెల్లగా వర్తులపథమున దీర్ఘ దేదీప్యమానకాంతిపుచ్ఛ ముతో ఉత్తరదిక్కు పయనించి, అరుణాచలశిఖరములో*

అదృశ్యమయ్యెను. తత్క్షణమే, ఇది భగవానులనుగురించి యేదో సూచన యని నాకు స్ఫురింపఁగా నేను ఆశ్రమము నకు పరుగిడితిని. డాక్టరులు భగవానుల గదిలో గుమి కూడుట చూచితిని. అంత్యము తెలియవచ్చెను. అవును, అంతా అయిపోయినది, అయిపోయినది. మనము దేని నుండి ఆనందపానము చేయుచుంటిమో ఆ వాహిని సాగ రములోఁ గలసిపోయినది. ఇఁక దాని దివ్యతీర్థమును మన మాస్వాదింపఁజాలము. ఈ మాంసపుఁదనువుగూడఁ గరఁగి కన్నీటికాలువయై ఆ దివ్యవాహిని వెనువెంటఁ బ్రవహించి పోరాదా! నేను నాగుండె యెండిపోవువఱకు ఏడ్చియేడ్చి యిప్పు డొక యనాథశిశువువలె అయినాను. ...శూన్యత తప్ప వేఱు నాకుఁ గనిపించుట లేదు. హా! భగవాన్, నీవు చెప్పినావుగదా 'ఏడువనిబిడ్డను తల్లి యెప్పుడూ తన మనస్సులో పెట్టుకొను' నని. ...ఆ తోకచుక్కవలెనే అరుణాచలునిలోఁ జేరినావా? నే నెట్లు నిన్ను జేరఁగల నయ్యా?...

(16-4-1950) నేను వ్రాయఁబూనినపుడెల్ల ఎన్నో దృశ్య ములు నా మనస్సుముందు సాగిపోవుచున్నవి......... 'ఇదంతా పోవును' అని తనచేయిఁ ద్రిప్పుచూ కొద్దిరోజుల ముందే వారు సెలవిచ్చిరే ఆ వాక్కుల భావమును గ్రహింపలేకపోవుటకు నేనెంత మందమతిని! కొలఁది వార

ములక్రిందట, చేతివ్రణముమానుట కెంతకాలము పట్టునని నే నడుగఁగా, వారు 'నే నెంత ముసలివాఁడనైనదీ, ఎంత దీర్ఘకాల మీదేహములో ఉన్నదీ యెవ్వారుసూ గణింపరే!' అని బదులుపలికిరి. అవును, ఈ సమాప్తికి వారు మనల నందఱిని తయారుచేయ నెంచిరి. అపారకృపంజేసి వారు దూరముననున్న యెల్లరికి వచ్చి కడసారి దర్శనము చేసి కొనుట కవకాశ మనుగ్రహించిరి. ఆ తోకచుక్కవలె వారును మనదృష్టి కతీతులైనారు ... ఈ యుదయము నే నాశ్రమమునకు వెళ్లితిని. దారి తప్పిపోయి జాలి పుట్టు నట్లు 'బ్యా' అని అఱచుచూ ఇటునటు తిరుగాడు మేక పిల్లవలె, నేనును ఎల్లెడఁ దిరిగితిని. ఒక మాసముక్రింద స్వప్నములోఁ గనిపించిన భగవానులులేని శూన్యాశ్రమము నేఁడు ప్రత్యక్ష మైనది...

బొందెలో ప్రాణ ముండఁగా భగవానులవద్దనుండు భాగ్యము నాకు లేకపోయిననూ, తర్వాత నేను నెట్టికొని లోనికిఁబోయి నిన్న రాత్రి 9-30 గంటలకు సమాధికార్యము పూర్తియగునంతదాఁక ఆ పావనశరీరముతోడనే యుంటిని. ఆ మహాసమాధిప్రశాంతతయందు నిర్మగ్నుఁడనై నేఁడు విశ్రాంతి పుచ్చుకొనుచున్నాను."

16-4-1950 వ తేదిన అప్పుడు మిసస్. ఎ.వి.యర్ కళాశాల

ప్రిన్సిపాలుగానుండిన శ్రీ యస్. పార్థసారథినాయుడుగారు శ్రీ భగవానుల నెన్నఁడును సందర్శించియుండని వా రిట్లు వ్రాసిరి:

"ఆధ్యాత్మికప్రశాంతిదివ్యావేశముల మూలవిరాట్టగు భగవాన్ శ్రీ రమణమహర్షుల నిర్యాణవార్త వినుట కెంతయు చింతిల్లుచున్నాను ... మనఃఖేదముల యుపశమనమును ఊఁటటను ఆశించివచ్చు యాత్రికులకు ఆశ్రమ మాశ్రయ మిచ్చుచునేయుండునుగాక ! యని యాశింతును. దృశ్యులై గానీ అదృశ్యులై గానీ శ్రీ భగవానులు ఆశ్రమాగంతుకులను ఆశీర్వదించుచునే యుందురు."

ఆనాఁడే పై యాశంసకు ప్రత్యుత్తరమో యనునట్లు ఆశ్రమమువా రిట్లు వ్రాసిరి :

"సమాధిమహాభిషేకము 24 వ తేదిన జరుపఁబడును. శ్రీభగవానుల నిరంతరానుగ్రహము వారి భక్తులను రక్షించుచూ నడపించుచుండునుగాక !"

ఇంతటితో ఈ కథనము సహజముగా సమాప్తమగుచున్నది. కడచుచున్న ప్రతిదినమూ శ్రీ భగవానుల త్రిగుణములు అనఁగా సర్వాత్మత్వ సర్వశక్తిమత్వ సర్వజ్ఞత్వములూ అన్నిటికన్న మిన్నగా శ్రీ భగవానులు తానే యైన దివ్యానుగ్రహమూ నాకుఁ గ్రమాభివృద్ధిగా సాక్షాత్కార మగుచున్నవి. కావున పై యనుభవము నుదాహరించు నుదంతములను మూఁడింటిని జేర్చికొని స్వస్తిచెప్పెదను.

19-4-1950 వ తేదిన శ్రీ భగవానుల చిరకాలభక్తుఁడు శ్రీ గ్రిద్దలూరు సాంబశివరావుగారు నెల్లూరికి తిరిగివచ్చి రాత్రి 7 గంటలప్పుడు, శ్రీ భగవానుల యవసానదివసములలో వారి దర్శనార్థము గుమికూడిన జనసమూహాములవలన ఆశ్రమములో ఆహారపదార్థములు నిశ్శేషమైనవనీ, ఏప్రిల్ 24 వ తేదిన జరుగవలసియున్న మహాభిషేకమునకు ఆశ్రమములో బియ్య మత్యవసరమైయున్నదనీ నాతోఁ జెప్పిరి. కుంభాభిషేక మప్పటివలెనే యిప్పుడునూ మే మిరువురము సంపన్నులగు స్నేహితులను గొందఱి నిందులకై చూడఁదగునని హెచ్చరించిరి. ఆ సమయమున నేను యూనివర్సిటీపరీక్షలతో సంబంధము కలిగియున్నందున దేనికిఁగానీ యెవరినీ యాచించుట కిష్టపడకుంటిని. అంతట సాంబశివరావుగారు నా పూర్వశిష్యుఁడు కోవూరువాస్తవ్యుఁడు వదాన్యశేఖరుఁడగు నెల్లూరు వెంకటరెడ్డినైననూ చూడుమని సలహానిచ్చిరి. అందులకునూ నే నంగీకరింపలేదు. ఆ మఱునాఁడు తెల్లవాఱఁగనే ఏ మాశ్చర్యము! ఆ నెల్లూరు వెంకటరెడ్డియే విద్యార్థిదశానంతర మెంత కాలమునకో ప్రథమపర్యాయము మాయింటికి తన కారులో వచ్చెను. ఆయన తాను పేదవిద్యార్థినిధి నేర్పఱుపఁదలచి అందులకై నాతో సంప్రదించుటకు వచ్చినానని చెప్పెను. ఆయన యాదృచ్ఛికముగా తనయెదుటనున్న శ్రీ భగవానుల రూపపటమును జూచి, వారి మహాసమాధిని బ్రస్తావించి "వారి యారాధనకు మీరు వెళ్లెదరా?" అని నన్నుఁ బ్రశ్నిం

చెను. నేను "అవు"నని బదులుపలుకుచూ "కుంభాభిషేకము నకువలెనే యిప్పుడు శ్రీ భగవానుల మహాభిషేకమునకునూ మీరేమైన కైంకర్యము చేసెదరా?" అని ఆయన నడిగితిని. వెంటనే ఆయన "తప్పకుండ చేసెదను. అంతకన్న చేయఁదగిన కార్యమే మున్నది? మీరేమి చెప్పిన అది చేసెదను" అని జవాబిచ్చిరి. ఆశ్రమములో ఇప్పుడు ముఖ్యముగాఁ గావలసిన ధాన్యముగానీ బియ్యముగానీ పంపఁగలిగిన గొప్ప యుపకారముగా నుండునని సూచించితిని. ఆయన తాను తత్క్షణమే రెండుపుట్లధాన్యమును మిల్లులో దంపించి ఆ బియ్యమును మూఁడవనాఁడు ఆశ్రమము చేరునట్లు రవాణాచేయించెదనని వాగ్దానమొనర్చి యట్లే గావించెను. కొన్నిదినముల తర్వాత మఱియొక స్నేహితుఁడు సింగపేటవాస్తవ్యుఁడు శ్రీ కేతిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి ఆశ్రమములో మహాపూజామహోత్సవము నకు ఒకపుట్టి ధాన్యమును కైంకర్యమొనర్చుటకు అయాచితముగా పరమాదరముతో నాకు వాగ్దానముచేసి యట్లే నెరవేర్చెను. ఈ రెండు సంఘటనలునూ నాకు దివ్యప్రసాదములైనవి. ఏలయన శ్రీ భగవానుల నిర్యాణానంతరము నేను ధైర్యమును గోల్పడి మనస్సులో క్రుంగిపోవుచుంటిని. శ్రీకృష్ణ నిర్యాణానంతరము పాండవులవలె నైతిని. ఇఁక నేను కేవలము నిస్సహాయుఁడను, నా జీవితము నిరుపయోగము అనుకొంటిని. అట్టి పరిస్థితిలో ఈ సంఘటనములు నాకుఁ గను తెఱపి సలిపెను. శ్రీ భగవానులు సజీవులైయుండిన తీఱుననే

యిప్పుడునూ మహత్తరశక్తియుక్తులనీ, మీఁదుమిక్కిలి వా రింకనూ నన్నుఁ దమ సాధనముగా వినియోగించుకొనుచున్నారనీ నాకుఁ దేటతెల్లమయ్యెను. నేను జారిపోవఁ దలంచిననూ వారు నన్ను వదలరు. ఈ విశ్వాసము నా కపరిమితోత్సాహమును స్వాత్మప్రత్యయమును మరలఁ జేకూర్చెను.

1950 మే నెలలో నేను పరీక్షకసమావేశసందర్భమున విశాఖపట్టణమం దుంటిని. రాత్రి మిసస్. ఎ.వి. యర్. కళాశాలాధ్యాపకభవనములో బసచేసితిని. ప్రతిదిన ముదయమున నిద్రలేవఁగనే శ్రీ భగవానుల పటమునకు మ్రొక్కుట నా కలవాటు. ఆనాఁటి వేఁకువన నమస్కరించుటకు శ్రీ భగవానుల పటము లేదుగదా అనుకొంటిని. ఆ గదిలో బల్లమీఁద నున్న యొక బొంబాయిపత్రికపై ఊరక చేయిపెట్టితిని. దానిని దెఱచిచూడఁగా ఏ మాశ్చర్యము! శ్రీ భగవానుల పటమే వారు కడపట జబ్బుగా నున్నప్పుడు తీసినది వారి మహిమను ప్రశంసించు వ్యాసముతోఁగూడఁ బ్రత్యక్షమయ్యెను! అప్పుడు శ్రీ భగవానులే నాతో "ఓరి పిచ్చివాఁడా, నీ వెంత అవిశ్వాసివి! నేను ఇక్కడా ఎక్కడా, ఇప్పుడూ ఎప్పుడూ నీతోఁగూడనే కదా ఉన్నాను" అని చెప్పిన ట్లనిపించెను.

రెండేండ్లక్రిత మొకరాత్రి నా కొక యద్భుతస్వప్నము వచ్చెను. ఒకగిరిశిఖరమున ఒకపెద్దసత్రములో శ్రీ భగవా

నులూ శ్రీ కాంచికామకోటి పీఠాధిప శంకరాచార్యస్వాముల వారూ నాయెదుట ఆసీనులై యుండఁగాఁ గంటిని. ఆ యిరువురు మహాత్ములను ఒకేస్థలమున సందర్శించుటచే నాహృదయమానందముతో నుప్పొంగెను. శ్రీ శంకరాచార్యులవారు “నీవు సంస్కృతవిద్యలో ఏపాటి యభివృద్ధిని గడించినావు?” అని నన్నుఁ బ్రశ్నించిరి. నేనుత్తరమిచ్చుటకుముందు శ్రీ భగవానులే “సంస్కృతము బాగా వచ్చునే’” అని బదులుపలికిరి. అందుమీఁదట శ్రీ ఆచార్యులవారు వేదమునుండి ఒక ‘ఋక్కు’ను బఠించి దాని ననువదింపుమని నన్నుఁ గోరిరి. నేను దానిని శ్రీవారికి తృప్తికరముగా అనువదించితిని. అంతట ఒక పెద్ద పాత్రలో తీర్థముఁ దెచ్చిరి. శ్రీ భగవానులు తొలుత ఒక యుద్ధరిణెడు తీర్థము తాను బుచ్చుకొని శ్రీ ఆచార్యులవారి కందియ్యఁగా, వారును మఱియొక యుద్ధరిణెడు పుచ్చుకొని ఆపాత్రను నాచేతి కిచ్చి ఆహాలులో గుమిగూడియున్న భక్త బృందమునకు వినియోగముచేయుమని యానతిచ్చిరి. నేను అట్లే యొనర్చితిని. అచ్చట అందఱికి ఇచ్చునప్పటికి తీర్థము సరిగా అయిపోయెను. అంతట నేను ఖాళీపాత్రను తిరిగి తెచ్చితిని. శ్రీ ఆచార్యులవారు “నీవు తీర్థముఁ బుచ్చుకొన్నావా?” అని యడిగిరి. “లేదు” అని విన్నవించితిని. అది విని శ్రీ భగవానులు “పరవాలేదు. *ఇతరులకు పంపకమే నీకు ప్రసాదము*” అని సెలవిచ్చిరి. అప్పుడు భిక్షకై అందఱికి విస్తళ్లు వేసిరి. చీఁకటిపడుచుండినందున, నేనే విద్యుద్దీపములు వెలిఁగించుటకుఁ

ప్రయత్నించితిని. తొలుసారి అవి వెలుఁగలేదు. రెండవమారు మీట నొక్కఁగానే అన్నిదీపములు తళుక్కుమని వెలిఁగెను. నేను మేల్కొంటిని.

"ఇతపులంతు పంపకమే నీకు ప్రసాదము." వాస్తవముగా ఈ స్మరణామృతమే పాఠకులకు పంచిపెట్టఁబడిన తీర్థము. అదే యీ భక్తపరమాణువునకు శ్రీ భగవానుల ప్రసాదము.

ఓం తత్ సత్.

ఈ గ్రంథమును ఆంగ్లమున 12-5-1956 వ తేదీ ఉదయము 10 గంటలు 5 నిమిషములకు వ్రాసి పూర్తిచేసితిని. తత్క్షణమే నా కొమార్తె అలగమ్మ "ఇదిగో ఈ తీర్థము అమ్మ నిన్నుఁ బుచ్చుకొమ్మన్నది" అని టెంకాయపాలు నా కొసంగెను. కావున అదే అది!



Vivekananda Press, Nellore.